2000 సం॥లో విశాలాంధ్ర ప్రచురణాలయం
నిర్వహించిన నవలల పోటీల్లో ప్రత్యేక బహుమతి
రూ.20,000/- లు పొందిన నవల

# స్వేచ్ఛాప్రస్థానం

## సింహప్రసాద్



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్- 500 001.

SWETCHAPRASTHANAM (Novel) By Simha Prasad

ప్రచురణ నెం. : 2260

ప్రతులు : 1000

ప్రథమ ముద్రణ : మే, 2001



టైటిల్ డిజైన్ : చంద్ర

వెల: రూ.65-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: శ్రీ కళాంజలి గ్రాఫిక్స్ హైదరాబాద్ - 29. ఫోన్ : 3229831

# ముందుమాట

విశాలాంధ్ర ప్రచురణాలయం 1978 నుంచి 1984 వరకు నవలలపోటీ నిర్వహించింది. చాలాకాలం తరవాత మళ్లీ ఈ "2000 సం॥రపు నవలల పోటీ."

"తెలుగు సమాజ గతిశీలతనూ, అంత స్వరూపాన్నీ, ఆగామి సంస్కారాన్నీ" ఈ పోటీలో పాల్గొనే నవలలు మన కళ్ల ఎదుట నిల్ప గలుగుతాయని ఆశించాము. తెలుగు కథ ప్రతిష్టను పెంచినట్లే తెలుగు నవల ప్రతిష్టను కూడా మన రచయితలు పెంచుతారనీ, పెంచగలరనీ ఆశించాము.

పోటీకి వచ్చిన నవలలన్నిటినీ న్యాయనిర్ణేతలు వ్యష్టిగా, సమష్టిగా సాకల్యంగా, నిశితంగా పరిశీలించారు; బాగోగులను నిర్మమకారంగా చర్చించారు. నవలల సాధారణ స్థాయిపట్ల ఏకగ్రీవంగా అసంతృప్తిని ప్రకటించారు. నవలల పరిశీలనలో తమను కలవరపెట్టిన ప్రశ్నలే తమ అసంతృప్తికి కారణమని భావించారు.

న్యాయనిర్ణేతలను కలవరపెట్టిన ప్రశ్నలు ఇవి:

తెలుగు సమాజ జీవితంలో వస్తున్న చాలాచాలా పరిణామాలనూ, తలఎత్తుతున్న అనేకానేక సమస్యలనూ రచయితలు పట్టించుకోవలసినంతగా ఎందుకు పట్టించుకోవటం లేదు? గ్రామీణ వ్యావసాయిక జీవితాల్లో, మానవ సంబంధాల్లో వస్తున్న మార్పులనూ, వ్యాపారమైపోయిన విద్యా, వైద్యాది రంగాల ప్రభావాలనూ, వామపక్ష ఉద్యమాల్లో తలెత్తిన పోకడలనూ, అంతర్జాతీయ ద్రవ్యసంస్థల తాకిడివల్ల సంభవిస్తున్న పరిణామాలనూ, ఇతివృత్త పరిధిలో రచయితలు గాఢంగా, విస్తారంగా ఎందుకు స్పృశించ లేకపోతున్నారు? తెలుగు నవలా సాహిత్యంలో ఇతివృత్త నిర్మాణం ఒక రచనా కళగా నశించి పోతోందా? పాత్ర చిత్రణలో మనస్తాత్వికమైన లోతూ, మానవసంబంధాల విశ్లేషణలో గాఢమైన చూపూ ఎందుకు కొరవడ్డాయి?

భాషను సృజనాత్మకంగా ఉపయోగించుకోగల సామర్థ్యం రచయితల్లో తగ్గిపోతోందా? ఎందువల్ల? ప్రమాణ మాండలికానికీ, ప్రాంతీయ వర్గ మాండలికాలకూ, వ్యక్తిగతమైన ఉచ్చారణ దోషాలకూ, యాసలకూ మధ్య

ఉండే తేడాలను రచయితలు ఎందుకు గమనించటంలేదు? రచయిత కథనానికీ, పాత్ర కథనానికీ మధ్య ఉండవలసిన తేడా ఎందుకుండటం లేదు?

నవలకు వస్తువును ఎన్నుకోవడం మొదలుకొని, ఒక సౌష్ఠవ రూపాన్ని ఇవ్వడం వరకూ ఎందుకు రచయితలు శ్రద్ధ చూపలేకపోతున్నారు?

ఈ ప్రశ్నలు అటుంచుదాం.

కథానికలాగా నవల అతి బిగువైన ప్రక్రియ కాకపోవచ్చు. నవలా నిర్మాణంలో 'వదులుతనం' ఉంటే ఉండవచ్చు. కానీ, ఒక పథకమంటూ లేకుండా రాసుకపోవడమే నవల కాదు. పోటీకి వచ్చిన సాధారణ స్థాయి నవలలన్నీ ఏ పథకమూ లేకుండా పేర్చుకుంటూ పోయినవే. గిజిగాని గూళ్లలాగా ఉండకపోయినా, కాకి గూళ్లలాగానైనా లేకపోవడం అన్యాయం. జీవితంలో నుంచీ ఇతివృత్తమూ, ఇతివృత్తంలో నుంచీ పాత్రలూ, పాత్రల్లోంచీ కథా ఇలా అంగాలమధ్య సమన్వయం సాధించలేకపోవడం అపరిణతకు సంకేతం. ఒక జీవిత ప్రాపంచిక దృక్పథం ఇవ్వలేకపోవడం సాహిత్య లౌక్యానికి దృష్టాంతం.

పోటీలో చివరకు నిలచిన నవల ఇది.

ఒక మహిళను కేంద్రంగా తీసుకొని దాదాపు 60 ఏళ్ల ఆంధ్రదేశ సామాజిక చరిత్రను చిత్రించే ప్రయత్నాన్ని రచయిత ఈ నవలలో చేశారు. ఈ కాలవ్యవధిలో వచ్చిన స్వాతంత్ర్యోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమంలోని చలనాలు, స్త్రీ, దళితవాద ధోరణలు, సారా వ్యతిరేక పోరాటం మొదలైనవి, నవలలోని ప్రధాన పాత్ర రాజమ్మ చైతన్యంలోనుంచి పరావర్తనం చెంది మనకు కన్పిస్తాయి.

స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్న ఒక గాంధీవాది కుమార్తె స్వరాజ్యం. స్వరాజ్యం బాల్యదశనుంచీ రాజమ్మగా ఎదుగుతుంది. వృద్ధాప్యంలోసైతం ఆర్థిక సామాజిక స్వాతంత్ర్యాలకోసం ఉద్యమాన్ని ప్రారంభించి ఆమె దానికి అంకితమైపోతుంది.

రాజమ్మ జైల్లో ఉండగా నవల ప్రారంభమవుతుంది. గతస్మరణ ద్వారా బాల్యంనుంచి వృద్ధాప్యందాకా సాగి వర్తమానం వరకు వచ్చి ఆమె జైలునుంచి విడుదల కావడంతో నవల ముగుస్తుంది. ఉద్యమాల ఆటుపోటులనూ, ఆడపిల్లల పెంపకం, చదువులో వివక్ష, వరకట్న సమస్యలు, వితంతువులపట్ల సాగే మూఢాచారాలూ, ఉద్యోగస్థలాల్లో స్త్రీలపట్ల

పురుషుల దుష్ప్రవర్తన, భార్య ఆధిక్యాన్ని సహించలేని భర్తల విపరీత ప్రవర్తన లాంటి సాంస్కృతికాంశాలనూ రచయిత ఈ నవలా పరిధిలో భాగం చేశారు.

స్వాతంత్ర్యం రాక ముందున్న ఆదర్శవాదం తర్వాత తర్వాత ఎలా, ఎందుకు పతనమైందో కూడా ఈ నవల చిత్రించింది. ఒకప్పటి త్యాగ ధనులైన వారి పిల్లలు ఎలా అవినీతిపరులైపోతున్నారో, అందుకు కారణ భూతమైన సామాజిక కారణాలేవో కూడా నవల తన పరిధిలోకి తీసుకుంది. ఈ నవల నిరాశావాదంతో ముగియదు. రాజమ్మ 'ద్వితీయ స్వాతంత్ర్యోద్యమ పోరాటం' ఈ నవలలోని ఆశాకిరణం. రాజమ్మ పాఠకుల మనసులో నిలిచే ఆదర్శపాత్ర. ఆమెకు చైతన్యమూ, మనస్తాత్వికమైన లోతూ ఉన్నాయి. శివయ్య, శ్రీకాంత్, లెనిన్‌బాబు, అరుణ్, సుబ్బలక్ష్మి సామాజిక పరిణామంలో కన్పించే వాస్తవిక పాత్రలు.

ఇది గొప్ప నవల కాకపోవచ్చు. కానీ గొప్ప నవలలు రావటానికి ప్రేరకంగా ఇది ఉపయోగపడుతుంది. ప్రపంచ బ్యాంకు, ప్రపంచ వాణిజ్య సంస్థలు సృష్టిస్తున్న పరిణామాల నేపథ్యంలో, ఆదర్శాలు ఎండమావులవుతున్న తరుణంలో స్ఫూర్తి ఇవ్వగల నవలగా ఈ నవలను న్యాయ నిర్ణేతలు భావించారు. ప్రత్యేక బహుమతికి అర్హమైందిగా అభి ప్రాయపడ్డారు. అయితే నవలా పరిధిలోకి వచ్చిన కొన్ని సంఘటనలతో, సన్నివేశాలతో, పాత్రలతో వాటి మూలంగా ఏర్పడే అభిప్రాయాలతో విశాలాంధ్ర ప్రచురణాలయానికి సంబంధం లేదనే విషయాన్ని కూడా న్యాయనిర్ణేతలు పరిగణనలోకి తీసుకున్నారు. అబ్బూరి ఛాయాదేవి, వల్లంపాటి వెంకటసుబ్బయ్య, నిఖిలేశ్వర్, కడియాల రామమోహనరాయ్, ఏటుకూరి ప్రసాద్‌లు న్యాయపరిశీలకులుగా వ్యవహరించారు. వారి ఏకగ్రీవ నిర్ణయంమేరకే ఈ ఫలితం.

న్యాయనిర్ణేతలు లేవనెత్తిన ప్రశ్నల నేపథ్యంలో అనుభవ చైతన్యాన్ని విస్తృతపరచుకునే కాంక్షతో ఈ నవలను చదవండి.

కేతు విశ్వనాథరెడ్డి
సమన్వయకర్త
విశాలాంధ్ర ప్రచురణాలయం
2000 సం॥రపు నవలల పోటీ

# స్వేచ్ఛాప్రస్థానం

"జననీ జన్మభూమిశ్చ......"
"సారేజహాఁసె అచ్ఛా........"
"పుణ్యభూమి నా దేశం........"
"వందేమాతరం మా తుఝెసలాం........"

ఒడలు పులకరింప చేసే పాటలు నలువైపుల్నుంచీ జైలు గోడల్ని చీల్చుకుని చీకటి గుహలాంటి సెల్‌లో ప్రవేశించాయి.

కటిక రాతి మీద ముడుచుకుపడుకున్న రాజమ్మకి హఠాత్తుగా మెలకువ వచ్చింది. ఒళ్ళంతా రోమాంచితమైంది.

ఏదో తెలీని ఆనందం ఉద్వేగం ఆమె నరనరాల్లో వేగంగా ప్రవహిస్తోంటే ఒక్క వుదుటున లేచి కూర్చుంది.

"భారత మాతకు జేజేలు......"
"యే దేశ్ కా ధర్తీ......"
"పాడవోయి భారతీయుడా......"

ఒకదాని వెంట ఒకటి కాదు – ఒకేసారి అనేక దేశభక్తి పూరితమైన పాటలు నలుదిక్కుల్నుంచీ విన్పిస్తూ ఆమెని కుదిపేస్తున్నాయి.

మెల్లగా లేచి సెల్‌డోర్ దగ్గరకి నడిచింది.

అలికిడికి సెంట్రీ ఆమెవైపు టార్చిలైట్ ఫోకస్ చేస్తూ [illegible]

"ఏం ముసలీ! లేచేవేంటి కథ? చలిగా వుందా? దోమలు పీకుతున్నాయా? శివుడాజ్ఞ తీసుకుని చీమలు కుడతాయి. మున్సిపల్ కార్పొరేషన్ వారి పర్మిషన్ తీసుకుని దోమలు కుడుతున్నాయి." నవ్వేడు.

ఆమె నవ్వలేదు. అసలు పట్టించుకోలేదు.

"ఇంత రాత్రివేళ ఆ పాటలు...."

"రేపు అగస్టు పదిహేనుకదా. స్వతంత్రం వచ్చి యాభైరెండేళ్ళ య్యింది మరి. దేశమంతా ఘనంగా ఉత్సవాలు చేస్తున్నారు. కార్గిల్ పోరాటంతో అందర్లోనూ దేశభక్తి పుట్టుకొచ్చింది!"

"రేపు అగష్టుపదిహేను! స్వాతంత్ర్యదినం! మహనీయులత్యాగఫలం!" గొణుక్కున్నట్టుగా అంది.

"ఈ శతాబ్దపు అఖరి స్వాతంత్ర్యదినోత్సవం కదా! పైగా ఎలక్షన్ సందడి ఒకటి. బయట చాలా కోలాహలంగా ఉంది. అన్నిచోట్లా పండుగపరచుకుందనుకో. ప్రభుత్వ కార్యాలయాలు ప్రైవేటు కంపెనీలు దుకాణాలు అన్నీ అంతా రంగురంగుల విద్యుద్బల్బుల తోరణాలతో అలంకరించారు. జనం గుంపులు గుంపులుగా రోడ్లమీద తిరుగుతున్నారు. ముఖ్యంగా టాంక్ బండ్ నుంచి అసెంబ్లీ వరకూ ఒకటే జనం అనుకో......"

ఆమె కళ్ళల్లో కోటి ఆనంద దీపాలు కదుల్తుంటే అంది: "నిక్కమైన స్వాతంత్ర్యం మనల్ని మనమే పాలించుకోగల స్వేచ్ఛ. మన జనంకోసం మనమే కార్యక్రమాలు రూపొందించగల హక్కు వుండి వుంటే ఎంత బావుండేదో! స్వతంత్రపౌరులం అని సగర్వంగా తలెత్తుకునే వాళ్ళం! గుండెల్నిండా స్వేచ్ఛావాయువులు నింపుకుని ధీమాగా ధీరులంగా నూతన శతాబ్దిలోకి అడుగుపెట్టేవాళ్ళం! ప్చ్... దేశాన్ని రాహువు మింగేస్తోంది!"

ఆమె వంక అయోమయంగా చూశాడు. చిత్రంగా చూశాడు.

"నేను పుట్టి బుద్ధెరిగాక ఎప్పుడూ స్వాతంత్ర్యదినోత్సవం ఇంతగొప్పగా చెయ్యటం చూళ్ళేదు. గాంధీ నెహ్రూ పటేల్ సుభాష్‌చంద్రబోస్ భగత్సింగ్ లాంటి దేశభక్తుల్ని తలచుకుంటే చాలు – మేను గగుర్పొడుస్తోందనుకో."

"స్వేచ్ఛా భారతిలో ఊపిరి పోసుకున్న నీకన్నా ఆ బానిసపు రోజుల్లో స్వాతంత్ర్యదినోత్సవపోరాట శంఖారావనేపథ్యంలో పుట్టిన నాకే స్వేచ్ఛ విలువ బాగా తెలుసు."

"నీ వయస్సెంతేంటి ముసలీ?"

"అరవై ఆరో అరవై ఏడో!"

"ఈ వయస్సులో జైలు శిక్ష... అంత ఘోరం ఏం చేశావు?"

ఆమె నేరం గురించి చూచాయిగా విన్నాడు. కాని నమ్మకం చిక్కలేదు. ఇంకేదో కథ వుండి వుంటుందని అతడి అనుమానం.

"స్వేచ్ఛ నా ఊపిరి. చైతన్యం నా మారుపేరు. నా గొంతు నులిమినా వాక్స్వాతంత్ర్యాన్ని హరించలేరు. నన్ను బంధించినా ఆవేశాన్ని

అడ్డుకోలేరు. పిచ్చివాళ్ళు! ముంజేతిని ఖండించినా పిడికిలి వదల్నని వాళ్ళకి తెలీదు. జైల్లో కుక్కి, నా రెక్కలు ఖండించొచ్చని పగటి కలలు కంటున్నారు!"

"హాయిగా కృష్ణారామా అనుకుంటూ ఇంట్లో కూర్చోక ఈ పాలిటిక్సెందుకు ముసిలీ? ఇలాటి కబుర్లతో తీవ్రవాదుల్తో చేయి కలుపుంటావు. జైల్లో కూర్చోబెట్టి వుంటారు. అంతేనా?"

"నీ కర్థం గాదులేరా...."

"నా కర్థం కాదా? డిగ్రీ పాసయ్యాను తెలుసా?"

"అర్థం చేసుకోడానికి క్కావలసింది విచక్షణాజ్ఞానం, అవగాహనశక్తి. అంతేగాని డిగ్రీలు కావు."

"నాకాశక్తి లేదంటావు! జోకులేస్తున్నావా?"

"ఇప్పుడీ జైల్లో బంధింపబడి వున్న నా అసలు పేరేమిటో తెలుసా? స్వరాజ్యం! నీకేమర్థమయిందో నువ్వేం గ్రహించావో ఆలోచించిచెప్పు."

ఆమె వెనుదిరిగి కాలు ఈడ్చుకుంటూ వెళ్తోంటే, "స్వరాజ్యమా!" అని బుర్ర గోక్కున్నాడు.

"స్వరాజ్యం నా జన్మహక్కు" అన్న నినాదం గుర్తొచ్చింది.

అలా నినదించిందెవరబ్బా?

గబ గబా ఆలోచించాడు. ఏమీ గుర్తురాలేదు. "పోనీలెద్దూ. ఇప్పుడేమైనా ఇంటర్వ్యూ కెళుతున్నానా!" అనుకుని తలవిదిలించి అక్కడ్నుంచి జారుకున్నాడు.

రాజమ్మ వెళ్ళి యధాస్థానంలో పడుకుంది.

గాలిని సైతం ఉత్తేజపరుస్తూ పాటలు విన్పిస్తూనే వున్నాయి.

ఆమె కళ్ళ ముందు తండ్రి వియ్యన్న రూపం కదలాడింది.

ఆ తర్వాత భర్త పిల్లలు మేనమావ బంధువులు మిత్రులు జనం కదిలారు.

ఒకటొకటిగా జరిగిన ఘటనలు, ఆశలు, ఆరాటాలు, స్వప్నాలు, సత్యాలు, బ్రతుకుబాటలోని ఎత్తులు, పల్లాలు, విజయాలు, వైఫల్యాలు, కష్టాలు, కన్నీళ్ళు అన్నీ కదలాడాయి.

దేశంలో మారిన పరిస్థితులు, పోరాటాలు, హక్కులు, ఎన్నికలు, నేతలు, నీతులు, వాగ్దానాలు వాస్తవాలు, వరల్డ్ బ్యాంక్ అప్పులు, వారి షరతులు.....

సామాజిక వ్యవస్థలో చోటు చేసుకున్న పెను మార్పులు ఘర్షణలు పరిష్కారాలు పరిణామాలు అన్నీ తలపున కొచ్చాయి.

ఎంత మహోన్నతమైనదీ శతాబ్దం!

రాజకీయంగా సాంఘికంగా సాంస్కృతికంగా ఎన్నెన్ని మార్పు లొచ్చాయి! ఎన్ని పరిశోధనలు ఎన్ని సిద్ధాంతాలు ఎన్ని ప్రయోగాలు ఎన్నెన్ని అన్వేషణలు!

దేశ స్వాతంత్ర్య కాంక్షాబీజం పడింది ఈ శతాబ్దంలోనే. స్వాతంత్ర్యం సాధించుకున్నదీ ఈ శతాబ్దిలోనే. ఆ స్వాతంత్ర్యానికి గ్రహణం పట్టిందీ.....!

ఆమె కళ్ళల్లో సన్నని కన్నీటి పొర కదిలింది.

దేశ స్థితిని తలచి ఆమె మనస్సు ఘూర్ణిల్లింది.

మెల్లగా తనని తాను కూడదీసుకుంది. గుండెని చిక్కబట్టుకుంది.

ఒక్కో పూసనీ జాగ్రత్తగా ఏరి మాలగా కూర్చసాగింది.

## 2

"స్వరాజ్యం! మీ నాన్నని జైల్లో పెట్టరంట కదా?"

కడ మల్లెపూలు ఏరి పరికిణీలో వేసుకుంటున్న స్వరాజ్యం ఉలిక్కి పడిందా మాటలకి. పిన్నివంక అపనమ్మకంగా చూసింది. ఇంతలోనే కళ్ళల్లోకి నీళ్ళు పొంగివచ్చేశాయి. పరికిణీలోని పూలన్నీ పారబోసి సన్నగా ఏడుస్తూ ఇంటికి పరుగెత్తింది.

ఇంట్లో అలికిడి లేదు. విషాదరాగం ఆలపిస్తున్నట్లుగా ఉంది.

భయం భయంగా అడుగులేస్తూ లోపలి కెళ్ళింది. తల్లి దుప్పటి ముసుగు పెట్టుకుని పడుకుంది. నాన్న కేదైనా అయితే అమ్మ ఏడుస్తూ మంచం ఎక్కేస్తుందని ఆ పిల్లకి తెలుసు.

అందుకే తల్లిని కదిలించకుండా పెరట్లోకెళ్ళింది. నానమ్మ ఏదో గొణుక్కుంటూ అంట్లుతోముతోంది

"మామ్మా! రాత్రి మా నాన్న రాలేదా?"

"మీ నాన్నకి ఇల్లు సంసారం కావాలంటే! మనమెలా పోయినా గాని దేశం బాగుంటే శాన. గాంధీగారు పిల్సేరని సదువుకు సున్నా సుట్టాడు. యవసాయానికి ఎగనామం పెట్టేడు. సభలూ సట్టుబండలూ అంటూ

వూళ్ళట్టుకు తిరుగుతున్నాడు. కడుపులోనీళ్ళు కదలకుండా ఇంటిపట్టునుండి యవసాయం సూసుకోక ఆ గొడవలన్నీ ఈడికెందుకు చెప్పు?"

"ఏం చేశాడు మామ్మా?"

"ఇప్పుడు కొత్తగా చేసేదేంటి? ఎప్పుడూ చేస్తున్నదే. సర్కారోడితో కయ్యానికి దిగుతున్నాడు. దొరలంతా ఆళ్ళ దేశం ఎళ్ళిపోవాలంట. ఈడు సెబితే ఆళ్ళింటారా! ఆళ్ళ దగ్గర బోల్డు మంది పోలీసోళ్ళుంటారు. బోల్డు తుపాకీలుంటాయి. రాజుగారి కెదురు నిల్సి ఎవడు బట్ట కట్టగలడు?!"

"ఇప్పుడేవయ్యింది మామ్మా?"

"ఆయన్నీ నాకేం తెలుస్తాయే! అయినా పిల్లదానివి. అయన్నీ నీకెందుకే? వెళ్ళి ఇల్లూ వాకిలీ తుడుచుకురా."

"వూహూ. మా నాన్నకేవయ్యిందో సెబితే గాని తుడవను"

బుగ్గలు నొక్కుకుని ఆశ్చర్యంగా చూసింది నానమ్మ.

"నువ్వెక్కడి మొండి ఘటానివే. ఆ తండ్రికి తగ్గ కూతురివే గాని ఎళ్ళెళ్ళు."

"వూహూ. వెళ్ళనంటే వెళ్ళను." మొండి కేసింది స్వరాజ్యం.

"ఆ పాపిష్టోళ్ళు మీ నాన్నని జైల్లో పెట్టారంట. మున్సీబు తాతొచ్చి చెప్పేడు...."

"నాన్నా!" ఏడ్చేసింది స్వరాజ్యం.

"ఛా – వూరుకోవే పిచ్చిపిల్లా! మీ నాన్నకేం కాదు. నా మాట విను. మీ నాన్నతో బాటు బోల్డు మందిని పెట్టేరట. ఆళ్ళందరికీ తిండి పెట్టాలంటే దేవుడు దిగిరావాలి. రేపో మాపో వదిలేస్తార్లేవే...."

"కొడతారేవోఁ?"

"అబ్బే. ఇదివరకంటే వేరు. ఇప్పుడు...." ఆ పిమ్మట మాట్లాడలేక పోయిందామె.

అప్పుడెప్పుడో సత్యాగ్రహుల్తోబాటు వియ్యన్న పాలకొల్లులో ఉప్పు తయారుచేస్తోంటే చావబాదారు! ఆ మధ్య భీమవరం డిప్యూటీ కలెక్టరు ఆఫీసు మీద జాతీయ జెండా ఎగరేస్తోంటే పట్టుకుని కుళ్ళబొడిచారు! ఇప్పుడు దెందులూరు రైల్వేస్టేషన్ మీద దాడి చేసి స్టేషన్ని ధ్వంసం చేసినందుకు రాయవెల్లూరు జైల్లో నిర్బంధించారు!

అవన్నీ గుర్తొచ్చేసరికి ఆవిడ గొంతు దుఃఖంతో పూడుకుపోయింది. చేతిలోని పని వదలి ఆ పక్కనే కూలబడిపోయింది.

"ఏవయ్యింది మామ్మా?" మనవరాలడిగింది అదుర్దాగా.

"వాడి బతుకెలా తెల్లారద్దో ఏవోఁనే. చచ్చి ఏ లోకాన వున్నారో మీ తాత. అయన్తోబాటు నేనూ పోయివుంటే బాగుండేది!" చీర చెంగుతో కళ్ళొత్తుకుంది.

మరేమీ మాట్లాడకుండా వీధి అరుగు మీది కెళ్ళి ఒక మూలన కూర్చుంది స్వరాజ్యం. కన్నీళ్ళు పొంగి వస్తోంటే పరికిణీతో తుడుచుకుంటూ నిశ్శబ్దంగా ఏడ్వసాగింది.

ఆమె స్నేహితులు పండూ, కామమ్మా వచ్చి ఆమె పక్కన చేరారు. సానుభూతిగా చూశారు.

"మీ నాన్నని జెయిల్లో పెట్టేరా?" పండు అడిగాడు.

తలూపింది.

"జెయిల్లో దొంగల్ని పెడతారుకదా, మీ నాన్న దొంగా?"

అమాయకంగానే అడిగాడు పండు. కాని అమాంతం కోపం వచ్చేసిందామెకి.

"మా నాన్నని దొంగంటావురా? నువ్వే దొంగవి. మీ నాన్నే దొంగ...." అంటూ వాడితో కలబడింది. వాడ్ని కింద పడేసి పైకెక్కి కూర్చుంది. ఆమెని తోసేసి లేవడానికి పెనుగులాడాడుగాని వాడికి శక్యం గాలేదు.

కామమ్మ అతికష్టంమీద ఇద్దర్నీ విడిపించింది.

"మా నాన్నని ఏవన్నా అంటే నీ నాలిక చీరేస్తాను." ఒగరుస్తూ అంది స్వరాజ్యం.

"అంతా అనుకుంటే అన్నానూ...." ఏడుపందుకున్నాడు వాడు.

జాలేసిందామెకి. "వూరుకోరా" అంది. ఆ మాటలకి వాడి స్వరం హెచ్చింది. దాంతో కంగారుపడిపోయి "రేపు బెల్లంముక్క తెచ్చి పెడతానుగా. వూరుకోరా" అని ఆశ పెట్టింది.

వాడు ఏడుపాపి "నిజంగా పెడతావా?" అనడిగాడు.

"నీతోడు."

కళ్ళు తుడుచుకున్నాడు పండు.

ముగ్గురూ పక్కపక్కనే కూర్చుని కబుర్లలో పడ్డారు.

"గాంధీ తాతని కూడా జెయిల్లో పెట్టేరంట తెలుసా?" అంది కామమ్మ.

"నిజమాఁ?!"

"మున్సీబుతాత చెబుతోంటే విన్నాను. బోల్డు మందిని జెయిల్లో పెట్టే రంట. రైళ్ళని ఆపేశారంట. పోలీసుఠాణాలకి నిప్పెట్టేరంట. రైలు పట్టాలు పీకేసేరంట. తీగలు తెంపేశారట. వంతెనలు పడగొట్టేశారంట......"

"ఇదంతా ఎందుకు చేస్తున్నారో?" పండు అడిగాడు.

"ఏమో మరి."

"స్వరాజ్యం కోసం. మా నాన్న చెప్పేరు" గొప్పగా అంది స్వరాజ్యం. గాంధీ తాతతోబాటు తన తండ్రీ జైలుకెళ్ళాడని ఆ పిల్లకెంతో గొప్పగా గర్వంగా వుందిప్పుడు!

"స్వరాజ్యం అంటే నీ పేరేకదా?"

"నా పేరే గాని మరి అదేంటో కావాలంట."

"మీ నాన్న శానా గొప్పోడంట...."

ఆమెకెంతో సంతోషం కలిగింది. ఉప్పొంగిపోతూ ఇంట్లోకెళ్ళి నానమ్మ చూడకుండా బెల్లం డబ్బాలోంచి మూడు ముక్కలు తెచ్చి వాళ్ళిద్దరికీ చెరోటీ ఇచ్చి తనోటి తీసుకుంది.

"మీ నాన్నని గొమ్ముని జెయిల్లోంచి వదిలేస్తార్లే." బెల్లం ముక్క నాకుతూ చెప్పేడు పండు.

"మా మామ్మ కూడా చెప్పింది. అందర్నీ వదిలేస్తారంట."

"జెయిల్లో ఏం చేస్తారే?" కామమ్మ అడిగింది.

"ఏమో మరి...."

అసలు జైలు అంటే ఏమిటి? ఎలా వుంటుంది? అందులో పెడితే ఏమవుతుంది? అక్కడేం జేస్తారు? అసలందులో పెడితే ఏమొస్తుంది?

ఎన్నెన్నో ప్రశ్నలు ఒకదాని వెంట ఒకటి పుట్టుకురాగా ఆలోచనలో పడింది స్వరాజ్యం.

మిత్రులు వెళ్ళిపోయారు. అయినా అక్కడ్నుంచి కదల్లేదు.

ఎప్పుడో నానమ్మ భోజనానికి పిలవగా లేచింది. కాళ్ళు కడుక్కొచ్చి సత్తుకంచం ముందు కూర్చుంది.

"వులుకూ పలుకూ లేకుండా కూర్చున్నావేం పిల్లా?"

"మామ్మా! జైలంటే ఏమిటి?"

ఆవిడ బుగ్గలు నొక్కుకుని వింతగా చూసింది.

"అయన్నీ పెద్దోళ్ళ కబుర్లు. నీకూ నాకూ ఎందుకే?"

"అసలేంటో చెప్పు!"

"ఏమో మరి. నేను మాత్రం చూశానా పెట్టానా! మీ తాత పోయాక ఇంటి గడప దాటానా ఏవన్నానా!" తెల్లచీర కొంగు భుజాల మీంచి లాక్కుని బొడ్లో దోపుకుంటూ అందామె.

"మామ్మా! నువ్వు తెల్లచీరలే ఎందుకు కట్టుకుంటావు? ఇంచక్కా రంగు చీరలు కట్టుకోవచ్చుకదా?"

"ముండ మోసినోళ్ళు ఇలాటి మల్లు పంచెలే కట్టుకోవాలే!"

"మరి జాకెట్టెందుకు తొడుక్కోవు?"

"ఆయనే పోయాక అవన్నీ ఎందుకే?" గాద్గదిక స్వరంతో అంది: "ఆయనకేం మా రాజా. నిద్దట్లో పడుకున్నాయన పడుకున్నట్టే పోయారు. ఇవన్నీ చూట్టానికే కాబోలు నేను మిగిలిపోయాను!"

తాత చనిపోయినంత మాత్రాన మామ్మ ఎందుకలా మోడు బారిపోవాలో ఆ పిల్లకి అర్థం కాలేదు. అయినా ఏదో దీర్ఘంగా ఆలోచిస్తూండి పోయింది.

## 3

రెండు నెలలు గడిచాయి.

వియ్యన్నని జైల్నుంచి విడుదల చెయ్యలేదు. ఇంటి ఆర్థిక పరిస్థితి బాగా దిగజారిపోయింది. ప్రతిదానికీ కటకటగానే వుంది.

వరి చేలు కోతకి వచ్చాయి. పాలేరు రావుడు రాత్రీపగలూ పొలాన్ని అంటిపెట్టుకునుంటున్నాడు, అయినవాళ్ళు మాటసాయం చేస్తున్నారు. కాని డబ్బు సర్దుబాటు చెయ్యగల స్థితిలో లేరెవరూ.

స్వరాజ్యాన్ని తోడు తీసుకుని గూడుబండి కట్టించుకుని పొరుగూళ్ళోని పుట్టింటికెళ్ళిందామెతల్లి కాంతమ్మ.

ఆమె అన్నగారు శివయ్య. ఆయనా స్వాతంత్ర్యోద్యమంలో చురుగ్గా పాల్గొంటున్నవాడే. కాని సత్యాగ్రహం మీదా అహింసా మార్గం మీదా ఆయనకి నమ్మకం లేదు. కమ్యూనిష్టు ఉద్యమం ద్వారానే స్వాతంత్ర్యం సాధ్యమని ఆయన విశ్వాసం. పార్టీ ఆదేశం మేరకు ఆయన "భారత్ ఛోడో" (క్విట్ ఇండియా) ఉద్యమంలో పాల్గోలేదు.

కాని బెంగాల్‌లో కరువు వచ్చి సుమారు యాభైలక్షల మంది చనిపోయారు. అందువల్ల కరువు నివారణ చర్యలు తీసుకోవాలని పార్టీ ఆధ్వర్యంలో పెద్ద ఎత్తున ఆందోళన చేశారు. ఆహారధాన్యాలు పాత బట్టలు విరాళాలు సేకరించి బెంగాల్ పంపారు. ఫాసిస్టు వ్యతిరేక ఉద్యమం చేబట్టారు. బలంగా ఉన్న ఉద్యమాన్ని దెబ్బకొట్టడానికి శివయ్య తదితరుల్ని ప్రభుత్వం అరెస్టుచేసి బళ్ళారి సెంట్రల్ జైలుకి పంపింది.

వదిన అన్నపూర్ణ, మహిళా ఉద్యమంలో చురుకుగా పాల్గొంటోందనీ అందునిమిత్తం వెళ్ళిందనీ తెలిసింది.

కాంతమ్మ ఎంతగానో నిరుత్సాహపడింది. ఇంటి పరిస్థితంతా తల్లికి వివరించి కళ్ళ నీళ్ళు పెట్టుకుంది.

"భూషణయ్య తాత బంగారం తాకట్టు మీద అప్పు ఇస్తాడు. నీ కాసుల పేరు మీద తీసుకుంటావా?" అనడిగింది తల్లి.

"ఆయనకి చెప్పకుండా....."

"ఆయనుంటే నువ్విలా రావల్సొచ్చేది కాదు కదే! అత్తగారేవైనా అంటుందా?"

"పుట్టింటివాళ్ళు ఆసరా రాలేదని ఆడి పోసుకుంటుంది. సరేలే. డబ్బు తీసుకెళ్ళకపోతే చేతికందొచ్చిన పంట కాస్తా చేజారి పోద్దేమో. అలాగే తీసుకుంటాన్లే."

చీకటితో లేచి రెండెడ్ల బండి కట్టాడు రావుడు. డబ్బు తీసుకుని వెనుదిరిగారు స్వరాజ్యమూ ఆమె తల్లీనూ.

డబ్బు తెచ్చినందుకెంతో సంతోషపడింది అత్తగారు. తర్వాత కాసుల పేరు తాకట్టు పెట్టిందని తెలిసి తాడెత్తున లేసింది.

"ఆ మాత్రం సర్దలేక పోయారా నీ పుట్టింటి వాళ్ళు. ఆడబడుచు ఒక్కతే వచ్చి నోరు తెరచి అడిగినందుకు తల తాకట్టు పెట్టైనా తెచ్చివ్వొద్దూ? దిక్కుమాలిన సంబంధం చేశాం. ఒక అచ్చటా లేదు ముచ్చటా లేదు!"

"మా అన్నయ్య ఇంటికొచ్చి రెండు నెలలయ్యిందిట." మెల్లగా అంది కాంతమ్మ.

"సరేలే సంబడం!"

ఆమె నిరసనా పెడసరం మాటలూ స్వరాజ్యానికి నచ్చలేదు. ఈవిడ తానెరిగిన నానమ్మేనా అని ఆశ్చర్యపడకుండా వుండలేకపోయింది.

"అలా నిట్రాడులా నిలబడకపోతే వెళ్ళి గేదెని తోలుకురమ్మని రావుడితో చెప్పకూడదూ? ఎండెక్కిపోతోంది పాలుతీయాలన్న ఇంగితమైనా లేదేవిటే నీకూ" అంటూ స్వరాజ్యంమీద మండిపడింది.

స్వరాజ్యం పరుగునెళ్ళి పశువుల శాలలోని పాలేరు రావుడితో చెప్పింది.

"తోలుకొచ్చేత్తాను పదండి. అయ్యగార్నెప్పుడూ ఇడిసేత్తారు సిన్న మ్మాయిగోరూ?"

"విడిచిపెట్టేత్తారంట....." తనకే సరిగ్గా తెలీకపోయినా అన్నీ తెలిసిందాన్లా చెప్పింది.

"అయ్యగోరు నిజంగా దేవుడే. అలాటోడ్ని కటకటాలెనక పెట్టినోళ్ళు పురగులడి సత్తారండి!"

అవునంటూ తలాడించింది.

ఇంటిదాకా గేదెనీ దూడనీ తోలుకొచ్చి ఆగిపోయాడు రావుడు.

అతడు మాలవాడు. అంచేత ఇంట్లోకే కాదు, పెరట్లోకి కూడా రాకూడదని ముసలావిడ ఆజ్ఞ. అంటరానితనం పాపమంటూ వాళ్ళని వియ్యన్న అక్కున చేర్చుకుంటాడని ఆవిడకి కోపం. రావుడు తీసిన పాలు కూడా ముట్టదావిడ. అందుకే గేదె పాలు కూడా స్వయంగా పితుకుతుంది.

స్వరాజ్యం గేదెని పెరట్లోకి తోలుకెళ్ళి కన్నెతో కట్టేసింది. తట్టలో చిట్టూ ఇంత తవుడూ వేసి గంజిపోసి కలిపి తెచ్చి గేదె ముందు పెట్టింది. గేదె చిట్టు తింటోంటే దాని తల గోకసాగింది. ముందు దూడని వదిలారు. కొంచెం తాగనిచ్చి ఆ పిమ్మట పక్కకి లాగి కట్టేసింది కాంతమ్మ.

నానమ్మ ఇత్తడి తపాలా తళ తళ మెరిసేలా తోముకొచ్చింది. గేదె పొదుగు కడిగి పాలు పితకసాగింది. సుయ్ సుయ్ మన్న శబ్దం ఎంతో మనోహరంగా విన్పిస్తోంటే గేదెవంక మురిపెంగా చూడసాగింది స్వరాజ్యం.

మూడు చన్నులు పితికి నాలుగోది దూడకి వదిలేసింది నానమ్మ.

మళ్ళీ గేదెని బయటికి తోలుకొచ్చి పాలేరు కప్పగించి గబగబా స్నానం చేసింది స్వరాజ్యం. తల దువ్వుకుని సంచి తీసుకుని రివ్వున ఎగుర్తూ ఆడపిల్లల బడికెళ్ళింది.

అప్పటికే పిలకపంతులుగారు పిల్లలచేత పెద్ద బాలశిక్ష వల్లె వేయిస్తున్నారు.

భయం భయంగా అడుగుపెట్టింది.

"రండి దొర్సానీ, రండి రండి. ఇప్పటికి తమకి తెల్లవారిందన్నమాట?"

సన్నగా కంపిస్తూ భయంగా చూస్తూ నిలబడింది.

"రా, చెయ్యి పట్టు. నీకు పెళ్ళి చెయ్యకపోతే ఎలా?" బెత్తం ఆడిస్తూ అన్నారు.

చేయి చాపగానే ఛెళ్‌మని ఒక్కటి వేశారు. చేయి ఎర్రగా కందింది. కళ్ళల్లోకి నీళ్ళుబికాయి.

"ఇంకోసారిలా ఆలస్యంగా వస్తే వూరుకునేది లేదు, ఏవిటనుకున్నావో" అంటూ కోటుజేబులోంచి ముక్కుపొడుం డబ్బా బయటికితీశారు.

ముక్కు పుటాల్నిండా పొడుం దట్టిస్తూ, "అవునూ, నువ్వు వియ్యన్నగారి కూతురివి కదూ" అనడిగారు.

తలూపింది.

వరుసగా ఆరుసార్లు తుమ్మేశారు. "నశ్యం బహు బాగుంది.... ఆ.... ఎక్కడున్నాం. వియ్యన్నగారి దగ్గిరా. పిల్లకాకికేం తెలుస్తుంది వుండేలు దెబ్బ అనీ ఈ కాంగ్రెస్సు వాళ్ళకేం తెలుస్తుంది బ్రిటీషువారి శక్తి? పిల్లలూ మీకో సంగతి చెప్పనా. ప్రపంచంలోని రాజులంతా పోయినా నలుగురు మాత్రం మిగిలి తీరతారట. వాళ్ళెవరో తెలుసా? పేకాటలో వుండే ఆఠీన్ రాజా ఇస్పేట్ రాజా డైమన్ రాజా మరియూ ఘనత వహించిన బ్రిటీషు రాజూను. అంత గొప్పవారు వారు. రవి అస్తమించని విశాల సామ్రాజ్యం వారిది. ప్రపంచమంతా ఆక్రమించుకున్న మహాశక్తివంతులు. వాళ్ళని కదలించడం గాంధీకేకాదు, ఎవరికీ సాధ్యం కాదు...."

ఆగి పిల్లల మొఖాల్లోకి చూశారు. అంతా ఆసక్తిగా వింటున్నారు. ఆయనకి మరింత వుత్సాహం వచ్చేసింది.

"బ్రిటీషు వారి శక్తితెలీక వూరికే ఎగిరెగిరి పడుతూంటారు వియ్యన్న గారిలాటి వాళ్ళు. ఆఖరికి వీళ్ళకి దక్కేవి తుపాకి గుళ్ళూ ఉరి కొయ్యలూ! జలియన్ వాలాబాగ్‌లో వేలాధి మందిని వూచకోత కోసేశారు ఏవిటనుకున్నారో. అలాగే వీళ్ళనీ ఏదో రోజున ఏ అండమాన్ దీవులకో పంపి కాల్చిపారేస్తారు....."

బావురుమంది స్వరాజ్యం.

పంతులుగారు కంగారుపడ్డారు. తన వాగుడు గురించి పిల్లలు ఊళ్ళో చెబితే నలుగురూ నాలుగు రకాలుగా అంటారేమోనని భయపడ్డారు.

"ఊరికే చెప్పేను పిల్లలూ! వియ్యన్నగార్నైవరైనా ఏమైనా చెయ్యడానికి ఎన్ని గుండెలుండాలి? ఎంత పెద్ద దొరలైనా గాంధేయులకి దణ్ణం పెట్టి పక్కకి తొలగాల్సిందే."

కళ్ళు తుడుచుకుంది స్వరాజ్యం.

స్తిమితపడ్డారాయన.

## 4

కాంతమ్మ వదినా, అన్నపూర్ణా, మరి పదిమంది ఆడవాళ్ళూ పొరుగూరునుంచి వచ్చారు.

కాళ్ళకి చెప్పులేసుకుని చేతిలో సంచి పట్టుకుని వచ్చిన వారివంక వింతగా చూశారు గ్రామస్తులు. "బరితెగించిన వాళ్ళు" అనుకున్న మగవాళ్ళూ లేకపోలేదు.

వాళ్ళంతా తిన్నగా వియ్యన్న ఇంటికెళ్ళారు.

సాదరంగా ఆహ్వానించింది కాంతమ్మ.

"మిడతల దండు వచ్చి ఇంటిమీద పడిందిరా దేవుడా!" అని ముసలావిడ గొణిగింది.

అత్తని చూసి ఎదురెళ్ళి చుట్టేసింది స్వరాజ్యం.

ఆవిడంటే స్వరాజ్యానికెంతో ఇష్టం. మరెంతో అభిమానం.

అన్నపూర్ణ కేవలం మేనమామ భార్య అయినందుకే కాదు, ఆమె మాటలు పద్ధతి తెగింపు అన్నీ కూడా ఎంతగానో నచ్చుతాయి స్వరాజ్యానికి.

ఆవిడ ఆ మధ్య బెజవాడలో జరిగిన మహిళా శిక్షణా శిబిరంలో పాల్గొంది. అప్పుడు చంద్ర రాజేశ్వరరావుగారి ఆధ్వర్యంలో బెజవాడ వీధుల్లో కాకీ నిక్కర్లూ సాముకర్రలూ ధరించి కవాతు చేశారు మహిళలు. వారిలో అన్నపూర్ణ కూడా వుంది.

ఆ సంగతి విన్నప్పట్నుంచీ స్వరాజ్యం కళ్ళకి ఆవిడ ఓ రుద్రమ దేవిలానూ ఝాన్సీ రాణిగానూ కన్పించసాగింది!

"బాగున్నావా స్వరాజ్యం?" బుగ్గ పుణుకుతూ అడిగిందామె.

"ఓ. మరేమో అత్తా, మా నాన్నని తెల్ల రాక్షసులు జెయిల్లో పెట్టేరు."

"మీ నాన్ననే కాదు తల్లీ బ్రిటీషు సామ్రాజ్యవాదులకి వ్యతిరేకంగా పోరాడుతోన్న ఎందరెందర్నో బంధిస్తున్నారు. కొందర్ని అండమాన్

దీవులకి తరలిస్తున్నారు. మరీ ముఖ్యుల్ని ఉరి తీస్తున్నారు. భగత్సింగ్ లాంటి త్యాగధనులు చిరునవ్వుతో ఉరిని మెడకి తగిలించుకుంటున్నారు. బ్రిటీషు వాళ్ళు ఎన్ని ఎత్తులేసినా జిత్తులు ప్రదర్శించినా స్వాతంత్ర్యభానూదయాన్ని ఆపలేరు. త్వరలోనే మీ నాన్నని వదిలేస్తారు. ధైర్యంగా వుండు."

సంతోషం పట్టలేక చప్పట్లు కొట్టింది స్వరాజ్యం.

"మా అన్నయ్యలాగే నువ్వూ ఇల్లూ సంసారం పట్టకుండా తిరుగుతున్నావన్నమాట!" నిష్ఠురంగా అంది కాంతమ్మ.

"మన సమస్య లేమిటో మనకే తెలీనంత అజ్ఞానంలో వున్నాం. అవన్నీ అందరికీ తెలియజెప్పి, స్త్రీలని సంఘటితం చెయ్యాల్సిన అవసరం ఎంతో వుంది. మీ వూరి మహిళల్ని కూడా సంఘంలో చేర్పించాలనొచ్చాం."

బుగ్గలు నొక్కుకుంది కాంతమ్మ. వదినగారి పద్ధతి ఆమెకే మాత్రం నచ్చలేదు. ఆ పోరాటాలూ సంఘాలూ అవీ మగాళ్ళూ చేసే పని అని ఆవిడ నమ్మకం.

"మీ అన్నయ్యంటే మంచీ చెడ్డా చూసేవారు. మా అత్తగారి కిలాటివి ఇష్టముండవు" అంది.

"ఆడవాళ్ళంతా చదువుకోవాలనీ దేశం గురించి తెలుసుకోవాలనీ మా నాన్న చెబుతూంటారత్తా!" గబుక్కున అంది స్వరాజ్యం.

"పులి కడుపున పిల్లి పుడుతుందా? ఆ తండ్రికి తగ్గ కూతురువే నువ్వు. ఆడవాళ్ళందర్నీ పిలుచుకొస్తావా, మీటింగెడతాం."

"ఓ. ఇప్పుడే వెళ్ళనా?"

"భోజనాలయ్యాక వెళ్దువుగాన్లే."

వచ్చిన స్త్రీలలోని బోడెమ్మగారు స్వరాజ్యాన్ని బాగా ఆకర్షించారు. ఆవిడ బ్రాహ్మణ వితంతువు. శిరోముండనం చేయించుకున్న నడివయస్సు స్త్రీ. తెల్లని సైనుపంచె నెత్తిమీద ముసుగేసుకునిమరీ ప్రచారానికొచ్చింది.

ఆవిడ్ని చూసి ముసలావిడ మూతి ముడిచింది. "పిదపకాలం, పిదప బుద్ధులూనూ!" అనేసింది

ఆవిడేమనుకుంటుందోనని స్వరాజ్యం ఇదయ్యింది గాని ఆవిడ పట్టించుకోలేదు.

"మన బతుకు లెలాగూ బూడిదయ్యాయి. మన రాత ఎవరికీ పట్టకూడదంటే ఆడవాళ్ళ కళ్ళు తెరవాలి. చదువుకోవాలి. ఉజ్జోగాలో మరోటో చెయ్యాలి" అందావిడ.

డాక్టరు అచ్చమాంబగారు రాసిన "ప్రసూతి-శిశుపోషణ" గ్రంథం కాపీని వారికిచ్చి వెళ్ళింది అన్నపూర్ణ.

ఓ పెద్ద కెరటం వచ్చి పడినట్టు ఓ మెరుపు కుదిపినట్టు వుంది స్వరాజ్యానికి.

ఆ మహిళలూ వారి మాటలూ సంఘాలూ అన్నీ అంతా కొత్తగా వుంది. వింతగా వుంది. ఉత్తేజితంగా వుంది.

ఓ సరికొత్తలోకం కళ్ళముందు ఆవిష్కరింపబడినట్టూ క్రొంగొత్త ద్వారాలేవో తెరుచుకున్నట్టూ వుంది.

"ప్రసూతి - శిశుపోషణ" గ్రంథాన్ని ఏకబిగిన చదివేసింది. సగం అర్థం కాలేదు. అయినా ఎంతో తృప్తిగా ఆనందంగా అనిపించింది.

ఎన్నో కొత్త సంగతులు తెలిసినట్టనిపించింది.

ఎప్పుడెప్పుడిదంతా తండ్రికి చెప్పి ఆయన మెప్పు పొందుదామా అని ఉత్కంఠతో ఎదురు చూడసాగింది స్వరాజ్యం.

☆ ☆ ☆

గానుగ దగ్గరి కెళ్ళి నువ్వులనూనె కొనుక్కొస్తోంది స్వరాజ్యం.

తమింటి అరుగు మీద పడక్కుర్చీలో కూర్చున్న మునసబు గారామెని చూసి పిలిచారు. భయంభయంగా సమీపించింది.

ఆయన ఆజానుబాహుడు. ఎర్రగా దబ్బపండులా వుంటారు. మాట్లాడితే వురుమురిమినట్టుంటుంది. ఆయన చెవుల్లోని వెంట్రుకలు పులిమీసాల్లా వుంటాయి.

"మీ నాన్న వస్తున్నాడే" అన్నారు.

అపనమ్మకంగా చూసింది.

"మధ్యాహ్నానికల్లా వచ్చేస్తాడు. వెళ్ళి మీ అమ్మకీ మామ్మకీ చెప్పు."

అంతే. సీసాలోని నూనె ఒలుకుద్దేమోననికూడా పట్టించుకోకుండా తూనీగలా ఎగిరి ఇంట్లో వాలింది.

"అమ్మా! నాన్నొచ్చేస్తున్నారు. మామ్మా! నాన్నొచ్చేస్తున్నారు......" వీధిలోంచే అరిచింది.

గదిలోంచి తల్లీ పెరట్లోంచి నానమ్మా ఒక్కుదుటున వచ్చేరు.

"నిజమాఁ స్వరాజ్యం?"

"అవునూ. మున్సీబు తాత పిలిచి చెప్పేడు. మధ్యాన్నాని కొచ్చేస్తాడంట...."

అమ్మకళ్ళ వెంబడి ఆనంద బాష్పాలు జల జల రాలాయి.

"వేంకట రమణమూర్తీ! ఇన్నాళ్ళకి కరుణించావా తండ్రీ!" అంటూ దణ్ణాలు పెట్టేసింది నానమ్మ.

పరుగు పరుగున తన మిత్రులందరి ఇళ్ళకీ వెళ్ళి మా నాన్న వచ్చేస్తున్నాడంటూ చెప్పి వచ్చింది స్వరాజ్యం. ఆనందంతో వుక్కిరి బిక్కిరవుతూనే గబగబా బంతిపూలు కోసి తెచ్చి మాల గుచ్చసాగింది.

ఆమె చేస్తున్న పనిని చూసి, "ఏమైనా ఇది నాన్న కూచే. అబ్బాయంటే దీనికెంత ఇష్టవనీ!" అని మురిసిపోయింది నానమ్మ.

ఇంతలో "వందేమాతరం" "మహాత్మాగాంధీకీజై" అని నినాదాలూ డప్పుల శబ్దాలూ కోలాహలమూ విన్పించాయి.

స్వరాజ్యం పూలమాలతో వీధిలోకి పరుగెత్తింది. అమ్మా నానమ్మా వీధి తలుపు వెనక్కి చేరి ఆత్రంగా వీధిలోకి తొంగి చూడసాగారు.

జయ జయ నినాదాల మధ్య ఒక బండి వచ్చి ఇంటి ముందాగింది. అందులోంచి దిగారు వియ్యన్న. ఖద్దరు చొక్కా ఖద్దరు టోపీ ధరించారు. మెడనిండా దండలున్నాయి. తలకి చిన్న కట్టువుంది. అయినప్పటికీ చాలా ఆనందంగా ఉత్సాహంగా వున్నారాయన.

ఇరుగుపొరుగు జనం కూడా పోగయ్యేసరికి నినాదాలు మిన్నుమిట్టాయి.

"వియ్యన్న గారికీ జై" అని కొందరు నినాదాలు ఇచ్చారు గాని ఆయన వెంటనే వారించారు. "బాపూజీకీ భారత మాతకీ జైజైలు కొట్టండి" అన్నారు.

ఆయన బండి దిగి కుంటుతూ అరుగెక్కడం చూసి ఆయన తల్లీ భార్యా కళవళపడ్డారు. అదేమీ గమనించని స్వరాజ్యం తండ్రికి ఎదురెళ్ళి మెడలో దండవేసింది. ఆమె నెత్తుకుని బుగ్గమీద ముద్దుపెట్టుకున్నారు. మురిసిపోయి తండ్రి మెడచుట్టూ చేతులు చుట్టేసింది.

స్వాతంత్ర్య పోరాట విశేషాలు చెప్పమని కోరారంతా.

"మన బాపూజీ ప్రారంభించిన "భారత్ ఛోడో" ఉద్యమానికి దేశ వ్యాప్తంగా మద్దత్తు లభించింది. అన్నిచోట్లా జనం ఉద్యమంలో పాల్గొని కదను తొక్కారు. ఎన్నో వేలమందిని జైల్లో నిర్బంధించినా ఎక్కడా

ఉద్యమం చప్పబడలేదు. బ్రిటీషు వారి గుండెల్లో గుబులు పుట్టింది. 'కరోయా మరో' అన్నది భారతీయులు తారక మంత్రంగా జపించే సరికి వారికి కాళ్ళూ చేతులూ ఆడకుండా పోయాయి. దానికి తోడు రైలు పట్టాలనీ వంతెనలనీ టెలిఫోన్ తంతుల్నీ నాశనం చేసి బ్రిటీషు సైనికుల పోలీసుల రాక పోకలకి అంతరాయం కల్గించడంతో బెంబేలు పడుతున్నారు. స్థానిక స్వపరిపాలనకి మరింత అవకాశం కల్పిస్తామని దిగి వచ్చారు. అయినప్పటికీ వారి మాటల్ని తోసిపుచ్చి సంపూర్ణ స్వరాజ్యమే మా లక్ష్యం అని కాంగ్రెసు తీర్మానించింది. బాపూజీనేతృత్వంలో కాంగ్రెసు మన దేశానికి స్వాతంత్ర్యం సాధించే రోజు అతి చేరువలో వుంది. ఈలోగా మనం బాపూజీ చెప్పినట్టు చరఖా ఉద్యమాన్ని విస్తృత పరచాలి. హిందీని అధికంగా ప్రచారం చెయ్యాలి. అంటరాని తనాన్ని నిర్మూలించాలి. మద్యపానాన్ని అరికట్టాలి. ఇవి మన ఆర్థిక పరిపుష్టికీ ఐకమత్యానికీ ఎంతగానో దోహదపడ్తాయి. మహాత్మాగాంధీకీ జై...."

జనం పదే పదే నినదించి శలవు తీసుకు వెళ్ళిపోయారు. కాస్త దూరంగా రావుడూ తదితర మాలలు గొంతుక్కూర్చుని వుండటం చూసి సమీపించారు వియ్యన్న.

"మీరిలా దూరంగా వుండొద్దు. మనమంతా ఒక్కటే. మనందరిలో ప్రవహిస్తోన్నది భారతీయ రక్తమే. మిమ్మల్ని జన స్రవంతిలోకి తీసుకు రావాలని బాపూజీ ఎంతగానో కృషి చేస్తున్నారు. హిందూ ధర్మంలోని దురాచారాన్ని తొలగించాలనే మీకు హరిజనులని నామకరణం చేశారు. హరిజనులంటే విష్ణువుకి ప్రీతిపాత్రులన్నమాట" అంటూ వారి భుజాల మీద చేతులేశారు.

వారు ముడుచుకుపోతోంటే వారించి వారి చేత కూడా నినాదాలు చేయించారు.

"మన దేశానికి స్వాతంత్ర్యం రాగానే మీ బతుకులు పూర్తిగా మారిపోతాయి. మీరూ చదువుకుంటారు. ఉద్యోగాలు చేస్తారు. ఊళ్ళేలతారు. అంటరాని తనం అన్నది మచ్చుకి కూడా కన్పించదు. ఇలా హీనంగా దీనంగా ఊరి చివర్న ఉండాల్సిన ఖర్మ ఉండదు. అందర్తో చేయీ భుజమూ కలిపి ముందుకి మున్ముందుకి సాగిపోయే రామరాజ్యం వచ్చితీరుతుంది."

వారి కళ్ళల్లో వేనవేల దివ్వెలు వెలిగాయి. ఆనందంగా చేతులు జోడించారు.

"మీరు మొక్కాల్సింది నాక్కాదు. ఆ దేవుడికీ బాపూజీకీ మాత్రమే. ఇంకోమాట. మీకెలాగూ చదువులేదు. మీ పిల్లల్ని అయినా చదివించండి. తాగుడు మానండి. శుచీ శుభ్రతా పెంచుకోండి. ఆత్మగౌరవం పెంపొందించుకోండి" అని చెప్పి వారిని సాగనంపి ఇంట్లోకి నడిచారు.

తల్లి వేడి వేడి పాలగ్లాసందిస్తూ "అలా కుంటుతున్నావేంరా అబ్బాయి? తలకి ఆ కట్టేవిటి?" అనడిగింది ఆదుర్దాగా.

నవ్వి వూరుకున్నారప్ప జవాబివ్వలేదు.

మళ్ళీ రెట్టించింది.

"రహస్యవివరాలు చెప్పమని కొట్టార్లే. ఇవి పెద్ద లెక్కలోవి కాదు. చాలా మందిని ఇంకా ఘోరంగా హింసించారు. చిత్రహింసలకి గురి చేశారు. అయినా ఎవరూ విలపించలేదు. వందేమాతరం నినాదాన్ని వదలనూ లేదు. ఆ కిరాతక పాలకుల దమనకాండకి మంగళం పాడేరోజు అతి త్వరలో వచ్చి తీరుతుంది" అన్నారు ఉద్వేగంతో వూగిపోతూ.

"ఇల్లూ ఒళ్ళూ గుల్ల చేసుకుంటూ ఇవన్నీ నీ కెందుకురా అబ్బాయి?"

"అదేం మాటమ్మా? మాతృభూమి బానిస బంధాల్లో చిక్కుకుని అలమటిస్తోంటే నిశ్చింతగా ఎలా నిద్రపోగలం చెప్పు? బానిస శృంఖలాలు తెగిపడే వరకూ ఈ గుండెల్లోని జ్వాలా చల్లారదు. ఈ రక్తం వుప్పొంగకా మానదు." దృఢంగా అన్నారు.

"ఏమిటోరా! ఒక్కగా నొక్క బిడ్డవి. చదువు అర్థాంతరంగా మానేశావు. వ్యవసాయమూ చూడవు. ఇల్లూ పట్టించుకోవు......"

"కుటుంబం కోసం వ్యక్తినీ, దేశం కోసం కుటుంబాన్నీ త్యాగం చెయ్యక తప్పదమ్మా! మన బిడ్డలు ముందుతరాల వాళ్ళు స్వేచ్ఛా వాయువులు పీలుస్తూ సగర్వంగా తలెత్తుకుని బతికే బంగారు రోజుల కోసం ఇప్పుడు మనం కొన్ని కష్టాలు నష్టాలు భరించక తప్పదు. కొన్ని త్యాగాలు చెయ్యకా తప్పదు."

తండ్రి మాటలు కొంచెం కొంచెం అర్థమయ్యాయి స్వరాజ్యానికి. ఆ మాత్రానికే తండ్రి వంక ఆరాధనగా చూస్తూండి పోయింది.

ఆ మర్నాడు స్వరాజ్యం మరి కొందరు పిల్లల్తో కలిసి చెడుగుడు ఆడుతోంది. రకరకాల పదాలతో కూత కూస్తున్నారు.

ఆ దారిన వెళ్తున్న వియ్యన్నగారు వారిని సమీపించి పిలిచారు.

"వందేమాతరం అనండిరా! ఆట పాటల్లోనే కాదు అన్ని వేళలా జపించాల్సిన తారక మంత్రంరా అది. వందేమాతరం అనే ఒక నినాదం కాదురా. ఒక అంకిత భావన. కులమత వర్ణసంప్రదాయాల కతీతంగా అందరూ పఠించి పులకించాల్సిన పుణ్యశ్లోకం. చైతన్యదీప్తి నిచ్చే సప్త స్వర సమ్మేళనం. తెల్సిందా?"

తలలూపారు పిల్లలు.

స్వరాజ్యం "వందేమాతరం వందేమాతరం....." అంటూ కూత పెడుతూ చెడుగుడు ఆడుతోంటే సంతృప్తిగా చూసి కదిలారాయన.

## 5

గ్రామంలో మహిళా సంఘాన్ని స్థాపించారని తెలిసి పరమానందపడి పోయారు వియ్యన్న.

"ఏవిటో అనుకున్నాను. శివయ్య భార్య ఘటికురాలేనే" అన్నారు భార్యతో.

"తనని మీరే మెచ్చుకోవాలి. ఊళ్ళట్టుకుని తిరగటం గొప్ప అనుకొంటోంది! కొడుకు బాగోగులు చూసే తీరిక కూడా లేదట!"

కాంతమ్మమాట లాయనకి రుచించలేదు.

"అవేం మాటలే. బాపూజీ కూడా మహిళలంతా స్వాతంత్ర్య పోరాటంలో పాల్గొనాలని పిలుపిచ్చారు తెలుసా? కాంగ్రెసు పార్టీ కమ్యూనిష్టు పార్టీలు రెండూ కూడా విద్యార్థి సంఘాల్నీ మహిళా సంఘాలనీ బాగా ప్రోత్సహిస్తున్నాయి. సభలు పెట్టి చైతన్యపరుస్తున్నాయి."

"మా అత్త ఎంత బాగా మాట్లాడిందో. అత్తకి బోల్డు బోల్డు సంగతులు తెలుసు నాన్నా!" అంది స్వరాజ్యం.

"ఏం మాట్లాడిందో చెప్పు చిట్టి తల్లీ!"

మొదట్లో తడబడినా తన కర్థమైనంతలో బాగానే చెప్పింది స్వరాజ్యం.

"నా బుజ్జి తల్లి గొప్ప నాయకురాలవ్వుద్ది!" కూతుర్ని ముద్దు పెట్టుకుని మురిసిపోతూ అన్నారు.

"నువ్వు తిరిగింది చాలదూ, దాన్ని కూడా చెడ గొట్టు."

మూతీ చేతులూ తిప్పిందాయన తల్లి.

"రేపు స్వతంత్రం వచ్చాక ఆడా మగా అన్న తేడాలుండవమ్మా! అంతా భుజం భుజం కలిపి పని చేస్తారు. చెరిసగమై మసల్తారు."

"ఆడోళ్ళకోసం మరుగుదొడ్డి కట్టిస్తున్నారు నాన్నా!"

"విన్నాను తల్లీ! ఇన్నాళ్ళకి మీ అత్త పుణ్యమా అని వూళ్ళోని స్త్రీలలోనూ కదలిక వచ్చింది. నాకూ మరింత స్ఫూర్తి నిచ్చింది."

"నీకా?" ఆశ్చర్యపోయింది స్వరాజ్యం.

"అవునమ్మా! నేను చెయ్యబోయేది చూశాక నీకే తెలుస్తుందిలే."

☆ ☆ ☆

వియ్యన్న తమ కొబ్బరి తోటలో రెండు పెద్ద పాకలు వేయించారు.

ఒకదాన్లో చరఖా కేంద్రాన్నీ మరోదాన్లో హిందీ శిక్షణా తరగతుల్నీ ప్రారంభించారు.

చరఖా కేంద్రంలో గాంధీజీ ఫోటో వుంచారు. ఫోటో ముందు భగవద్గీత నుంచారు.

"రఘుపతి రాఘవ రాజారాం పతీత పావన సీతారాం

ఈశ్వర అల్లా తేరే నామ్ సబ్‌కో సన్మతిదే భగవాన్" అని ప్రార్థన చేయించారు.

వందేమాతర గీతాన్ని కూడా పాడించారు.

అనంతరం యువకులు, కొద్దిమంది యువతులూ రాట్నాల ముందు కూర్చుని నూలు వడుకుతోంటే వచ్చిన శబ్దానికి మురిసిపోయా రాయన.

పిల్లలు కూడా ఉత్సాహంగా తకిలీల్తో నూలు వడకడం చూసి పొంగిపోయారు.

"అంబర్ చరఖా బీదల పాలిట కల్పతరువు అన్నారు బాపూజీ. ఇది గృహ పరిశ్రమలకి కేంద్రం. వితంతువులకి బీదలకి ఆశాజ్యోతి. పల్లెలకి పట్నాలకు మధ్య చెడిపోయిన సంబంధాన్ని పునరుద్ధరించడాని కుపయోగపడే సాధనం ఇది. ప్రజల్ని సంఘటిత పరచగల శక్తి దీనికుంది. విదేశీ వస్త్రాలని విసర్జిద్దాం. జీవితావసరమైన గుడ్డ కొరకు లాంక్‌షైరుకి బానిసల్ని చేసిన ఈస్టిండియా కంపెనీ ఎత్తుల్ని తిప్పి కొడదాం. స్వదేశీ ఖాదీని ధరిద్దాం. దేశీయ కుటీర పరిశ్రమల్ని ప్రోత్సహిద్దాం. చూస్తూండండి. ఈ రాట్నపుధ్వనే బ్రిటీషు వారిని సముద్రాలు దాటి పారిపోయేలా చేస్తుంది" అని ప్రసంగించా రాయన.

తదనంతరం రెండోపాకలో హిందీ శిక్షణా తరగతులు ప్రారంభించారు వియ్యన్న. కులమతాలతోనూ వయోభేదాలతోనూ సంబంధం లేకుండా ఎవరైనా సరే వచ్చి హిందీ భాష నేర్చుకోవచ్చని ఉద్బోధించారు. రామనాథం అనే పొరుగూరి యువకుడ్ని హిందీ శిక్షకుడిగా నియమించారు. అతడు అక్కడే వుండటానిక్కావలసిన సమస్త ఏర్పాట్లూ చేశారు.

చరఖా కేంద్రానికి అత్యధికంగా మహిళలొచ్చేందుకు విశేషంగా కృషి చేశారు గాని ప్రతిస్పందన ప్రోత్సాహకరంగా లేదు. గోషా పద్ధతి అందు కాటంకంగా తయారయ్యింది.

అయినప్పటికీ మహిళా సంఘ సభ్యులూ స్వరాజ్యమూ లలిత అనే వితంతువూ మరి కొందరూ ముందుకొచ్చారు. యువకులు మాత్రం అధికంగా వచ్చారు. హిందీ తరగతులకి యువసత్యాగ్రహుల్తో బాటు విద్యార్థులు కూడా వస్తున్నారు. ప్రతిరోజూ తరగతులకి వెళ్ళేవారిలో స్వరాజ్యం కూడా వుంది.

ఇది నాంది మాత్రమేననీ ముమ్ముందు ఈ కేంద్రానికి విశేష ప్రాముఖ్యత లభిస్తుందనీ ఆశించారు వియ్యన్న.

అంతటితో ఊరుకోలేదాయన. ఉత్సాహవంతులైన కాంగ్రెసు కార్యకర్తల్నీ యువకుల్నీ రాజమండ్రి దగ్గరి సీతానగరంలో గౌతమీ తీరాన స్థాపించిన గౌతమీ సత్యాగ్రహ ఆశ్రమానికి బృందాలుగా తీసుకెళ్ళారు. ఆ ఆశ్రమం దక్షిణ సబర్మతిగా పేరుగాంచిందనీ గాంధీజీ రెండుసార్లు దర్శించారనీ వుత్తేజపరిచారు. వారి కక్కడ సామాజిక సేవ గురించీ దేశభక్తి గురించీ సేవా కార్యక్రమాల గురించీ శిక్షణ ఇప్పించి తీసుకొచ్చారు.

వియ్యన్న మాటలు పాటలు చేష్టలు కలలు కార్యక్రమాలు ఊహలు ఊసులు అన్నీ స్వాతంత్ర్య సాధన గురించే. అంతగా ఉద్యమంతో మమేకమయ్యా రాయన!

☆ ☆ ☆

ఓ రోజు రాత్రి తండ్రి పెరట్లో మంచం వేసుకుని నడుం వాల్చారో లేదో స్వరాజ్యం వెళ్ళి ఆయన పక్కన చేరింది.

"హిందీ బాగా వస్తోందా తల్లీ?"

"ఓ. అప్పుడే గుణింతాల కొచ్చేశాను."

"భేష్. నా తల్లి చాలా చురుకైంది. ఇలా చూస్తే అలా పట్టేస్తుంది."

తండ్రి మాటలకి సంబరపడుతూ "నాన్నా! జైలు ఎలా వుంటుంది?" అనడిగింది.

గట్టిగా నవ్వేశారు వియ్యన్న.

"జైలు కూడా ఇల్లు లాంటిదే. చుట్టూ పెద్ద పెద్ద గోడలు మాత్రం వుంటాయి. ఎవరూ తప్పించుకుని పారిపోకుండానన్నమాట. బయటేం జరుగుతోందో లోపలి వారికి తెలీదు. అసలు బయటి ప్రపంచంతో సంబంధం తెగిపోద్దన్నమాట. జైలర్లు నిర్దేశించినట్టు నడచుకోవాలి తప్ప మనిష్టప్రకారం వుండటానికి వీలుండదు. ఏదో ఇంత అన్నం పెట్టి పులుసు పోస్తారంతే. ఆ పులుసు బాగుండదు. కంపు కొడుతుంది. అయినా దేవతా పులుసు అనుకుంటూ కలుపుకుని ఏదోలా తినేసేవాళ్ళం..."

"అసలు జెయిల్లో ఎందుకు పెడతారు నాన్నా?"

"బయట వుంటే మనమెన్నో కార్యక్రమాలు చేపడతామనీ అవి ప్రభుత్వానికి వ్యతిరేకంగా వుండొచ్చనీనూ. అంటే ప్రభుత్వాని కిష్టంలేని పని చేసే వాళ్ళని ఓ పెద్ద ఇంట్లో బంధించి నిర్వీర్యుల్ని, నిర్వ్యాపారుల్ని చెయ్యాలని చూస్తారన్నమాట. అసలు జైల్లో పెట్టడమంటే శిక్షించడమే. అనగా మన స్వేచ్ఛని హరించి మనల్ని నాలుగ్గోడల మధ్య బంధించడమే ఒక పెద్ద శిక్ష అన్నమాట. దీన్నిబట్టి స్వేచ్ఛ ఎంత విలువైందో తెలీడం లేదూ? అందుకే స్వేచ్ఛ కోసమే కాంగ్రెసూ బాపూజీ ఉద్యమం నడుపుతున్నారు. ఇప్పుడు మన దేశమే ఓ పెద్ద కారాగారంలా వుంది. ఈ జైలు గోడల్ని బద్దలుగొట్టి బానిస సంకెళ్ళు తెగ్గొట్టి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు సాధించుకోవాలనే నమ్మకం మా ఈ పోరాటమంతా."

"మరి స్వరాజ్యమంటే?"

"మన రాజ్యం అన్నమాట. స్వరాజ్యం నా జన్మహక్కు అన్నాడు లోకమాన్య తిలక్. అందుకే నీకాపేరు పెట్టాను. పరతంత్రంలో బానిసగా మగ్గేకన్నా స్వాతంత్ర్య పోరాటంలో మరణించడం ఉత్తమం. ఇప్పుడు మన రాజ్యాన్ని అంటే మన దేశాన్ని ఆంగ్లేయులు పరిపాలిస్తున్నారు. వారిని పార దోలి మన దేశాన్ని మనమే పాలించుకున్నప్పుడే స్వతంత్రం లభించినట్టు."

"మరైతే అప్పుడు తెల్ల దొరలుండరా నాన్నా?"

"ఉండరు. దొరలూ సామాన్యులూ అన్న భేదమే ఉండదు. ఇప్పుడు ప్రభుత్వం ఏం చేసినా అఖరికి రైలు మార్గాలు నిర్మించినా ఉప్పు

మీద పన్ను వేసినా మన పత్తిని చౌకగా తీసుకుపోయినా మిల్లు వస్త్రాలని దిగుమతి చేసినా ఏం చేసినా సరే బ్రిటీషువారికి లాభం కలగటం కోసమే చేస్తోంది. మనకి స్వరాజ్యం వచ్చేక ఇక అలాటి దోపిడిని సాగనివ్వం. అందరికీ సమాన అవకాశాలు కల్పించబడతాయి. అంతా కలిసికట్టుగా ముందడుగు వేసేలా చూడబడుతుంది. బీదా బిక్కీ ఆకలితో అలమటించాల్సిన పరిస్థితి వుండదు. ప్రతివారికీ కూడూ గుడ్డా లభ్యమయ్యేట్లు చూడబడుతుంది. స్వదేశీ పరిశ్రమల్నీ కుటీర పరిశ్రమల్నీ ప్రోత్సహిస్తాం. ప్రతిగ్రామమూ స్వయం పోషక మయ్యేట్లు చూస్తారు. అంతా సుఖంగా సంతోషంగా సగర్వంగా బతికే పరిస్థితి కల్పించబడుతుంది. ఎక్కడా ఆకలి కేకలుండవు. అవినీతి చీడ ఉండదు. దమన నీతి ఉండదు. మన వాళ్ళే, మనలో వాళ్ళే మన నాయకులై మనందరి బాగుకోసం అహరహం కృషి చేస్తారు. అంటరాని తనాన్ని నిరక్షరాస్యతని నిర్మూలిస్తారు. ఆరోగ్యం విద్య వ్యవసాయం మెరుగుదలకు చర్యలు తీసుకుంటారు ఒక్క మాటలో చెప్పాలంటే సాక్షాత్తూ రామరాజ్యం స్థాపించబడుతుంది."

"అమ్మో! అప్పుడెంత బావుంటుందో!" కళ్ళింతంత చేసుకునంది స్వరాజ్యం సంబరంగా.

ఆమె మాటల కాయనకి మరింత ఉత్సాహం వచ్చింది.

"బాపూజీ ఏమన్నారో తెలుసా స్వరాజ్యం? నేను కలలు గన్న స్వరాజ్యంలో కుల మత భేదాలకు ఎలంటి స్థానం లేదు. దాని మీద ధనికుల మేధావుల ఆధిపత్యం ఏమాత్రం వుండరాదు. ఆ స్వరాజ్యం అందరి క్షేమం కొరకే, కళ్యాణం కొరకే వుంటుంది. మన స్వరాజ్యాని కర్థం మన దేశ ప్రజల్ని సభ్యత కలవారుగా చెయ్యటం. సభ్యత యొక్క మూలం సర్వోత్కృష్టమైన నీతి పాలనలోనే వుంది. ఈ నీతి పాలన సార్వజనికాలైన కార్యాలకూ వ్యక్తిగత కార్యాలకూ కూడా వర్తిస్తుంది. దేశంలోని ప్రతి పురుషుడు ప్రతి స్త్రీ తన శరీర శ్రమ, బుద్ధి కుశలత ద్వారా ఆర్థిక ఉన్నతిని సాధించుకోవాలి. నేటి మాదిరిగా వస్త్రవిహీనులు కాకుండా కావలసిన గుడ్డలు, పాలు, వెన్న, పోషక ఆహారం అప్పుడు అందరికీ లభించగలవు."

"నిజంగా అంత చక్కని రోజులు వస్తాయా నాన్నా?"

"రావటం కాదమ్మా, సాధించి తీరతాం. భారతీయులంతా ఒక్కతాటి మీద నిలిచి పిడికిళ్ళు బిగిస్తే అసాధ్యం అసంభవం అన్న పదాలు తమ అర్థాల్ని కోల్పోతాయి!"

స్వరాజ్యం తండ్రి గుండెలమీద చేయివేసి పడుకుని నిద్రపోయింది. ఆ నిద్రలో చక్కని కల వచ్చింది.

బాపూజీ శంఖారావానికి భయపడి బ్రిటీషువారు జీపెక్కి పారి పోయారు. తెల్లదొరలూ కిరాతక పోలీసులూ రైళ్ళెక్కి వెళ్ళిపోయారు. జైలు గోడల్ని ధ్వంసం చేశారు. అసలెక్కడా జైళ్ళనేవే లేవు. ఎల్లెడలా స్వేచ్ఛ. అంతా ఖద్దరు దుస్తులు ధరించారు. అన్నదమ్ముల్లా కలిసిపోయారు. ఆడుతూ పాడుతూ పనీ పాటా చేశారు. ఎంతో అహోరాత్రాన్ని మరెంతో సంపదని సృష్టించారు. అంతా బంతులుగా కూర్చుని ఆనందంగా తిన్నారు. పండుగ పరచుకున్నట్టుంది దేశమంతా....!

## 6

స్వరాజ్యం పుష్పవతి అయ్యింది.

ఊరంతట్నీ పిలిచి "బంతి" చేయాలనీ కార్యక్రమం ఘనంగా చెయ్యాలనీ ఆమె నానమ్మ పట్టుబట్టింది. వియ్యన్న పెళ్ళి తర్వాత ఆ ఇంట జరుగుతోన్న కార్యం ఇదే గనుక ఖర్చు విషయంలో వెనకాడితే వూరుకునేది లేదని ఖండితంగా చెప్పేసింది.

దేశమంతా అల్లకల్లోలంగా వుంది. హిందూ ముసల్మానుల మధ్య విభేదాలు సృష్టించి తద్వారా దేశాన్ని చీల్చడానికి ప్రయత్నాలు జరుగుతు న్నాయి. ఇటువంటప్పుడు తమింట్లో వేడుక చేసుకోవడం వియ్యన్నకు ఇష్టం లేకపోయింది. కాని కడకి తల్లి ఒత్తిడికి తలొగ్గక తప్పలేదాయనకి.

చేతిలో చిల్లి గవ్వలేదు. పంటలు సరిగ్గా పండటం లేదు. పండిన ధాన్యానికి గిట్టుబాటు ధర లభించట్లేదు. దాన్ని ఆసరా చేసుకుని భూస్వాములు అప్పులిస్తూ అధిక వడ్డీలు గుంజుతున్నారు. చితికిన రైతుల భూముల్ని ఆక్రమించుకుంటున్నారు.

వియ్యన్న పరిస్థితి చాలా తీసి కట్టుగా వుంది. తెచ్చిన అప్పులు తీర్చలేక పోతున్నారు. కాంగ్రెస్ కార్యకలాపాలకీ చరఖా కేంద్రానికీ వాటికీ చాలా

ఖర్చవుతోంది. అయినా వెనుదిరిగి చూసుకోవడం లెక్కలు వేసుకోవడం ఆయనకి చేతకాని పని. అంచేత మళ్ళీ అప్పుచెయ్యక తప్పింది కాదు.

ఊరందర్తో బాటు హరిజనుల్ని కూడా భోజనానికి పిలవాలనుకున్నారు. ఇంట్లో తల్లీ బయట గ్రామపెద్దలూ వ్యతిరేకించారు. అంతా మాలకూడు చేసేస్తామంటే మేం భోజనానికి రామని తెగేసి చెప్పేరు. వాళ్ళకి నచ్చచెప్పాలని ప్రయత్నించి విఫలురయ్యారు. వారి మూఢత్వానికెంతో బాధ పడ్డారు. ఆఖరికి మాల మాదిగలందరికీ పశువుల శాలలో భోజనాలు పెట్టడానికి నిర్ణయించుకున్నారు.

బంతి కన్ని ఏర్పాట్లూ చేశారు. ఇంతలో గాంధీజీ ఆ ప్రాంతానికి వస్తున్నట్టు తెలిసింది. ఇంటి కార్యక్రమాన్ని బంధుమిత్రుల కప్పగించేసి కార్యకర్తల్ని వెంటేసుకు వెళ్ళిపోయారు వియ్యన్న.

ఆయన తల్లి నెత్తీ నోరూ కొట్టుకుంది. కాని విన్పించుకోలేదు. ఆఖరికి స్వరాజ్యం కూడా "నాక్కూడా బాపూజీని చూడాలనుంది మామ్మా!" అంది.

దాంతో ఆవిడ ఎండు పుల్లలా మండిపోయింది. గాంధీజీతో సహా అందర్నీ తిట్టిపోస్తోంటే ఆమెకి నచ్చచెప్పి వూరుకోబెట్టేసరికి తల ప్రాణం తోకకొచ్చింది!

గాంధీజీని దర్శించి జన్మ ధన్యమైనట్టు పులకించిపోతూ పరమానంద భరితులై తిరిగొచ్చారు వియ్యన్న.

ఆయన చేతి వేళ్ళు బోసిగా వుండటం చూసి "మీ చేతి వుంగరాలేమయ్యాయండీ?" అనడిగింది ఇల్లాలు.

స్వరాజ్యం కూడా తండ్రివంక ఆసక్తిగా చూసింది.

"బాపూజీ స్వరాజ్య నిధికోసం జోలె పట్టారు. చేతి ఉంగరాలిచ్చేశాను. అమ్మకి తెలవనివ్వొద్దు. బాధపడుతుంది."

ఆవిడ చీరచెంగు నోట్లో కుక్కుకుంది.

"బాపూజీని కళ్ళారా చూశావా నాన్నా?" అనడిగింది స్వరాజ్యం.

"చూశానమ్మా! ఆ దరిద్రనారాయణుడి దివ్యమంగళ స్వరూపాన్ని తనివితీరా చూశాను. పాదాభివందనం చేసే భాగ్యం కూడా లభించింది. పండు వెన్నెల కురిపిస్తూ నవ్వుతూ ఎంత నిరాడంబరంగా వున్నారనీ! ఈ బక్క చిక్కిన ముసలాయన ఒక చేత్తో చరఖానీ మరోచేత్తో సత్యాగ్రహోయు

ధాన్నీ ధరించి బ్రిటీష్ సామ్రాజ్యం మీద శంఖారావం చేస్తున్నారనుకునే సరికి తనువెల్లా పులకరించిందనుకో. సభకి వచ్చిన అశేష జనవాహిని చూశాక మనకి స్వరాజ్యం రావడం ఖాయమన్పించిందమ్మా! నీకూ నీలాటి యువతీ యువకులకూ పుట్టబోయే పిల్లలంతా స్వేచ్ఛావనిలో ఊపిరి పీలుస్తారమ్మా! స్వతంత్రపౌరులై తలెత్తుకుని సగర్వంగా బతుకుతారమ్మా! ఆ తరం వారూ ఆ తర్వాతి తరాల వారూ ఎంతెంత అదృష్టవంతులో!"

అశ్రుపూరితాలైన ఆయన కళ్ళల్లో మెరుస్తోన్న మెరుపుల్ని చూసి మైమరచిందామె.

☆ ☆ ☆

హిందీ శిక్షకుడు రామనాథం వచ్చి "మీతో కొంచెం మాట్లాడాలండి" అన్నాడు వియ్యన్నతో.

"పుస్తకాలేమైనా తెప్పించాలా?"

"అహ అదికాదు. మీరంతా అంగీకరిస్తే లలితని పెళ్ళి చేసుకుంటాను"

ఆశ్చర్యంగా చూశారు. "లలిత వితంతువు. ఆ సంగతి నీకు తెలుసుకదా?"

"తెలుసండి. మీ ఆశీర్వాదం లభిస్తే ఆమెకి కొత్త జీవితాన్నివ్వగలననీ సుఖపెట్టగలననీ నా నమ్మకం."

"చాలా సంతోషం బాబూ! నా ఆశ్రమంలోని ఓ యువకు డిలా ముందుకొచ్చి ఒక అభాగ్య యువతికి చేయి అందిస్తున్నందుకు చెప్పలేనంత ఆనందంగా వుంది. అందునా బాపూజీ సిద్ధాంతాన్ని మనసా వాచా ఆచరిస్తోన్న మీ ఇద్దరూ పెళ్ళి చేసుకోబోవటం మహదానందం కలిగిస్తోంది. చరఖా కేంద్రంలోని లలితకీ హిందీ పాఠశాలలోని నీకూ పెళ్ళి జరిపిస్తాను. మన ఆశ్రమంలోనే జరిపిస్తాను. ఆమె పెద్దల్ని కూడా అంగీకరింపచేస్తాను."

వారి సంభాషణ విన్న స్వరాజ్యం తండ్రి నెంతగానో మెచ్చుకుంది.

వెంటనే వెళ్ళి లలిత పెద్దల్తో మాట్లాడి వచ్చేరాయన.

"ఒప్పుకున్నారా నాన్నా?" ఆత్రంగా అడిగింది.

"ఎంతగానో నచ్చ చెప్పిన మీదట అంగీకరించారు. సంప్రదాయాలూ కట్టుబాట్లూ మనిషి ఎదుగుదలకూ ముమ్ముందుకి నడవడానికీ తోడ్పడాలి తప్ప కాళ్ళకి సంకెళ్ళుగా మారకూడదమ్మా! వితంతువుకి మళ్ళీ

పెళ్ళి చేస్తే సాటి కులస్థు లేమనకుంటారోనని ఆలోచిస్తున్నారు గాని కూతురి బతుకు బాగుపడే అవకాశం వచ్చిందని, సంతోషపట్టం లేదు. ఎట్టకేలకు ఒప్పుకున్నారనుకో. కాని రామనాథానికి ఉద్యోగం సద్యోగం లేదు కదా పెళ్ళాన్నెలా పోషిస్తాడూ అవటాని చిన్న మెలిక పెట్టారు. తోటలో ఇల్లు కట్టించిస్తానని రెండెకరాల పొలం రాసిస్తాననీ చెప్పేను. స్వరాజ్యం వచ్చేక చక్కని ఉద్యోగం వస్తుందని నచ్చజెప్పేను."

"మరి మామ్మా...."

"ఒప్పుకోదు. ఎలా వోలా నచ్చచెప్పాలి. అసలే తాత తండ్రులు సంపాదించిన ఆస్తిని హారతి కర్పూరం చేసేస్తున్నానని బాధపడ్తోంది. దానితోబాటే ఇదీను అనుకోవడమే. మనవల్ల ఒక బతుకు ఒడ్డున పడుతోందంటే అంతకంటే ఏం కావాలి చెప్పమ్మా?"

అవునన్నట్టు తలాడించింది స్వరాజ్యం. ఆమె దృష్టిలో తండ్రి మరింత వున్నత శిఖరాలకి ఎదిగిపోయాడు!

మరి వారం రోజులకి చరఖా కేంద్రంలో రామనాథం లలితల వివాహం ఏర్పాటు చేశారు.

మొదట వారిద్దరి చేత ఖద్దరు బట్టలు ధరింప చేశారు. పిమ్మట ఊరి చెరువు రేవు శుభ్రం చేసి రమ్మన్నారు. అనంతరం బాపూజీ చిత్రపటం సాక్షిగా ముప్పన్నెల నూలు దండలు మార్చుకోమన్నారు. ఇద్దరి చేతా – వివాహ బంధానికి కట్టుబడి వుంటామని ప్రతిజ్ఞ చేయించారు. వారి చేత రాట్నంమీద నూలు వడికించారు. మొక్కలకి నీళ్ళు పోయించారు.

తకిలీ భగవద్గీత బహూకరించారు.

ఎందరో గ్రామస్థులు కాంగ్రెసు నాయకులూ కార్యకర్తలూ మహిళా సంఘసభ్యులూ వచ్చి ఆ ఆదర్శ వివాహాన్ని కనులారా తిలకించారు. మనసారా అభినందించారు.

వియ్యన్నని వేనోళ్ళ పొగిడి "ఈ వివాహంవల్ల మీ ఆశ్రమం కూడా ధన్యమయ్యింది. బాపూజీ సంతోషించే చక్కని కార్యక్రమం నిర్విఘ్నంగా నిర్వహించారు" అన్నారు నాయకులు.

సదరు కార్యక్రమానికన్ని ఏర్పాట్లూ చేసింది స్వరాజ్యమే.

# 7

"బోలో స్వతంత్ర భారత్‌కీ – జై!"

"మహాత్మా గాంధీకీ – జై!"

దేశానికి స్వాతంత్ర్యం వచ్చింది! ఎందరో వీరుల త్యాగం ఫలించింది!

ఎల్లెడలా ఆనందం! పరమానందం! బ్రహ్మానందం!

చిన్నపిల్లాడై ఆనంద నాట్యం చేశారు వియ్యన్న.

దేశ విభజన జరిగినందుకు దుఃఖం ఓపక్కన తొలిచేస్తున్నప్పటికీ ఎందరెందరో సత్యాగ్రహుల త్యాగధనుల తపఃఫలంగా స్వాతంత్ర్యం లభించిందని వుప్పొంగిపోయా రాయన.

వాడ వాడకీ ఇంటింటికీ వెళ్ళి చెప్పేరు. పిల్లల్తో పెద్దల్తో స్వతంత్ర భారతావనికి జేజేలు చెప్పించారు.

ఆనందోద్వేగంతో ఆయన నిలువెల్లా వూగిపోతున్నారు. ఆయన కే మవుతుందో నన్న భయంతో ఆయన నీడల్లే వెన్నంటి వుంది స్వరాజ్యం.

చరఖా కేంద్రం దగ్గరకి ఊరంతా తరలి వచ్చింది. ప్రతివారి మోములోనూ అవ్యక్తానందం చిందులేస్తోంది.

విదేశీ పీడ విరగడయ్యింది! దేశం స్వతంత్రమయ్యింది! ఇక మనదే రాజ్యం!

"వందేమాతరం!" పదే పదే నినదిస్తున్నారు జనం.

స్వాతంత్ర్య సమరంలో అసువులు బాసిన అమరవీరుల స్మృత్యర్థం రెండు నిమిషాలు మౌనం పాటించారు.

తదనంతరం త్రివర్ణ పతాకాన్ని ఎగురవేశారు వియ్యన్న.

"ఝండా ఊంచా రహే హమారా
విజయీ విశ్వతరంగా ప్యారా
సదాశక్తి బరసానే వాలా
ప్రేమసుధా సరసానే వాలా
వీరోంకే హర్షానే వాలా
మాతృభూమికా తన్‌మన్ సారా" అంటూ ముక్తకంఠంతో ఉద్రేకంతో ఊగిపోతూ పాడించారు.

వందేమాతర గీతాన్ని ఉచ్చైస్వరంతో పాడించారు.

మిఠాయిలు పంచారు.

"సోదర సోదరీమణులారా! నా ప్రియదేశవాసులారా! దీపావళి ఇవాళే. బక్రీద్ ఈరోజే. క్రిస్మస్ ఈనాడే. మన కల మహాత్ముడి సంకల్పం ఫలించిన మహత్తరమైన రోజిది. తుపాకులు తిరుగుబాటు రక్తపాతం ఏమీ లేకుండా అహింసే ఆయుధంగా సత్యాగ్రహమే అస్త్రంగా స్వాతంత్ర్యాన్ని సముపార్జించుకున్నాం. ప్రపంచంలో అహింసా మార్గంలో స్వతంత్రం సాధించుకున్న దేశం మరొకటిలేదు.

"స్వరాజ్యం వచ్చిందని పొంగిపోతే సరిపోదు. దీన్ని సురాజ్యంగా మార్చుకోవాల్సిన గురుతరమైన బాధ్యత మనందరిమీదా, మన నేతల మీదా వుంది. దేశపు మూలుగుని పీల్చి పిప్పిచేశారు బ్రిటీషు వారు. అస్థిపంజరాన్ని మిగిల్చారు. దీనికి మళ్ళీ జవసత్వాలు చేకూర్చాలి. సుసంపన్నం చెయ్యాలి. సుజలాం సుఫలాం సస్యశ్యామలం అయ్యేలా తీర్చిదిద్దాలి. ఇదే సమయంలో మన ముస్లిం సోదరులు పాకిస్థాన్ పేరుతో మరో దేశంగా విభజితులయ్యారు. ఇది భరించలేక బాపూజీ ఈ వేడుకలకి దూరంగా వున్నారు.

"సంపూర్ణ స్వరాజ్యం కోసం లాహోరు కాంగ్రెసులో ప్రతిజ్ఞ చేశాం. ప్రతిజ్ఞ నెరవేరింది. కాని లాహోరు మన దేశంలో లేకుండా పోయింది. అయినప్పటికీ ఈ విషాదం దిగమింగుదాం. సోదర భావాన్ని పెంచుకుందాం. హిందూ ముస్లింల మధ్య సఖ్యభావన పెంచుతామని ప్రతిజ్ఞ చేద్దాం. మహాత్మా గాంధీకీ – జై! భారత మాతకీ – జై! స్వతంత్రా భారత్ కీ జై!...."

పిల్లలూ పెద్దలూ అంతా అడుగడుగునా వియ్యన్న ప్రసంగానికి హర్షధ్వనులు చేశారు. మధ్య మధ్యలో వందేమాతరం మహాత్మా గాంధీకీజై అంటూ నినాదాలు చేస్తూనే వున్నారు.

"రాత్రి మన ప్రధమ ప్రధాని జవహర్ లాల్ నెహ్రూ దేశప్రజల నుద్దేశిస్తూ ఒక ప్రతిజ్ఞా ప్రసంగం చేశారు. దాన్ని రేడియోలో విని రాశాను. ఇప్పుడు మనందరికీ దాన్ని చదివి వినిపిస్తాను, శ్రద్ధగా ఆలకించండి" అంటూ జేబులోంచి కాగితం బయటికి తీశారు.

"జగతి గాఢ నిద్దురలో మునిగి తేలే ఈ అర్ధరాత్రి సజీవ స్వతంత్ర భారతం మేలుకొంటోంది. స్వేచ్ఛ అధికారాలతోబాటు బాధ్యతలూ వెనువెంటనే

వస్తాయి. అలసత్వంతో విశ్రమించే తరుణం కాదిది. ఇంతవరకూ చేసిన బాసలను ఇప్పుడు చేయబోతున్న ప్రతిజ్ఞలను నెరవేర్చేందుకు నిరంతరం కృషి చేసే సమయ మాసన్నమైంది. భారతదేశాన్ని సేవించడమంటే ఈ దేశంలోని పీడిత జన కోటిని సేవించడమే. దారిద్ర్యాన్ని అవిద్యను అనారోగ్యాన్ని నిర్మూలించడమే! అందరికీ సమానావకాశాలు కల్పించేందుకు కృషి చేయడమే దేశ సేవ. అన్ని కన్నుల అశ్రుధారలను తుడిచేయడమే మన తరంలోని మహాత్ముని ఆశయం. కన్నీరూ కడగండ్లూ దేశంలో వున్నంతవరకూ మనం కష్టించక తప్పదు. దేశమాత సంతానం నివసించేందుకు స్వతంత్ర భారత సమున్నత సౌధాన్ని నిర్మించడమే మన లక్ష్యం."

ప్రసంగం చదవటం పూర్తయ్యింది. చప్పట్ల వర్షం కురిసింది, మళ్ళీ జయజయ నినాదాలతో దిక్కులు ప్రతిధ్వనించాయి.

"స్వరాజ్యం సాధించాం, స్వతంత్రులమయ్యాం" అన్న భావనతో జనమంతా అవాళ పండుగ చేసుకున్నారు. వీధి వీధినా జెండాలు ఎగుర వేశారు. దీపావళిని తలదన్నేలా దీపాలంకరణ చేశారు. అమర వీరుల్ని కీర్తిస్తూ పాటలు పాడారు. నృత్యాలు చేశారు.

అన్నిచోట్లా తానే ఐ అన్నిటా పాల్గొన్నారు వియ్యన్న.

☆ ☆ ☆

"ఇన్నాళ్ళూ దేశం స్వరాజ్యం అంటూ ఇల్లూ ఒళ్ళూ పట్టకుండా తిరిగావు. స్వరాజ్యం వచ్చింది కదా, ఇకనైనా ఇంటి సంగతులు పట్టించుకోరా అబ్బాయ్?" అంది తల్లి వియ్యన్నతో.

"అలాగే నమ్మా! కాని కలకత్తాలో పంజాబులో హిందూ ముస్లింల మధ్య విభేదాలూ కొట్లాటలూ ప్రారంభమయ్యాయి. బాపూజీ ఉపవాస దీక్షకి పూనుకున్నారు. మనదేశం మతప్రాతిపదికన రెండుగా చీలి పోయినా వారిలో పరివర్తన రాలేదు చూడు. అన్నదమ్ముల మధ్య కలహాలూ విధ్వంసక చర్యలూనూ. ఎంత ఘోరమో చూడమ్మా!....." బాధగా అన్నారు.

"రామాయణంలో వాలి సుగ్రీవులు కొట్లాడుకోలేదూ? అలాటివి జరుగుతూనే వుంటాయి మరి. వాళ్ళూ వీళ్ళూ కూర్చుని సర్దుబాటు చేసుకోవాలిగాని వీధెక్కితే పలచనైపోరూ?"

"బాపూజీ అదే బోధిస్తున్నారు. శాంతి సంఘాలు ఏర్పాటు చేస్తున్నారు."

"వాటి గురించి మన పనులు వాయిదా వేసుకుంటామురా అబ్బాయ్? పెళ్ళి కెదిగిన పిల్లని ఎన్నాళ్ళు ఇంట్లో ఉంచుకుంటాం, చెప్పు? వీలైన సంబంధం చూసి స్వరాజ్యానికి ఆ మూడు ముళ్ళూ వేయించేస్తే నువ్వు నిశ్చింతగా వుండొచ్చు."

అంతవరకూ అక్కడే ఉన్న స్వరాజ్యం సిగ్గుపడి లేచి లోపలికెళ్ళి పోయింది.

"సరేనమ్మా!. వీలైన సంబంధం కోసం నలుగురి చెవినా వేస్తాన్లే."

"ఆడపిల్లని తెచ్చుకునేప్పుడు తక్కువ నుంచి తెచ్చుకోవాలి. ఇచ్చేప్పుడు ఎక్కువలో ఇవ్వాలి. ఆ సంగతి గుర్తుంచుకోరా అబ్బాయ్."

"అలాగేలే. నా కున్నదే ఒక్కగానొక్క కూతురు. పైగా అదెంతో తెలివైంది. చురుకైంది. ఊళ్ళో ఉన్నత పాఠశాల లేదుగాని లేకపోతే ఇంకా బాగా చదివించేవాడ్నే."

"హవ్వ! సవత్తాడిన పిల్లని బయటికి పంపిస్తావట్రా?" బుగ్గలు నొక్కుకుంది.

"ఆడపిల్ల చదువు ఇంటికే వెలుగన్నారే!"

"చాలు చాల్లేరా. అదేం ఉద్యోగాలూ చెయ్యక్కర్లేదు ఊళ్ళూ ఏలక్కర్లేదుగాని నా బొందిలో ప్రాణం వుండగానే నాలుగక్షింతలు వేయించెయ్. ఆ తర్వాత హరీ అన్నా ఫర్లేదు, నిశ్చింతగా పోతాను."

"శుభమా అంటూ పెళ్ళి వూసెత్తి అవేం మాటలమ్మా."

"నాది పోయే కాలమే కాని వచ్చే కాలం కాదు కదరా! అప్పలూ ఆ ఇచ్చిపుచ్చుకునే లావాదేవీలూ కూడా తేల్చేసుకుంటే గట్టున పడొచ్చురా అబ్బాయ్! ఋణం వ్రణంలాంటిదిరా! లోపల్లోపల్నుంచి తినేస్తుందిరా—ఏవిటనుకున్నావో."

ఆ విషయాలు తలచుకునేసరికాయన గుండెలు గుభిల్లుమన్నాయి.

మరి మాటలు పెంచకుండా లేచి వెళ్ళిపోయారు వియ్యన్న.

# 8

విషాదమూర్తిలా వున్న వియ్యన్నను చూసేసరికి అందరి గుండెలూ గుభిల్లు మన్నాయి.

"మా వొదినకి ఎలా ఉందండీ?" ఎదురెళ్తూ అడిగింది కాంతమ్మ.

"వెన్నుపూస దెబ్బతిందంటున్నారు.

ఏడుస్తూ కూలబడింది కాంతమ్మ.

స్వరాజ్యానిక్కూడా దుఃఖం పొంగివచ్చింది.

ఎంతో ఆవేశంగా ఉపన్యసించే అన్నపూర్ణ రూపం కళ్ళముందు కదిలింది.

"ఇలా ఎలా జరిగింది నాన్నా! స్వాతంత్ర్యం వచ్చేక అంతా బావుంటుందన్నావుగా?" అతికష్టంమీద నోరు పెగల్చుకుని అడిగింది స్వరాజ్యం.

"అదే నాకూ అర్థం కావట్లేదు తల్లీ దారులు వేరైనా అందరూ పోరాడారు. బ్రిటీషువారిని ఎదిరించారు. ఎన్నో కష్టనష్టాల కోర్చారు. అయినా మద్రాసు ప్రభుత్వం కమ్యూనిష్టులమీద, ఎందుకు నిర్బంధ కాండ సాగిస్తోందో అర్థం కావట్లేదు...."

"శివయ్య మావయ్యని కూడా ఎన్నో కేసుల్లో ఇరికించారు. తాడేపల్లి గూడెం పోలీసు క్యాంపులో ఎన్నో చిత్రహింసలు పెట్టారు. ఇప్పుడెక్కడున్నాడో ఏమో. కొందరేమో పోలీసులు కాల్చి చంపి వుంటారంటున్నారు."

"అబ్బే, అలాంటిదేం లేదమ్మా! అజ్ఞాత వాసంలో వున్నాడు. శివయ్యకేం కాదుగాని మీ అత్తయ్య పరిస్థితే...."

"బెజవాడలో రాష్ట్రమహిళా సభ జరుపుకోడానికెళ్ళేరు. అదే నేరమైపోయిందా నాన్నా?"

కూతురి ప్రశ్నకి ఏం సమాధాన మివ్వాలో తోచలేదు వియ్యన్నకి.

మహిళాసభని జరపరాదన్నది ప్రభుత్వం. 144వ సెక్షన్ జారీ చేసింది కూడా. నిషేధాజ్ఞల్ని ధిక్కరించి వేలమంది మహిళలు ఊరేగింపు జరిపారు. అచ్చమాంబ, మెల్లీ షోలింగర్, మానికొండ సూర్యావతి, మోటూరి ఉదయం మొదలైనవారు నాయకత్వం వహించారు.

అన్నపూర్ణ కూడా ఆ ఊరేగింపులో పాల్గొంది.

ఎలాంటి హెచ్చరికా లేకుండా పోలీసులు భాష్పవాయువు ప్రయోగించారు. లారీచార్జీ చేశారు.

నాయకురాంద్రని అరెస్టు చేసి నందిగామ జైలుకి తరలించారు. మిగతా వారిని తరిమి తరిమి కొట్టారు. పరుగెడుతూ అన్నపూర్ణ పడిపోయింది. పోలీసు లారీలు ఆమెమీద విరుచుకుపడ్డాయి.

కృష్ణ లంక ప్రజలు ఆమెకి ఆశ్రయమిచ్చి సపర్యలు చేసి ఇంటికి పంపించారు. ఆసుపత్రిలో చికిత్స పొందుతున్న ఆమెని చూసి వచ్చారాయన.

"మన ప్రభుత్వాన్ని మనం వ్యతిరేకించడం, మన ప్రభుత్వం మన ప్రజల మీద దమన కాండ సాగించడం.... ఇదంతా వీవిటో ఎందుకో తెలీటం లేదు తల్లీ! అంతా అయోమయంగా వుందనుకో."

"అత్తకేమీ కాదుకదా నాన్నా?"

"కాదులే తల్లీ ధైర్యంగా వుండు...." కళ్ళు తుడుచుకుంటూ అన్నారు.

"తిన్నది అరక్కగాకపోతే ఆడవాళ్ళకి ఆ సభలూ చట్టుబండలూ ఎందుకూ!"

నానమ్మ మాటలకి స్వరాజ్యానికి రోషం వచ్చింది.

"మా అత్త చాలా గొప్పది నానమ్మా"

"అబ్బో! ఆ అత్తకి తగ్గ మేనకోడలివి!"

"అలా మాట్లాడకమ్మా! త్యాగాలు కొందరే చెయ్యగలరు. వారే ధన్యాత్ములు!"

కొడుకు మాటలకి అవాక్కయ్యిందావిడ.

☆ ☆ ☆

"అమ్మా! స్వరాజ్యానికో సంబంధం చూశాను." బయట్నుంచొచ్చి కాళ్ళు కడుక్కుంటూ అన్నారు వియ్యన్న.

"ఏ వూరూ, ఎవరి తాలూకూ?" కాళ్ళు తుడుచుకోవడానికి పైపంచె అందిస్తూ అడిగింది.

స్వరాజ్యమూ ఆమె తల్లీ చెవులు రిక్కించారు.

"విశ్వేశ్వరయ్యగారనీ పేరు మోసిన వకీలులే. వారబ్బాయి. కుర్రాడు కూడా మద్రాసులో ప్లీడరీ చదువుతున్నాడు. ఆయనకి ఇద్దరబ్బాయిలూ ఒకమ్మాయీనూ. ఇతగాడు చిన్నవాడు. పెద్దవాళ్ళిద్దరికీ పెళ్ళిళ్ళయ్యాయి."

"ప్లీడరు సంబంధమా! వాళ్ళతో వ్యవహారాలు సాఫీగా వుండవారేయ్ అబ్బాయ్! అయినదానికీ కానిదానికీ కచేరీల కీడుస్తార్రా!"

"భలేదానివే అమ్మా! ఇతరుల వ్యవహారాల్లో అలాటి పన్లు చేస్తారుగాని స్వంత పనుల్లో ఎందుకు చేస్తారే? నీదంతా చాదస్తం."

"ఏమోరా అబ్బాయ్! లక్షణంగా ఏ వ్యవసాయం చేసుకునే వాడికో చేస్తే భూమిని కొలుస్తూ సుఖంగా బతికేస్తారు."

"నన్ను చూస్తున్నావుగా ఏం బావుకుంటున్నానో! స్వరాజ్యం తెలివైన పిల్ల. బడికెళ్ళి చదివింది తక్కువైనా ఇంట్లోవుండి రామాయణ భారతాలు ఔపోసన పట్టింది. హిందీ నేర్చుకుని హిందీ గ్రంథాలూ చదివింది. ఆ పరీక్షలూ రాస్తోంది. వాళ్ళమేనమామ ఇచ్చిన కమ్యూనిష్టు పుస్తకాలూ, పత్రికలూ చదివి అర్థం చేసుకొంటోంది. అలాటిదాన్ని విద్యాగంధం వున్న ఇంట్లో పడేస్తే దాని విద్య రాణిస్తుంది. విజ్ఞానమూ వికసిస్తుంది."

"నాకు మాత్రం ఇష్టం లేదురా అబ్బాయ్! కోరి కోరి పేచీకోర్లతో సంబంధం అందుకోవడమేమిటి? నీ పెళ్ళాం ఏమంటుందో కనుక్కో."

"దాని మొహం, దానికేం తెలుసు?"

స్వరాజ్యం మనస్సు చివుక్కుమంది. ఆ ఇంట్లో తల్లికిగాని తల్లి మాటకి గాని వీసమెత్తు విలువ లేదు. తండ్రి ఇతరత్రా ఎంత పురోగామి అయినా తల్లినేమీ సంప్రదించడు. భార్యావిధేయుడనుకుంటారని భయమో ఏమో!

"చిన్న కుటుంబం. ఆడబడుచుకి పెళ్ళయిందాయె. అలాటి ఇంట్లో అమ్మాయిని పడేస్తే సుఖపడుతుంది మరి." కాంతమ్మ అంది. తల్లి మాటలకన్నా ఆవిడ తన అభిప్రాయం స్వేచ్ఛగా వెలిబుచ్చినందుకే అధికంగా మురిసిపోయింది స్వరాజ్యం.

"ఇంకేంరా? నీ పెళ్ళాం కూడా వంత పాడింది. అలాగే కానియ్. ఈ ఇంట్లో నా మాటేమైనా చెల్లుతుందా ఏవిటి? నా వైభోగమంతా ఆయన్తోనే పోయింది." కంట తడిపెట్టింది నానమ్మ.

"ఇప్పుడేవయ్యిందనీ అంతిది అవుతున్నావు? నీ కిష్టం లేని పని నేనెప్పుడైనా చేశానా?"

ఆవిడేదో అనబోయిందల్లా వీధి గుమ్మంలో కెవరో వచ్చినట్టన్పించి ఆగిపోయింది.

ఆడవాళ్ళు గబ గబా లోపలికెళ్ళి పోయారు. వియ్యన్న వీధిలో కెళ్ళారు.

దూరపు బంధువు సోమలింగం!

"మీరా సోమలింగం బావగారూ! బాగున్నారా?" "బాగుండక పోవడానికి నాకేం దొబ్బుడాయి? ఇంత వయస్సు పైబడ్డా ఒక్కనాడూ బుర్రున చీదెరగను. ఒక మాత్రమింగెరగనంటే నమ్ము."

స్వరాజ్యం నీళ్ళచెంబు గుమ్మం బయటపెట్టి లోపలికెళ్ళిపోయింది.

"అమ్మాయికదూ! శ్రీమహాలక్ష్మిలావుంది. అందుకనే అదృష్టం వెదుక్కుంటూ వచ్చి మీ తలుపు తట్టింది."

"మీ మాటలు నాకేం అర్థం కావట్లేదు."

"వస్తున్నా వస్తున్నా. అవన్నీ చెప్పి నోరు తీపి చేసుకువెళ్ళడానికే కదా నేనొచ్చిందీ!"

కాళ్ళు కడుక్కొచ్చేసరికి పైపంచె, మంచినీళ్ళ గ్లాసు అందించింది స్వరాజ్యం.

పిమ్మట కంచుగ్లాసుడు మజ్జిగ గడగడా తాగేసి త్రేన్చి అన్నాడాయన: "కాకుళ స్వామి గార్నెరుగుదువు కదా?"

"ఆయన్నెరక్క పోవడం ఏమిటి. మూడు నాలుగూళ్ళకి పెద్దమనిషి. దివాణంలాంటి ఇల్లూ నిత్య కొలువూ అంటారు. ఆయన గురించి వినటమే గాని ముఖ పరిచయం లేదు."

"పరిచయం లేకపోతేనేం, ఏకంగా వియ్యమే అందుకోబోతున్నావాయె."

"అంటే, తమరి ఉద్దేశం...."

"సదుద్దేశ్యమేనయ్యా! కాకుళ స్వామిగారి మూడో అబ్బాయికి మీ చిరంజీవి సౌభాగ్యవతి నిచ్చి పెళ్ళి చేయించడానికొచ్చాను."

"వారెక్కడ నేనెక్కడ! వారితో తూగగల్నా?!"

"తూగలేవు. కాని వారే స్వయంగా కోరుతున్నప్పుడు వూఁ అనేస్తే శుభమూ శ్రేయస్కరమూనూ."

కాస్సేపటివరకూ ఎటూ మాట్లాడలేకపోయారు వియ్యన్న

"ఏమిటలా వుండి పోయావు? కాకుళ స్వామిగారంతటి వారు ఎదురు పిల్లనిమ్మని అడగటం ఏవిటా అనా?"

"అహ—అబ్బే...."

"అయినా చెప్పాల్సిన బాధ్యత నా మీద వుంది గనుక చెబుతున్నాను. ప్రముఖంగా గాంధేయ వాదిగా స్వాతంత్ర్య సమర యోధుడిగా నీకీ ప్రాంతంలో ఎంత పేరుందో నీకు తెలీదు గానీ లోకానికంతటికీ తెలుసు. అలాటి నీతో – ఏదీ, దేశం కోసం ఎన్నో త్యాగాలు చేసి జైలు క్కూడా వెళ్ళొచ్చిన ఒక మహనీయుడితో సంబంధం అందుకోవాలనుందని స్వయంగా కాకుళ స్వామిగారు నాతో చెప్పారు. వెంటనే రెక్కలు కట్టుకునొచ్చి వాలిపోయాను."

ఆ మాటలకి ఉబ్బితబ్బిబ్బైపోయారాయన. మొహమాటపడ్తూ అన్నారు: "అదంతా ఆయన అభిమానంగానీ అసలాయన్తో వియ్యమందుకో గలగడం మా పూర్వజన్మ సుకృతం కాదూ?"

"ఇద్దరూ ఘనులే. అలాటి ఘనుల్ని కలిపిన ఖ్యాతి నాకు దక్కనిస్తే బావుంటుంది."

"ఎంతమాట? ఇప్పుడే వస్తాను...."

"ఇలాటి విషయాల్లో ఆడవారి సలహా తీసుకోవడం కూడా మంచిదిలే."

"అహ సలహాకని కాదు. సంగతి ఇంట్లో చెప్పాలి కదా? మా అమ్మగారికి చెప్పకుండా ఏ పనీ చెయ్యను."

లోపలికెళ్ళి తల్లికి విషయమంతా వివరించారు వియ్యన్న. స్వరాజ్యమూ కాంతమ్మా కూడా పక్కనే వున్నారు.

"కాకుళ స్వామిగారనీ చాలా పెద్ద మనిషి. వారిది జమీందారీ కుటుంబం. లంకంత లోగిలి. ఇంటి నిండా నౌకర్లూ చాకర్లూ. ఏ రోజునా పదిమంది అతిథులు ఆ ఇంట్లో చెయ్యికడుక్కోకుండా వుండదు. ఊళ్ళోకి అధికారు లెవరొచ్చినా వారింటనే బస చేస్తారు. ఆయనకి ప్రత్యేకంగా జట్కాబండి వుంది. ఎక్కడి కెళ్ళినా అందులోనే వెళ్తారు. ఆ ఊళ్ళోనే కాదు ఆ చుట్టు పక్కల ఎక్కడ ఎవరికి తెగని సమస్య లొచ్చినా గొడవ లొచ్చినా ఆయన్ని తీసుకెళ్తారు. ఆయన తీర్పుకి తిరుగుండదు. వారిది భారీ కుటుంబమే అనుకో. వారి మూడో అబ్బాయికి మన స్వరాజ్యాన్ని చేసుకోవాలనుందని కబురంపారు."

"ఒంటిగా పెరిగిన పిల్ల ఆ మందలో ఇమడగలదంటావుట్రా అబ్బాయ్?" అంది నానమ్మ.

"ఇలా అన్నిటికీ ఏదో వంక వెదుతూ పోతే ఇక నేను దాని పెళ్ళి చేసినట్టే!"

"ఉండబట్టలేక కడుపులోని మాట కక్కేశాను. ఆ తర్వాత నీఇష్టం నీ పెళ్ళాం ఇష్టం. మధ్యన నాదేంవుంది బోడిపెత్తనం! అయినా దాని నుదుటి రాత ఎలా రాసి వుంటే అలా జరుగుతుందిలే. మధ్యన మనం ఎన్ననుకుని ఏం లాభం?"

నానమ్మ మాటలకి స్వరాజ్యం మనస్సు చివుక్కుమంది. ఎంచేతో ఈ సంబంధం ఆమె కిష్టంగా లేదు. తండ్రి తన అభిప్రాయం అడుగుతాడనీ నిర్భయంగా చెప్పాలనీ అనుకుంది.

"అబ్బాయి ఏం చేస్తాడండీ?" కాంతమ్మ అడిగింది మెల్లగా.

గతుక్కుమన్నారు వియ్యన్నగారు. కాకుళ స్వామిగారి సంబంధమని వూరి పోయార్తప్ప కుర్రాడి మంచీ చెడ్డా అడగనేలేదు!

"వెనకాల కావల్సినంత ఆస్తి వుందాయె. తలోపనీ చేస్తూ తండ్రికి చేదోడు వాదోడుగా వుంటారు" అని వూహించి చెప్పేరు.

"దీని కన్నా మీరిందాక చెప్పిన ప్లీడరుగారి సంబంధమే బావుంటుందేమో నండీ...."

స్వరాజ్యం మొఖం విప్పారింది. తన మనస్సులోని మాట చెప్పి నందుకు తల్లి వంక కృతజ్ఞతగా చూసి తండ్రి మొఖంలోకి చూసిందామె.

"అవున్రా అబ్బాయ్! లంకంత కొంప అంటున్నావ్. ఆ ఇంటికి ఇంట్లో వాళ్ళకీ చాకిరీ చేసేసరికి నడుం విరిగిపోద్ది!" నానమ్మ అంది.

"నౌకర్లు లేరేంటిగాని, ప్లీడరుగారి సంబంధమే బావుంటుందనుకో. కాని కాకుళ స్వామిగారంతటి వారు మీ అమ్మాయిని చేసుకుంటామనొస్తే కాదనటం బావోదు...."

ఆడవాళ్ళు మరి మాట్లాడలేకపోయారు.

నిట్టూర్చి వీధి అరుగుమీది కెళ్ళారు వియ్యన్న

"ఏవన్నారు? ఎగిరి గంతేసి ఒప్పేకున్నారు కదూ? నాకు తెలుసు. కాకుళ స్వామిగారి సంబంధమంటే మాటలా? నీ తాహతుకి మించింది కాదూ? అయినా కోరి వచ్చిందంటే అది నీ అదృష్టం, మీ అమ్మాయి భాగ్యమూనూ."

మరి మాట్లాడలేకపోయా రాయన.

"రెండు మూడు రోజుల్లో మంచి రోజు చూసుకువెళ్ళి అయన్తో మాట్లాడదాం."

"ఎల్లుండి ఏకాదశీ శనివారం. దివ్యంగా వుంది. ఎల్లుండి మీరొస్తే నేనూ వస్తాను. అనుకోవాల్సిన రెండు మాటలూ అనుకుని ముహూర్తం పెట్టేసుకోవచ్చు."

"పిల్లమేనమావతో కూడా ఓ మాట చెప్పి....."

"అతగాడు కమ్యూనిస్టనుకుంటాను. వాళ్ళదంతా వితండ వాదం. మొన్న మా ఊరి అమ్మవారి జాతర్లో జంతు బలులిస్తామంటే అడ్డం పడ్డారు. ఏవేవో తలా తోకాలేని కబుర్లు చెబుతారు. వాళ్ళ మాటలు పట్టుకుంటే కుక్కతోక పట్టుకుని గోదారి ఈదినట్టే!"

"ఎల్లుండి వస్తాంలెండి!"

"మీరు మాటిచ్చారూ అంటే జరిగిపోయినట్టే. గాంధీగారి శిష్యులా మరాహాటా! మరైతే నేను శలవు తీసుకుంటాను."

"భోంచేసి వెళ్దురుగాని...."

"కతికితే అతకదయ్యా! ఏకంగా పెళ్ళి భోజనం చేస్తానుగా!"

సోమలింగం గొడుగు చంకన పెట్టుకుని వెళ్ళిపోయాడు.

కాకుళ స్వామిగారి సంబంధం అందుకోబోతున్నందుకు ఓ పక్కనెంత సంతోషంగా వుందో మరోపక్కన అంత గాభరాగానూ వుంది వియ్యన్నకి.

## 9

బావమరిది శివయ్యని ఉన్నపళాన రమ్మని కబురంపారు వియ్యన్న.

ఆయన్లేరనీ పార్టీ పనిమీద నైజాం వెళ్ళారనీ జవాబొచ్చింది. ఎంతో నిరుత్సాహపడ్డారు. అతడుంటే అన్ని విషయాలూ కూలంకషంగా పరిశీలించడానికి వీలుపడేది కదా అనుకున్నారు.

ఊళ్ళోని ఇద్దరు ముగ్గురు శ్రేయోభిలాషుల్తో చెప్పేరు. "బాగానే వుంటుంది గాని కాకుళస్వామిగార్తో సరితూగ్గలవారా అని? ఆయనందంతా డాబూ దర్పమూనూ!" అన్నారు.

వస్తానని మాటిచ్చేక వెళ్ళకపోతే తన సత్యసందతకే అవమాన మన్పించింది. ముగ్గురు పెద్దమనుషుల్ని తీసుకుని కాకుళ స్వామిగారి వూరెళ్ళారు.

కాకుళ స్వామి గారిది చాలా పెద్ద లోగిలి. లోపలంతా నగిషీలు చెక్కిన పూర్వకాలపు కుర్చీలూ బల్లలూనూ. ఆయన చాలా హుందాగా

పిల్ల జమిందార్లూ వున్నారు. తెల్ల వుంగరాల జుట్టు బుర్ర మీసాలు బంగారు బొత్తాములున్న సిల్కు చొక్కా అన్ని వేళ్ళకీ వుంగరాలు ఒక చేతికి కడియం ఇంకోచేతిలో పొన్నుకర్ర – సింహాసనం లాంటి పెద్ద కుర్చీలో రాజసం వుట్టిపడుతూండగా దర్జాగా కూర్చున్నారు.

అయన కనుసైగనిబట్టి నడచుకుంటూ వంగి వంగి నడుస్తూన్నారు నౌకర్లూ చాకర్లూ.

వియన్నకీ తదితరులకీ రాచమర్యాదలు జరిగాయి. ఇలాటి ఇంటికి తన స్వరాజ్యం కోడలు కాబోతున్నందుకు కించిత్తు గర్వంగా అన్పించింది కూడానూ.

సరిగ్గా సమయానికి వూడిపడ్డాడు సోమలింగం.

"మీక్కాబోయే అల్లుడ్ని చూద్దురుగానీ రండి" అంటూ లోనికి తీసికెళ్ళాడాయన.

హాలుదాటి ఓ పక్కగా వున్న విశాలమైన గదిలోకి ప్రవేశించారు.

బంగారు వర్ణపు సిల్కు దుస్తులు ధరించిన ఓ యువకుడు ఎవరిదో చిత్రాన్ని రంగుల్లో చిత్రిస్తున్నాడు.

"ఇతడే పాణి అని ప్రఖ్యాత చిత్రకారుడు. పూర్తి పేరు చక్రపాణి. అద్భుతమైన రంగుల కలయికతో జీవకళ వుట్టిపడేలా మహామహుల నిలువెత్తు చిత్రాల్ని గీయటంలో అందెవేసిన చెయ్యి. వీరి చిత్రాలని తమ తమ ఇళ్ళల్లో పెట్టుకోవడం ఓ గర్వకారణంగా భావిస్తూంటారు జమీందార్లూ అధికారులూ. మొగల్తూరు కోటలో కూడా వీరి చిత్రం చూడొచ్చు."

నమస్కరించి ముక్తసరిగా మాట్లాడాడు పాణి.

అతడి రంగు, అందం బాగా ఆకర్షించగా, "స్వరాజ్యానికి తగినవాడు. ఈడూ జోడూ బాగుంటుంది" అని సంబరపడ్డారు వియ్యన్న.

"ఒకసారి వచ్చి అమ్మాయిని చూసుకుంటే బావుంటుంది."

"మా నాన్నగారెలా చెబితే అలా నడచుకుంటాం" అన్నాడు పాణి.

"ఏం వినయం, ఏం గౌరవం!" పొగిడాడు సోమలింగం.

మళ్ళీ కలుస్తామని చెప్పి ముందరిచావిడిలో కొచ్చేశారంతా.

"ఇచ్చి పుచ్చుకోటాల గురించి ఒక మాట అనుకుంటే బావుంటుంది" అన్నాడు సోమలింగం.

"ఇవ్వడమేగాని పుచ్చుకోవడం మా చేతికి తెలీదు. మీకెలా బాగుంటుందంటే అలా చెయ్యండి" అన్నారు కాకుళ స్వామి.

"కాదుమరీ. జమీందారీ వంశం. వారి హోదాకి భంగం కాకుండా కట్న కానుకలివ్వకపోతే ఏం బావుంటుంది చెప్పండి. రేపు ఫలానా వారి ఆడబడుచు సాదా సీదా కట్నంతో వచ్చిందని నలుగురూ చెప్పుకుంటే మీకు మాత్రం అవమానం కాదూ?" అన్నారు సోమలింగం.

వియ్యన్న గారి తరపున వచ్చిన ఓ పెద్ద మనిషి ఓ అంకె చెప్పాడు. సోమలింగం నసిగాడు. వియ్యన్న ఇంకో మాట చెప్పారు. "అదీ ఇదీ కాదుగాని ఇలా కానిచ్చెయ్యండి" అంటూ మరో మాట చెప్పేరు సోమలింగం.

చాలా బరువవుతుందన్పించింది. నిస్సహాయంగా చూశారు. ఆ వెంటనే "ఒక్కగానొక్క కూతురాయె. ఆమె సుఖంగా వుంటే అంతేచాలు" అని సరిపెట్టుకుని తలాడించారు.

"హమ్మయ్య. అసలు విషయం తెమిలిపోయింది. ఇహపోతే పెళ్ళి ఈ ఇంటి ఆనవాయితీ ప్రకారం అయిదురోజులు చెయ్యాలి. పల్లకీ ఊరేగింపు ఉండాలి. భోగం మేళం ఏర్పాటు చెయ్యాలి...."

కుదేలై పోయారు వియ్యన్న. ఇరుకున పడ్డట్టుగా బేలగా చూశారు. కడకి వెర్రినవ్వుతో తన అంగీకారాన్ని తెలియజేశారు.

"తమరంతా వచ్చి అమ్మాయిని చూస్తే మాకు తృప్తిగా వుంటుంది." వియ్యన్న సలహాపై ఒకాయనన్నారు.

"అవసరంలేదు. మీ అమ్మాయి గురించి విన్నాం. అది చాలు." గంభీరంగా అన్నారు కాకుళ స్వామి.

పురోహితుడొచ్చాడు.

వివరాలన్నీ కనుక్కుని ఏవేవో లెక్కించి ముహూర్తం పెట్టేడు.

"తథాస్తు" అన్నారు కాకుళస్వామి.

తలాడించారు వియ్యన్న.

ఊళ్ళోకి తిరిగి వచ్చారో లేదో సంగతి విని కట్న కానుకల గురించి ఆరా తీశాడో గ్రామస్తుడు.

వియ్యన్న చెప్పేరు.

"చాలా ఎక్కువ ఇస్తున్నావయ్యా! చూస్తోంటే మిమ్మల్ని అమాయకుడ్ని చేసి బుట్టలో పడేసినట్టున్నారు. కాకుళ స్వామిగారిదంతా పైన

పటారం లోన లొటారం. మునుగుతోన్న ఓడ అనుకోండి. కొంచెం ముందూ వెనకా ఆలోచించాల్సింది....."

ఆపై మాటలు విన్పించ లేదాయనకి!

☆ ☆ ☆

అన్నపూర్ణ ఆరోగ్యం బాగా దిగజారి పోయిందని తెలిసింది.

అవాళ పోలీసులారీ దెబ్బలకి ఆమె వెన్నుపూస దెబ్బ తిన్నప్పట్నుంచీ మంచం పట్టే వుంది.

ఆమెని చూడడానికీ, పెళ్ళి కుదిరిన విషయం చెప్పడానికీ వెళ్ళారు కాంతమ్మా స్వరాజ్యమూ.

రగుల్తోన్న అగ్నికణంలా వుండే అత్త మంచానికి అంటుకుపోయి వుండటం చూసి కళ్ళ నీళ్ళు పెట్టుకుంది స్వరాజ్యం.

అటువంటి స్థితిలో కూడా ఎంతో ధైర్యంగా వుంది అన్నపూర్ణ. మేనకోడల్ని తన పక్కన కూర్చోబెట్టుకుని ఎన్నో కబుర్లు చెప్పింది.

"కాకుళ స్వామిగారింటికోడలివవుతున్నావన్నమాట! వారిదంతా పెత్తందారీ పద్ధతి. ఆడవాళ్ళని ఘోషాలో వుంచాలని చూస్తారు. నేన్నీకిచ్చే సలహా ఒకటే. ఆడవాళ్ళు మగవారి కెందులోనూ తీసిపోరు. నిజం చెప్పాలంటే మగాళ్ళు చెయ్యలేని పనుల్ని సైతం ఆడవాళ్ళు చెయ్యగలరు. మగవాళ్ళు చేసే పనుల్ని మరింత సమర్థవంతంగా కళాత్మకంగా ఆడవాళ్ళు చెయ్యగలరు. అంచేత మనం బానిసలుగా వుండక్కర్లేదు. మన వ్యక్తిత్వానికీ అభిమానానికి మచ్చరాని విధంగా ఆ ఇంట మసలు. నువ్వా ఇంట వెలుగు కిరణంగా ప్రకాశించాలి!"

అలాగే అంటూ తలాడించింది స్వరాజ్యం.

"మావయ్యింకా రాలేదా అత్తా?"

"పోరాటం మధ్యలో ఎలా వస్తారు?"

"మనకు స్వతంత్రం వచ్చేసిందిగా అత్తా? ఇంకా పోరాటాలూ అజ్ఞాతవాసాలూ ఎందుకు?"

"మీ నాన్నలాంటి వాళ్ళు స్వరాజ్యం వచ్చిందని గంతులేస్తున్నారు గాని నిజానికి బ్రిటీష్ సామ్రాజ్య వాదుల్నుండి బూర్జువా భూస్వామ్య కాంగ్రెసుకు అధికారం బదలాయింప బడిందంతే. తెల్లదొరలు పోయి నల్ల దొరలొచ్చారు. ప్రజల బతుకుల్లో మార్పేమీ వుండదు. దున్నేవాడికి

భూమి లభించదు. శ్రమజీవుల శ్రమకి విలువ పెరగదు. భూస్వాములూ పెట్టుబడిదారులూ యధాప్రకారం దోచుకుంటూనే వుంటారు. .....”

“మరెలాగ అత్తా?” బేలగా అడిగింది.

“నైజాం నిరంకుశ పాలనని కూలదోయటానికి సాయుధ పోరాటం చేస్తున్నారు. భూస్వాముల భూముల్ని స్వాధీనం చేసుకుని పేదలకి పంచుతున్నారు వెట్టి చాకిరీని నిర్మూలిస్తున్నారు. ఆ పోరాటాన్ని ఆంధ్రప్రాంతానికి విస్తరింప జేయాలి. నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలి. స్వాతంత్ర్యంతో బాటు సోషలిస్టు విప్లవాన్ని సాధించాలి.”

“గాంధీజీకి వ్యతిరేకంగా యుద్ధం చేస్తారా?!” భయం భయంగా అడిగింది స్వరాజ్యం. నవ్వింది అన్నపూర్ణ.

“తెలంగాణా గడ్డ మీద మీ మావయ్య చేస్తోన్నదదే.......”

“నిజవాఁ! పోలీసులంతా వాళ్ళ పక్కనే వున్నారుగా? మావయ్య నేమైనా చేస్తారేమో అత్తా?”

“నమ్మిన సిద్ధాంతాల్ని చిత్తశుద్ధితో ఆచరణలో పెట్టేవాడే కమ్యూనిస్టు. కష్ట నష్టాలకి దమనకాండకి అణచివేతకి ఎదురునిలిచి జనంకోసం ప్రాణాలని సైతం తృణప్రాయంగా భావించే సంఘమిత్రుడు కమ్యూనిస్టు.” ఉద్వేగభరితంగా ఆమె చెబుతోంటే ఆమె కళ్ళల్లో మెరుస్తోన్న వెలుగుల్ని చూస్తూండి పోయింది. స్వరాజ్యం.

ఆమె దృష్టిలో అన్నపూర్ణ ఆకాశమంత ఎత్తుకి ఎదిగిపోయింది.

అన్నపూర్ణ కొడుకు లెనిన్ బాబు వచ్చాడు. అతడు స్వరాజ్యం కన్న పెద్ద. విద్యార్థి సంఘంలో ప్రముఖ పాత్ర వహిస్తున్నాడు.

అతడ్ని చూసి “మేము చూడలేక పోయినా సమసమాజాన్ని మా బాబు చూస్తాడని మా ఆశ. ఆ లక్ష్య సాధనా మహాయజ్ఞంలో ఓ సమిధగా తనని తాను అర్పించుకుంటాడని మా ఆకాంక్ష” అందామె గర్వంగా.

అభినందన పూర్వకంగా చూసిందతడివంక స్వరాజ్యం.

“స్వరాజ్యానికి చలం పుస్తకాలు తెచ్చివ్వరా. అత్తవారింట్లో చదువు కుంటుంది.”

అతడు తెచ్చివ్వగా అందుకుని వాటివంక అపురూపంగా చూసింది స్వరాజ్యం.

☆ ☆ ☆

స్వరాజ్యం పెళ్ళి చాలా అట్టహాసంగా చేశారు వియ్యన్న.

వియ్యాల వారిచేత ఏమాత్రం వంక బెట్టించుకోకుండా అవసరమైన దానికన్నా అధికంగానే చేశారు. శక్తినిమించి ఖర్చు పెట్టారు. స్వతంత్రం వచ్చేక జరుపుకుంటున్న శుభకార్యం గనక చాలా ఉత్సాహంగానూ ఉబలాటంగాను చేశారు. అత్తవారింట స్వరాజ్యాన్ని నెత్తిన పెట్టుకోవాలన్న ఆకాంక్ష కూడా ఆయన్నంత భారీ ఖర్చుకి పురిగొల్పింది.

"వియ్యనగారిది భారీ చెయ్యి" అన్నారు గ్రామస్తులు.

"ఒక్కగానొక్క కూతురాయె. ఎంతైనా ఖర్చుపెడతారు" అన్నారు బంధువులు.

"ఆయనో అమాయకుడు. మంచి నీళ్ళలా ఖర్చు పెట్టెయ్యడమేతప్ప ముందు వెనక లాలోచించడం తెలీదు" అన్నవాళ్ళూ వున్నారు.

ఏమైతేనేం అంతా నిర్విఘ్నంగా ఎవరూ వేలెత్తి చూపని విధంగా జరిగిపోయినందు కాయనెంతో సంతోషించారు.

స్వరాజ్యం భవిష్యత్తు బాగుంటుంది లెమ్మని పదే పదే నచ్చ చెప్పుకుంటూ వచ్చేరు తప్ప తన భయాలుగాని లోకుల మాటలుగాని ఇంట్లో తెలీనివ్వలేదాయన!

భర్త పాణి గురించి మొదటి రాత్రే చాలా తెలుసుకుంది స్వరాజ్యం.

పాణి భావుకుడు. సౌందర్యోపాసకుడు. రాజకీయాలుగాని లౌకిక విషయాలుగాని అంతగా పట్టవు.

పెయింటింగ్ చేస్తూనో పుస్తకాలు చదువుతూనో శిల్పాలని పరిశీలి స్తూనో గడిపేస్తూంటాడు. ఇంటి విషయాల గురించి అసలేమీ తెలీదు. తెలుసుకోవాలన్న ఆసక్తీలేదు. తనేమిటో తన లోకమేమిటో – అంతే!

చిత్రకళ తప్ప మరేదీ తెలీదు. వ్యవసాయం చేయలేడు. చేయించలేడు. వ్యాపార వ్యవహారజ్ఞానం పూజ్యం. అతడి పెయింటింగ్‌లకు చక్కని గుర్తింపు వుంది. ఆర్టిస్టుగా మంచి పేరుంది. కాని చిత్రాల్ని వూరికే గొప్ప కోసం బహూకరిస్తాడు తప్ప డబ్బు తీసుకోవడం అమ్మడం నామోషీగా భావిస్తాడు. అంచేత రంగులకీ వాటికీ జేబులోంచి ఖర్చుపెడుతూ ప్రముఖుల చిత్రపటాలు గీసిస్తూ అభినందనలు మూట గట్టుకొంటూంటాడు.

ఆమె ఎలా వుండాలో కూడా శోభనం రాత్రే చెప్పేశాడతడు.

ఆమె ఎప్పుడూ నవ్వుతూ ముగ్ధ మోహనంగా వుండాలి. ఏ సమయంలోనైనాసరే మూర్తీభవించిన అందంలా వుండాలి. పరుషంగానూ

దిగ్గరగానూ మాట్లాడకూడదు. ఎవర్నీ కసురుకోకూడదు. లలిత లలితంగా మృదు మధుర వాక్సమత్కృతితో అలరారుతూండాలి. అతడి క్కావాల్సిన ఏర్పాట్లు చేస్తూనే అవసరమైన ఏకాంతతనీ ప్రశాంతతనీ కల్పిస్తూనే మావగారికీ వదినలకీ సేవ చెయ్యాలి.

అతడి మాటలామె గుండెల్లో గుబులు పుట్టించాయి.

తను పుట్టి పెరిగిన పరిసరాలూ ఆశలూ ఆశయాలూ కలలూ అన్నీ గాలికి కొట్టుకుపోగా ఆకులు రాలిన చెట్టులా కేవలం అందాల బొమ్మగా మిగిలినట్టుగా అన్పించింది. ఓ పెద్ద జైలు లాంటి చక్కని కోటలోని చిన్న గదిలో ఖైదీగా మారబోతున్నట్టుగా అనుభూతి కల్గింది!

అయినా కన్నీళ్ళని కంటి సరిహద్దుల్ని దాటనీయలేదామె!

## 10

"మీ ఆయన బావుంటాడే?" చెరువు నుంచి నీళ్ళు తేవడానికి బిందెల్తో వెళ్తోంటే స్నేహితురాలంది స్వరాజ్యంతో.

చిన్నగా పేలవంగా నవ్వి వూరుకుందామె.

"నిజంగా నువ్వు అదృష్టవంతురాలివే. ఏ వేళ చూసినా మీ ఆయన ఎంత ముచ్చటగా వుంటాడనీ?" మరొకామె అంది.

"ఆ గొడవకేం గాని చెరువులోని తామర పూలన్నీ వికసించి ఎంత బావున్నాయో చూడు" అంటూ మాట మార్చింది స్వరాజ్యం.

"వాళ్ళాయన్ని కొరుక్కుతింటామని మాటమారుస్తోంది చూడు." మొదటామె నవ్వుతూ అంది.

"మీ ఆయన్ని కొంగున ముడేసుకో తల్లీ, మేం ఎత్తుకు పోకుండా!" రెండో ఆమె ఎత్తి పొడిచింది, నవ్వుతూనే.

నవ్వులు పువ్వులై పూశాయి. కాని స్వరాజ్యం వారితో జత కలప లేకపోయింది.

గుర్రబ్బండి మీద మల్లెపూవులాంటి దుస్తులు ధరించి వస్తాడు పాణి. సెంటు వాసన ఫర్లాంగు దూరం వరకూ కొడుతుంది. చాలా ముక్తసరిగానూ అంటీ ముట్టనట్టుగానూ వుంటాడు. అల్లుడొచ్చాడని ఇంట్లో ఎంతో ఆర్భటం చేస్తారు. పిండి వంటలు వండుతారు. కానత డంతగా పట్టించుకోడు. గది వదిలి బయటికి రాడు.

రోజూ మంగలి వచ్చి గెడ్డం గీయాల్సిందే. మీసం కూడా నున్నగా గీయించేస్తాడు. బట్టలు నలగనీడు. రోజూ చలువ చేసిన వస్త్రాలు కావాల్సిందే. "తనకంటే చాకలి మంగళ్ళతోనే ఆయన కెక్కువ పని" అని అనుకోకుండా వుండలేకపోతోంది స్వరాజ్యం!

ఏదో ఆలోచిస్తూ ఎటో చూస్తూ లేదా ఏదో చదువుతూ ఎక్కువ సమయం గడిపేస్తూంటాడు పాణి. భార్యతో కూడా చాలా పొదుపుగా మాట్లాడతాడు. అవెనా ఆమె అందాన్ని పొగుడుతూనో ఆమె మెలగాల్సిన విధానం గురించో అవుతాయంతే. ఒక్కోసారి ఆమె మొఖం వంక గంటల తరబడి చూస్తూండి పోతాడు!

ఆమెకి చాలా విసుగ్గా అన్పిస్తుంది. అతడొచ్చాడన్న సంతోషం వుండదు. పట్టపగలు గదిలో వుంటే అంతా ఏమనుకుంటారోనని ఇదవుతుంది. కానత డేమీ పట్టించుకోడు. తన ధోరణి మార్చుకోడు. తనెదుట వున్నప్పుడు ఇతరుల గురించీ ఇతర విషయాల గురించీ మాట్లాడొద్దని ఖండితంగా చెప్పేశాడు. ఆమె వాదిస్తూ మాట్లాట్టం తన కిష్టం లేదనీ అసలు గట్టిగా మాట్లాట్టం బిగ్గరగా నవ్వటం కులస్త్రీలకి కూడని పని అని బోధిస్తాడు!

దేశంలో వస్తోన్న వినూత్న మార్పుల గురించీ నెహ్రూ పాలన గురించీ ఒకసారి మాట్లాడాలని ప్రయత్నించిందామె. అతడు మొహాన్ని అప్రసన్నంగా మార్చుకుని "రాజకీయాలు నాకు తెలీవు. తెలుసుకోను. ఇంకెప్పుడూ ఆ విషయాలు నా దగ్గర ఎత్తొద్దు" అనేశాడు!

ఆమె హతాశురాలయ్యింది. గుండె లోతుల్లో ఏదో తెలీని బాధ సుళ్ళు తిరిగింది!

"మీరేమీ అనుకోనంటే ఒకమాట. ఎన్నాళ్ళు మరొకళ్ళమీద ఆధారపడి వుంటాం? ఏదో బాగానే చదివేరు గనుక ఏ ఉద్యోగమో మరోటో చూసుకుంటే మనకాళ్ళ మీద మనం నిలబడొచ్చు కదండీ?" అన్నదో సారి భోజనం వడ్డించి.

"ఇంకొకరి కింద పని చేయాల్సిన అవసరంగాని ఇంకొకరి మోచేతి నీళ్ళు తాగాల్సిన అగత్యంగాని మాకు లేదు" అన్నాడతడు కరకుగా.

ప్రాణ్పడి నిస్తేజంగా చూస్తూండిపోయింది.

అతడ్తో నూరేళ్ళ యాత్ర ఎలా చేయాలో ఎలా నడవాలో అర్థంగాక అయోమయంలో పడింది స్వరాజ్యం.

ఆమె కళ్ళ వెనుక సన్నని కన్నీటి అల భళ్ళున పగిలింది!

☆ ☆ ☆

స్వరాజ్యాన్ని అత్తారింటికి కాపురానికి పంపించారు వియ్యన్న.

అయిదు కావిళ్ళ సారెతో ఇంటిల్లి పాదికీ వస్త్రాలతో మేనా ఎక్కించి పంపించారు.

అత్తింట ఆమెకి సామాన్య స్వాగతం లభించింది. అత్తగారు లేనందున వదినెలూ ఆడబడుచులూ ఆహ్వానించారు. వారి చూపులూ మాటలూ చీర సారెల చుట్టూనే తిరిగాయి!

మావగారు ఏమీ అన్లేదు. పలకరించనూ లేదు. సారెని కొందరు ప్రముఖులకి ముందుగా పంపించి, మిగతాది ఊళ్ళో పంచిపెట్టమని మాత్రం చెప్పేరు.

ఆ సందర్భంగా పెద్ద కోడలు సావిత్రి స్వరాజ్యాన్ని "స్వరాజ్యం......" అంటూ పిలవడం గమనించి నుదురు చిట్లించారాయన.

"అంతా మనదే అయ్యాక ఇంకా స్వరాజ్యమూ స్వతంత్రమూ ఏమిటి?! ఇకనుంచి రాజ్యం అని పిలవండి" అన్నారు ఆజ్ఞాపిస్తున్నట్టు.

ఆయన మాటలు విన్న స్వరాజ్యం గుండెలు విలవిల్లాడాయి. ఏదో అనాలన్న వుక్రోషం తన్నుకురాగా సన్నగా కంపించింది. గొంతులోంచి మాటలు దూకడానికి తపించాయి. కానింతలో తను క్రొత్త కోడలినన్న సంగతి గుర్తొచ్చింది. ఇక్కడే కాపురం చెయ్యబోతున్న సంగతీ మదిలో మెదిలింది. భావావేశాన్ని బలవంతాన అణచుకుంది. చాటుగా కళ్ళు తుడుచుకుంది.

ఆ రకంగా అత్త వారింట అడుగుపెట్టిన మరుక్షణం స్వరాజ్యం రాజ్యంగా మారిపోయింది!

ఆమెని చూసి చక్రపాణి బాగా సంతోషపడ్డాడు. ఆ సంగతి అతడి కళ్ళల్లో కన్పించిన మెరుపులవల్ల అర్థమయ్యిందామెకి. అలాగని ఆమెని ఆత్రంగా చుట్టెయ్యనూ లేదు కౌగిల్లోకి తీసుకోనూ లేదు. ఆఖరికి నిల్చున్న చోటునుంచి కదల్లేదు వేస్తున్న పెయింటింగ్ ఆపనూ లేదు.

"వచ్చేవా మంచిది. మీ ఊర్రావాల్సిన శ్రమ తప్పింది. నా అలవాట్లూ అభిరుచులూ తెలుసుకుని దాని కనుగుణంగా అన్నీ అమర్చే బాధ్యత ఇకనుంచి నీదే. నాకేలోటూ రాకుండా చూసుకో" అనేసి తన ప్రపంచంలో మునిగిపోయాడు.

చిన్నగా నిట్టూర్చిందామె.

వారం రోజుల్లోనే అత్తింటి పరిస్థితి యావత్తూ ఆకళింపు చేసుకుంది రాజ్యం.

వారి ఆర్థిక పరిస్థితి ఏమంత బాగుండలేదు. ఆస్తి పాస్తులూ పెద్దగా లేవు. మత్స్యపురి నర్సాపురం బ్రాహ్మల పొలాలోయాభై ఎకరాలు కౌలుకి తీసుకుని చేస్తున్నారు. అంచేత చేతి నిండా పని చేతి కింద పాలేర్లు పశువులూ వుండేసరికి ఓ చిన్న సైజు జమీందారీలా సాగిపోతోంది. ఆదాయాన్ని మించి ఖర్చు చెయ్యడం అలవాటై పోయింది!

మావగారు కాకుళ స్వామిగారి దంతా పెత్తందారీ ధోరణి. ఆయన ఊరికి పెద్ద తలకాయ. అంతేకాదు, ఆ చుట్టుపక్కల గ్రామాల్లోని జటిలమైన సమస్యలకీ గొడవలకీ చక్కని తీర్పులిస్తూ సర్దుబాటు చేస్తూ పెద్దమనిషిగా ఖ్యాతి గాంచారు.

ఆయనక్కావాల్సింది కేవలం కీర్తి ప్రతిష్ఠలు. అంతా తనని విపరీతంగా గౌరవించాలి. అత్యధికంగా ప్రశంసించాలి. చేతికి పెత్తనం ఇవ్వాలి. అందు నిమిత్తం ఏమైనా చేస్తారు. ఎంతైనా పెడతారు. అందుకు వ్యతిరేకమైన చిన్న చేష్టని కూడా సహించకపోవడం ఆయన బలహీనత!

ప్రముఖులూ అధికార్లూ ఊళ్ళోకొస్తే వారికి ఆ ఇంటనే భోజనాదులు ఏర్పాటు చేస్తారు. పొరుగూర్నించి మరేదో పని మీదొచ్చి మర్యాద కోసం ఆయన్ని పలకరించడానికి గుమ్మం ఎక్కినవాళ్ళు సైతం ఆ ఇంట చెయ్యి కడుక్కుని వెళ్ళాల్సిందే. రోజూ పదిమంది అతిథులకి ఆ ఇంట విస్తర్లు వేయడం పరిపాటి.

ఇక భట్రాజులు గాని పగటి వేషగాళ్ళు గాని తోలు బొమ్మలాటల వాళ్ళు గాని ఎవరైనా సరే – మొదట వారి లోగిలి ముందు కొస్తారు. ఆయన్ని పొగడ్తారు. తమ ప్రతిభ ప్రదర్శించి మంచి బహుమానం అందుకు నెళ్తారు.

మద్రాసు ఓడ రేవులో దిగుమతి అయిన గ్రామఫోన్లు రేడియోలు టెర్లిన్ దుస్తులు సెంట్లు వగైరా ఆధునిక వస్తువులు వెంటనే వారింట్లో ప్రత్యక్షం కావల్సిందే. పదిమందికీ గొప్పగా ప్రదర్శించాల్సిందే.

రోజూ సభ తీర్చినట్టుగా కూర్చుంటారాయన. వంది మాగదుల్తో ముచ్చట్లాడతారు. ఊరి పెద్దల్తో ఊరి విషయాలు చర్చిస్తారు. ఆఖరికి అప్పుల వాళ్ళొచ్చినా సరే – అంత ఠీవిగానూ మాట్లాడి అతిథి

సత్కారం చేస్తారు. వాళ్ళు అడగలేక చిన్నగా గొణిగినట్టుగా అడుగుతారు. "చూస్తాన్లెండి" అంటారాయన. అదే పదివేలనుకుంటూ వెళ్ళిపోతారు!

ఇక పాలేర్లూ నౌకర్లూ ఆఖరికి ఇంట్లోవారు సైతం ఆయన ముందు కెళ్లడానికే సాహసించరు. అల్లంత దూరంలో ఒదిగి చేతులు కట్టుకుని ఆయన చెప్పిందానికి తలూపి వెళ్ళిపోవాల్సిందే.

పెద్ద కొడుకు లిద్దరూ వ్యవసాయప్పనులు చేస్తూంటారు. కోడి కూసింది మొదలు రాత్రి వరకూ గొడ్లలా పని చేస్తారు. పాణి చిత్రకళ సేవలో వుంటాడు. ఆఖరతను కాలేజీలో చదువుకుంటున్నాడు. డబ్బు అవసరపడితే తప్ప అతడు ఇంటికి రాడు. అతడు పెద్ద చదువు చదివి కలెక్టరు గాకపోయినా తాశిల్దారై తీరతాడని కాకుళ స్వామిగారి నమ్మకం.

పెద్ద కోడళ్ళిద్దరికీ వండి వార్చడమే పని. పెద్ద కోడలు సావిత్రి. వంటా వార్పూ మంచి చెడ్డా అన్నీ ఆమే చూస్తూంటుంది. ఎవర్నీ ఏమీ అనదు. అనవసర కబుర్లు చెప్పదు. పని తప్ప మరో ధ్యాస వుండదు.

రెండో కోడలు దమయంతి. పని పాటల్లో సావిత్రికి చేదోడుగా వుంటుంది. కాస్త నోటి దురదెక్కువ. "మా ఆయన ఈ ఇంటికి పెద్ద పాలేరు. కొందరు బట్టనలక్కుండా ఇంట్లో కూర్చునుంటారు. అదృష్టవంతులు!" అంటూ అన్యాపదేశంగా పాణిని ఎత్తిపొడుస్తూంటుంది.

రాజ్యం కూడా వంటా వార్పుల్లో చేదోడు వెళ్తోంది. అంతకు మించి ఆ ఇంట్లో ఆడవాళ్ళు చేసే పనేమీ లేదు. ఇంటిల్లపాదికీ నిత్యం వచ్చే అతిథులకీ వండీ వడ్డించడమే వారి పని. అది తప్ప మరో వ్యాసు మరో లోకం వుండవు!

పాలేర్లూ మాల కూలీలూ ఇంట్లోకే కాదు – పరిసరాలక్కూడా రారు. దూరంగా చేతులు కట్టుకుని నిలబడాల్సిందే. తన తండ్రి స్వాతంత్ర్యం రాక పూర్వమే వాళ్ళతో ఎంతో చనువుగా వుండటం ఆప్యాయంగా మాట్లాట్టం ఆమెకి తెలుసు. ఆ స్థితితో పోల్చుకుని "స్వరాజ్యం వచ్చినా వీళ్ళనింకా బానిసత్వంలోనే వుంచినట్టున్నారే" అనుకోకుండా వుండలేకపోయింది రాజ్యం.

ఇంట్లోక్కావాల్సిన నీళ్ళు చెరువునుంచి ఈడిగల ఆసామి కావిళ్ళతో తెచ్చిపోస్తూంటాడు. అంచేత చెరువు నుంచి నీళ్ళు మోసుకురావాల్సిన బాధ ఆడవాళ్ళకి తప్పింది.

ఆ ఇంటి ఆడవారికి సూర్యదర్శన మయ్యేది బహిర్భూమి కెళ్ళేప్పుడు మాత్రమే అంటే అతిశయోక్తి కాదు.

దినపత్రిక తపాలద్వారా ఒకరోజు ఆలస్యంగా వస్తుంది. మావగారు చదివేక సాయంత్ర మప్పుడు రాజ్యం చదవటం అలవాటు చేసుకుంది. రేడియో కూడా ఎక్కువగా వింటుంది. దేశ ప్రగతి గురించి తెలుసుకోవాలన్న ఆరాటం ఆమెలో అంతకంతకీ అధికమవుతోంది. అందుకే పాణి రెండు మూడుసార్లు విసుక్కున్నా పట్టించుకోలేదామె.

పత్రిక రేడియోలే ఆమెకి బయటిప్రపంచాన్ని చూపే చక్షువులు!

## 11

ఒక్కసారి మావగారి ధోరణిలో విపరీతమైన మార్పు వచ్చింది.

మొఖంలో ఏదో ఆందోళన కన్పిస్తోంది. కోపం విసుగూ పెరిగాయి. ఏదో అశాంతితో కొట్టుమిట్టాడుతున్నట్టుగా మారిపోయారు.

ఆ సంగతే చిన్నతోడికోడలు దమయంతితో అంది రాజ్యం.

"నీకు తెలీదా?"

"వ్హూహూ......"

"కౌలు ధాన్యం సరిగ్గా ఇవ్వట్లేదుట. రెండు పట్లు నుంచి అస్సలు ఇవ్వటం లేదుట. బ్రాహ్మర్లు కబురుమీద కబురు పంపుతున్నారు. కచేరీ కెక్కుతామని బెదిరిస్తున్నారట. మీ చిన్న బావగారు ఒకటే ఇదైపోతున్నారనుకో. రాత్రుళ్ళు సరిగ్గా నిద్రపోవడం లేదుకూడాను. ఇలా అన్నానని ఎక్కడే అనకుసుమా!" అందామె లోగొంతుకతో.

"కౌలు ధాన్యం ఎప్పటి కప్పుడు పంపరా?"

"పంపేస్తే ఇల్లిలా గడుస్తుందీ! ఒక్క వెలక్కాయతో ఏనుగు ఆకలి తీర్తుందా! నువ్వెక్కడో వెర్రి బాగుల్దానివిలా వున్నావే? మావగారికి స్వంత పొలం తక్కువ. కౌలు పొలం ఎక్కువ. బ్రాహ్మర్లు కౌలు పొలం లాగేసుకుంటే ఈ పాలేర్లూ అక్కర్లేదు, ఇన్ని పశువులూ అక్కర్లేదు. అప్పుడిహ మనికి రెండు వేళ్ళూ నోట్లోకే వెళ్ళవు!"

నివ్వెరపోయింది రాజ్యం.

మావగారు అప్పుల్లో వున్నారని పెళ్ళికి ముందే సూచాయిగా విన్నది. ఇక్కడి కొచ్చేక ఇక్కడి పద్ధతులూ భారీ ఖర్చులూ చూశాక అప్పుల

పాలుగాక ఎలా వుంటార్లే అనుకుంది. కాని మరీ ఇంత తీసికట్టుగా వుంటుందని వూహించనేలేదు!

ఇంతలో గణాచారి కొడుకుని కట్టేసి మావగారు చావకొడుతున్నారని తెలిసి హడలిపోయారు ఆడవాళ్ళు. రాజ్యం పరుగున ముందరి చావిడిలో కెళ్ళి కిటికీలోంచి చూసింది.

ఒక యువకుడ్ని పెడరెక్కలు విరచి స్తంభానికి కట్టివేశారు. కాకుళ స్వామి కొరడా తీసుకుని చర్మం వూడొచ్చేలా బాదుతోంటే బొబ్బలు పెడుతున్నాడతడు.

ఇంట్లోవాళ్ళూ ఊళ్ళోవాళ్ళూ ప్రేక్షకుల్లా నిలబడి చూస్తూండి పోయార్తప్ప ఒక్కరూ అడ్డు వెళ్ళలేదు. ఇదేమని అడిగే సాహసం కూడా చెయ్యలేకపోయారు.

"అయ్యో అయ్యో! గొడ్డుని బాదినట్టు బాదేస్తున్నారు." ఆందోళనగా అంది రాజ్యం.

"ష్.........నెమ్మది. మావగారికింత కోపం రావటం ఎన్నడూ చూళ్ళేదుమరి. ఆయన ఉగ్రమూర్తి అయ్యారూ అంటే ఏదో పెద్ద ఘోర నేరమే చేసుంటాడు" అంది దమయంతి.

"పొద్దున్నే ఎవడి మొహం చూశాడో పాపం, చావు దెబ్బలు తింటున్నాడు." బాధపడింది పెద్దకోడలు సావిత్రి.

"మీ రెళ్ళి ఆ ఘోరం ఆపండక్కయ్యా!" రాజ్యం అంది.

తోడికోడళ్ళిద్దరూ నోళ్ళు నొక్కుకున్నారొక్కసారే.

"ఇటువంటప్పుడు వీధిలో అడుగుపెడితే ఇంకేమైనా వుందా?!"

"ఏం, తల కొట్టి మొలేస్తారా?"

"నువ్వు చిన్నపిల్లవి. నీకు తెలీదుగాని, లోపలికి పద." రెక్కపట్టుకుని లోపలికి తీసుకెళ్ళబోయింది. సావిత్రి.

"నాకు పిరికి పాలు పొయ్యకండక్కయ్యా!"

"పిచ్చిదానా! మావగారి సంగతి నీకు తెలీదు. ఆయన క్కోపం సాధారణంగా రాదు. వచ్చిందో, చూస్తున్నావుగా, ఇలాగే శివతాండవం ఆడేస్తారు. మనిషిని నిలువునా చంపడానిక్కూడా వెనకాడరు."

"అదే జరిగితే వాళ్ళ వాళ్ళు నోర్మూసుక్కూర్చుంటారా?"

"అంతకంటే ఏం చేస్తారు మాలవాళ్ళు? అగ్రకులస్తుల్ని ఎదిరించే దమ్ములు వాళ్ళ కెక్కడివి?!"

"అంటే, ఆ యువకుడు హరిజనుడా?"

"హరిజనుడో గిరిజనుడో, ఎవరైనా మావగారి చెప్పుకింద పడుండాల్సిందే........"

రాజ్యం ఏదో అనబోయేంతలో "అయ్యగోరో, నా కొడుకుని సంపకండి బాబో......." అంటూ వచ్చాడో ముసలతను.

"అతనే గణాచారి." దమయంతి అంది.

"అంటే?"

"మన గ్రామదేవత చల్లాలమ్మ అతడికి పూనతాది."

గణాచారి వచ్చి చేతులు జోడించి అర్థింపుగా చూశాడు. కన్నీటితో వేడుకున్నాడు. "తప్పైపోనాది. తమఁరు గీసిన గీటు దాటం బాబో! పిల్ల గాడ్ని ఇడిసేండి......."

"నమ్మమంటావు?"

"నా బిడ్డ తోడండి. తమరెలా సెబితే అలా ఇంటాను. తప్పైపోనాది." కాలి చెప్పు తీసుకుని టపటపా లెంపలు వాయించుకున్నాడు.

"ఇలా దారికిరా. ఇంకెప్పుడూ ఇలాటి మాదొచ్చోద్ పనులు చెయ్యకండి." మీసం మెలితిప్పి క్రూరంగా చూసి కొరడా విసిరేశారు.

ఆయన ఇంట్లో కొస్తూండటం చూసి బిల బిలమంటూ ఆడవాళ్ళు లోపలికి పారిపోయారు. రాజ్యాన్నికూడా లాక్కుపోయారు.

సావిత్రి కొడుకు సత్యం వచ్చి "కొబ్బరికాయల దొంగతనం చేశాట్ట" అని చెప్పేడు.

"ఎన్ని కాయలు?"

రాజ్యం మాటలకి "రెండు కాయలూ రెండు బొండాలు" అని బదులిచ్చాడు.

"ఆ మాత్రానికే అంత పెద్ద శిక్ష వేశారా? ఆయన పెద్దమనిషేనా అసలు?" ఆశ్చర్యపడింది రాజ్యం.

"అసలు కారణం ఇంకేదో వుండి వుంటుందిలే. మావగారి ఎత్తులు ఎవరికీ అర్థంకావు." దమయంతి అంది.

సాలోచనగా చూసింది రాజ్యం.

☆ ☆ ☆

రెండు మూడుసార్లు అన్నం తినగానే వాంతి చేసుకుంది రాజ్యం. చింతకాయ పచ్చడి నాకడం, పుల్ల మామిడికాయ కొరకడం కూడా గమనించింది సావిత్రి.

"రాజ్యం! బయటయ్యి ఎన్ని నెల్లయ్యింది?"

"మూడను కుంటాను అక్కయ్యా!"

"అయితే నీకు నెల తప్పిందన్న మాటే!" ముసి ముసిగా నవ్వింది.

మొదటేమీ అర్థంగాక అయోమయంగా చూసింది. అనంతరం అపనమ్మకంగా చూసింది "నిజమంటావా?.........."

"నిజమేనే పిచ్చిపిల్లా! మీ నాన్నకి ఉత్తరం రాయి, వచ్చి తీసుకెళ్ళమని."

"నాకు సిగ్గు బాబూ!......"

"కబురు చెయ్యమని మావగారికి చెబుతాన్లే."

తను తల్లి కాబోతోంది! తనలో మరోప్రాణి వూపిరి పోసుకుంది! తను బుజ్జిబిడ్డకి జన్మ నివ్వబోతోంది! ఓహ్! ఎంత ఆనందం! మహానందం!!

చిత్రమైన అనుభూతుల్తో తలమున్కలవుతూ తనలో తాను మురిసి పోయింది రాజ్యం. ఆ ఆనందాన్నంతా తానొక్కతీ భరించలేక భర్తతో పంచుకోవాలని గబగబా వెళ్ళింది.

పూర్తయి పెంయింటింగుకి తుదిమెరుగులు దిద్దుతున్నాడు పాణి.

"ఏవండీ!.........."

"హుఁ......."

"మీకో శుభవార్త........"

"........................"

"మీకో తీపికబురు చెప్పనా?"

"ష్..........గొడవ చేయకు........."

"అది కాదండీ! మనకి............"

"నన్ను ఒంటరిగా వదిలెయ్, తలుపేసి వెళ్ళిపో." విసుక్కున్నాడు.

చివుక్కుమందామె మనస్సు. గాఢంగా నిట్టూర్చి వెనుదిరిగింది.

ఇంతలో మావగారు పిలుస్తున్నారంటూ సావిత్రి దగ్గరుండి తీసు కెళ్ళిందామెని.

"నీళ్ళోసుకున్నావటకదా? చాలా సంతోషం. మీ ఇంటికి కబురంపుతాన్లే. రేపు గుడికెళ్ళి అభిషేకం చేయించుకురండీ" అన్నారాయన.

తలలూపి వచ్చేశారు.

రాత్రి భోజనాలయ్యాక తాంబూలం అందిస్తూ "మీకో సంగతి చెప్పనా?" అంది రాజ్యం.

"చెప్పు. పొద్దున్న చెప్పబోయావు, అదేనా?"

"వూఁ. మీరు.......మీరు......తండ్రికాబోతున్నారు."

ఆశ్చర్యం ఆనందం జంటగా ముప్పిరిగొనగా పరమానందపడిపోయాడు. అతడి ఆనందం ఎబ్బెట్టుగా అన్పించిందామెకి. తన పురుషత్వానికి గర్విస్తూ ఆనందిస్తున్నట్టుగా వుందిగాని తమ ప్రేమకి ప్రతిరూపం రూపు దిద్దుకొంటున్నందుకు సంతోషించినట్టు లేదు!

"అయితే చక్కని పేరు ఆలోచించాలన్నమాట?"

అతడినుంచేదేదో ఆశించిన ఆమె ఆ మాటలకి నిరుత్సాహపడింది.

"అన్నట్టు, చెప్పడం మరిచాను. ఇవాళ పూర్తిచేసిన చిత్రాన్ని తీసుకుని రెండు మూడురోజుల్లో మద్రాసు వెళ్తాను."

"ఎందుకండీ?"

"చల్లపల్లి జమీందారు తాలూకు వారెవరో అక్కడున్నారు. వారికివ్వాలి. పంపిస్తానని నాన్నగారు చెప్పేరట."

"ఊరికేనా, లేక........"

"భలేదానివే. ఊరికే గాకపోతే కళని అమ్ముకుంటామా?! నా చిత్రం నా సృష్టి నా రంగుల కల్పన గొప్ప గొప్పవారి భవనాల్లో అలంకరించారంటే మనకెంత గొప్ప! మన వంశానికెంత కీర్తి!"

"ఒక మాటడగనా?"

"అడుగూ."

"గొప్ప గొప్పవారి బొమ్మలూ ప్రముఖుల బొమ్మలూ ఆడవారి బొమ్మలూ వేస్తున్నారు గాని గాంధీజీ బొమ్మ ఎందుకు వేయలేదు?"

"ఏం ప్రత్యేకతుందని వేయను?"

"ఆయనే ఓ ప్రత్యేకత కదా."

"ప్చ. కనీసం నెహ్రూగార్లా కోటు తొడుక్కుని టోపి పెట్టుకుని గొప్పగా వున్నా వేద్దును. బొత్తిగా సాదా సీదా ముసిలి మనిషి. నలుపు తెలుపు బొమ్మలాటి చిత్రాన్నేం గీయను?"

"స్వాతంత్ర్య సమరంలో అపరకృష్ణుడై అహింసామూర్తియై అనన్య సాధ్యమైన కార్యాన్ని సాధించిన మహావ్యక్తి. ఆ సేతు హిమాచలం భారతీయులందర్నీ ఏకతాటిమీద నిలిపి నడిపించిన మహానాయకుడు.

ఆయన్ని గురించి మీరిలా మాట్లాట్టం భావ్యం కాదు." గుండెకి గాయం కాగా వేదనగా అంది రాజ్యం.

"ఓహో – మీది దేశభక్తుల కుటుంబం కదూ!" అని నవ్వేసి, "సర్లే, ఇక పడుకో" అన్నాడు మరో పక్కకి ఒత్తిగిల్లి.

ఆమె పడుకుంది. కాని నిద్ర రాలేదు!

## 12

ఒక కావిడ మిఠాయి, ఒక అరిటి గెల తీసుకుని ఆనందపు రథాన్ని అధిరోహించి మరీ వచ్చారు వియ్యన్న.

పరమానందపడిపోతూ కూతుర్ని అక్కున చేర్చుకున్నారు.

తల నిమిరి "నిండు నూరేళ్ళు సౌభాగ్యవతిగా వర్ధిల్లు తల్లీ! నీ జన్మ ధన్యమయ్యిందమ్మా." అన్నారు ఆనందబాష్పాలు రాలుస్తూ.

"అదేవిటి నాన్నా! మాతృత్వమే స్త్రీకి పరమావధి! అయినట్టు మాట్లాడుతున్నారేవిటి!" నవ్వుతూ అంది రాజ్యం.

"అంతే కదమ్మా? వంశాన్ని వృద్ధి చెయ్యడంతోనే కదా స్త్రీ జన్మ సార్థకమయ్యేది?"

"బాపూజీ అలా అన్లేదే. ఆడవారు చదువుకోవాలి. అన్నిటా ముందడుగు వేయాలి. మగవారితో పోటీపడా లన్నారు. ఇల్లాలి చదువు ఇంటికే వెలుగన్నారు. రాణి రుద్రమదేవి ఝాన్సీ లక్ష్మి లాంటి వార్నెంతగానో అభినందించారు. నన్ను అలా కమ్మని ఒక చరిత్రగా మిగిలి పొమ్మని ఆశీర్వదించకుండా ఒక తల్లిగా మిగిలిపొమ్మంటున్నావేం నాన్నా?"

కూతురివంక తేరిపార చూస్తూ అన్నారు: "చాలా ఎత్తుకి ఎదిగిపోయావమ్మా!"

"నా కెందుకో అందరాడవాళ్లలా అణిగి మణిగి తలుపుచాటునే వుండి పోవాలన్పించట్లేదు నాన్నా! ఏదో చేసేయ్యాలి ఏదో సాధించెయ్యాలనెంతో తపనగా వుంటోంది. ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో తోచదు. ఎక్కడ అన్యాయం జరిగినా వెళ్ళి అడ్డుకోవాలనీ, ఎక్కడ కన్నీరొలికినా వెళ్ళి తుడవాలనీ నా మెదడులో ఎన్నెన్నో గొంతులు ఘోషిస్తుంటాయి నాన్నా! ఇదంతా ఏవిటంటారు? ఎందుకంటారు?"

"పదిమందికోసం పడుతోన్న నీతపనని చూస్తోంటే నాకు ఆనందంతో మాట రావట్లేదమ్మా! నీకు ప్లీడరు విశ్వేశ్వరయ్యగారి సంబంధమో మరోటో చేసివుంటే ఎంతో బావుండేది. నీ భావాలు పుష్పించి ఫలించేవి. ఈ దేశానికి కాంతి నిచ్చేవి. కాని తీసుకొచ్చి ఈ చీకటి కొట్లో పడేశాను!"

ఆయన గొంతు గాద్గదికమయ్యింది.

"అవేం మాటలు నాన్నా? నేనిప్పుడు బాగానే వున్నాను. నాకిక్కడ బాగనే వుంది."

'అంతే లేమ్మా! అలా సమర్థించుకుంటేనే జీవితం."

"మీరేవిటదోలా వున్నారు నాన్నా? ఒంట్లో బావుంటోంది కదా? చాలా చిక్కిపోయారు!"

"నాకేముమ్మా, దుక్కలా వున్నాను. దేశం పరిస్థితే బాగోలేదమ్మా. స్వాతంత్ర్యం వస్తే ఎన్నో అద్భుతాలు జరిగిపోతాయనుకున్నాం కాని ఎక్కడి వక్కడే ఎప్పట్లానే............హిందూ ముస్లింల మధ్య విద్వేషాలు రగుల్తూనే వున్నాయి. ఎప్పుడేమవుతుందో, దేశం మళ్ళీ చీలి పోతుందేమోనని భయంగా వుంది."

"అన్నీ అవే సర్దుకుంటాయి. అన్నప్రాసననాడే ఆవకాయ తినిపించె య్యాలంటే ఎలా?" నవ్వింది.

"నీకు తెలీదమ్మా, మతం మనిషిని సన్మార్గాన నడిపించాలి. అంతేగాని విద్వేషాన్ని రెచ్చగొట్టకూడదు. మనస్సుల్ని విషపూరితం చెయ్యకూడదు. మతమౌఢ్యం మన దేశపు ఐకమత్యానికెప్పుడూ గొడ్డలి పెట్టేనమ్మా! పాపం, మధ్యన బాపూజీ నలిగిపోతున్నారు. స్వాతంత్ర్యం వచ్చినా ఆ ముసలాయనకి శాంతి లేకుండా పోయింది!"

"బాపూజీ ఒకసారేమన్నారో గుర్తుందా నాన్నా? నా మంత్రం శ్రీరామకాదు, హే రామ. శ్రీరామ అంటే సంపద లిచ్చే రాముడు. హే రామ అంటే ఆవేదనతో పిలిచే రాముడు."

"భవిష్యత్తు ఆయన నోట పలికినట్టుంది."

తండ్రివంక చిత్రంగా చూసింది.

చూపులు మరల్చుకున్నారాయన.

"అన్నపూర్ణత్త మాటి మాటికీ గుర్తొస్తోంది............"

"శివయ్యకి తగ్గ ఇల్లాలు. నమ్మిన ఆశయంకోసం బలైపోయింది పాపం!"

"ఆ రోజున ఊరేగింపులో పాల్గొనకుండా వుంటే వెన్నుపూసకి దెబ్బ తగలకుండా వుంటే ఇంకో నలభై ఏళ్ళు బతికేది. ఎందరికో మార్గ దర్శకురాలయ్యేది."

"భార్య పోయినప్పుడొచ్చి మొఖం చూపించడమే – మళ్ళీ ఇంతవరకూ శివయ్య రానేలేదు. నైజాముకి వ్యతిరేకంగా పోరాడుతున్నారంటే అర్థముంది. ఏకంగా యూనియన్ సైన్యంతోనే తలపడాలని చూస్తున్నారు. కొండతో ఢీకొంటే ఏమవుతుంది? నుజ్జు నుజ్జు అయిపోతారు."

భయవిహ్వాలయ్యి చూసింది రాజ్యం.

ఇంతలో గదిలోకి పాణి రావడంతో వారి సంభాషణా మాలిక తెగిపోయింది.

"అల్లుడుగారు బాగున్నారా?"

"వూ, మీరొచ్చి ఎంత సేపయ్యింది?"

"ఇంతక్రితమే. ఇప్పుడే చెబుతున్నాను అల్లుడుగారూ! మీకు అబ్బాయి పుట్టినా అమ్మాయి పుట్టినా పెంపకానికి మాకిచ్చెయ్యాలి" అన్నారు నవ్వుతూ.

"ఏం? మేం పెంచలేం అనుకుంటున్నారా?"

"అహా. అలా అని కాదు. మీరు తప్ప మాకు మాత్రం ఎవరున్నారు?"

"అయితే మాత్రం. మా పిల్లల్ని అనాధలుగా మరొకరి కప్పగించం."

"అయ్యయ్యో, ఎంతమాట!..........."

మరో మాట కవకాశం ఇవ్వకుండా బయటికెళ్ళిపోయాడు పాణి.

"అల్లుడుగారు అంత మాటనేశారేవిటమ్మా?" బాధగా అన్నారు వియ్యన్న.

"ఆయన తీరే అంత మీరేం ఇదవ్వకండి నాన్నా!"

"నేనైనా అలా అనకుండా వుండాల్సింది. తప్పు నాదే." నొచ్చుకున్నారు.

"ఇతరుల తప్పు మీదేసుకోవడం మంచితనం అన్పించుకోదు నాన్నా. భోంచేద్దురుగాని పదండి."

☆ ☆ ☆

"అమ్మాయిని మా ఇంటికి తీసుకెళ్ళి వారం పది రోజులుంచుకుని పంపిస్తాం......"అని చెప్పి కాకుళ స్వామిగారి అనుమతి తీసుకుని రాజ్యాన్ని పుట్టింటికి తీసుకొచ్చారు వియ్యన్న.

రాజ్యం గుమ్మంముందు బండి దిగిందో లేదో చాకర్ది గబ గబా ముందుకొచ్చి పేడ ముద్దల్తో దిష్టి తీసి పారేసింది.

తల్లీ నానమ్మా ఆప్యాయంగా ఆహ్వానించారు. ఇరుగు పొరుగు వచ్చి కుశలం కనుకున్నారు. తర్వాత అత్తవారింటి గురించి ఆరా తీశారు.

అత్తవారింట్లో తను సుఖంగా వుందని నమ్మబలికేక తేలిగ్గా నిట్టూర్చారంతా.

"మీ అయనింకా ఆ పేడి మొఖంతోనే వుంటున్నాడా, మీసాలు పెంచుతున్నాడా?"

నానమ్మ మాటలకామె మోము ఎర్రబడింది. అడంగులంతా ఘొల్లుమని నవ్వేశారు.

"మగాడనే వాడు మీసాల్లేకుండా వుండకూడదు. అయినా తండ్రి వుండగా మీసాలు గొరిగించుకోకూడదే!" అందావిడ మళ్ళీ.

నిజానికి కోరమీసం వుంచుకోమని పెళ్లైన కొత్తలోనే చెప్పింది రాజ్యం. కాని పాణి విన్పించుకోలేదు. "నాకిష్టం వుండదు" అనేశాడు.

"మాట్లాడవేమే? మనస్సు మీ అయన్దగ్గిరి కెళ్ళిపోయిందా?" ఓ స్నేహితురాలంది. అంతా నవ్వేశారు మళ్లీ.

ఊరి విషయాలు అడిగి తెలుసుకుంది. చాన్నాళ్ళ తర్వాత మనసు తీరా కబుర్లు చెప్పింది. గల గలా నవ్వింది. ఎలాటి భయాలు సంకోచాలు లేకుండా ప్రవర్తించింది.

అత్తింట ఇలా స్వేచ్ఛగా వుండలేకపోతున్న సంగతి గమనించింది. తను ఏమేం కోల్పోయిందో గుర్తించింది. గుండెలు బరువెక్కాయి!

"హిందీ పంతులు రామనాధానికి ఉద్యోగం వచ్చిందే! ఈ పక్కనే ఏదో ఊళ్ళో వేశారు. మీ నాన్నా చెప్పేరా?" తల్లి కాంతమ్మ అడిగింది.

"అలాగా. చాలా సంతోషంగా వుందమ్మా! లలిత అదృష్టవంతురాలు."

"పండంటి మగ బిడ్డని కంది. అదైనా చెప్పేరా లేదా మీ నాన్న"

"లేదే వున్నా కాస్సేపూ నా గొడవతోనే సరి పోయింది. భగవంతుడు వాళ్ళని చల్లగా చూశాడు. అదే పదివేలు"

"అంతా మీ నాన్నని ఎంతగానో పొగుడ్తున్నారు. లలితా వాళ్ళమ్మా నాన్నా వచ్చి లలితకి పునర్జన్మ ప్రసాదించా రన్నారు. అనక వాళ్ళింటి కో అడుగు వేసిరా."

"వెళ్తాన్లే. వాళ్ళన్నదీ నిజమే. అలాంటి నాన్న కడుపున పుట్టడం నా అదృష్టం."

రాజ్యం మాటలకి కాంతమ్మ మొఖం ఆనందంతో వెలిగిపోయింది.

ఆ రాత్రి భోజనాలయ్యాక పెరట్లో మంచం వాల్చి కూర్చుంటూ రాజ్యాన్ని పిల్చింది నానమ్మ.

"నీ ఒంట్లో ఎలా వుంటోంది నానమ్మా ? ఆ మధ్య నోట్లో పూత పూసి నోరు లక్కపిడతలా అయ్యింది కదా, ఇప్పుడెలా వుంది?"

"ఆచార్లుగారు ఏదో లేహ్యం ఇచ్చార్లే. రావి ఆకు మీదేసుకుని రోజూ ఇంత నాకాలి. అది నాకేక కొంచె నయమేలే. అయినా కాళ్ళు చాచుకున్న దాన్ని నాకేంటి గాని మీ నాన్నని చూశావా చిక్కిసగమై పోయాడు బిడ్డ."

"అదే అడిగాను. దేశం గురించీ బాపూజీ గురించీ బాధ పడిపోతున్నాడు."

"మనేద పెట్టుకున్నాడే!"

"మనోవ్యాధా?" ఆశ్చర్యపోయింది రాజ్యం.

"అవునే అమ్మాయ్! ఈమధ్య పరాకూ పరజ్ఞానం ఎక్కువయ్యాయి. ఎప్పుడూ దిగులుగా కూర్చుంటున్నాడనుకో. కంటినిండా నిద్రపోడం లేదు. అర్ధరాత్రుళ్ళు అమాంతం లేచి కూర్చుంటున్నాడు బిడ్డ........"

"ఇప్పుడేవయ్యిందనీ?"

"ఇంకా ఏం కావాలే, ఇల్లంతా గుల్లయితేనూ! ఇంటి చుట్టూ అప్పులేనాయె!"

"అన్ని అప్పులయ్యాయా?"

"అవ్వక కూర్చుంటాయా? మనిషీ మానూ నిద్రపోతారుగాని అప్పు నిద్రపోదే! రాత్రీ పగలూ పెరుగుతూనే వుంటుంది. ఎప్పుడూ దేశం గొడవలే గాని ఇల్లూ వ్యవసాయం పట్టించుకోలేదు కదా? చదువూ వానకాలం చదువయ్యింది. వ్యవసాయం పాలేరు మీద వదిలాడు. ఆరుగాలం కష్టపడితేనే నాలుగు గింజలు మిగట్లం లేదు. దగ్గరుండి ఆనూ పానూ చూసుకోకపోతే ఏం మిగుల్తాయి చెప్పు? ఆ సభలనీ ఈ చందాలనీ

ప్లీడర్లనీ కేసులనీ చరఖాలనీ – ఒకటేమిటి అన్నీ మీ నాన్నకే కావల్సి వచ్చాయియాయె! మధ్యలో ఆ విధవప్పిల్లని పెళ్ళాడతానన్నాడని రెండెకరాలు వాళ్ళ మొఖాన కొట్టాడా? నీ పెళ్ళికి పెట్టుపోతలకీ కుంచంతో రూపాయలు కొలిచి పోయాల్సొచ్చింది కదా! ఇంక తేలమంటే సంసారం ఎలా తేల్తుంది చెప్పు?"

చదువూ సంధ్యాలేని నానమ్మ వ్యవహారజ్ఞానానికీ ఆలోచనా ధోరణికీ అచ్చెరువందకుండా వుండలేకపోయింది. రాజ్యం. ఆమెతో పోలిస్తే తను చాలా చదివినట్టే లెక్క. కాని తనంత లోతుగా ఎన్నడూ ఆలోచించలేదు!

"ఏం చేస్తే బావుంటుదంటావు నానమ్మా?"

"అంతో ఇంతో పొలం అమ్మేసి అప్పులు తీర్చేస్తే మిగిలిందాంతోనే మనశ్శాంతిగా వుండొచ్చే పిల్లా! నువ్వు చెప్పి చూడు. నీ మాటంటే వాడికి గురి."

"అలాగే నానమ్మా!"

"మీ తాత రెక్కలు ముక్కలు చేసుకుని రెండెకరాల్ని ఎనిమిదెకరాలు చేశారు. ఎప్పుడూ పచ్చడి మెతుకులేగాని పరమాన్నం తినెరుగుదురా ఏవన్నానా? ఒంటిమీద చొక్కా కూడా లేకుండా గావంచాతోనే వుండేవారు. ఎప్పుడూ నా భూమి నా తల్లి అంటూ దేవుళ్ళాడే వారు. చాకిరీ చెయ్యడవేగాని సుఖాలకి నోచుకోలేదా మనిషి!" కళ్ళ నీళ్ళు పెట్టుకుంది నానమ్మ.

ఆవిడ పాత జ్ఞాపకాల్లో మునిగిపోయింది. ఆమెని వదిలిరావడం ఇష్టంలేక మౌనంగా వుండిపోయింది రాజ్యం.

మర్నాడు తండ్రి ఒక్కరూ వుండగా చూసి నానమ్మ భయాల్నీ తన అభిప్రాయాన్నీ వివరించింది.

"పొలం అమ్మి అప్పుల్నుంచి బయటపడాలని నాకూ వుందమ్మా. కాని మీ అత్తవారేమనుకుంటారోననీ......" సందేహిస్తూ ఆగారు.

"ఇది మనింటి వ్యవహారం. వాళ్ళేమైనా ఎందుకనుకోవాలి?"

"ఎంతో వుందనుకున్నాం. ఒక్కతే సంతానం గనుక అంతా కోడల్దే అవుతుందనుకున్నాం. కడకి మిగిలింది ఇంతేనా అని నిన్ను చులకనగా చూస్తారేమోనని......."

"వాళ్ళంతకంటే బాగున్నారా?" రోషం పొడుచుకురాగా అంది.

"ఏమ్మా, వాళ్ళ పరిస్థితి బాగోలేదా?" గాభరాగా అడిగారు వెంటనే..

"అహో. అలా అని కాదు. పరిస్థితి బాగున్నా ఆదాయం రెండు ఖర్చు నాలుగు. అలా ఎంత కాలం నడుస్తుంది చెప్పు?"

"పెద్ద కుటుంబం పైగా మూడు నాలుగూళ్ళకి పెద్దమనిషి. కొన్ని అదనపు ఖర్చులు తప్పవు మరి. ఎంతచెట్టుకి అంతగాలి అన్నారు."

"వాళ్ళ సంగతికేంగాని మీరు త్వరగా ఒడ్డున పడిపోండి నాన్నా!"

"నీ మాట కోసమే చూస్తున్నా నిన్నాళ్ళూ. ఇక ఆ పని మీదే వుంటానమ్మా! నీ పురిటి నాటికి ఎక్కడా అప్పుపత్రం వుండనివ్వను. ఇప్పుడే చెబుతున్నాను. అబ్బాయి పుడితే మాత్రం బాపూజీ పేరు పెట్టాలి సుమా!"

"మీరే పెడుదురుగాని నాన్నా!"

"నా తల్లే. ఎంత మంచి మాటన్నావమ్మా! మనవడి కోసమైనా రెండెకరాలు మిగిల్తే బావుణ్ణు......"

"ఆ మాత్రమైనా మిగలకపోతే మీ పరిస్థితి?"

"మా కేంటమ్మా, ఎలాగో బతికేస్తాంలే. నీకు పసుపు కుంకాల కింద మూడెకరాలు రాసిచ్చాం గదా. అది పోను ఎకరం పొలమూ చరఖా కేంద్రమున్న తోటా మిగలొచ్చేమో!"

ఆకాస్త భూమి మీదా వచ్చే పంటతో ఎలా బతుకుతారు? పైగా పురుడు ఖర్చు వుండనే వుందాయె!

దిగులుగా కూర్చుండిపోయింది రాజ్యం.

## 13

"కోడలొచ్చిన వేళా గొడ్డొచ్చిన వేళా అని వూరికే అన్లేదు. ఏ ముహూర్తాన నా ఇంట్లో పెద్దమ్మలా కాలుపెట్టావో అప్పట్నుంచి ఇంటిని శని పట్టుకుంది." రాజ్యంవంక నిరసనగా చూస్తూ అన్నారు కాకుళ స్వామి.

గుండెల్లో వాడి బాకు దిగబడినట్టు విలవిల్లాడింది రాజ్యం.

"మంచం వున్నంత వరకే కాళ్ళు చాచుకోవాలి. లేకపోతే ఇలాగే ఇతరుల్ని నిందించాల్సొస్తుంది" అనేసిందామె.

అంత ధైర్యం ఎక్కడ్నుంచొచ్చిందో ఆమెకే తెలీదు!

అవాక్కయ్యారాయన. ఎన్నడూ ఊహించని ఎదురుదెబ్బ ఇంట్లోనే తగిలింది. ఆగ్రహోదగ్రులయ్యారు.

"నోర్మూయ్. నాకే చెప్పేంత మొనగత్తె వయ్యావా?" అని వురిమి చూశారు.

ఇంతలో సావిత్రి పరుగునొచ్చి రాజ్యాన్ని లోపలికి తీసుకుపోయింది. దమయంతి కూడా వెనకే వచ్చింది. అంతా వెళ్ళి వంటింట్లో దూరారు.

ఆమెకి మావగారేం శిక్ష విధిస్తారోనని వణకిపోతూ అంది సావిత్రి: "అయ్యో అయ్యో! మావగారని కూడా లేకుండా నోటి కెంతొస్తే అంత అనేసెయ్యడవే?"

"ఆయన మాత్రం కడుపుతో వుందని కూడా చూడకుండా అంతలేసి మాట లంటారా. ఆయనసలు పెద్దమనిషేనా?" దమయంతి నిలదీసింది.

"ష్ ఏమిటా ఎగురుడు దమయంతీ – చిన్నంత్రం పెద్దంతం లేకుండా!"

"అలా అనుకుని నోర్మూసుకునేది మనవే. వూరివాళ్ళు కాదు."

"నెమ్మది – నెమ్మదిగా మాట్లాడవే. మావగారు వింటే ఏమైనా వుందా?"

"లోయ నోరు మూయగలరు కాని లోకం నోరు మూయగలరా? మనమంటే అన్నీ దాచిపెట్టుకుంటున్నాం. పిల్లి కళ్ళు మూసుకుని పాలు తాగుతూ తనని ఎవరూ చూట్టం లేదనుకుంటుందిట!"

"బాగా చెప్పేవక్కా! అత్త మీద కోపం దుత్త మీద చూపినట్టు ఎవరి మీదో కోపం నా మీద చూపిస్తే ఎలాగా?" అంది రాజ్యం.

"అయ్యో అయ్యో – మీ ఇద్దరికీ ఇవాళేమయ్యిందే, ఒకర్ని మించి ఒకరు రెచ్చిపోతున్నారూ!" నుదురు కొట్టుకుంది సావిత్రి.

"మాక్కాదు, మావగారికే ఈమధ్యేదో అయ్యింది. కౌలుధాన్యం ఇమ్మని ఆ బ్రాహ్మలు పీకల మీద కూర్చున్నప్పట్నుంచీ ఆయనిలాగే కల్లు తాగిన కోతిలా గంతు లేస్తూనే వున్నారు."

"కచేరీకి ఫిర్యాదు చేస్తాం, కౌలు ఇంకొకరికి అమరకం ఇస్తాం అన్నారనే కదా ఎక్కడ్నుంచో డబ్బు తెచ్చి వాళ్ళ కిచ్చారు మావగారు" అంది సావిత్రి.

"ఎక్కడ్నుంచో కాదు, అమ్మవారి సొమ్మే ఇచ్చారు."

"దమయంతీ!"

"అవునక్కా! ఈ సంగతి వూరందరికీ తెలుసు. ఆ మధ్యన

గణాచారికి అమ్మవారు కన్పించినప్పుడు అమ్మవారి సొమ్ముతో పొలం కొనమంది తెలుసా?"

దమయంతి మాటల కడ్డొస్తూ "అమ్మవారు కన్పించడం ఏవిటి?" అనడిగింది రాజ్యం.

"గణాచారికి చల్లాలమ్మ పూనుతుందిలే. అలాటప్పుడు చెప్పేట్ట. ఆ తర్వాత నాలుగు కొబ్బరి కాయలు దొంగిలించాడని గణాచారి కొడుకుని చావ గొట్టారు కదా? మళ్ళీ గణాచారికి అమ్మవారు కన్పించినప్పుడు పొలం కొనొద్దనీ, ఆ సొమ్ముతో ఏం చెయ్యాలో తర్వాత చెబుతాననీ చెప్పిందిట, మావగారే అలా చెప్పించి ఆ సొమ్ము వాడేసుకున్నా రనుకుంటున్నారంతా."

"పాపం పుణ్యం పరమాత్ముడి కెరుక. చూసీ చూడనీ మాటలు మన కెందుగ్గాని ఇంక కట్టి పెట్టేయ్!" కసురుకుంది సావిత్రి.

"ఉన్న మాటంటే వులుకెందుకు? మొన్నటిసారి అమ్మవారు కన్పించి నప్పుడు అమ్మవారి కాసులపేరు మెడలో వెయ్యలేదు. దానిక్కూడా రెక్కలొచ్చాయేమోనని నా అనుమానం" అంది దమయంతి.

"అవేం అఘాయిత్యం మాటలే? అందరికీ మాట తెచ్చేట్టున్నావ్. పద పద, ఎక్కడా తెలివితక్కువగా వాగకు. మావగారికి తెల్సిందంటే అగ్గిరావుడై పోతారు." బెంబేలు పడింది సావిత్రి.

"అమ్మవారి నగలు మావగారి దగ్గిర దాస్తున్న సంగతి వూరందరికీ తెలుసు. ఏమేం నగలున్నాయో ఏవి లేవో ఇవాళగాకపోతే రేపైనా తెలీదూ!" అంటూ సాగదీస్తూ లేచెళ్ళిపోయింది దమయంతి.

"దానిమాటలకేంగాని నువ్వేం ఇదవ్వకు రాజ్యం! మావ గారేదో ధోరణిలో వుండి విసుక్కుంటారత్తప్ప ఆయన మనస్సు మంచిదే" అని నచ్చచెప్పింది సావిత్రి.

కాని రాజ్యం మనసు కుదుటపళ్ళేదు. రాక్షసి బొగ్గులా రగుల్తూనే వుంది!

ఎన్నడూ ఎవరూ తనని చిన్నెత్తు మాటన్లేదు.

అలాటిది మావగారు కోడలని కూడా చూడకుండా అంత మాటంటారా? శనిలా ఇంటిని పట్టుకున్నానని నిందిస్తారా?

ఎంత ఘోరం!

కళ్ళనుంచి కన్నీళ్ళు జల జలా రాలిపోతున్నాయి.

మావగారో పెద్దమనిషి అనుకుంది. పదిమందికీ మంచి చెప్పే తీర్పరి అనుకుంది.

కానాయన ఒక పెత్తందారుగా కుహనా సంస్కారిగా దౌర్జన్య పరుడిగా కన్పిస్తున్నారు.

గణాచారి తనకి అడ్డొస్తున్నాడని భావించి చిన్న సాకుతో అతడి కొడుకుని హింసించి అతడ్ని తన దారిలోకి తెచ్చుకున్నారు.

అమ్మవారి సొమ్ముని ఇష్టానుసారం ఖర్చు పెట్టేస్తున్నారు.

ఆఖరికి ఇంటికోడళ్ళని షోకేసులోని బొమ్మల్లా వుంచి ఆడిస్తున్నారు! తన తప్పులకి దుర్వర్తన ఫలితాలకి చిన్నకోడలు కారణమని నిందిస్తున్నారు!

అన్నపూర్ణత్త మాటలు గుర్తొచ్చాయి. చలం రాతలూ గుర్తొచ్చాయి.

స్త్రీకీ మెదడుందని అదీ ఆలోచించగలదని ఈ మగాళ్ళెప్పుడు గ్రహిస్తారో!

గాఢంగా నిట్టూర్చింది రాజ్యం.

సావిత్రి ఎంత బతిమాలినా ఆ రాత్రి భోజనం చెయ్యలేదామె.

పాణి వచ్చాడు. ఏదైనా అంటాడేమోనని చూసింది. ఏమీ అన్లేదు. అసలతడికి తెలిసిందో లేదో అని అనుకుంది. అయినా చెప్పాలన్పించలేదు!

కలత నిద్ర మధ్యలో తండ్రి మాటలు గుర్తురాగా వులిక్కిపడి లేచి కూర్చుంది రాజ్యం.

వియ్యన్న కొంత పొలం అమ్మి అప్పులన్నీ తీర్చేశారు. ఆ సంగతులు ఎవరి నోటో తెలియడం ఎందుకని స్వయంగా ఆయనే వచ్చి వియ్యంకుడి కంతా చెప్పి వెళ్ళారు. అప్పుడు కాకుళస్వామి "దేశం దేశం అంటూ వున్నది ఆర్పుకున్నారు" అని వ్యాఖ్యానించారు కూడా.

తరచి ఆలోచిస్తే అప్పట్నుంచీ ఆయన తనని చిన్నచూపు చూస్తు న్నట్టుగానే వుంది!

"డబ్బుకి పెద్ద పీట వేస్తారు. ఏం మనుషులో!" అనుకుంది.

అది జరిగిన వారం రోజులకి ఓ ప్రముఖ వాస్తు సిద్ధాంతిని తుణుకు నుంచి తీసుకొచ్చారు కాకుళస్వామి.

ఆయన ఇల్లూ పరిసరాలూ అన్నీ పరిశీలించారు. ఎన్నో అడిగారు. మరెన్నో లెక్క లేశారు.

ఆఖరికి దక్షిణం కన్న ఉత్తరాన ఖాళీ స్థలం తక్కువగా వుందనీ దానివల్లే వ్యయం ఎక్కువై కుటుంబానికన్నిటా లోటుగా వుందనీ

చెప్పేరు. అందుకని ఉత్తరం వైపునున్న చావిడిని కూలగొట్టెయ్యడం మినహా మరోమార్గం లేదన్నారు.

ఆ చావిడిలోనే సభ తీర్చి కూర్చుంటారు కాకుళస్వామి. యాభై మంది దాకా కూర్చునేంత జాగా వుందందులో. పెద్దల సమావేశాలూ రచ్చబండ తీర్పులూ అన్నీ అక్కడే జరుగుతాయి. దాని నానుకుని వున్న పొడుగాటి గదిలోనే అతిథులకి భోజనాలు వడ్డిస్తారు. వీధి అరుగు మీద పొరుగూర్నించొచ్చిన వాళ్ళు పడక మంచాల మీద పడుకుని తెల్లవారగట్లే లేచి వెళ్ళిపోతూంటారు.

అలాటి దాన్నిప్పుడు కూల్చెయ్యమన్నారు.

మరో మాటకీ ఆలోచనకీ ఆస్కారం లేకుండా వెంటనే కూల్చేయించారు కాకుళస్వామి

ఒక్కసారిగా వారి లోగిలి బోసిపోయింది. బావురుమంటూ శిధిల దుర్గంలా మిగిలిపోయింది!

ఒకనాటి వైభవం ఏది ఏదని కళ్ళనీళ్ళు పెట్టుకుంది రాజ్యం!

## 14

"చిన్నమ్మా చిన్నమ్మా! రేడియోలో గాంధీ తాత గురించేదో చెబుతున్నారు." సావిత్రి కొడుకు సత్యం వచ్చి చెప్పేడు రాజ్యానికి.

ఒక్కంగలో గదిలో కెళ్ళింది. రేడియోలోంచి విషాద సంగీతం విన్పిస్తోంది. ఆమె గుండెలు గుబ గుబ గుబలాడాయి.

"బాపూజీ గురించేమైనా చెప్పేరా?" ఏవో పుస్తకాలు తిరగేస్తోన్న పాణిని అడిగింది.

"ఏమో మరి. విన్లేదు..............."

గుండె చప్పుడు స్పష్టంగా తన చెవులకి విన్పిస్తోంటే వూపిరి బిగబెట్టి చెవులు రిక్కించింది.

"గాంధీజీ షాట్ డెడ్........" రేడియోలో విషాద స్వరంతో చెప్పారు.

"ఏవిటి; ఏం చెప్పేరండీ." భర్త భుజాన్ని కుదిపేస్తూ అడిగింది.

"గాంధీజీ చనిపోయారట........"

"అఁ! షాట్ అన్నారేవిటి?"

"అంటే, కాల్చారని.......తుపాకితో కాల్చి చంపివుంటారు........."

"ఆఁ!" మొదలు తెగిన వృక్షంలా కూలిపోయిందామె.

"మహాత్ముడు కాల్చి చంపబడ్డారు. హే రామ్ హే రామ్ అన్నవి ఆయన ఆఖరి మాటలు...........ఇప్పుడు భారత ప్రధాని జవహర్‌లాల్ నెహ్రూ ప్రసంగపాఠం వింటారు........." రేడియోలో నెహ్రూ దుఃఖపూరిత కంపిత స్వరం వినబడ్డది:

"మన జీవితాలను ప్రభావితం చేసిన ప్రకాశ జ్యోతి ఆరిపోయింది. కాదు పొరబడుతున్నారు. ఇంతవరకు ఈ దేశాన్ని ప్రకాశింప చేసిన ఆ తేజస్సు సాధారణ తేజస్సు కాదు. అది వేయిసంవత్సరాల తర్వాత కూడా ఈ దేశానికి ప్రకాశమిస్తూనే వుండగలదు. యావత్తు ప్రపంచం ఆ తేజస్సును చూడగలదు. అది ప్రత్యక్ష సత్యజ్యోతి......"

ఓ బాపూ! ఓ జాతి పితా! ఓ మహాత్మా! ఓ మహర్షీ! అహింసే ఆయుధంగా బ్రిటీషు సామ్రాజ్యం మీద విజయం సాధించిన అహింసామూర్తి కడకో మత మౌఢ్యుని హింసముందు ఓడిపోవాల్సొచ్చిందా? ప్రపంచానికి సత్యాగ్రహ మార్గం చూపిన సత్యవ్రతుడు తుపాకీ గుళ్ళకి అసువులు బాయాల్సొచ్చిందా? హే రామ్!

బావురుమంది రాజ్యం.

ఇంటిల్లపాదీ ఏం జరిగిం దేంజరిగిందని బిల బిలమంటూ వచ్చారు.

"గాంధీతాతని ఎవరో చంపేశారంట." సత్యం చెప్పేడు.

"గాంధీతాత. ఆయనెవరు? మీ తాతా? మీ తాత నీ చిన్నప్పుడే చనిపోయారు కదా!" అమాయకంగా అడిగింది సావిత్రి.

"బాపూజీ నాకే కాదు మనందరికీ తాతే. దేశానికి పెద్దదిక్కు అక్కయ్యా! అలాటి ఆయన్నెవరో దుండగుడు పొట్టన పెట్టుకున్నాట్ట" అంటూనే ఏడ్చేసింది రాజ్యం మళ్ళీ.

"ఏవీటీ ఏడ్పులూ పెడబొబ్బలూ! ఎక్కడో ఎవరోపోతే సిగ్గువిడిచి ఏడవాలా?" విసుక్కున్నాడు పాణి.

ఆడపులిలా లేచిందామె. "బాపూజీ ఎవరోనా? ఇవాళ మీరు పీలుస్తున్న స్వేచ్ఛా వాయువు నిలుచున్న భారత భూమి ఆయన ప్రసాదించిన భాగ్యమేనండీ! మీరివాళ నిశ్చింతగా స్వతంత్రుడిగా గుండెల మీద చేయి వేసుకుని నిద్రపోతున్నారంటే అది ఆనయపెట్టిన భిక్షేనండీ............"

మీది మీదికెళ్తూ చేతులూపుతూ ఆక్రోశంతో మాటలు తూటాలు వదుల్తోంటే అవాక్కయ్యాడు పాణి.

"కాస్త సంభాళించుకో అసలే వట్టిమనిషివికూడా కాదు ....." అంటూ రెక్కపట్టుకుని మంచంమీద కూర్చోబెట్టింది సావిత్రి.

అప్పుడు గుర్తొచ్చాడు తండ్రి.

వార్త విని తానే తట్టుకోలేకపోతోంది. నాన్న.........నాన్న ఎలా వున్నారో! ఎంతగా తల్లడిల్లుతున్నారో!

"అక్కయ్యా, అక్కయ్యా – నేను తక్షణం మా పుట్టింటి కెళ్ళాలి."

"ఇప్పుడా!"

"ఇప్పుడే. మా నాన్నని వెంటనే చూడాలి. ఆయనీ ఘోర వార్తకి ఎంతగా కుమిలిపోతున్నారో; కుంగిపోతున్నారో! బండి కట్టించు అక్కయ్యా!"

"సమయానికి ఇంట్లో మావగారుకూడా లేరు......"

"ఆయన్లేకపోతేనేం పాణి వున్నాడుగా? పాణీ – మీ ఆవిడ పుట్టింటి కెళ్తుందిట. బండి కట్టించు" అంది దమయంతి.

"నాన్నగారొచ్చేక చెప్పి వెళ్ళొచ్చులే" తాపీగా అన్నాడతడు.

"లేదు లేదు. నేనిప్పుడే వెళ్ళాలి. మా నాన్నని చూడాలి........" గొంతు చీరుకుంది రాజ్యం.

"అలాగేకాని నువ్వు కాస్త గుండెదిటవు చేసుకో రాజ్యం!......" అంది సావిత్రి.

ఇంతలో సావిత్రీ వాళ్ళాయనొచ్చాడు. సంగతి విని "నిజమే. మావయ్యగారికి గాంధీగారంటే పిచ్చిభక్తి. బండి కట్టిస్తాను, పెట్టె సర్దుకోమను. తోడుగా సత్యాన్ని వెళ్ళమను" అన్నాడతను.

మరోగంటకి గూడు బండి సిద్ధమైంది. ముందు వెనుకల తెరలు కట్టారు. చీరైనా మార్చుకోకుండా ఎలా వున్నది అలాగే బండి ఎక్కేసింది రాజ్యం. ఆమె కళ్ళనుంచి కన్నీరు ధారలు కడుతూనే వుంది. తోడుగా సత్యం కూడా ఎక్కేడు. ఎన్నో జాగ్రత్తలు చెప్పి వీడ్కోలిచ్చారు సావిత్రీ దమయంతీ బావగారూ పిల్లలూ.

☆ ☆ ☆ ☆

ఇంటి ముందూ అరుగుమీదా వున్న జనాన్ని చూసేసరికి రాజ్యం పై ప్రాణాలు పైకే పోయాయి. బండి ఆగటం ఆలస్యం గబుక్కున దిగి లోపలికి తన స్థితిని మరచి పరుగెట్టింది.

మంచంమీద ఒంటిమీద స్పృహలేని స్థితిలో పడివున్నారు వియ్యన్న! పక్కనే ఆచార్యులుగారేదో మూలికలు నూరుతున్నారు. కాంతమ్మ నానమ్మ సర్వం కోల్పోయినవాళ్ళల్లా గోడకి జేరబడి నోట్లో చీర కొంగులు కుక్కుకుని కూర్చున్నారు. ఇరుగు పొరుగు ధైర్య వచనాలు చెబుతున్నారు.

రాజ్యాన్ని చూసి బావురుమన్నారంతా.

"ఏమైంది నానమ్మా!........" జల జలా కన్నీళ్ళు కారిపోతోంటే అడిగింది.

"ఏం చెప్పనే తల్లీ. మాయదారి రేడియో ఏదో చెప్పేసరికి గుండెలు పట్టుకుని చెట్టంత మనిషి నిలువునా కూలిపోయాడే!" అంది దుఃఖాన్నాపుకో ప్రయత్నిస్తూ నానమ్మ.

కాంతమ్మ దుఃఖం రెట్టింపయ్యింది.

రాజ్యం కూడా "నాన్నా, నాన్నా" అంటూ ఏడ్చేసింది.

ఆచార్యులుగారు నిశ్శబ్దంగా వుండమని వారించారు.

నోట్లో ఏదో రసం పోశారు. కంట్లో చుక్కలు వేశారు.

ఎప్పటికో కళ్ళు తెరిచారాయన. రాజ్యం కన్పించింది. ఆయన కళ్ళు మెరిశాయి. అంతలో విషాదం అలుముకోగా "బాపూజీ........" అని వెళ్ళిపోయారంటూ సైగచేశారు.

ఆయన కనుకొనల్నుంచి కన్నీటి బొట్లు టప టప రాలిపడ్డాయి.

"చరఖా కేంద్రానికి తీసుకెళ్ళండి....." అతికష్టంమీదన్నారు.

వెంటనే మంచాన్నెత్తుకుని చరఖా కేంద్రంలోకి తీసుకెళ్ళారాయన్ని. ఊరంతా తరలివచ్చిందక్కడికి.

బాపూజీ చిత్రపటం వంక చరఖాల వంక ప్రశాంత ఆశ్రమం వంక చూసి ఎంతో తృప్తిపడ్డారు.

"నాకు ఖద్దరే కప్పండి........." అతి కష్టంమీద రాజ్యానికి చెప్పేరు. "ఒక్కసారి రఘుపతి......" అని పాడవూ అన్నట్టు అర్థింపుగా చూశారు.

"రఘుపతి రాఘవ రాజారాం
ఈశ్వర అల్లా తేరేనామ్
సబ్‌కో సన్మతి దే భగవాన్......."

రాజ్యంతోబాటు శృతి కలిపారంతా. కొందరు యువకులూ రామనాధమూ లలితా రాట్నాల ముందు కూర్చుని నూల వడకసాగారు.

ప్రార్ధన వింటూ రాట్నాల శబ్దం వింటూ బాపూ పోటో వంక చూస్తూ చూస్తూనే ఒరిగిపోయారు.

ఘొల్లుమన్నారంతా.

వార్త క్షణాల్లో పాకిపోయింది. జనం తండోపతండాలుగా వచ్చేరు. గాంధీగార్తోబాటు ఆయన శిష్యుడూ పోయారని బాధగా చెప్పుకున్నారు.

ఆయనకి ఖద్దరు దుప్పటి కప్పారు. మూడు రంగులు దారపు పోగుల దండ వేశారు. గ్రామస్తు లంతా రకరకాల పూలదండల్తో ముంచెత్తారు.

డప్పులు మ్రోగాయి.

పాడె లేచింది.

పూలు బుక్కాలు చిల్లర పైసలు దారి పొడవునా శవంపైకి విసుర్తూ శవయాత్ర సాగింది. ఊరు ఊరంతా శవం వెంట నడిచింది.

పాణిని తల కొరివి పెట్టమన్నారు. తండ్రి అనుమతి తీసుకోవాలన్నాడు. ఆయన రాలేదు గనుక అయన్నెలా అడుగుతా వన్నారు. అతడు మాట్లాడ్లేదు.

ఆ పని మరెవరు చేస్తే బాగుంటుందని తర్కించుకొంటోంటే హిందీ శిక్షకుడు రామనాథం "ఆ అవకాశం నాకిస్తే మహద్భాగ్యంగా భావిస్తాను" అన్నాడు.

"గురువు ఋణం ఈ రకంగా తీర్చుకుంటానంటే ఎందుక్కాదంటాం?" అన్నారు పెద్దలు. గాంధేయ వాదియైన తండ్రికి తల కొరివి పెట్టగల అర్హత అతడికే వుందంది రాజ్యం.

అతడు నిప్పులకుండ తీసుకుని శవంముందు నడిచాడు.

"తలకొరివి పెట్టినోడికి ఏదోటి ముట్టజెప్పాలంటారు. ఇలా జరుగుద్దని ముందే తెలిసిందో ఏవో వియ్యన్నగారు ముందుగానే రెండెకరాలు రాసిచ్చారు" అనుకున్నారు కొందరు.

రామనాథం చేతుల మీదుగా వియ్యన్న కట్టె ఈ దేశపు పంచ భూతాల్లో కలిసిపోయింది!

## 15

దిన కర్మలు పూర్తయ్యాయి.

అగ్రామస్తులే కాదు పరిసర గ్రామాలు వారు సైతం పెద్దకర్మకి వచ్చారు. తలా ఒకపని మీదేసుకుని ఊరుమ్మడి కార్యక్రమంగా చేశారు. వియ్యన్న కి ఘనంగా శ్రద్ధాంజలి ఘటించారు.

వియ్యంకుడి కర్మకాండ తను చూడకూడదన్చెప్పి కాకుళస్వామి రాలేదు. పాణి వచ్చినా ఒక పక్కగా అంటీ ముట్టనట్లు కూర్చుండి పోయాడు. అతడి పెద్దన్నగారు మాత్రం ఇంట్లోని మనిషిలా అన్నీ చక్క బెట్టారు.

రాజ్యం మేనమావ కొడుకు లెనిన్‌బాబు తదితరులు వచ్చేరుగాని "ఈ కర్మకాండల మీద మాకు నమ్మకం లేదు" అంటూ కబుర్లేసుకుని కూర్చున్నారు.

వియ్యన్న దేశభక్తినీ త్యాగనిరతిని పరిపరి విధాల నెమరువేసుకుని నివాళులర్పించి బంధుమిత్రులూ, అభిమానులూ వెళ్ళిపోయారు.

మూడుతరాలకి చెందిన ముగ్గురాడవాళ్ళు బిక్కుబిక్కుమంటూ మిగిలిపోయారు!

ముసలావిడ కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. "నీ చేతుల మీదుగా పోవాలనుకున్నాను కొడకా! నా కంటే ముందు నువ్వు మట్టి అయిపోతావనుకోలేదు కొడకా! ఋణ విముక్తుడివవ్వరా అని పోరు బెట్టాను గాని దాంతో బాటే భవబంధాల్నుంచీ విముక్తుడవై పోతావనుకోలేదురా కొడకా!" అంటూ ఆమె రోదిస్తోంటే రాజ్యం గుండెలు తరుక్కు పోతున్నాయి.

రాజ్యం ఏడ్చి ఏడ్చి అలసిపోయింది. కళ్ళల్లో నీళ్ళింక మిగల్లేదేమో అనుకుంది. కాని తల్లికి దాపురించిన దుస్థితి తలచుకుంటే కన్నీళ్ళు వరదై పారుతున్నాయి!

రాజ్యం తల్లి కాంతమ్మని పెద్దకర్మరోజు ఉదయం చీకటితోనే డోలీలో ఎక్కించారు. ఆమె హృదయవిదారకంగా విలపిస్తోంటే ఊరిచివరి మడుగు దగ్గరకి తీసుకెళ్ళారు. ఆమె వెంట కొందరు వింతంతవులెళ్ళారు. ఆమెని ముత్తైదువుగా అలంకరించి ఆ వెంటనే పూలు, బొట్టూ, గాజులూ

అన్నీ తీసి పారేశారు. పుస్తెలతాడు తెంపేశారు. తెల్లగుడ్డ ముసుగేసి తీసుకొచ్చారు.

బ్రాహ్మలకి పాత్తర్లు ఇచ్చేక, అంతా నోట్లో ఇంత జీలకర్ర వుంచుకుని గదిలో తెల్లచీర కట్టుకున్న కాంతమ్మని చూసి బయటికొచ్చి "ధూ" అని వూసేరు. "ఛీ విధవా" అన్నట్టుగా ఛీత్కరించారు!

ఈ దుస్థితికన్న చావు మేలు అన్పించేలా ప్రవర్తించారు. అది భరించలేక కుళ్ళి కుళ్ళి ఏడ్చిందావిడ.

ఆ తతంగం చూసి రాజ్యం భరించలేకపోయింది. "మా అమ్మనేం చెయ్యొద్దు" అని ఏడ్చింది.

"సాంప్రదాయం అనుసరించక తప్పదు. లేకపోతే మీ నాన్న ఆత్మకి శాంతి వుండదు" అంటూ ఆమె నోరు మూసేశారు.

పట్టు బట్టల్లో లక్ష్మీదేవిలా నట్టింట తిరిగిన తల్లి ఇప్పుడు తెల్ల దుస్తుల్లో ఏవరికీ మొఖం చూపించలేక గదిలోనే మగ్గుతోంటే చూసి విలవిల్లాడింది. "అయ్యో! ఎంత ఘోరం! ఆడదై పుట్టినందుకేనా ఇంతటి దౌర్భాగ్యం దాపురించింది" అంటూ ఆక్రోశించింది.

బ్రాహ్మణుల ఇళ్ళల్లో వింతంతవులకి గుండు గీయడం గుర్తొచ్చి గుడ్డిలో మెల్ల అనుకుంది..

నవ్వూ పువ్వూ అయిదోతనం అన్నీ కోల్పోయినా అవమానాగ్నిలో నిలువునా దహించుకుపోతున్నా కూతురి కోసం ఆ తల్లి ఆరాటం తగ్గలేదు. "నా రాతకి నువ్వేం చేస్తావు గాని నీ ఆరోగ్యం జాగ్రత్త తల్లీ. వట్టి మనిషివి కాదు. నువ్వు బాగుంటే నీ బిడ్డా బాగుంటాడు" అంటూ ఓదారుస్తోంది!

ఒక నెల గడిచింది.

కాంతమ్మ అత్తగార్తో మాట్లాడేక రాజ్యంతో అంది: "అత్త వారింటికి పంపిస్తానమ్మా! ఆరోనెల రాగానే తీసుకొస్తాం. నీకు సీమంతం చెయ్యాలని మీ నాన్నెంతో వువ్విళ్ళూరారు. ఆ వేడుక చూడకుండానే దేవుడు ఆయన్ని తీసుకుపోయాడు."

ఆమె కంఠం దుఃఖంతో పూడుకుపోయింది.

"మిమ్మల్ని వదిలేసి ఎలా వెళ్ళనమ్మా?........"

"పెళ్లయ్యాక ఆడపిల్ల ఆడపిల్లే గాని ఈడపిల్లకాదు కదమ్మా! పోయిన వాళ్ళతో మనమూ పోలేం కదా? గుండె దిటవు చేసుకుని ముందుకి

సాగిపోవాలి. అవాళేదో అనుకోకుండా పరిగెత్తు కొచ్చావు. అంచేత కడచూపు దక్కిందనుకో. అయినా మీ అత్తవారికి చెప్పి, పురుడుకి తీసుకురావటం రివాజు. లేకపోతే నలుగురూ తప్పుపడతారు తల్లీ!"

తల్లి వంక అమితాశ్చర్యంగా చూసింది రాజ్యం.

తండ్రి బతికుండగా ఎన్నడూ నాలుగు మాటలు మాట్లాడి ఎరుగని ఆమె, ఇప్పుడు ఎంత చక్కగా చెబుతోంది! మెల్లగ తండ్రి బాధ్యతలు స్వీకరిస్తోంది! పరిణామక్రమం అంటే ఇదే కాబోలు!

ఇందుకే కాబోలు త్యాగం, నమ్రత, శ్రద్ధ, వివేకం, స్వేచ్ఛాపూర్వకమగు కష్టసహనం స్త్రీలో మూర్తీభవించి వున్నాయన్నారు బాపూజీ.

చిన్నగా నిట్టూరుస్తూ అంది: "మీ రిద్దరూ ఇక్కడెలా వుంటారమ్మా! పోనీ మీరు కూడా నాతో వచ్చెయ్యండి."

పేలవంగా నవ్విందామె.

"నీకు మా మీద ప్రేముంటుంది గాని మీ వాళ్ళు కెందు కుంటుందమ్మా? ఎంతా, ఒకటి రెండు నెలల్లో నిన్ను పురుడికి తీసుకొచ్చేస్తాం కదా! ఈ లోగా నన్ను పుట్టింటికి తీసుకెళ్ళి పంపిస్తామంటున్నారు....."

"నానమ్మ?......."

"రామనాథం ఇంట్లో వుంటుంది. మొగుడూ పెళ్లా లిద్దరూ వచ్చి బతిమాలి వెళ్ళారు. వాళ్ళు అండగా వుంటార్లే స్వరాజ్యం! వాళ్ళ పెళ్లికి పొలం రాశారని, ఇల్లు కట్టిచ్చారనీ, అనవసర దానమంటూ ఎన్నో అన్నాం. ఇలా జరుగుద్దని ముందే తెలుసో ఏమో మీ నాన్నకలాంటి బుద్ధిపుట్టి వాళ్ళని చేరదీశారు. అందుకే కాబోలు మన మంచీ, మన పుణ్యం మనల్నే కాపాడతాయంటారు......"

మరి మాట్లాడలేకపోయింది రాజ్యం.

రామనాథం తోడబుట్టిన వాళ్ళానే వుంటున్నాడు. రోజూ వచ్చి మంచీ చెడ్డా కనుక్కుంటున్నాడు. బజార్నుంచి కావల్సినవి కొని తెచ్చిస్తున్నాడు.

అమ్మా నానమ్మల బాగోగులు చూస్తూండమని అతడికీ, లలితకీ చెప్పి అత్తవారింటి కెళ్ళి రావడమే మంచిదనుకుంది. కాని నానమ్మ పరిస్థితి ముందరి కాళ్ళకి బంధం వేస్తోంది!

ఆవిడ ఇదివరకెన్నడూ ఖాళీగా కూర్చు నెరుగదు. ఎప్పుడూ ఏదో పని చేస్తూనే వుండేది. పొలం విషయాలు కనుక్కునేది. పశువులకి గడ్డీ నీళ్ళూ చూసేది. అంట్లు తోమేది. కాయగూరలు కోసేది. ఇల్లూ వాకిలీ

వూడ్చేది. నాన్న స్వాతంత్ర్యోద్యమంలో తిరుగుతూ నెలల తరబడ ఇంటికి రాకపోయినా వున్నంతలో అన్నీ చక్కబెట్టేది.

అంతేకాదు, ఇరుగుపొరుగుకి మంచీ చెడ్డా చెప్పేది. పాతిక మందికి భోజనాలు పెట్టాలంటే ఎన్ని బియ్యం వార్చాలి, ఎంత పప్పు నాన బెట్టాలి వగైరాలనామె నడిగి సలహా తీసుకునేవారంతా. ఆ చుట్టుపక్కల ఆవకాయ పచ్చడి పెట్టడానికి ఆవిడ్ని తప్పక తీసుకెళ్ళేవారు. ఆవిడ పెడితే పచ్చడి రుచిగా వుండటమే కాదు, బూజు పట్టదని లోకుల నమ్మకం. ఇంట్లోవాళ్ళతోనో పాలేరుతోనో, పనివాళ్లతోనో ఎప్పుడూ ఏదోటి వాగుతూనే వుండే దావిడ.

అలాటి ఆవిడిప్పుడు మంచం దిగటం లేదు. ఎక్కువగా ముడుచుకు పడుకుంటోంది. తనలో తను ఏదేదో గొణుక్కొంటోంది.

చిన్న వయస్సులో భర్త పోయినా కొడుకుని చూసుకుని బతికింది ఇన్నాళ్ళూ. ఇప్పుడా కొడుకు కూడా దూరమయ్యాడు మరి!

పండుటాకులా వణకుతోన్న నానమ్మ పక్కన కూర్చుని "నేను అత్తవారింటి కెళ్ళొస్తాను నానమ్మా! నీ ఆరోగ్యం జాగ్రత్త. నా బిడ్డలకి నువ్వే నీళ్ళు పోయాలి......." అంటూ ఏడ్చేసింది రాజ్యం.

"పిచ్చిపిల్లా. ఏడుస్తావేందుకే? నా కొడుకు మళ్ళీ నీ కడుపున పుట్టబోతున్నాడే. వాడికి నీళ్ళు పోస్తాను. లాలిస్తాను. వుగ్గు పడతాను......... ఆపైన చెప్పలేక ఏడ్చేసింది.

రాజ్యమూ ఏడ్పు ఆపుకోలేకపోయింది.

## 16

రెండు నెలల తర్వాత అత్తవారింటి కెళ్ళిన రాజ్యం కొత్త చోట అడుగు పెట్టినట్టుగా అనుభూతి చెందింది.

ఇల్లూ వాతావరణం అన్నీ మారిపోయాయి. ఇదివరకట్లా అతిథులు రావట్లేదు. మావగారు పొరుగూళ్ళకి పెద్దమనిషిగా వెళ్ళట్లేదు. ఆరోగ్యం బావోటం లేదన్చెప్పి ఎక్కువగా ఇంట్లోనే వుంటున్నారు.

ఇంటిఖర్చు బాగా తగ్గించేశారు. డబ్బుకి కట కటగా వున్న సంగతి ప్రతి దాన్లోనూ ప్రస్ఫుటమవుతోంది!

ఒక్క మాటలో చెప్పాలంటే, ఇంటిల్లిపాదికీ వూపిరందటం లేనట
వుంది.

"ఏవిటక్కయ్యా, ఏవిటిలా అయిపోయిందాక్కసారే?" తోడికో
దగ్గర తన ఆ వేదనని వెలిబుచ్చింది రాజ్యం.

"ఇంటికి ఎవరి దిష్టో తగిలింది!" అంది సావిత్రి. ఆ వెం
మళ్ళీ తనే అంది: "ముందరి చావిడి పడగొట్టకుండా వుండాల్సి
సిద్ధాంతి మాట విని తొందరపడి కూలగొట్టారు. అప్పట్నుంచి ఇం
శని పట్టుకున్నట్టుగా వుంది."

ఆవిడ కళ్ళొత్తుకొంటోంటే దమయంతి అందుకుంది: "ఆ మ
మావగార్తో రాజ్యం అన్నది నిజమే. మంచం వున్నంత వరకే కా
చాపుకోవాలి. లేకపోతే ఇలాగే అవుతుంది. మింగ మెతుకు లే
మీసాలకి సంపెంగ నూనె అన్నట్టు, వున్నది. తక్కువైనా జమీంద
గిరీ వెలగబెట్టాలని చూస్తే ఇలాగాక ఇంకెలా అవ్వుద్ది? తిని కూర
ఊరి పెత్తనాలెందుకూ?"

"అవేం మాటలు దమయంతీ?" కసురుకుంది సావిత్రి.

"ఉన్నమాటంటే వులుకెందుకూ? ఆయన పరిస్థితి వక్రించిం
కదా, ఎవరూ తీర్పు లివ్వడానికి పెద్దమనిషిగా పిలవట్లేదు. ఒక
పిలిచినా తీర్పు నిజాయితీగా ఇవ్వట్లేదంటున్నారు......"

"లోకులు పలుగాకులు............."

"వ్యవసాయం పెట్టుబళ్ళకి సర్దుబాటు గాకే కదా కొంత కా
పొలం వదులుకున్నారు. ముందు ముందు ఇంకెలాంటి రోజులొస్తాయె
ఆయనకేం ఆయన తనువు ఎలావోలా గడిచిపొద్ది. మన గతేవిటి? పి
సంగతేవిటి?"

"మగాళ్ళేదో దారి చూస్తార్లే......."

"మీ ఆయనా మా ఆయనా కూలీ నాలీ చేసైనా సంసారా
పోషించగలరు. పాణికి బొమ్మలెయ్యడంతప్ప ఏమీ చేతకాదాయె. పెళ్లాన్ని
పోషిస్తాడు? చిన్న మరిది అందరికన్న అదృష్టవంతుడు. కావల్సింది తింట
పట్నంలో చదువుకున్నాడు. ఇంచక్కటి వుద్యోగం సంపాదించుకున్నాడ

"అతగాడి చదువుకి బోల్డు ఖర్చు పెట్టేరు మావగారు. తాశిల్దా
గిరీ ఇప్పిద్దామని చాలా ప్రయత్నించారంటగాని కుదర్లేదంట. క
రెవెన్యూ ఇన్స్పెక్టరీ వేయించారు. కొన్నాళ్ళకి తాశిల్దారై పోతాడంట
గొప్పగా చెప్పింది సావిత్రి.

"అయితే మాత్రం మనకేం ఒరుగుద్దీ? రేపో మాపో పెళ్లి చేస్తారు. వెళ్లాన్ని తీసుకుని టింగురంగా అని ఎగిరెళ్ళిపోతాడు. మనకి పేడ పిసుక్కునే బతుకే మిగుల్తుంది." వుక్రోషంగా అంది దమయంతి..

ఆమె మాటల్లో ఎంతో నిజముందన్పించింది రాజ్యానికి.

ఆస్తులు కరిగిపోతున్నాయి. ఉమ్మడి కుటుంబాలు వేరడిపోతున్నాయి.. ఎవరికి వారే అయిపోతున్నారు. పూలమ్మిన చోటనే కట్టెలమ్మలేక పొట్ట చేతబట్టుకుని పల్లెల్నుంచి పట్నాలకి వలస పోతున్నారు

రేపు తమింట్లోనూ జరగబోయేదదే. అప్పుడు తమ పరిస్థితేమిటి?

ఆమెకి గాఢాంధకారం తప్ప మరేమీ కన్పించలేదు.

ఎవ్వరికీ చెప్పా చెయ్యకుండానే చిన్న కొడుకు పెళ్ళి ఖాయం చేసి ముహూర్తం పెట్టించేశారు కాకుళస్వామి. ఊళ్ళో ఎవ్వర్నీ పిలవకుండా కేవలం ఇంట్లోవాళ్ళుమాత్రం వెళ్ళి పెళ్ళి జరిపించి వచ్చారు.

ఇంత వేగంగా ఇంత నిరాడంబరంగా ఆ ఇంట్లో ఇంతవరకూ ఏ వేడుకా జరగలేదు.

"కాకుళస్వామిగారి పని అయిపోయింది" అని ఇరుగమ్మా, పొరుగమ్మా అనుకోవడం విని తల్లడిల్లిపోయింది రాజ్యం.

భర్త ఏమనుకున్నాసరే అంతా వివరించి చెప్పాలని నిర్ణయించుకుంది.

పాణి నిరాశగా శూన్యంలోకి చూస్తూ కూర్చున్నాడు. అతడంతగా దిగాలు పడివుండటం ఆమె ఎన్నడూ చూళ్ళేదు. గుండెలు కలుక్కుమనగా "అలా వున్నారేమండీ?" అనడిగింది అదుర్దాగా.

బదులివ్వలేదు.

"ఏవయ్యిందో చెప్పరూ? ఈ మధ్య చిత్రాలూ గీయటం లేదు..........."

అతడి కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

"ఏవయ్యిందండీ?..........."

"నాన్నగారు రంగులకీ వాటికీ డబ్బు అడగొద్దన్నారు. తమ్ముళ్ళా నేను ఉద్యోగం చూసుకోవాల్సిందని విసుక్కుంటున్నారు. ఇదివరకేమో బాగా వేస్తున్నావు, ఇంకా వెయ్యి. పెద్దవాళ్ళతో పరిచయాలు పెరుగుతాయి, కీర్తిప్రతిష్ఠ లొస్తాయని ప్రోత్సహించారు. ఇప్పుడేమో........నాకేం చెయ్యాలో తోచడంలేదు రాజ్యం!...."

ఆమె ఒడిలో తల పెట్టుకుని చిన్నపిల్లాడిలా ఏడ్చేశాడు పాణి.

తల్లిలా తల నిమిరింది.

"ఇప్పుడైనా మించి పోయింది లేదండీ! యస్సెస్సెల్సీ పాసయ్యారు. రైల్వేలో బోల్డు మందికి ఉద్యోగాలిస్తున్నారంట. ఏదోటి చూసుకోవచ్చుగాని ధైర్యాన్ని మాత్రం కోల్పోవద్దు. ధైర్యంపోతే సర్వం పోయినట్టే!"

"నాకేం చేతకాదు. నేనెవ్వరితోనూ కలవలేను."

"అన్నీ ఎప్పుడో అప్పుడు కొత్తవే కాదా? తర్వాతవే అనుభవాలుగా మారుతాయి. అన్నీ చేతనవుతాయి. తొలిసారిగా నేను బిడ్డకి జన్మనివ్వ బోవటం లేదూ?"

"మనం సుఖంగా బతగ్గలమని నీకు నమ్మకంగా వుందా?"

"మనస్ఫూర్తిగా వుంది."

అతడి మోములో ఎంతో రిలీఫ్ కన్పించింది. "నిన్నర్థం చేసుకోలేక పోయానుగాని నువ్వు చాలా తెలివైందానివి."

ఆ మరుసటి రోజునే రాజ్యాన్ని తీసుకెళ్ళి, పురుడు పోసి పంపిస్తామంటూ వచ్చాడు రామనాథం.

"నన్నొంటిగా వదిలేసి నువ్వెళ్ళి పోతావా?" బేలగా అన్నాడు పాణి.

"మళ్ళీ మన బిడ్డతో వస్తానుగా. మీరుకూడా రాకూడదూ? ఆ ఇంటికి అల్లుడైనా కొడుకైనా మీరేకదా!"

"ఇప్పుడొస్తే బాగుండదులే. వారం పదిరోజులు పోయాక నాన్నగార్తో చెప్పి వస్తాను."

"ఒంటరిగా వుంటే పిచ్చి పిచ్చి ఆలోచన లొస్తాయి. ఏదైన వ్యాపకం పెట్టుకోండి. ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యండి. లేదా అక్కడి కొచ్చెయ్యండి. ఎప్పుడనుకుంటే అప్పుడొచ్చేయండి. వస్తారు కదూ?"

తలూపాడు.

మొదటిసారిగా ఎడబాటు ఫీలయ్యారిద్దరూ.

రామనాథం కాకుళ స్వామిగార్తో మాట్లాడాడు.

రాజ్యం, తోడికోడళ్ళకీ బావగార్లకీ మావగారికీ నమస్కరించి, వారి ఆశీస్సులందుకుంది. పిల్లల్తో ఇరుగు పొరుగుతో వెళ్ళొస్తాని చెప్పి, వెళ్ళి రెండెడ్ల బండెక్కింది.

"రోడ్డు బాగోలేదు. బండి నెమ్మదిగా పోనియ్యి." బండివాడితో చెప్పేరు పెద్దబావగారు.

పిల్లలు ఎక్కడ్నుంచో ఇన్ని కనకాంబరాలు కోసి తెచ్చి ఆమె చేతిలో పోశారు. తడి కళ్ళతో చూసిందందర్నీ.

బండి కదిలింది.

వెనకే నడవసాగాడు రామనాధం.

ఊరి పొలిమేర దాటారు.

"అదోలా వున్నావేం, మావగారేమైన అన్నారా?" కళాహీనంగా వున్న అతడి మొఖం వంక చూస్తూ అడిగింది రాజ్యం.

మరోసారి రెట్టించగా మెల్లగా అన్నాడు: "మీ పరిస్థితి గురించే మాట్లాడారు. మీకు చాలా ఆస్తి వుందని ఆశ పడ్డార్ట. ఆ ఆశ అడియాశ అయ్యిందన్నారు. మీ నాన్నగారి పేరు పలుకుబడీ ఉపయోగించుకుని రాజకీయంగా ఎదగాలనుకున్నారంట. ఆ అవకాశమూ పోయిందని బాధ పడ్డారు. మన సంబంధం చేసుకుని అన్ని విధాలా భ్రష్టు పట్టిపోయామని అదోలా మాట్లాడారు. అయన్తో నేనిదే ముఖాముఖీ మాట్లాట్టం. ఆయన పైకి కన్పిస్తున్నంత సూటిమనిషి కాదన్పిస్తోంది............"

కాస్సేపు మౌనం వహించేక అంది: "అంతేనా, ఇంకేమైనా చెప్పేరా?"

ఆమె మోములోకోసారి చూసి తలదించుకున్నాడు: "మీ స్థితిగతులు బాగుండనందున మీ నాన్నగారు నా కిచ్చిన రెండెకరాల భూమిని తిరిగి మీకిచ్చేస్తే న్యాయంగా వుంటుందన్నారు........"

అదిరిపడి చూసింది. అపనమ్మకంగా చూసింది.

"ఆలోచిస్తే అయన చెప్పిందీ సబబుగానే వుందన్పిస్తోంది. మీ నాన్నగారు నాకు హిందీ నేర్పించారు. తర్వాత హిందీ శిక్షకుడిగా పనిచ్చారు. పెళ్లి చేశారు. ఇల్లు కట్టిచ్చారు. ఆయన ఆశీర్వాదం వల్ల మంచి ఉద్యోగం వచ్చింది. మేం సుఖంగా వున్నాం. అంచేత ఆ భూమిని........."

"అన్నయ్యా!"

అటు బండివాడు ఇటు రామనాధమూ ఒక్కసారే వులిక్కిపడి ఆమెవంక విడ్డూరంగా చూశారు.

"తోడ బుట్టకపోయినా నువ్వు నా అన్నయ్యవే. ఇన్నాళ్ళూ అలా పిలవలేకపోయినందుకు సిగ్గుపడుతున్నాను. మా నాన్న రక్తమే నాలోను ప్రవహిస్తోంది. నాన్న మాటకీ చేతకీ తిరుగులేదు. అందుకు భిన్నంగా ఎవరు వ్యవహరించినా నాన్న ఆత్మ క్షోభిస్తుంది. ఇంకెప్పుడూ అలా మాట్లాడొద్దు. ఇంకో సంగతి. మావగారు అదో తరహా మనిషి. ఆయన

మాటల్ని ఇప్పుడే ఈ క్షణమే మర్చిపో. పొరబాటునకూడా అమ్మకీ నాన్నమ్మకీ తెలీకూడదు." దృఢస్వరంతో అంది రాజ్యం.

"అలాగే చెల్లాయ్!......"

## 17

హఠాత్తుగా రాజ్యానికి పురిటి నొప్పులు మొదలయ్యాయి.

"అమ్మా!" అంటూ అరుస్తూ నిద్రలోంచి లేచి కూర్చుంది.

ఆమె తల్లీ నాన్నమ్మా కళవళపడ్డారు. పక్కింటి వారెళ్ళి మంత్రసానిని పిలుచుకొచ్చారు. రాజ్యం పరిస్థితి చూసి మంత్రసాని గాభరా పడింది. ఆసుపత్రికి తీసుకెళ్ళమంటూ కంగారుపెట్టింది.

ఆ రాత్రికి రాత్రి బండి కట్టించి నర్సాపురం తీసుకెళ్దామనుకున్నారు. కాని అంత కంతకీ బాధ తట్టుకోలేక మెలికలు తిరిగిపోసాగింది రాజ్యం. బండి మీద చుట్టూతా తిరిగెళ్ళేకన్నా మంచం సవారీ కట్టించి అడ్డరోడ్డుపడితే గంటలో ఆసుపత్రికి తీసుకుపోవచ్చంది మంత్రసాని.

అప్పటి కప్పుడు మాలపల్లెకి కబురంపారు. ఓ ముగ్గుర్ని వెంటేసు కొచ్చాడు పాలేరు రావుడు. వాళ్ళని అంటరానివాళ్ళని దూరంగా వుంచిన సంగతి గుర్తు రాలేదు నానమ్మకి. త్వరగా తీసుకెళ్ళమంటూ తొందరపెట్టింది. కడుపులోని బిడ్డ అడ్డం తిరిగితే పెద్ద ప్రాణానికి ముప్పు రావచ్చని ఆమె భయం.

నులక మంచం మీద రాజ్యాన్ని పడుకోబెట్టి నలుగురూ నాలుగు వైపుల భుజాని కెత్తుకున్నారు. మంత్రాసానీ రామనాథం వెంటరాగా పెద్ద పెద్ద అడుగులేస్తూ తీసుకెళ్ళి మిస్సమ్మ ఆసుపత్రిలో చేర్చారు.

"కొంచెం ఆలస్యం చేసుంటే చాలా ప్రమాదమయ్యేది" అంది డాక్టరమ్మ. "పైలోకంనుండి మా నాన్న చల్లగా కాపాడాడు" అనుకుంది రాజ్యం.

పెద్ద ఆపరేషన్ చేశారు. కవలలకి జన్మ నిచ్చింది రాజ్యం. ఇద్దరూ మగపిల్లలే. ఇద్దరూ కూడా ఆరోగ్యంగా వున్నారు. వాళ్ళని చూసి ఎంతగానో పొంగిపోయింది. ఏదో సాధించినట్టు గర్వంగా అన్పించింది. మురిపెంగా చూసింది. పిల్లల నోటికి స్తన్యమిచ్చి అపూర్వానుభూతికి లోనైంది.

కబురందగానే సావిత్రీ పాణీ వచ్చారు.

పిల్లల్ని ఒడిలోకి తీసుకున్నాడు పాణి. ఆనందోద్వేగంతో వూగిపోయాడు. వారి పిడికిళ్ళు పట్టుకుని వూపాడు. బుగ్గలు నిమురుతూ సంబర పడిపోయాడు.

కాని అతడ్ని చూసి రాజ్యం తన కళ్ళని విశ్వసించలేనంతగా విస్తుబోయింది. నలిగిన దుస్తులు ధరించి వున్నాడతడు. గెడ్డం మాసి వుంది. అలాటి స్థితిలో అతడ్ని చూడటం ఇదే ప్రథమం!

"అలా వున్నారేవిటి, ఒంట్లో నలతగా వుందా?" అని తరచి తరచి అడిగిందిగాని అతడు సూటిగా జవాబివ్వలేదు.

"నాన్నగారప్పుడే వీళ్ళ జాతక చక్రాలు వేయించేశారు రాజ్యం! వీళ్ళిద్దరూ కూడా ఎంతో గొప్పవాళ్ళవుతారట. మనకీ మన వంశానికీ ఎంతో కీర్తి ప్రతిష్ఠల్ని తీసుకొస్తారట!"

మగబిడ్డ పుడితే బాపూజీ పేరు పెట్టమన్న తండ్రి కోరికని గుర్తు చేసుకుంటూ అంది "ఒకరికి బాపూజీ పేరు పెడదామండీ! అది మానాన్న కోరిక."

"చిన్నవాడికి నీ ఇష్టం. పెద్దవాడికి మాత్రం మా నాన్నగారి పేరే పెట్టాలి. ఆయన పేరు కలిసొచ్చేలానూ అధునికంగా కొత్తగా వుండేలానూ చక్కని పేరు ఆలోచించాను. శ్రీకాంత్. ఎలావుంది?"

"బావుందీ. వాడు శ్రీకాంత్. వీడు గాంధీ."

"నోరు తీపి చేయకుండా నామకరణం చేసేస్తే ఎలా పాణీ?" సావిత్రి మాటలకంతా నవ్వేశారు.

పిల్లల్కి మూడోనెల వచ్చింది.

కాంతమ్మ నానమ్మ చెరో బిడ్డనీ కంటికి రెప్పలా చూస్తున్నారు. వారి ఆలనా పాలనా చూస్తూ మురిసిపోతున్నారు.

పాణి వచ్చాడు. తన ఉద్యోగ ప్రయత్నాల గురించి చెప్పాడు.

"తమ్ముడి ఉద్యోగం కోసం నాన్న గారెంతో ప్రయత్నించారు. ఎందర్నో ఆశ్రయించారు. మొత్తానికెలా అయితేనే మంచి ఉద్యోగం వేయించారు. ఎంచేతో నా విషయంలో కల్పించుకోవడంలేదు. అసలు గుమ్మం దాటి బయటకెళ్ళడం లేదు" అని మధన పడ్డాడు.

"ఇప్పుడున్నది మన ప్రభుత్వం. మన రాజ్యం. ఎన్నో ప్రాజెక్టులు ప్రారంభిస్తున్నారు. ఎన్నో స్కూళ్ళు ఆసుపత్రులూ నెలకొల్పుతున్నారు.

మీలాంటి చదువుకున్నవారికి తప్పకుండా మంచి వుద్యోగం వస్తుంది చూడండి. బ్రిటీషువారి తొత్తుల్లాగాక మనవారికోసం మనదేశంకోసం పాటుపడే చక్కని ఉద్యోగం వస్తుంది" అని ధైర్యం చెప్పిందామె.

ఆరాత్రి ఎంచేతో పిల్లలు త్వరగా నిద్రపోలేదు. ఒకరి తర్వాత ఒకరు విడవకుండా ఏడుస్తోంటే కాంతమ్మ ఇన్ని మిరపకాయలూ ఉప్పూ దిష్టి తీసి పొయ్యిలో వేసింది. అవి చిట పటమని మండాయి.

"నా బంగారు తండ్రులకి దిష్టి తగిలింది. ఇంక నిద్రపోతార్లే" అని జో కొట్టింది. అయినా ఒకరు ఏడుపు మానలేదు.

ఇంతలో బయట్నుంచెవరో పిలిచారు.

తలుపు తీసి చూడగా కాకుళస్వామిగారి చిన్న పాలేరు.

"ఇలా వచ్చావేంరా"

"పెద్దయ్యగోరి పేణం బాగోలేదండి. తవర్ని వున్నపళాన రమ్మన్నారు."

"ఆయన కెలా వుందిరా?"

"తెల్దండి. తవరి అక్కగారి వూరెళ్ళి కబురు సెప్పాలండి. తవరెల్లి పోండి" అని వాడెళ్ళిపోయాడు.

వెంటనే వెళ్ళడానికి సిద్ధమయ్యాడు పాణి. కాని అంత రాత్రివేళ ఒక్కడ్నీ పంపడానికి మనస్కరించలేదు.

రామనాధానికి కబురంపగా అతడు తోడుగా వెళ్తానన్నాడు.

"దారి మంచిది కాదు. పురుగూ పుట్రా వుంటాయి. చూసుకు వెళ్ళండయ్యా!" అంది రాజ్యంతల్లి కాంతమ్మ.

చేతికర్ర తీసుకుని ఇద్దరూ సైకిలుమీద చీకట్లోకి దూసుకు పోయారు.

తెల్లవారింది.

రామనాధం రాలేదు. ఎండెక్కింది. అతడు రాలేదు. ఎలాంటి కబురుకూడా రాలేదు.

ఇంట్లోంచి వీధిలోకీ వీధిలోంచి ఇంట్లోకీ కాలు కాలిన పిల్లిలా తిరగ సాగింది రాజ్యం.

మధ్యాహ్నమయ్యింది. ఎలాంటి వార్త తెలీదు. అంతవరకూ అభోజనంగానే వుందామె.

"ఆయనకేం కాదులే. ఏ ఆసుపత్రిలోనే చేర్చివుంటారు. నువ్వు కాస్త ఎంగిలిపడమ్మా!" అంది తల్లి.

"ఆకలిగా లేదమ్మా! ఈపాటికి రామనాధమైనా తిరిగి రావాల్సిం దేనే......"

"ఎన్ననుకుంటే ఏమిటిగాని భూమ్మీద నూకలున్నంతకాలం ఏమీ కాదు. నూకలునిండేక క్షణంకూడా వుండలేరు" అంది నానమ్మ.

చీకటి పడుతూండగా రామనాథం వచ్చాడు. అతడి నల్లబడ్డ మొఖం చూడగానే సగం అర్థమైంది.

"ఆయనకెలా వుందన్నయ్యా?"

"అంతా అయిపోయింది........"

"అంటే........."

"రాత్రే ప్రాణం పోయిందిట......."

నానమ్మ డీలా పడింది. "ఇక్కడి ఈ దిక్కే కూలిపోయిందను కుంటే అక్కడి ఆ దిక్కూ లేకుండాపోయిందన్నమాట! బొడ్డూడని పసిగుడ్డని పెట్టుకుని సంసార సాగరం ఎలా ఈదుకొస్తావే నా తల్లీ?"అంది రాజ్యాన్నుద్దేశించి.

ఆ పిమ్మట ఏదో గొణుక్కుంటూ లోపలికెళ్ళిపోయింది.

"ఏవిటో కష్టాలన్నీ కట్టగట్టుకొస్తున్నాయి. ఏ జన్మలో ఏం పాపం చేశామో!" అనుకుంటూ పెరట్లోకెళ్ళింది తల్లి.

గాఢంగా నిట్టూర్చి అంది రాజ్యం: "మరి నా గురించి కబురంప లేదేం?"

"ఏమో మరి, బాలింతరాలివని వూరుకున్నారేమో! అయినా అంతా హడావిడిగా కానిచ్చేశారు. కొడుకులూ కూతుళ్ళూ రాగానే పాడె లేపేశారు."

ఓ క్షణానంతరం అంది: "పిడుగులా వుండేవారు ఇలా ఎలా జరిగిందిట?"

"నిన్న రాత్రి భోంచేయలేదుట. ఆకలిగా లేదన్చెప్పి పెద్ద గ్లాసుడు పాలుమాత్రం తాగారట. పడుకునేముందు చుట్ట కాల్చే అలవాటుందిట కదా? నిప్పు కావాలేమోనని పెద్ద కోడలు వెళ్ళి అడిగిందట. ఉలుకూ పలూకూ లేకుండా పడక్కుర్చీలో కూర్చునున్నారట. దగ్గరికెళ్ళి చూసేసరికి ఒళ్ళు చల్లబడివుందిట."

"అదృష్టవంతులు, ఎవర్తోనూ సేవలు చేయించుకోకుండా మంచాన పడకుండా సునాయాసంగా పోయారు......"

"పాపం పుణ్యం భగవంతుడికే తెలియాలి కాని పాలల్లో ఏదో కలుపుకుని ఆత్మహత్య చేసుకున్నారని వూళ్ళో వాళ్ళనుకుంటున్నారు మరి......."

ఆమె కళ్ళల్లోకి వరదలా పొంగి వచ్చాయి నీళ్ళు. అపనమ్మకంగా చూసింది.

"అమ్మవారి నగలూ సొమ్మూ అంతా ఆయన దగ్గరేవుందిట కదా? అన్నీ వెదికారట. ఎక్కడా ఏమీ కన్పించలేదుట. జేబులో మాత్రం దహనఖర్చుకి సరిపడా డబ్బుందిట.........."

నిలబడే శక్తి లేక నిస్త్రాణగా నేలమీద చతికిలబడిపోయింది.

"శవయాత్రకి కూడా జనం ఎక్కువగా రాలేదు. ఇంటిపేరు వాళ్ళే వచ్చారు. అంతా ఆయన గురించి తలో రకంగా వ్యాఖ్యానిస్తున్నారు మరి........"

"చచ్చినవాడి కళ్ళు చారడేసి అంటారు. చనిపోయినవారు ఎలాటి వారైనా వారిలోని చిటికెడు మంచినే పెద్దది చేసి చెప్పుకుంటారు. అలాటిది మరోలా చెప్పుకుంటున్నారంటే నిజమే అయ్యుంటుంది. మనిషి బతికున్నప్పుడు కాదు – చనిపోయాక చెప్పుకునేవే అసలైన మాటలు. ఎందరికో న్యాయం చెప్పి ఎంతో పెద్దమనిషిగా గౌరవింపబడి ఆఖరికి. బతికి ఏం బావుకున్నారు? పోతూ ఏం పట్టుకెళ్ళారు?!"

వైరాగ్యభావన తొణికిసలాడింది రాజ్యం గొంతులో.

☆ ☆ ☆

మంచం కుర్చీలు పెయింటింగులూ స్టాండూ వగైరాలు బండి మీద వేసుకునొచ్చాడు పాణి.

కాళ్ళు కడుక్కోడానికి నీళ్ళచెంబు అందిస్తూ "ఏవిటండీ, ఏవిటిదంతా? మన సామానంతా వేసుకొచ్చేశారేవిటి? ఏవయ్యిందసలు?" అనడిగింది రాజ్యం ఆదుర్దాగా.

"మన వాటాకి వచ్చిందివే!"

"వీటిలో మా నాన్న పెట్టినవే వున్నాయి కదా?"

"అవును. అంతకంటే ఏమీ రాలేదు పంచుకుంటే."

సామాన్లు దింపించి ఇంట్లో సర్దించారు. భోజనాదులయ్యాక "వాటాలు పంచేశారా?" అనడిగింది.

"మనకి తెలియదుగాని చాలా అప్పులున్నాయి. నాన్నగారు పోయే సరికి అప్పులవాళ్ళంతా వచ్చిపడ్డారు. ఊళ్ళోని పెద్దలు అన్నీ చూసి ఇల్లూ ఇంట్లోని సామాన్లూ మిగిల్చి, మిగతాది అప్పులవాళ్ళని పంచుకో మన్నారు. నాన్నగారి మొఖంచూసి గొడవచెయ్యకుండా వచ్చిందాంతో

తృప్తిపడమన్నారు. ఎందరికో తీర్పులు చెప్పినాయన చేసిన అప్పుల గురించి ఊరివాళ్ళు తీర్పుచెప్పి సర్దుబాటు చెయ్యాల్సివచ్చింది. ఎంత గ్రహపాటో చూడు.......!"

"ఇల్లుకూడా పంపకాలేశారా?"

"వేశారు. మనకి రెండు గదులూ కాస్తంత దొడ్డీ వచ్చాయి. అన్నయ్య లిద్దరూ కౌలు వ్యవసాయానికి ప్రయత్నిస్తున్నారు. తమ్ముడు తను ఉద్యోగం చేస్తున్న ఊరికి వెళ్ళిపోయాడు. వేరుకుండలు పెట్టేసుకో మన్నారు. అందుకని........అంచేత.........."

"పోనీలే బాబూ! మీరుతప్ప మాకుమాత్రం ఎవరున్నారు? తిన్నగా ఇక్కడికొచ్చి మంచిపని చేశారు" అంది కాంతమ్మ.

పిల్లల్ని తీసుకుని అత్త వారింటికి వెళ్ళకుండానే అది కాస్తా ముక్కచెక్కలై పోయిందే అని విచారించింది రాజ్యం.

"ఉద్యోగం దొరికేవరకూ ఇక్కడే వుండకతప్పదు" అన్నాడతడు.

"అలాగే వుందామండీ! ఇదీ మన ఇల్లే" అందామె.

మొదట్లో అతడికేమీ పని చెప్పలే దెవరూ. రేడియో వింటూ పిల్లల్ని ఆడిస్తూ కాలువ దగ్గరకి షికారుకెళ్తూ గడిపేశాడు. అతడలా ఖాళీగా వుండేకన్నా వ్యవసాయం పాలూ నీళ్ళూ చూస్తే బావుణ్ణు కదా అనుకున్నారు ఇంట్లోని ఆడవాళ్ళు. ఏమంటే అత డేమనుకుంటాడోనని వెనకాడారు. కాని ముసలావిడ వూరుకోలేదు.

"మన మనిషంటూ వెళ్ళి గట్టుమీద కూర్చోవాలి నాయనా! లేకపోతే కూలోళ్ళు నడుం ఒంగదు. మన చేతికి సరిగ్గా పంట రాదు. అందుకని ఒకడుగు పొలం వైపు వేస్తూండు నాయనా! ఇవాళ గాకపోయినా రేపైనా ఇవన్నీ చూసుకోవాల్సింది నువ్వే కాదా?" అంది.

దాంతో మెల్లిగా పొలం వెళ్ళక తప్ప లేదతడికి.

వ్యవసాయం గురించేమీ తెలీదు. తెలుసుకోవాలన్న ఆసక్తీ లేదు. అయినా ఏమీ అన్లేక మరో దారిలేక లోలోపల విసుక్కుంటూనే వెళ్తున్నాడు, వస్తున్నాడు.

రోజూలానే అవాళ పిల్లలకి నూనెరాసి నలుగుపెట్టింది నానమ్మ. తన కాళ్ళమీద బోర్లా పడుకోబెట్టుకుని వేడి నీళ్ళతో స్నానం చేయించింది. వారి ఒళ్ళు తుడిచి చెవిలో తిర్రిపెట్టి జుట్టు అరడానికి సాంబ్రాణి పొగ వేయమంటూ రాజ్యానికొకకర్నీ కాంతమ్మకొకకర్నీ అందిచ్చింది. తనూ

లేచి రెండడుగులేసిందో లేదో కాలుజారి పడి పోయింది. తుంటె దగ్గరి ఎముక విరిగింది. మంచాన పడింది.

ఒక వారం రోజులు బాధపడి కాలం చేసిందామె!

ఆమెతో ఎంతో అనుబంధం గలరాజ్యం వెక్కి వెక్కి ఏడ్చింది.

పాణి మాత్రం సంతోషించాడనే చెప్పాలి. ఇన్నాళ్ళూ ఆవిడ నోటికి భయపడి వ్యవసాయప్పనులు చూస్తున్నాడు. ఇక తనని పల్లెత్తు మాటనే వాళ్ళెవరూ ఇంట్లో లేరనుకున్నాడు.

అత్తవారింట తల దాచుకున్నాననీ అత్తవారిమీద ఆధారపడి బతుకు తున్నాననీ ఇన్నాళ్ళూ లోలోన ఫీలయ్యాడు. అదిప్పుడు సెల వేసింది. ఊళ్ళోవాళ్ళంతా తనని హీనంగా చూస్తున్నారనీ చాటుగా నవ్వుకుంటున్నారనీ అనుకోసాగాడు.

"ఎన్నాళ్ళిలా మారుమూల గ్రామంలో పడి వుంటాం చెప్పు? భీమవరం వెళ్ళిపోదాం."

"ఎందుకు?"

"ఏదో బతుకుతెరువు చూసుకుందాం. ఈ వ్యవసాయం నా వల్ల కాదు."

"అక్కడేదైనా ఉద్యోగం చూసుకోండి. తర్వాత వెళ్దాం."

"అక్కడికెళ్ళిపోతే ఎలాగైనా మారొచ్చు. ఏమైనా చేసుకోవచ్చు. మంచిరోజు చూసుకు వెళ్దాం."

"మనతో మా అమ్మ కూడా వస్తుంది."

"ఆవిడ్నికూడా పోషించడం నా తరంకాదు."

"ఆవిడ్నెవరూ పోషించక్కర్లేదు. పైపెచ్చు పంట రాబడితో మనల్నే ఆవిడ పోషించగలదు."

అది నిజమే అన్పించిందతడికి. పైగా పిల్లల్నిద్దర్నీ కనిపెట్టుకు చూడటం ఒక్కరివల్ల కాదు!

"అయితే మంచిరోజు చూసుకువెళ్దాం, మీ అమ్మగార్తో చెప్పు."

వ్యవసాయాన్ని కౌలుకిచ్చేశారు.

చరఖా కేంద్రానికెవరూ రావటం లేనందున తాళం వేసేశారు.

పల్లెనుంచి పట్నానికి ప్రస్థానం సాగించారు!

# 18

అయిదేళ్ళు గిర్రున తిరిగాయి.

శ్రీకాంత్, గాంధీ వీధిబడిలో చదువుకుంటున్నారు.

రాజ్యం మరో ఆడపిల్లకి జన్మ నిచ్చింది. పాపకి నాన్నమ్మ పేరు కలిసొచ్చేలా సుబ్బలక్ష్మి అని పేరు పెట్టింది.

రామనాథం ఆ మధ్య ఒక్క సారొచ్చినప్పుడు "నీకు హిందీ బాగా వచ్చుకదా!. దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు పరీక్షలు నిర్వహిస్తున్నారు. నువ్వుకూడా రాయకూడదూ? మున్ముందు ఎందుకైనా ఉపయోగ పడొచ్చు" అన్నాడు.

"ఈ వయసులో చదువేంటి?" అని పాణి నవ్వేడు.

"చదువుకి వయస్సేమిటి? తప్పకుండా చదువుతాను. దరఖాస్తులు తెచ్చియ్యి అన్నయ్యా!" అందామె.

అన్నట్టుగానే అదే ఉత్సాహంతో పరీక్షలు రాసింది. ప్రథమ, మధ్యమే గాక ఉత్తమ, విశారద కూడా పాసయ్యింది.

దాంతో విజ్ఞానతృష్ణ పెరిగింది. గ్రంథాలయాన్నుంచెన్నెన్నో పుస్తకాలు తెప్పించుకుని చదువుతోంది. దేశం నలుమూలల్లో వస్తోన్న మార్పుల్నీ, జరుగుతోన్న అభివృద్ధినీ, ఎదురవుతోన్న ఆటంకాలనీ తెలుసుకొంటోంది. సామాన్యుడికి కనీసావసరాలు కల్పించే దిశలో ప్రభుత్వం మరిన్ని చర్యలు తీసుకుంటే బావుండ్నని తపిస్తోంది!

రాజ్యం తల్లి కాంతమ్మ భక్తి మార్గానికి మళ్ళింది.

పల్లెలోని భూమిని హారతి కర్పూరం చేసేశాడు పాణి. అదే సమయంలో ఆమె అన్నయ్య శివయ్య నైజాంలో రజాకార్ల చేతిలో హతుడయ్యాడు. దాంతో పూజలూ పునస్కారాలూ గుళ్ళూ గోపురాలూ అంటూ భక్తి ప్రపంచంలో మునిగిపోయింది. భజన సమాజంలో చేరి రోజూ ఎవరోకరి ఇంట భజన చేస్తూ ఒంటి పూట భోజనంతో కాలక్షేపం చేస్తోంది. ఆ మార్గంలో లభిస్తోన్న శాంతికి వూరట పొందుతోంది!

ఇహ చక్రపాణి.

భీమవరం వచ్చిన కొత్తలో ఏం చెయ్యాలో తోచక చాలా ఇబ్బంది పడ్డాడు. అతడికి మొహమాటం ఎక్కువ. నలుగుర్తో కలిసే రకమూ కాదు.

చొరవ తక్కువ. అంచేత ఉద్యోగం గురించి గట్టిగా ప్రయత్నించలేదు. ఒకరిక్రింద పని చెయ్యడం ఇష్టమూ లేకపోయింది.

"ఏదైనా వ్యాపారం ప్రారంభిస్తాను. రోజురోజుకీ టౌన్ పెరుగుతోంది. వ్యాపారాల కెంతో అవకాశం వుంది" అన్నాడు.

"తెలియని రంగంకన్నా తెలిసున్న రంగం మంచిది కదండీ!" అంది రాజ్యం.

"అంటే అందరి బొమ్మలూ గీసి ఇటింటికీ తిరిగి అమ్మమంటావా?" వ్యంగ్యంగా అన్నాడు.

"అలా అని కాదు. ఇష్టపడి వేయించుకునే వాళ్ళుంటారు కదా........"

"చవగ్గా ఫోటోలు తీసేస్తోంటే ఖరీదైన పెయింటింగు లెవరిక్కావాలి!"

"మీ మనసులోని మాటేవిటో చెప్పండి." కాస్త విసుగ్గానే అంది.

"ఒకతను కలుస్తానంటున్నాడు. ఇద్దరం సెంటర్లో బట్టల షాపు పెడదామనుకుంటున్నాం."

"పెట్టుబడి చాలా కావాలి కదా?......"

"మన స్థాయికి తగ్గ షాపు పెట్టాలి కదా! పెట్టుబడి ఎక్కువే కావాలి. చరఖా కేంద్రం వున్న తోట అమ్మేద్దాం. మంచిరేటు వస్తుందంటున్నారు."

"లేదు లేదు నా కంఠంలో ప్రాణముండగా అది అమ్మడానికి వీల్లేదు. అది మా నాన్న స్మృతి చిహ్నం. ఒక స్వాతంత్ర్య సమరయోధుడి స్వప్నం. మా నాన్న ఆత్మ అక్కడే తిరుగుతూంటుంది......."

"అయితే పొలం అమ్మేద్దాం."

మరో మార్గం కన్పించ లేదామెకి. తల్లితో చెప్పింది. "మీ ఇష్టం" అందామె.

రెండెకరాలు అమ్మేశారు. షాపు ప్రారంభించారు. మొదట్లో బాగానే నడిచింది గాని తర్వాత్తర్వాత అమ్మకాలు తగ్గిపోయాయి.

"పోటీ పెరిగింది కదా! వెరైటీలు పెంచాలి. లేకపోతే నిలబళ్ళేం. అందుకని ఇంకొంచెం పెట్టుబడి పెడదాం" అన్నాడో భాగస్తుడు.

సరే అనక తప్పలేదు. రాజ్యానికి నచ్చచెప్పి మిగతా పొలం అమ్మేశాడు. సరుకు పెంచారు. షో చేశారు. అమ్మకాలు మరింత పుంజుకోడానికి పరిసర గ్రామాల్లోని రైతులకి అరువు లిచ్చారు.

భాగస్తుడు సరుకు తేవడం, షాపులో కూర్చోవడం చేస్తూ, అరువులు వసూలు బాధ్యత పాణి కప్పగించాడు. పంట చేతికందే సమయంలో

ఇళ్లిల్లూ తిరుగుతూ వసూలు చెయ్యాలి. ఆ పని పాణికి కిష్టం లేదు. అయినా తప్పకపోయేసరికి సరిగ్గా తిరిగేవాడు కాదు. వసూలు కాలేదని అబద్ధాలు చెప్పడం నేర్చాడు.

ఏతా వాతా షాపు మళ్ళీ నష్టాల్లో కూరుకుపోయింది.

కొత్త పెట్టుబడి తేవడమో నష్టాన్ని పంచుకోవడమో చేయాలన్నాడు పార్టనర్. చేతు లెత్తేసాడు పాణి. బాకీ లన్నిట్నీ భాగస్తుడే తీర్చే పద్ధతి మీద షాపుని అతగాడి కప్పగించి ఖాళీ జేబుల్తో బయటికొచ్చేశాడు పాణి.

తర్వాతతడు షాపు పేరుమార్చి బ్రహ్మాండంగా బిజినెస్ చెయ్యసాగాడు.

మోసం చేశాడంది రాజ్యం.

ఒప్పుకోడానికి పాణికి అహం అడ్డొచ్చింది!

కొన్నాళ్ళు ఖాళీగా వున్నాడు. ఇంటి ఖర్చు కెలా డబ్బు సమకూర్చాలో తెలీలేదు. ఎవరో చెప్పగా వర్తక సంఘం వారి లెక్కలు చూసే పనిలో కుదిరాడు కాని ఎక్కువ కాలం కొనసాగలేకపోయాడు.

ఆ సమయంలో పరిచమయ్యాడు ఆర్టిస్టు గోపి. అతడో కమ్మర్షియల్ ఆర్టిస్టు. కాలువ అవతల చిన్న దుకాణం పెట్టుకున్నాడు. సైను బోర్డులూ బేనర్లూ రాస్తూంటాడు. మొదట రోజూ వెళ్ళి పరిశీలనగా చూస్తూండేవాడు. అతడి ఆసక్తి గమనించి "వేస్తావా?" అనడిగాడు.

"వెయ్యాలనే వుంది. నేనూ ఆర్టిస్టునే. పోర్ట్రెయిట్స్ వేస్తాను"

"అరే అలాగా గురూ గారూ! రండి కూర్చోండి. మీరిలాటివి వెయ్యడం ఎందుకు?" అంటూ మర్యాద చేశాడు.

"ఇల్లు గడవటం కష్టంగా వుంది. అందుకని....... రోజు కింతని ఇస్తే చాలు."

"ఒకోసారి పనుంటుంది. ఒకోసారి అస్సలుండదు. రోజుల్లెక్కన కాదుగాని బోర్డుల లెక్కన ఇస్తాను. కలిసి పని చేసుకుందాం."

తలాడించి వచ్చి రాజ్యానికి జరిగిందంతా చెప్పేడు. తానెవరి దగ్గరకీ వెళ్ళక్కర్లేదనీ, ఆర్డర్ల గురించి దేబిరించక్కర్లేదనీ, ఆ పనంతా గోపీ చూసుకుంటాడనీ చెప్పేడు.

అప్పుడతడి మోములో వింత కాంతి కన్పించింది.

"ప్రవృత్తే వృత్తి అయితే పొందే ఆనందం మీ కళ్ళల్లో కన్పిస్తోంది. అలాగే కానివ్వండి. ఇవాళ్టి ఈ చిల్లర పనులే రేపు ఏ ఎత్తులకి తీసుకెళ్తాయో ఎవరు చెప్పగలరు?"

"నువ్వు చాలా మంచిదానివి రాజ్యం!" మెచ్చుకున్నాడు.

రాత్రీ పగలూ అని చూడకుండా పని చేస్తున్నాడు పాణి. బోర్డు రాసి ఓ మూలన పాణి అని సంతకం చేసి, వాటిని పదే పదే చూసుకుని మురిసిపోతున్నాడు. జనం ఆ అక్షరాలనీ రంగుల కలయికనీ మెచ్చు కొంటోంటే పెన్నిధి దొరికినట్టు పొంగిపోతున్నాడు.

ఈలోగా ఎన్నికలొచ్చాయి.

ఒక పార్టీ తరపున గోడలమీద బేనర్లుమీద రాసే ఆర్డర్ లభించింది. గోపీ, పాణీ ఆ పనిలో మునిగిపోయారు.

మెల్లగా టీ అతిగా తాగటం, సిగరెట్లు కాల్చడం, మధ్య మధ్య మద్యం సేవించడం అలవాటు కాసాగింది పాణికి!

☆ ☆ ☆

రాజ్యం మేనమావ శివయ్య కొడుకు లెనిన్ బాబు వచ్చాడాయె ఇంటికి.

స్థానిక రిక్షా కార్మికులకీ రిక్షా యజమానులకీ మధ్య ఘర్షణ తలెత్తింది. దాన్ని సామరస్య ధోరణిలో పరిష్కరించడానికి పార్టీ పంపిందతడ్ని. ఎలాగూ వచ్చాడు గనుక రాజ్యాన్నిచూసి పోదామని వచ్చాడు.

అతడూ అతడి తండ్రీ కమ్యూనిష్టుపార్టీ సభ్యులే అయినా ఇద్దరి ధోరణికీ పొంతనే లేదు

శివయ్య కమ్యూనిష్టు ఉద్యమకార్యకర్త. ప్రారంభ దశలో ఎన్నో ఇడుముల పాలయ్యాడు. జైలు శిక్షలు అనుభవించాడు. ఎన్నోసార్లు అజ్ఞాతవాసాని కెళ్ళాడు. ఆస్తీ పాస్తుల్ని పార్టీ పరం చేశాడు. ఆఖరికి పార్టీ ఆదేశానుసారం నైజాం వెళ్ళి, తెలంగాణా సాయుధ పోరాటంలో పాల్గొని, నమ్మిన సిద్ధాంతం కోసం పార్టీ ఆశయం కోసం ప్రాణాలర్పించి అమరుడయ్యాడు.

శివయ్య కొడుకుగా పార్టీలో ప్రవేశించాడు లెనిన్ బాబు. కార్యకర్తగా పని చెయ్యాల్సిన అవసరం లేకుండానే నాయకుడయ్యాడు. అప్పటికే వివిధ వర్గాల కార్మికులు సంఘటితమవుతూ వస్తున్నారు. అందువల్ల కొన్ని సంఘాలకి నాయకుడ్ని చేశారు.

తన నైపుణ్యంతో వాక్చాతుర్యంతో వారిని మరింత సంఘటితపరచి ఒక శక్తిగా రూపు దిద్దుకున్నాడు. ఆ క్రమంలో పార్టీలో గబ గబా

ఎదిగాడు. జనం అభిమానాన్ని సంపాదించాడు. అతడి కిప్పుడెంతో పేరూ పలుకుబడీ వున్నాయి.

రాజ్యం ఇంటినీ పరిసరాల్నీ చూసి " మీ పరిస్థితేం బాగున్నట్టు లేదే" అని పెదవి విరిచాడు లెనిన్‌బాబు.

"స్థిర ఆదాయం లేదు కదా – పిల్లలు మాత్రం బాగానే చదువు కుంటున్నారు. నా ఆశలన్నీ వాళ్ళమీదే"

"మావయ్య ఇప్పటిదాకా బతికుంటే బాగుండేది. స్వాతంత్ర్య సమరయోధులకి ప్రభుత్వం అయిదెకరాల భూమి ఇస్తోంది."

వవ్వి వూరుకుంది.

"పోనీ, ఓ పని చేద్దాం. అత్తయ్య వుంది కదా! మావయ్య జగమెరిగిన గాంధేయవాది. ఆయన్తోబాటు అత్తయ్యకూడా ఓసారి జైలు కెళ్ళిందని చెబుదాం. ఎవరోకళ్ళు సర్టిఫికెట్ ఇవ్వకపోరు. అయిదెకరాలొస్తుంది. ఏమంటావ్ స్వరాజ్యం"

"వద్దులే బావా! నే నివాళ చెట్టు నాటేది దాని ఫలాలు నేనే తినాలని కాదు – భావి తరాల కోసం అనేవారు నాన్న. ఒక ధ్యేయంతో ఒక ఆశయంతో సర్వ జనావళి శుభం కోరి నాన్న ఎన్నో పోరాటాల్లో పాల్గొన్నారు. లాఠీ దెబ్బలు తిన్నారు. దేవతా పులుసు రుచి చూశారు. మరెన్నో త్యాగాలు చేశారు. వాటికి ప్రతిగా వాటికి వెల కట్టి ఏదేదో నొల్లుకోలేం."

"ప్చ్. మావయ్య లాగానే నీకు వేపకాయంత వెర్రి వుంది. బతకటం చేతకానివాళ్ళు. పోనీ, ఓ పని చెయ్యి. హిందీ పరీక్షలు పాసయ్యానన్నావు కదా! అవన్నీ ఇవ్వు. జిల్లా బోర్డులో తెలిసున్న వాళ్ళున్నారు. వాళ్ళకి చెప్పి హిందీ మాస్టారుగా వేయిస్తాను. ఆడవాళ్ళకి అత్యధిక ప్రోత్సాహం ఇవ్వాలన్నది ఇప్పటి స్లోగన్ కదా! త్వరగా పనవుతుంది."

ఓ క్షణం ఆలోచించి "ఆ పని చేసిపెట్టు, మాకో ఆధరువు లభిస్తుంది" అంటూ సర్టిఫికెట్లు తెచ్చిచ్చింది.

పాణి వచ్చాడు. బక్కగా రోగపీడితుళ్ళా వున్న అతడ్ని చూసి ఆశ్చర్యపోయాడు లెనిన్‌బాబు.

"ఒకప్పుడు ఇస్త్రీ మడత నలగని బట్టల్తో నున్నని గెడ్డంతో ఫ్రెష్‌గా వుండే మీరు......"

మొఖం తిప్పేసుకున్నాడు పాణి.

కాఫీ తాగి వెళ్ళి పోయాడతడు.

అతడెళ్ళేక ఉద్యోగ ప్రయత్నం గురించి చెప్పింది రాజ్యం.

"వీళ్ళంతా మాటల్ని అమ్ముకుని బతికే నాయకులు. కార్యాలు చక్కబెట్టే చేతలవాళ్ళు గాదు. లేనిపోని భ్రమలు పెంచుకోకు" అన్నాడు.

కాని అతడి అంచనా తప్పని ఋజువు చేస్తూ నెల తిరిగేసరికల్లా ఆమె చేతికి నియామకపు ఉత్తర్వులొచ్చాయి.

ఆనందోద్వేగంతో వూగిపోయింది.

తల్లి సంబరం చూసి పిల్లలు గంతులేశారు.

కాంతమ్మ "భగవంతుడు దయామయుడు. ఆయన్ని నమ్ముకున్న వారిని తప్పక కటాక్షిస్తాడు. ఇవాళ నీ పేరన అర్చన చేయిస్తాను" అంది.

సంగతి చెవినబడేసరికి పాణి మొఖం ఎర్రగా కందిపోయింది. కాస్సేపటివరకూ మాట్లాడలేకపోయాడు.

తనూ రాత్రీ పగలూ సమయం సందర్భం అని లేకుండా పని చేస్తున్నాడు. ఎండలో మాడుతూ చలిలో వణకుతూ రోడ్డు పక్కన డాబాల పైన అన్ని చోట్లా పని చేస్తున్నాడు. అయినా నెల తిరిగేసరికి కళ్ళచూసే డబ్బుకన్నా ఆమె రెట్టింపు సంపాదిస్తుంది. అదికూడా నీడ పట్టున కూర్చుని మరీ సంపాదిస్తుంది. ఇక రేపట్నుంచి తనకి గౌరవం ఇస్తుందా? ఇరుగ పొరుగువాళ్ళు భార్య సంపాదిస్తోంటే జల్సా చేస్తున్నాడంటూ చెవులు కొరుక్కోరూ?

అతడిలో ఘర్షణ చెలరేగింది. తీవ్రమైన మథనకి గురయ్యాడు. ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో కుంగిపోయాడు.

అతడి మొఖాన్ని చూసి అంతా గ్రహించేసింది రాజ్యం

"నేను ఉద్యోగం చెయ్యటం మీ కిష్టంలేదా?"

"అహ. అదేంకాదు, చెయ్యి......" అన్నాడు.

ఆమె ఉద్యోగంలో చేరింది.

అతడి తాగుడు ఎక్కువయ్యింది.

## 19

ఉద్యోగంలో చేరిన మొదటిరోజున రాజ్యం ఎప్పటికీ మరిచిపోలేదు.

అవాళ గంజిపెట్టి ఇస్త్రీచేసిన చీర కట్టుకుంది. తల దువ్వుకుని చక్కగా తయారయ్యింది. పిల్లల్ని బడికి పంపింది. వాళ్ళ అన్నపానాలు చూసే బాధ్యత తల్లి కప్పగించింది.

తను కొత్తదారి తొక్కబోతోందన్న భావన ఆమెని తిన్నగా నిలవ నీయడం లేదు. ఎంతో ఆనందంగా వుంది. మరెంతో గాభరాగానూ వుంది.

పిల్లలకి పాఠాలు సరిగ్గా చెప్పగలనో లేదో చెప్పకపోతే నవ్వుతారేమో ఉద్యోగంలోంచి తీసేస్తారేమో – అంటూ రకరకాల అనుమానాలు తలెత్తసాగాయి.

స్కూల్లో చేరటానికి పాణిని తోడురమ్మంది.

మొదట రానన్నాడు. పిమ్మట ఏమనిపించిందో ఆమె రెడీ అయ్యే సరికి తనూ సిద్ధమయ్యాడు.

సర్టిఫికెట్లవీ తీసుకుని బయల్దేరబోతోంటే, "దేవుడికి దణ్ణం పెట్టుకెళ్ళవే" అంది తల్లి. మళ్లీ లోపలికెళ్ళి దణ్ణం పెట్టుకొచ్చింది.

ముచ్చటగా వున్న భార్యని చూసి మొఖం ముడుచుకున్నాడు పాణి. తన గుండెల్నెవరో ఉక్కుహస్తాలతో పిసికేస్తున్నట్టుగా వుందతడికి.

భర్తతో కలసి నడుస్తోంటే తనేదో పెద్ద విజయం సాధించినట్టుగా వుంది రాజ్యానికి.

ఎన్నోసార్లిద్దరూ కలిసి బజారుకీ సినిమాలకీ వెళ్ళారు.

కానిప్పటి సంగతి వేరు.

తను ఉద్యోగంలో చేరడానికి వెళ్తోంది. తను సంపాదించడానికి వెళ్తోంది. తన కాళ్ళమీద తను నిలబడటాని కెళ్తోంది.

రాజ్యం కాళ్ళు గాలిలో తేలిపోతున్నాయి.

"మా నాన్న బతికి వుంటే చస్తే ఒప్పుకునేవారుకాదు." దారిలో అన్నాడు పాణి.

అతడి వంకోసారి చూసి అంది. "బతకొద్దంటారా?"

"ఆడదాని సంపాదనమీద బతకాల్సిన ఖర్మ పడుతుందని కలలో కూడా అనుకోలేదు."

"అలా వేరు చేసి ఎందుకు చూస్తారు? ఇద్దరం కష్టపడేది మన సంసారం గురించే కదా. మన పిల్లలకి బంగారు భవిష్యత్తు ఇవ్వడం కోసమే కదా?"

"ఉద్యోగం పురుష లక్షణం అన్నారు, తెలుసా?"

"అది ఒకప్పటి మాట. అదిప్పుడు చెల్లదు. కాలంతోబాటే మనమూ మారాలి. భార్యా భర్తలిద్దరూ కూడా ఉద్యోగాలు చేస్తేగాని గడవని కాలం ఇది."

"చిత్రకళ పట్టుకుని వేలాడకుండా చదువవ్వగానే ఉద్యోగంలో చేరివుంటే సరిపోయేది. ఈపాటికి గొప్ప ఆఫీసర్ని అయ్యేవాడ్ని." నిట్టూరుస్తూ అన్నాడు.

"ఆ మాట మన పెళ్లవగానే చెప్పేను. ఒకరి కింద పని చేయడం నామోషీ అన్నారప్పుడు."

"అప్పుడలాగే అనుకున్నాను మరి. ఇప్పుడంతకంటే నామోషీ పని చేయాల్సొచ్చింది."

ఆమె ఆగింది. అతడి మొఖంలోకి సూటిగా చూస్తూ అడిగింది. "నేను ఉద్యోగం చెయ్యడం మీ కిష్టం లేదు కదూ?"

"నా ఇష్టం ఎవడిక్కావాల్లే."

"అదేం మాట? మీ నిలకడ లేని సంపాదనతో సంసారం గడవట్లేదు. అందుకనే కదా నేను ఉద్యోగంలో చేరతానంది."

"నేను అసమర్థుడ్ని మరి." అతడి కంఠం రుద్ధమయ్యింది.

"ఛా. అదేం మాట? ధరలూ ఖర్చులూ అవసరాలూ అన్నీ పెరుగుతున్నాయి. వాటికి తగ్గట్టు సంపాదించాలంటే భార్య భర్త లిద్దరూ ఉద్యోగాలు చెయ్యతప్పదు. మనమింకా లేనిపోని ఘోషాలకీ ఆడంబరాలకీ పోతున్నాంగాని కూలీ నాలీ చేసుకునేవారి ఆడవాళ్ళంతా మొగాళ్లతో సమానంగా పనిచేయడం లేదూ?"

"మనం మాల మాదిగల్తో కలిసిపోతున్నామంటావు! అవున్లే జమీందారీకుటుంబాల గురించీ వారి కట్టుబాట్లగురించీ నీకేం తెలుసులే!"

చటుక్కున కోపం వచ్చేసిందామెకి.

"ఆ జమీలూ ఆస్తులూ వుండి వుంటే నేను పరదాలమాటున ఎండ కన్నెరక్కుండా వుండేదాన్ని!"

"నువ్వేం దెప్పక్కర్లేదు. నా రాత బాగోలేదు. అంతే"

ఆమె మనసు చేదుగా అయిపోయింది. సంభాషణ మరి పొడిగించలేదామె.

హెడ్మాస్టార్ని కలిసి నియామకపు ఉత్తర్వులూ సర్టిఫికెట్లూ ఇచ్చింది రాజ్యం.

"ఓహో. మీరేనా స్వరాజ్యం? రండి, కూర్చోండి. గతంలో ఏమైనా అనుభవం వుందా?"

"లేదండీ. ఇదివరకు ఉద్యోగం చెయ్యాల్సిన అవసరం లేకపోయింది."

"ఏం ఫరావాలేదులే అమ్మాయ్! హిందీ సిలబసు పెద్దగా వుండదు."

అటెండెన్సు రిజిస్టర్లో సంతకం పెట్టించుకున్నారు. టీచర్లందర్నీ పిలిచి పరిచయం చేశారు.

అంతా మగ టీచర్లే.

అందరిమధ్య వాళ్ళందర్తో కలిసి తన భార్య పని చేయబోతోందని గ్రహించాడు పాణి. మొఖాన గంటుపెట్టుకుని వెళ్ళిపోయాడు.

స్టాఫ్ రూంలో కెళ్ళింది రాజ్యం.

"రాజ్యంగారూ, నా పేరు సదాశివం. మీకేం కావాలన్నాసరే నాకు చెప్పండి, చిటికెలో చేసి పెట్టేస్తాను" అన్నాడో టీచర్.

డ్రిల్లు మాస్టారు జగన్నాథం వేళ్ళకున్న ఉంగరాలని సవరిస్తూ "మీ రాక వల్ల స్కూలుకి కళవచ్చిందండీ! మనం సరదాగా కలిసి మెలిసి వుండొచ్చు" అన్నాడు అదోలా చూస్తూ.

ముక్కు పుటాల్లోకి నశ్యం దట్టించి అన్నారు పరమేశ్వర శాస్త్రి "అవునూ, మగరాయుళ్ళా ఉద్యోగం చేయడానికి మీ ఇంట్లో వాళ్ళెలా అంగీకరించా రసలు? అబ్బే, పరువూ మర్యాదాగల ఆడవాళ్ళు చెయ్యాల్సిన పని కాదు. పైగా మన డీ ఈ ఓ ముండావాడి కళ్ళు మంచివి కావు. వాడి చూపు మీ మీద పడిందనుకోండి నంజుకుతినేస్తాడు. అనక మీ కాపురం కొల్లేరైపోతుంది. ఆ తర్వాత మీ ఇష్టం మరి."

అయన మాటలకి మిగతావాళ్ళు గట్టిగా నవ్వేరు.

అవమానంతో ఆమె మోము ఎర్రబడింది. ఉక్రోష పడింది. మొదటి రోజు గనుక అతి కష్టంమీద నిగ్రహించుకుంది.

వాళ్ళంతా చదువుకున్నవాళ్ళు. భావితరాలని తీర్చిదిద్దే మహత్తరమైన ఉపాధ్యాయ వృత్తిలో వున్నారు. అలాటివాళ్ళలా లేకిగా ప్రవర్తించడం భరించరానిదిగా వుందామెకి. చదువుకీ సంస్కారానికీ సంబంధం లేదేమో అన్పించసాగింది.

ప్యూను వచ్చి ఆమెకి ఎనిమిదో తరగతి వారికి పాఠం చెప్పమని హెడ్మాస్టారు చెప్పమన్నారని చెప్పేడు.

"మొదటి క్లాసనుకుంటా, జాగ్రత్తండోయ్ అసలే కుర్రాళ్ళు కొంచెం కోణంగులు." నవ్వేడాకాయన.

ఆయనవంక చూడకుండా విస విస నడుస్తూ క్లాసురూంలో కెళ్ళింది.

అంతవరకూ నడిపించిన ధైర్యం జారుకుంది.

సన్నగా కంపిస్తూ కుర్చీలో కూర్చుంది.

ముచ్చెమటలు పోస్తోంటే పిల్లల వంక చూసింది. అంతా ఆసక్తిగా చూస్తున్నారు. ఆడపిల్లలు మరింత ఉత్సుకతతో చూస్తున్నారు.

అటూ ఇటూ చూసింది.

టీచర్లంతా తొంగి చూస్తున్నారు.

ఆమెకెంతో గాభరాగా అన్పించింది. తడబడ్తూ లేచింది.

పిల్లల పేర్లు కనుక్కోవాలనుకుంది. పెదాలు విడివళ్ళేదు.

అంతలో అన్నపూర్ణత్త గుర్తొచ్చింది.

మహిళా సమావేశంలో ఆమె చేసిన ప్రసంగమూ గుర్తొచ్చింది.

ఒక్కసారిగా పది ఏనుగుల బలం వచ్చి చేరింది.

"ఏ పాఠం చెబుతున్నారు?"

ఒకబ్బాయి చెప్పేడు.

"ఒక్కొక్కరూ లేచి రెండేసి లైన్లు చొప్పున చదవండి."

ఒక్కో విద్యార్థి చదువుతోంటే ఆసక్తిగా విన్నది. తప్పులు దిద్దింది. ఎలా పలకాలో చెప్పింది అంతా చదివేసరికి రాజ్యానికెంతో ధైర్యమూ ఉత్సాహమూ వచ్చాయి. పాఠమూ అర్థమైంది.

హిందీ పాఠాన్ని తెలుగులో కథగా చెప్పింది. కఠిన పదాలకి అర్థాలు చెప్పి వల్లెవేయించింది.

బెల్ మోగేసరికి "అరే, అప్పుడే పిరీడ్ అయిపోయిందా" అనుకుంది.

పిల్లల వంక చూసింది అందరి ముఖాల్లోనూ ఒకరకమైన తృప్తి కన్పించింది.

విజయానందంతో స్టాఫ్ రూంలో కెళ్ళింది.

"రాజ్యం గారేదో మంత్రం వేసి నట్టున్నారు. కోతులన్ని క్రమశిక్షణగా కూర్చున్నాయి." ఒకరన్నారు.

"ఆడగాలి మహత్యం." నవ్వేరింకొకరు.

"మీ ఇల్లెక్కడ రాజ్యంగారూ?" ఆరా తీశాడు జగన్నాధం.

ఆమె చెప్పింది.

"మా ఇల్లూ ఆ దగ్గర్లోనే, మనం రోజూ కలిసి రావొచ్చు. కలిసి వెళ్ళొచ్చు" అన్నాడతడు.

అతడు గ్రంథసాంగుడన్న సంగతి అందరికీ తెలుసు అంచేత అసూయగా చూశారంతా అతడి వంక.

రాజ్యం మాట్లాడలేదు. క్లాసు పుస్తకాలు తిరగెయ్యసాగింది.

"మనమంతా ఒక్కచోట పనిచేయాల్సినవాళ్ళం. ఉలిపికట్టెలా వుండ కండి" అన్నాడు సదాశివం. ఆ వెంటనే "పాఠాల గురించి మీరేం ఇదివ్వండి. ఎలా చెప్పినా అడిగే వారుండరు. డీ ఈ ఓ వచ్చేముందు నాలుగు మంచి ముక్కలు నేర్పి వల్లె వేయిస్తే చాలు" అని కూడా అన్నాడు.

"పాఠాలన్నీ నేర్పడం మన బాధ్యత కదండీ!"

రాజ్యం మాటలకి అవాక్కయారు. ఎకసక్కెంగా చూశారు. ఏదో అనబోయారు గానింతలో హెడ్మాస్టారు పిలవడంతో ఆయన గదికి వెళ్ళింది.

"హెడ్మాస్టారి చూపు పడ్డట్టుందోయ్!"

వెనకెవరో అన్నమాటలు ఆమె చెవినపడ్డాయి. నిలువునా దహించుకుపోయింది.

"పాఠం బాగా చెప్పేవుట. పిల్లలు చెప్పేరు. చాలా సంతోషం. మొదటి రోజే పిల్లల అభినందన లందుకోవడం అదృష్టం. ఇక మన స్కూలు పిల్ల లెవరూ హిందీలో తప్పరన్న ధీమా కలిగింది నాకు."

"మీ ప్రోత్సాహముంటే అంతా మంచి మార్కులు తెచ్చుకునేట్టు చూస్తాను సార్!."

☆ ☆ ☆

"కాంతమ్మొదినా, మీ అమ్మాయి ఉజ్జోగంలో చేరిందట కదా."

పక్కింటావిడ గోడ దగ్గరికొచ్చి అడిగింది. ఆవిడ మాటలు చెవిన పడటంతో తల్లి ఏం సమాధాన మిస్తుందోనని చెవులు రిక్కించింది రాజ్యం.

"అవునమ్మా, హిందీ పండితురాలిగా చేరింది. వాళ్ళ నాన్న హిందీ నేర్పించినందుకు అదిలా ఉపయోగపడింది!"

"స్కూల్లో అంతా మగాళ్ళేనంట కదా?"

"అంతా మగాళ్ళ లోకమాయె. వుండే వుంటారు."

"పరాయి మగాళ్ళతో కలిసి కూర్చుంటూ పని చెయ్యడం......మా వారైతే నరికి పోగులెడతారు......."

"ఇందులో కాని పనేముందమ్మాయ్? ఉజ్జోగం చేస్తేనే చెడిపోతారా ఏవిటి? మన బంగారం మంచిదవ్వాలంతే"

"బంగారం మంచిదైతే చాలదొదినా, కంసాలి కూడా మంచోడవ్వాలి."

"రాజ్యం సంగతి నీకు తెలీదు. పదూళ్ళకి పెద్దమనిషైన వాళ్ళ మావగార్నే ఎదిరించింది. అది నిప్పు. ముట్టుకుంటే కాల్చేస్తుంది. ఏదో సంసార సాగరం ఈదలేక గాని ఉజ్జోగాలూ ఊళ్ళేలటాలూ మా ఇంటా వంటా వున్నాయా ఏవన్నానా!"

"ఏమోనమ్మా! నలుగురూ నాలుగురకాలుగా అనుకుంటున్నారని వుండబట్టలేక అడిగాను గానీ ఒకరింటి గొడవ నా కెందుకూ!"

"అందుకే లోకులు పలుగాకులన్నారు. పనీపాటలేక కావు కావుమని అరుస్తూంటారు...." రుస రుసలాడుతూ ఇంట్లో కొచ్చేసింది కాంతమ్మ.

ఏమైనా అంటుందేమోనని ఎదురుచూసింది రాజ్యం. కానామె ఏమీ అన్లేదు.

పడుకునే ముందుమాత్రం కూతురి తల నిమురుతూ అంది: "జాగ్రత్తగా వుండు తల్లీ! ఆడదానికి ఆడదే శత్రు వంటారు. నరంలేని నాలుక ఎన్ని వంకరైనా తిరుగుద్ది!"

## 20

రామనాథం వచ్చి అమ్మవారి జాతరకి అందర్నీ రమ్మని ఆహ్వానించి వెళ్ళాడు.

"మా ఊళ్ళో అడుగు పెట్టి అయిదేళ్ళవుతోంది. ఒకసారి వెళ్ళి అందర్నీ చూసొద్దామండీ!" అంది రాజ్యం.

"వెళ్తే నువ్వెళ్ళు. నేను రాను" అన్నాడు పాణి.

"రెండ్రోజులు ఆటవిడుపుగా వుంటుంది కదా! ఈ మధ్య మీరు బాగా చిక్కిపోయారు కూడానూ."

"అందుకే రానంటున్నాను."

"అంటే?"

"ఒకప్పుడు యువరాజులా వుండేవాడ్ని. ఇప్పుడు కూలోడిలా మారిపోయాను. అది అందరికీ తెలియడం నా కిష్టంలేదు."

"నా పరిస్థితీ అంతే కదా. నేను వెళ్దామనటం లేదూ?"

"నీ సంగతి వేరు. ఉద్యోగం చేస్తున్నావు. వెళ్ళి గొప్ప ప్రదర్శించుకో" అనేసి బయటికెళ్ళిపోయాడు.

నోట మాటరాలేదు రాజ్యానికి.

తను ఉద్యోగం చెయ్యడాన్ని అతడింకా జీర్ణించుకోలేకుండా వున్నాడని గ్రహించింది. గుండెల్లో ముల్లు గుచ్చినట్టు విల విల్లాడింది.

నిజం చెప్పాలంటే పాణి సంపాదన అతడి తాగుడుకీ సిగరెట్లకీ సరిపోవడం లేదు. ఆ దురలవాట్లు మానమని ఎంత పోరినా విన్పించుకోవట్లేదు. నాకీ సుఖమూ దక్కనివ్వవా అని కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. ఒక పక్క దగ్గు నిలేస్తున్నా పట్టించుకోవట్లేదు.

ఉద్యోగం చేసి తను సంపాదించకపోతే కుటుంబం ఏనాడో వీధిన పడేది!

నిట్టూర్చింది.

అతడు రాకపోయినా వెళ్ళడానికే నిశ్చయించుకుంది రాజ్యం. కాంతమ్మ కూడా వస్తానంది గాని అల్లుడి భోజనానికి ఇబ్బంది అవుతుందని ఆగిపోయింది.

ముగ్గురు పిల్లల్నీ తీసుకుని పల్లెకెళ్ళింది రాజ్యం.

ఆప్యాయంగా ఆహ్వానించారు రామనాధం దంపతులు.

వియ్యన్నగారమ్మాయి వచ్చిందన్న వార్త క్షణాల్లో వూరంతా పాకిపోయింది. అంతా వచ్చి పలకరించారు.

ఆమె పరిస్థితి బాగున్నందుకెంతో సంతోషించారు. ఆమె ఉద్యోగం

చేస్తోందని తెలుసుకుని కొందరు అబ్బురపడితే మరికొందరు బుగ్గలు నొక్కుకున్నారు.

ఒకనాటి పాలేరు రావుడి కొడుకు భీముడు తాటిముంజెలు తీసుకు నొచ్చాడు.

"ఇవన్నీ ఎందుకురా? మీ నాన్న ఎలాగున్నాడు?......"

"మీరు వూర్నించి ఎల్లిన కొత్తలోనే సచ్చిపోనాడండి......."

"అరె, చచ్చిపోయాడా? ఎంత నమ్మకంగా పని చేసేవాడూ? మా నాన్న స్వాతంత్ర్యోద్యమంలో తల మున్కలై తిరుగుతోంటే వ్యవసాయానికి పాలూ నీళ్ళూ రావుడే చూసేవాడు. దగ్గరుండి ధాన్యాన్ని ఇంటికి చేర్చేవాడు. ఆ తరం వాళ్ళంతా ఒక్కొక్కరుగా రాలిపోతున్నారు. నీతీ నిజాయితీ మంచీ మమతా అన్నీ వాళ్ళ తోనే పోయినట్టున్నాయి!"

"తమరి పనెలాగుందండీ?"

"బాగానే వుందిరా భీముడూ!......"

"నా పేరు మార్చేసినారండి. ఆశీర్వాదమండి. మతం పుచ్చుకున్నానండి."

"మీరంతా క్రైస్తవమతం తీసుకున్నారా?"

"మావోళ్ళు శానామంది పుచ్చుకుంటున్నారండి. మాలపల్లెలో సెర్చి కట్టేరండి. దుప్పట్లు పాలడబ్బాలు ఇత్తన్నారండి. అంతా సమానవే అంటున్నారండి."

"హిందూ సమాజం అంటరాని తనమనే బురదని కడుక్కోనంతకాలం ఇలాటి వలసలు తప్పవేమోలే. నీ కెందరు పిల్లల్రా? వాళ్ళని బాగా చదివించు. వెనుకబడిన కులాలవారికోసం ప్రత్యేకం రిజర్వేషన్లు కల్పించింది. స్కాలర్‌షిప్పులు ఇస్తున్నారు. హాస్టళ్ళు పెడుతున్నారు........"

"మా పిల్లగాడు నర్సాపురంలో సదూకుంటున్నాడండి. పడకా తిండీ ఆళ్ళే సూత్తున్నారండి. అడి పని బానేవుందిలెండి.........."

"అక్షరాస్యత చాలా ముఖ్యంరా. అంతా చదువుకోవాలి. చదువు కుంటే చాలు, సమస్యలు తీరిపోతాయనుకో."

మరి కాస్సేపు ఆ కబురూ ఈ కబురూ చెప్పి వెళ్ళిపోయాడు భీముడు.

ఊరంతా ఒక్కసారి చుట్టివస్తానని చెప్పి బయల్దేరింది రాజ్యం.

ఝాన్సీ లక్ష్మీభాయి మహిళా సంఘపు బోర్డు చూసి మహదానంద పడిపోయింది.

అన్నపూర్ణత్త మరికొందర్తో కలిసిరావడం, తను సమావేశానికి అందర్నీ పిలవడం, సంఘం స్థాపించడం అన్నీ గుర్తొచ్చాయి.

"అయితే, ఆ సంఘం ఇంకా తన కార్యకలాపాలని కొనసాగిస్తూనే వుందన్నమాట!"

అన్నపూర్ణత్త అమృతహస్తాలతో ప్రారంభింపబడిందాయె.

లోపలి కెళ్ళింది. ప్రింటింగ్ ప్రెస్ పెట్టి, ప్రింటిగ్ టెక్నాలజీలో మహిళలకి శిక్షణ ఇస్తున్నారు. మరో పక్క కుట్టు మిషన్ల తరగతులూ నిర్వహిస్తున్నారు.

సంఘాధ్యక్షురాలిని కలిసి వారి కార్యకలాపాలు తెలుసుకుంది.

గ్రామంలో ఘోషా పద్ధతి లేదంది బండ్లకీ రిక్షాలకీ తెరలు కట్టడం మాన్పించారుట. సభలకీ సమావేశాలకీ ఎక్కువ మంది స్త్రీలు హాజరవుతున్నారట. ఉపాధి శిక్షణ ఇప్పిస్తున్నారట. వయోజన పాఠశాల నిర్వహిస్తున్నారట. వివిధ స్త్రీ సంక్షేమ పథకాల ద్వారా స్త్రీల ఆర్థిక పరిస్థితీ ఆదాయం పరిస్థితీ మెరుగుపరుస్తున్నారుట. స్త్రీలకు వితంతు పెన్షన్లూ ప్రసూతి ఎలవెన్సులూ ఇప్పిస్తున్నారట. స్త్రీల, పిల్లల ఆరోగ్య సంరక్షణ కెన్నో చర్యలు తీసుకుంటున్నారుట.

"మీ చైతన్యం చూస్తోంటే చాలా ముచ్చటేస్తోంది. మహిళలు కొంగు బిగిస్తే చాలు, వాళ్ళు సాధించలేనిదంటూ ఏమీ వుండదన్న నా నమ్మకం మరింత బలపడింది."

"గ్రంథాలయం కూడా నిర్వహించాలనుకున్నాంగాని యువజన సంఘం వాళ్ళు శ్రమదానం ద్వారా డబ్బు పోగుజేసి గ్రంథాలయాన్ని స్థాపించి చక్కగా నడుపుతున్నారు. అక్కడికెళ్ళి చదుకోవటాన్నీ పుస్తకాలని ఇళ్ళకి తెచ్చుకుని చదువుకోవటాన్ని బాగా ప్రోత్సహిస్తున్నాం."

"చాలా సంతోషంగా వుంది. రిటైరయ్యాక నేను కూడా ఇక్కడి కొచ్చి మీ సంఘంలో చేరి, చేతనైంది చేస్తాను" అని చెప్పి వచ్చేసింది.

ఊరు బాగా మారిపోయింది. కొత్తగా డాబాలు వెలుస్తున్నాయి. చెరువులోని తామరాకుల్ని తొలగించారు. లోతు తవ్వారు. నీరు కొంత వరకూ శుభ్రంగానే వుంది. హరిజనులు కూడా అదే చెరువు నుంచి నీళ్ళు తోడుకెళ్తున్నారు. ఇదివరకట్లా వాళ్ళు అల్లంత దూరాన్నుంచి తప్పు కోవట్లేదు. అగ్రహారపు రోడ్లమీద సైతం నిర్భయంగా నడుస్తున్నారు. వర్ణ

విచక్షణ పలచబడింది. అంటరానితనం నేరమన్న భావన అందర్లోనూ వేరూనుతోంది.

నాలుగు వీధులూ తిరిగి చరఖా కేంద్రానికెళ్ళింది..

తాళం తీసి లోపలికెళ్ళింది.

బూజులు వేలాడుతున్నాయి. చీరకొంగు బొడ్లో దోపి చీపురందుకుంది. నిమిషాల్లో అంతా శుభ్రం చేసి చుట్టూ నీళ్ళు చిమ్మింది.

గోడకి తగిలించి వున్న బాపూజీ, వియ్యన్నల ఫోటోల్నీ రాట్నాలనీ చూస్తూ చతికిలబడింది.

పాత జ్ఞాపకాలు తోసుకొచ్చాయి. వాటిల్లో కూరుకుపోయి చీకటి పడిన సంగతికూడా గమనించలేదు.

పిల్లల్ని తీసుకుని లలిత వచ్చింది.

"నన్ను కూడా పిలవకపోయావా స్వరాజ్యం?........" నొచ్చుకుంటూ అంది లలిత.

నవ్వి వూరుకుంది.

"ఈ కేంద్రాన్ని మళ్ళీ ప్రారంభిస్తే బావుండని వుంది మీ అన్నయ్యకి, కాని జనాని కీచరఖాలూ చేనేతలూ ఎక్కడం లేదు. అందరికీ మిల్లు బట్టలంటే మోజెక్కువయ్యింది."

"దేశం పారిశ్రామికంగా ఎంత ముందంజ వేసినా గ్రామ సౌభాగ్యం మాత్రం కుటీర పరిశ్రమల్లోనే వుంది. వ్యవసాయం పట్టుమని నాలుగైదు నెలల్ని మించి పని కల్పించలేదు. ప్రతీవారూ ఏదో కుటీర పరిశ్రమ ప్రారంభిస్తే ఆదాయమూ పెరుగుతుంది, ఆర్థిక స్థితీ మెరుగుపడుతుంది."

చేతిలాంతరు వెలిగించి తీసుకొచ్చాడు రామనాథం

"మనూరికింకా కరెంటు రాలేదు కదూ?" అంది రాజ్యం అప్పుడే ఆ సంగతి గమనించి.

"కరెంటూ రోడ్లూ స్కూళ్ళూ లేని ఊళ్ళు చాలా వున్నాయి. ఎప్పటికి బాగుపడతాయో ఏమో!" అన్నాడు రామనాథం.

"నాయకులేమీ చెయ్యట్లేదు."

"చేసిన ఊళ్ళకి చేస్తున్నారు. లేని ఊళ్ళకి లేదు. వాళ్ళలో కూడా ఇదివరకటి నిస్వార్థతా త్యాగశీలతా వుండట్లేదు. ఆస్తుల్ని సంపాదించడమే ధ్యేయంగా వుంటున్నారు. పార్టీ ఒకటే అయినా అందులో లెక్కలేనన్ని ముఠాలు!"

"స్వాతంత్ర్యం వస్తే చాలు, అన్ని సమస్యలూ మంత్రించినట్టు మారి పోతాయనుకున్నాను."

"దారిద్ర్యం, నిరుద్యోగం పెరిగాయి. జనం కూడా ఆడంబరాలకి అలవాటు పడుతున్నార్లే, ఒకర్ని చూసి ఒకరు వాతలు పెట్టుకుంటున్నారప్ప వాస్తవ స్థితేమిటో గ్రహించట్లేదు. ఇక రైతుల సంగతి చెప్పేదేముంది? వడ్డీవ్యాపారుల చేతుల్లో కీలుబొమ్మలు. సహకార ఉద్యమం ఇప్పుడిప్పుడే పుంజుకోంటోంది మరి. అది స్థిరపడితే తక్కువ వడ్డీకి ఋణాలు లభించే సావకాశం వుంది. కాని దాన్నీ పెద్దలు తమ గుప్పిళ్ళలో బంధిస్తారేమో తెలీదు!"

"సంఘాలని పెట్టి జనంలో చైతన్యం తీసుకొస్తే తప్ప బతుకులు మారవు."

"ఆ దిశలో కమ్యూనిస్టుపార్టీ కృషిచేస్తోందిగాని అది కొన్నిప్రాంతాలకే పరిమితమైపోయింది. మున్ముందు విస్తరిస్తుందేమో చూద్దాం."

మర్నాడు జాతరచూసి తిరుగుప్రయాణమైంది రాజ్యం.

## 21

స్కూల్లో అడుగు పెడుతూనే తెలిసిన వార్తకి దిమ్మెరబోయింది రాజ్యం.

క్రితం రాత్రి జగన్నాథం మాస్టారు యస్సెస్సెల్సీ చదువుతోన్న ఓ అమ్మాయి ఇంట్లో దొంగచాటుగా ప్రవేశించబోతూ పట్టుబడ్డాడట. అతడ్ని చెట్టుకి కట్టి గొడ్డుని బాదినట్టు బాదేరట. తెల్లారేక ఆయన ఫలానా అని తెలిసి హెచ్చరించి వదిలేరట!

ముక్కుపచ్చలారని పిల్లలకి సన్మార్గం చూపుతూ బుద్ధులు నేర్పాల్సిన గురువు బుద్ధి ఇలా వక్రించడం ఎంత సిగ్గుచేటు!

ఒళ్ళంతా సీసా పెంకుతో గీరి కారం అద్దినట్టు మండిపోయింది. అలాంటి వాళ్ళని స్కూలు నుంచి తొలగించాలనంటూ హెడ్మాస్టారు ముందు ఆవేశపడింది రాజ్యం.

ఆమె ధోరణికి ఆయనే కాదు, టీచర్లంతా కూడా ప్రాన్పడి పోయారు.

విషయం తెలిసి విద్యార్థులు సమ్మెకు దిగి గొడవ చేస్తారేమోనని భయపడుతున్నారు. రాజ్యం మాటలకి సమాధానమే చెప్పాలో తెలీక మాటలకోసం తడుముకున్నారు హెడ్మాస్టారు.

ఆమె ఎంత పట్టుదలగల మనిషో ఆయనకి బాగా తెలుసు.

ఒకసారి "స్త్రీలకి విద్య అవసరమా కాదా" అన్న అంశాన్ని డిబేటింగ్ కి పెట్టారు.

వెంటనే ఆమె తన అభ్యంతరాన్ని ఘాటుగా తెలియజేసింది.

"స్త్రీకి విద్య అత్యంత అవసరం అన్నది ప్రపంచ వ్యాప్తంగా అంతా ఎప్పుడో అంగీకరించిన విషయం అసలు విద్య అంటే విజ్ఞానం పురుషులకి కావాలా స్త్రీలకి కావాలా అని వేరు చేసి చూడటం మన అజ్ఞానం. ప్రతి మనిషికీ విద్య కావాలి. విజ్ఞానం కావాలి. ప్రతిభని పెంచుకునే మాధ్యమం కావాలి. అన్ని రంగాల్లోకీ చొచ్చుకుపోయి జనాభ్యుదయానికి కృషి చేయాలి" అంటూ ఆవేశపడింది.

ఆమె వాదనలోని నిజం కన్నా ఆమె వాదనాపటిమకి లొంగి పోయారాయన. వెంటనే టాపిక్ ని "స్త్రీకి విద్య అవసరమే" అని మార్చేశారు!

"లిఖితపూర్వకంగా మనకి కంప్లెయింటు లేకుండా మనం ఎలాటి చర్యా తీసుకోలేం." ఇబ్బందిగా చూస్తూ అన్నారు హెడ్మాస్టారు.

"అసలు తప్పంతా జగన్నాధానిదే అనేవిటి? రెండు చేతులూ కలవందే తప్పట్లు రావు. ఇందులో ఆ అమ్మాయి తప్పు వుందని నా అభిప్రాయం" అన్నాడు సదాశివం.

"అలా అని ఒక బాధ్యత గల టీచరు అర్ధరాత్రి వేళ దొంగ చాటుగా శిష్యురాలింటి కెళ్తాడా? ఆమె మానమర్యాదల్తో ఆటలాడుకోవాలని చూస్తాడా? ఇది డీ.ఈ.ఓ. గారికి తెలిస్తే మనస్కూలు పరవే మవుతుందో ఆలోచించండి."

ఉలిక్కి పడ్డారు హెడ్మాస్టారు. డీ.ఈ.ఓ గారు కొద్దిరోజుల్లో స్కూలు తనిఖీకి రానున్నారు. ఇటువంటి సమయంలో అలాటి సంఘటన జరగటంతో కలవరపడిపోయా రాయన.

"ఇప్పుడేం చేద్దామంటావమ్మా?"

"ఇలాటివి మళ్ళీ జరక్కుండా కట్టుదిట్టమైన చర్యలు తీసుకోవాలి. ఇప్పుడిప్పుడే ఆడ పిల్లలు హైస్కూలు చదువుకి కూడా వస్తున్నారు.

ఇలాటి సంఘటన గురించి వారి తల్లి తండ్రులకి తెలిస్తే ఆడపిల్లల్ని స్కూలుకి పంపించడానికే భయపడ్తారు. అదెంత నష్టకరమో మీకు తెలీంది కాదు. ఆడపిల్ల చదువుకోవడమంటే ఒక తరం చదువుకోవడమన్న సంగతి మీకు తెలుసు కదా."

"అవునవును. జగన్నాధాన్ని గట్టిగా మందలించడమే కాదు, ట్రాన్స్ఫర్ పెట్టుకుని మరో స్కూలు కెళ్ళిపొమ్మని చెబుతాను. నడత సరిగ్గా లేనివాళ్ళు విద్యార్థుల నడవడికేం తీర్చి దిద్దగలరు?"

ఆయనామె మాటలకి వత్తాసు పలికే సరికి అందరి మొఖాలూ మాడిపోయాయి. మొత్తం మగ టీచర్లందరికీ అవమానం జరిగినట్టు ఫీలయ్యారు. రాజ్యంవంక కటువుగా చూసెళ్ళిపోయారు.

రాజ్యం వెళ్ళబోతోంటే ఆపి అన్నారు: "వచ్చేనెలలో డీ ఈ ఓ గారు మన స్కూలుకి రావచ్చమ్మా! స్కూలు డెకరేషనూ అదీ మిగతావాళ్ళు చూస్తారు గాని నువ్వు మాత్రం పిల్లల చేత సాంస్కృతిక కార్యక్రమం ఇప్పించాలి. మీ రొక్కరే ఇందుకు సమర్థులు గనుక ఆ పని మీ కప్పగిస్తున్నాను."

"మీ నమ్మకాన్ని వమ్ముచెయ్యను సార్! ఇకనుంచి ఆ పని మీదేవుంటాను."

ఆమె వెళ్ళేక దీర్ఘంగా నిట్టూర్చారు హెడ్మాస్టారు.

గుండెలమీంచి పెద్ద బరువేదో దిగిపోయినట్టుగా వుందాయనకి.

జగన్నాధం చాలా పలుకుబడ గలిగిన వ్యక్తి. పెద్ద పెద్దవారితో సంబంధ బాంధవ్యాలున్నవాడు. జరిగిన గొడవవల్ల అతడిమీద చిన్నపాటి చర్య తీసుకున్నా అది తిరిగి తిరిగి తన నెత్తిమీద పిడుగై పడుతుందేమోనని భయపడుతున్నారాయన.

విషయం గోటితోనే పోయినందుకు చాలా ఆనందంగా వుందాయనకి.

స్కూల్లో జరిగిందంతా వర్ణక్రమంతోసహా జగన్నాధానికి తెలిసింది.

పళ్ళు పట పటనూరాడు.

నీలివార్తలు నాటేశాడు!

☆ ☆ ☆

శ్రీకాంత్, గాంధీ, సుబ్బలక్ష్మిలను చదివిస్తూ కూర్చుంది రాజ్యం.

"హరే రామ హరే రామ, రామ రామ హరే హరే" అనుకుంటూ వత్తులు చేస్తూ కూర్చుంది కాంతమ్మ.

చక్రపాణి తూలుతూ వచ్చాడు. అతడి కన్నా ముందొచ్చింది సారా వాసన.

రోజూకన్నా ఎక్కువ తాగినట్టున్నాడు మనిషి తిన్నగా నిలబళ్ళేక పోతున్నాడు.

సాయం వెళ్ళింది రాజ్యం. అతడు విదిలించేశాడు.

"వద్దు. నన్ను ముట్టుకోవద్దే. ఫో. దూరంగా ఫోవే....."

"అలాగేలేగాని, పిల్లలు వింటారు మీరు గదిలోకి పదండి చెబుతా."

"వద్దు. వద్దన్నానా. నా దగ్గరకి రాకు. నువ్వింకా పతివ్రతవనుకుం టున్నానే. కాదే. కాదని తెల్సిపోయిందే. నువ్వు చెడిపోయావు......" తూలుతూ పేలాడు పాణి.

"ఏమండీ!" కళ్ళ నీళ్ళ పర్యంతమయ్యింది. రాజ్యం.

పిల్లలు భయం భయంగా తండ్రివంక చూస్తున్నారు.

"అవేం మాటలు నాయనా? అభం శుభం తెలీని నా కూతురి మీద అభాండా లేయడానికి నీకు నోరెలా వచ్చింది?" కయ్‌మని పడింది కాంతమ్మ.

"మీకు తెలీదు అత్తగారూ స్కూల్లో! మేస్టర్లుతో కలిసి ఒకటే ఇక ఇకలూ పకపకలూ. ఇది చెడిపోయింది, చెడిపోయింది........."

కళ్ళల్లో కన్నీటి అల బద్దలవ్వగా శిలలా బిగుసుకుపోయింది రాజ్యం.

"నీది నాలికా తాటిపట్టా? నిప్పులాంటి అమ్మాయిని పట్టుకుని అంత మాటనడానికి నీకు నోరెలా వచ్చింది? వీధిలో కెళ్ళినంత మాత్రాన మైలపడిపోతారా?"

"అవునంతే. ఇది కులస్త్రీకాదు. అందుకే తెయ్‌మంటూ ఉజ్జోగాని కెళ్ళింది, నా పరువు తీసేసింది."

"అంత పరువున్నవాడివైతే పదిరాళ్ళు సంపాదించు ఉద్యోగం మాని ఇంట్లో కూర్చుంటుంది."

"అనండనండి. అంతా నన్నే అనండి. నేను తేలేదననేకదా అంటున్నారు. అనండి. నేను చచ్చేదాకా అనండి......" గదిలోకెళ్ళి మంచం మీద పడ్డాడు.

"ఒళ్ళు పై తెలీకుండా తాగి వున్నాడు. అతగాడి మాటలు పట్టించు కోకమ్మాయ్!......" కూతుర్ని వూరడించింది.

తల్లి ఒడిలో తల దాచుకుని బావురమంది రాజ్యం.

"వూరుకో తల్లీ! నువ్వేలాంటిదానివో లోకానికి తెలీదూ. గడపదాటిన ఆడదాన్ని అనుమానించడం శ్రీరాముడి కాలం నుంచీ వున్నదే. ఇవాళ కొత్తా ఏమన్నానా! అన్నీ భూదేవిలా భరించాలి. భగవంతుడు కష్టాలన్నీ ఆడదాని నుదుటే రాసేశాడు. అందుకే అంటారు ఆడదానిగా పుట్టడం కన్నా అడవిలో మ్రానై పుట్టడం మేలని......."

ఆవిడేదేదో చెప్పుకు పోతూనే వుంది.

ఆ మాట పాణిగాక మరొకరూ మరొకరూ అని వుంటేరాజ్యం కొంతవరకూ సహించేది. కాని తన గురించి అన్నీ తెలిసిన పాణి - తనతో పదేళ్ళుగా కాపురం చేస్తున్న పాణి అలా మాట్లాడేసరికి భరించ లేకపోతోంది.

అతడి మాటలు ఈటెలై గుండెల్ని నిలువుగా చీల్చగా కుళ్ళి కుళ్ళి ఏడ్వసాగింది రాజ్య.

మర్నాడు ఇంటిపనుల్తో పిల్లల పనుల్తో బిజీగా వుండిపోయింది తప్ప భర్తని పట్టించుకోలేదు రాజ్యం.

కాఫీసైతం పిల్లాడితో పంపించి వూరుకుంది.

ముసలావిడా పిల్లలూ అంతా ముభావంగా దూరంగా దూరంగా వుండి పోయేసరికి పాణికి ఏవిటో అన్పించింది.

ఎవడో చెప్పిన చెప్పుడు మాటలు విని భార్యని అనుమానించానే అని పశ్చాత్తాప పడ్డాడు. ఎలావీలా భార్యతో రాజీపడిపోవాలని చూశాడు గాని ఆమె ఆస్కారమివ్వలేదు.

శ్రీకాంత్‌ని పిలిచి "రాత్రి బాగా గొడవ చేశానుట్రా?" అనడిగాడు పాణి.

వాడేమీ చెప్పలేదు గాని "అమ్మని తిట్టేవు. నువ్వు మంచోడివి కాదు" అన్నాడు గాంధీ.

సుబ్బలక్ష్మి చూపులు కూడా అదే భావాన్ని వ్యక్తపరిచేసరికి సిగ్గు పడిపోయాడు.

దగ్గుతెర వచ్చింది. అయినా లెక్క చెయ్యకుండా సిగరెట్టు వెలిగించాడు. భార్య వారిస్తుందనీ ఆ రకంగా ఆమెతో మాటలు కలపొచ్చనీ చూశాడు గాని ఆమె పట్టించుకోలేదు.

అసహనంగా అటు ఇటూ తిరిగాడు. ఏదో పనున్నవాడిలా వంటింట్లో కెళ్ళేడు. రాజ్యం కన్నెత్తి చూడలేదు.

"తప్పైపోయింది రాజ్యం ఎవడో ఏదో కూసేసరికి భరించలేక పోయాను."

"తరతరాల్నుంచీ మీ రక్తంలో కలగలిసి వున్నదాన్నే బయటపెట్టారు. ఆడది మగాడి కాళ్ళదగ్గర దాసిలా పడివుండాలి. వంటింటి కుందేలుగా పిల్లల్ని కని వంశాన్ని వృద్ధి చేసే యంత్రంగా వుండాలి. అంతకుమించి ఒక్కడుగు ముందుకేసినా మీ మగాళ్ళు సహించలేరు."

"తప్పైపోయిందంటున్నాగా!"

"కడుపులోనిదంతా కక్కేసి తప్పయిపోయిందని లెంపలేసుకుంటే సరిపోతుందా! ఇవాళ్టినుంచి స్కూలుకెళ్ళను. కుటుంబాన్ని మీరే పోషించండి."

"నువ్వేం ఎత్తిపొడవక్కర్లేదు."

"యదార్థం చెబుతున్నాను. ఎలాంటి పరిస్థితుల్లో ఉద్యోగానికి సిద్ధపడ్డానో మీకు తెలుసు. తెలిసినా తెలీనట్టే వుంటారు. మగమహారాజులు కదా! స్వేచ్ఛావాయువులు ధారాళంగా వీచిన ఇంట్లో పుట్టాను. నా కర్మకొద్దీ మీ ఇంటి అంతఃపురంలో బందీ అయ్యాను. ఇక్కడికొచ్చేక మళ్ళీ లోకాన్ని రెండు కళ్ళతో చూస్తున్నాను. రెక్కలు విప్పుకుంటూ నేనేవిటో తెలుసుకుంటూ ఆత్మవిశ్వాసంతో ముందడుగు వేస్తున్నాను. అది మీకు కంటకప్రాయమై పోయింది. లేనిపోని నిందలు వేసి నన్ను హింసించాలనీ అప్రతిష్ఠపాలు చెయ్యాలనీ చూస్తున్నారు. చెయ్యండి. మీరెంత చెయ్యగలరో అంతా చెయ్యండి."

"ఇంకెప్పుడూ ఇలా అననంటున్నానుగా! నీ తోడు లేకపోతే నేనుండను. నీ నీడ లేకపోతే పిల్లలు వుండరు."

విస విసా బయటికెళ్ళిపోయిన భర్త వంకచిత్రంగా చూస్తూండి పోయింది రాజ్యం.

## 22

స్కూలు కాంపౌండు గోడమీద గీయబడ్డ బొమ్మలు, రాసిన రాతలూ చూసి పిల్లలు నవ్వుకుంటున్నారు. ఆడపిల్లలు సిగ్గుపడి తలొంచుకెళ్ళి పోతున్నారు.

రాజ్యం రావడం చూసి నిశ్శబ్దమై పోయారంతా. తప్పుచేసి దొరికి పోయినట్టుగా నేలచూపులు చూస్తూండిపోయారు.

ఏదో అనుమానం రాగా గోడవంక చూసింది.

ఆమె కెవరెవర్తోనో అక్రమ సంబంధం వుందంటూ పిచ్చి రాతలూ పిచ్చి బొమ్మలూ!

ఆమె నవనాడులూ కుంగిపోయాయొక్కసారే.

స్టాఫ్‌రూంలో కెలా వెళ్ళి పడిందో ఆమెకే తెలీదు.

భూగర్భంలో తలదాచుకుంటే బాగుండ్నన్పిస్తోంటే అతికష్టంమీద దుఃఖాన్ని నిగ్రహించుకుంది. ఎవరు చేసుంటారాపని?

తననేమీ అనలేక ఎదుర్కోలేక క్యారక్టర్ ఎస్సాసినేషన్‌కి పూనుకున్న ద్రోహి ఎవరు?

"అప్‌సెట్టైనట్టున్నారేవిటి కథ?" నంగనాచిలా అడిగాడు సదాశివం.

"తనదాకా వస్తేగాని తెలీదంటారందుకే. కళ్ళు మూసుకుని పాలు తాగుతూ తన నెవరూ చూడటం లేదనుకంటుందట పిల్లి." ముక్కు పొడుం డబ్బా తీస్తూ అన్నారు పరమేశ్వర శాస్త్రి.

"డీ ఈ వో గారికి స్వాగతం చెప్పడానికి ఏర్పాట్లు చెయ్యమంటే ఈ రకమైన ఏర్పాట్లు చేశారన్న మాట! ఎలా చేసినా ఫర్లేదులే. ఆడవాళ్ళు ఓరచూపు విసిర్తేచాలు – ఎన్ని తప్పులైన కప్పడిపోతాయి" అన్నాడు జగన్నాథం

అంతటితో ఆగలేదు. "ఆడవారి ఓరచూపులో జగాన ఓడిపోని ధీరుడెవ్వడూ......." అంటూ కూనిరాగం తీశాడు.

ఇంతలో హెడ్మాస్టార్నుంచి పిలుపొచ్చింది.

అంతా వెళ్ళారు.

ఎలాటి పరిస్థితి ఎదుర్కోవలసి వస్తుందోనని గుండె చిక్కబట్టుకుంది రాజ్యం.

"చూస్తుంటే మన స్కూలు ప్రతిష్ఠ ఏమవుతుందోనని భయంగా వుంది" అన్నారు హెడ్మాస్టారు. ఎవ్వరూ మాట్లాడలేదు.

"చూడమ్మా! నువ్వు నా కూతుర్లాటిదానివి గనుక చొరవ తీసుకుని చెబుతున్నాను. ఆడవాళ్ళు అణకువగా వుండాలి. అణగి మణగి వుండాలి. ఆదర్శంగా వుండాలి. అంతేతప్ప అడ్డమైన రూమర్లకీ తావివ్వకూడదు.

ఇన్నాళ్ళూ ఎంతో గొప్పగా వున్న స్కూలు ప్రతిష్ఠ నీ వల్ల ఒక్క సారిగా దిగజారిపోయింది."

"నేనే పాపమూ ఎరగనండీ. ఎవరో గిట్టనివాళ్ళు ఏదో రాశారని నన్ను నిందించడం భావ్యం కాదు." ధైర్యాన్ని కూడదీసుకుంటూ అంది.

"నిప్పులేందే పొగరాదు కదా" జగన్నాథం అన్నాడు, వంకరగా నవ్వుతూ.

"మనం నిదానంగా నడిస్తే చాలదు. మన నీడకూడా నిదానంగా వుండేట్లు చూసుకోవాలి......"

చిన్న సైజు ఉపన్యాసమివ్వబోయి ఆగిపోయారు హెడ్మాస్టారు.

ఎస్పీఎల్ మరో కుర్రాడ్ని తీసుకొచ్చి ముందుకి తోస్తూ అన్నాడు "గోడలమీద రాతలు రాసింది వీడేసార్!"

అమాంతం ఉగ్రులైపోయారు హెడ్మాస్టారు.

బెత్తం తీసుకుని "చెయి చాపు" అన్నారు.

అతడు చాపడం ఆలస్యం టప టపా బాదేశారు.

చెవి పట్టుకు మెలితిప్పుతూ "అలా ఎందుకు రాశావురా? నిన్నెవరు రాయమన్నార్రా? చెప్పరా వెధవా" అనడిగారు.

"జగన్నాథం మాష్టారు రాయమన్నార్సార్!" ఏడుస్తూ చెప్పేశాడు.

అంతా స్థాణువులై పోయారు.

జగన్నాధం తలొంచేసుకున్నాడు.

అప్పుడు లేచింది. రాజ్యం.

ఆడపులిలా అతడిమీదకి దూసుకెళ్ళి రెండు చెంపలూ వాయ గొట్టింది.

అది జరిగిన వారం రోజులకి ట్రాన్స్ఫర్ చేయించుకు వెళ్ళిపోయాడు జగన్నాధం.

☆ ☆ ☆

డీ.ఈ.ఓ.గారి కార్యక్రమం ఖరారయ్యింది.

ఆయన మెప్పు లభించేలా స్కూలుని తీర్చిదిద్దే బాధ్యత రాజ్యం నెత్తిమీద పెట్టేశారు హెడ్మాస్టారు.

ఆమెతో విద్యార్థులంతా ఎంతో సన్నిహితంగా వుంటున్నారు. టీచర్లం దరికన్నా ఆమె మీద వారికి గౌరవాభిమానా లెక్కువున్నాయి. అందుకు ముఖ్య కారణం ఆమె చెప్పిందే చేస్తుంది, చెయ్యగలిగిందే చెబుతుంది!

స్కూలుని రంగు కాగితాల తోరణాలతో చక్కగా అలంకరించారు. పిచ్చి మొక్కల్నీ గడ్డినీ తొలగించారు. గోడమీది రాతలు చెరిపి వెల్ల వేశారు. బల్లలూ కుర్చీలూ అన్నీ కడిగి శుభ్రంచేశారు.

విద్యవల్ల ఒన గూడే లాభాలని వివరిస్తూ చిన్ననాటిక రాసింది రాజ్యం. పిల్లల ఉత్సాహం చూసి కొన్ని దేశభక్తి పాటల్ని కూడా రాసింది.

డీ.ఈ.ఓ గారొచ్చినప్పుడు క్రమశిక్షణతో మెలగాల్సిన అవసరాన్ని నొక్కిచెప్పింది. అంతా కలిసి స్కూలుకి మంచి పేరు తీసుకు రావాలంది.

ఏర్పాట్లు చూసి హెడ్మాస్టారు పొంగిపోయారు. మిగతా టీచర్లు కూడా అయిష్టంగానే అయినా రాజ్యాన్ని పొగిడారు.

డీ.ఈ.ఓ. వచ్చారు.

గులాబీ పూలిచ్చి స్వాగతం చెప్పేరు పిల్లలు.

అన్ని రిజిస్టర్లూ చూశారు. అన్ని క్లాసులకీ వెళ్ళి ప్రశ్నలడిగారు. ఆట పాటల గురించీ సైన్సు ప్రయోగాల గురించీ అడిగి తెలుసుకున్నారు.

పిల్లలు ప్రదర్శించిన నాటిక చూసి, పాటలు విని పరమానంద పడ్డారు. వీటన్నిటికీ కారణం రాజ్యం అని తెలుసుకుని ఆమెని పొగడ్తల్లో ముంచెత్తారు.

"ఇంటిని దిద్దే ఇల్లాలు ఇలను కూడా సరిదిద్దగలదని ఋజువు చేశారు. నన్నడిగితే డాక్టర్లుగా టీచర్లుగా మహిళల్నే నియమించాలంటాను. వారి ఓర్పు నేర్పు అనంతం. పిల్లల భవిష్యత్తు చక్కని రంగవల్లిగా తీర్చి దిద్దగల శక్తి స్త్రీలకే వుంది. మీరెందరో ఉత్తమ పౌరుల్ని దేశాని కప్పగిస్తారని మనస్ఫూర్తిగా విశ్వసిస్తూ మిమ్మల్ని ప్రత్యేకంగా అభినందిస్తున్నాను" అన్నారాయన.

కష్టానికి తగ్గ ఫలం లభించినట్టుగా ఫీలయ్యింది రాజ్యం.

☆ ☆ ☆

"అమ్మా! అన్నయ్య బీడీ కాల్చాడు."

నిర్విణురాలయ్యింది రాజ్యం.

"నువ్వు చూశావా?"

"చూశాను. అన్నయ్యా కేవీ గాడూ చింతచెట్టుదగ్గర కాల్చేరు. అన్నయ్యకి దగ్గొచ్చింది కూడా."

గాంధీ అబద్ధ మాడడని ఆమెకి తెలుసు. వాడు అమ్మకూచి. ప్రతీదీ తల్లికి చెబుతాడు. ఎవరు తప్పు చేసినా సహించడు.

వాడికి పూర్తి భిన్నంగా వుంటాడు శ్రీకాంత్. తండ్రిలానే ఎక్కువగా మాట్లాడడు. తను చెయ్యాలనుకున్నదేదో మౌనంగా చేసుకుపోతాడు. మెత్తనివాడు సమయానుకూలంగా మారిపోతూంటాడు.

పిల్లల్ని ఎంతో క్రమశిక్షణతో పెంచాలనీ ఆదర్శవంతుల్ని చెయ్యాలనీ రాజ్యం తాపత్రయం. అందుకు విరుద్ధంగా చిన్నపాటి సంఘటన జరిగినా పెద్దగా ఫీలవుతూంటుంది. గోరంతల్ని కొండంతలుగా వూహించుకుని భయపడుతూంటుంది.

"శ్రీకాంత్! ఒరే శ్రీకాంత్!......." రోడ్డుమీదకెళ్ళి గట్టిగా కేకలు పెట్టింది.

శ్రీకాంత్ వచ్చాడు. అమాయకుళ్ళా మొఖంపెట్టిన వాడ్ని చూసే సరికి ఆమె కోపం రెట్టింపయ్యింది.

వాడి రెక్క పట్టుకుని "ఏరా వెధవా! బీడీలు కాల్చావా? ఎవర్ని చూసి నేర్చుకుంటున్నావురా వెధవలవాట్లూ?" అంటూ నిలదీసింది.

"నేను కాల్చలేదమ్మా!"

వీపు మీద ఒక్కటేసింది. "ఛీ వెధవా! చేసింది చాలక అబద్ధాలొకటా!......."

వాడు అరున్నొక్కరాగం అందుకున్నాడు.

కాంతమ్మ వచ్చి వాడ్ని విడిపించింది. "చిన్నపిల్లాడు. తెలిసీ తెలీకేదో చేస్తే చంపేస్తా వేమిటి?"

"బీడీలు కాల్చడం చిన్నపనా? ఇవాళ బీడీలు, రేపు సిగరెట్లు, ఆపైన తాగుడు.......అయన్తోనే చస్తున్నాను. ఇక వీడుకూడా తోడైతే.........." ఏడుస్తూ కూలబడింది రాజ్యం.

"వూరుకోవే తల్లీ! ఎవరి రాత నెవరు చెరపగలరు చెప్పు. నిక్షేపం లాంటి ప్లీడరు సంబంధం కాదని ఈ ముదనష్టపు సంబంధం చేశారు మీ నాన్న. దురలవాట్లు మానవయ్యా, బుద్ధిగా వుండవయ్యా అంటే వినడు నీ మొగుడు. ఒకప్పుడు గొప్పగా బతికేమంటూ చెప్పుకొస్తాడు. తాతలు నేతులు తాగారని వీరి మూతులు వాసన చూడమంటాడు."

"ఆయన చెడటం కాదు, పిల్లల్ని కూడా చెడగొడుతున్నారని నా బాధ. వీళ్ళేలా తయారవుతారోనని బెంగ!"

"నువ్వేం ఇదవ్వక. వయసొచ్చేక వాళ్ళే తెలుసుకుంటార్లే."

శ్రీకాంత్ వంక చూసింది. "ఏరా, ఇకనుంచి వెధవ్వేషాలెయ్యకుండా బుద్ధిగా చదువుకుంటావా?" అనడిగింది.

తమ్ముడివంక గుర్రుగా చూస్తూ తలూపాడు.

చెల్లెలు సుబ్బలక్ష్మి గాంధీ చేతిని గట్టిగా పట్టుకుని పెద్దన్నగారి వంక భయంగా చూసింది!

# 23

పాణి అక్క సుధారాణి వచ్చింది.

కాకుళస్వామిగారి ప్రభ బాగా వెలుగుతున్న రోజుల్లోనే ఆమె పెళ్ళి రంగ రంగ వైభోగంగా చేశారు. అత్తవారిక్కూడా భూములూ తోటలూ వుండటంతో ఆమె రాణీవాసం చేసిందని చెప్పాలి.

తర్వాత్తర్వాత ఆమె భర్త కాంట్రాక్టు పనులు చేపట్టాడు. మావగారి పలుకుబడినీ పరిచయాలనీ బాగా ఉపయోగించుకున్నాడు. ఎవర్నెలా ఆకట్టుకోవాలో బాగా తెలియడంతో గబ గబా పైకెగబాకి ప్రముఖ కాంట్రాక్టర్‌గా మారిపోయాడు.

వారి కుటుంబం ఉచ్ఛదశలో వుంటే పుట్టింటివారు క్షీణదశకు చేరుకున్నారు.

దాంతో రాక పోకలు తగ్గిం చేసిందామె. ఎప్పుడైనా మొక్కుబడిగా వచ్చి తండ్రిని చూసి వెళ్ళిపోయేది. బుడి బుడి దీర్ఘాలు తీసి అంతో ఇంతో పట్టుకుపోయేదికూడా.

కాకుళస్వామిగారి మరణానంతరం కొడుకులంతా చితికిపోయి తలో దారీ తొక్కారు. ఎవరి సంపాదన వారికే చాలని స్థితి దాపురించింది.

వారితో సంబంధం పెంచుకుంటే తనే వాళ్ళకి పెట్టాల్సొస్తుందేమోనని దూరంగా వుండిపోయింది. పుట్టింటివైపు ఒక్కనాడూ తొంగిచూసిన పాపానపోలేదు.

ఇప్పుడు పాణి పరిస్థితి బావుందనీ వదిన రాజ్యం ఉద్యోగం చేస్తూ సంపాదిస్తోందనీ తెలిసివచ్చింది. "నా తమ్ముడు" అంటూ ఆప్యాయత ఒలక బోసింది.

"ఏరా తమ్ముడూ, ఇలా అయిపోయా వేమిట్రా? ఇస్త్రీ బట్టలు తొడుక్కుని సెంటు పూసుకుని పూలరంగడిలా వుండేవాడివి. ఇప్పుడు

కురచ చొక్కాలూ పాత పాంట్లూ తొడుక్కోవలసివచ్చిందన్నమాట! నిన్ను చూస్తోంటే కడుపు తరుక్కుపోతోందిరా తమ్ముడూ!" అంది సుధారాణి.

"ఏం చేస్తామే? పెయింటింగు పనితప్ప నాకింకో పని చేతకాదు. రాత్రీ పగలూ రంగుల్తో బ్రష్షుల్తో కుస్తీ పట్టినా పది రూపాయలు కూడా మిగల్టం లేదు ఇదివరకటి దర్జాలు కావాలంటే ఎలా వస్తాయి చెప్పు!" అన్నాడు పాణి.

"చాల్లే సంబడం. నీ పెళ్లాం ఉజ్జోగం చేసి వందలకి వందలు సంపాదిస్తోంది కదా!"

"అందువల్లే సంసారం ఇలాగైనా గడుస్తోంది. ఈ టౌన్లో పాలూ నీళ్ళు దగ్గర్నుంచి సమస్తమూ కొనుక్కోవడమే కదా అక్కా!"

"అయితేమాత్రం నీ మంచీ చెడ్డా బాగూ ఓగూ చూడాల్సిన బాధ్యత ఆవిడమీద లేదా? నీ కేమో రంగుల మరకల బట్టలు. అవిడేమో ఠింగురంగా అంటూ సిల్కు చీరలు కట్టి వూరేగుతోంది! ఉక్రోషంగా అంది.

"పదిమందిలో తిరిగేది. కాస్త మంచి చీర కట్టుకోకపోతే ఎలా చెప్పు?"

"నువ్వింత వెర్రిబాగులోడివి గనుకే నిన్నిలా ఆడిస్తోంది."

"ఆ గొడవకేంగాని మీ విషయాలు చెప్పు. బావగారు ఎన్నికల్లో పోటీ చేస్తారంట కదా?"

"అంతా పోటీ చెయ్యమని బతమాల్తున్నార్రా. ఎన్నికలంటే మాటలా? బోల్డు డబ్బూ దస్కం కావాలి. మందీ మార్బలం వుండాలి."

"బావగారికేం లోటు లేవే?"

"అంతా అలాగే అనుకుంటారు. లోగుట్టు పెరుమాళ్ళ కెరుక అన్నారు. పీత కష్టాలు పీతవీ సీత కష్టాలు సీతవీనూ!"

"పిల్లలెలా చదువుతున్నారు?"

"పెద్దస్కూల్లో వేశాం. చిన్నాచితకా స్కూళ్ళలో చదివించడం మీ బావగారి కిష్టం లేదు. అవునుగాని తమ్ముడూ మీ అత్తగారు కూడా నీ మీద పడి తింటూనే వుంటుందా."

"పాపం, ఆవిడకి మాత్రం ఎవరున్నారు చెప్పు?"

"ఎవర్లేకపోతే ఏట్లో దూకుతుంది. మధ్యన ఈ తద్దినం నీ కెందుకురా? నువ్వేమిటో అనుకుంటున్నావుగాని రాజ్యం దేవాంతకురాలు!"

"అనవసరంగా దాన్నంటావేమిటే? అవతల స్కూలుపని ఇవతల ఇంటిపని. రెండిట్లతో నలిగిపోతోంది, పాపం!"

"నీ పిచ్చిగానీ స్కూలు కెళ్ళి పాఠాలు చెప్పద్దేవిటీకబుర్లేసు కూర్చుం టుందంతే."

పాణి మాట్లాడలేదు. అక్కగారి ధోరణి అతడికి బొత్తిగా రుచించ లేదు. అలాగని రాక రాక వచ్చిన ఆవిడ్ని నొప్పించదలచనూ లేదు.

అవిడ మెప్పుకోసం బజారుకెళ్ళి చేపలూ మాంసం కొని తెచ్చాడు. ఆమె కిష్టమని చెప్పి బూందీ లడ్డూలు కొన్నాడు.

దుబారా ఖర్చు అంటుందేమోనని భయపడ్డాడు గాని రాజ్యం ఏమీ అన్లేదు. ఆడబడుచుకి ఎలాంటి లోటూ రాకుండా మర్యాదలు చేస్తోంది.

సుధారాణికి మాత్రం చాలా అసహనంగా వుంది.

రాజ్యం ఇస్త్రీ చేసిన చీర కట్టుకుని గొడుగు పట్టుకుని ఠింగు రంగా అంటూ వెళ్ళడం సహించలేకపోతోంది. అక్కడికీ సూటీ పోటీ మాటల్తో హింసించాలని చూసిందిగాని ఎవరూ ఆమె ఆశించినట్టు ప్రతిస్పందించలేదు.

"ఏమ్మా మరదలా. నీ జీతమంతా నీ చీరలకీ పౌడర్లకే సరి పోతున్నట్టుంది!" అంది రాజ్యంతో.

"అదే నిజమైతే సంసారాన్నెలా ఈడ్చుకురాగలను చెప్పు?"

"అంటే ఏమిటి నీ ఉద్దేశ్యం? మా తమ్ముడేం సంపాదించ ట్లేదు. చేవలేనిచవట. నువ్వే సంపాదిస్తున్నావు. కుటుంబాన్ని నువ్వే పోషిస్తున్నానంటావు?!"

"సుఖంగా సాగిపోతున్న మా సంసారంలో చిచ్చుపెట్టాలనొచ్చారా?"

"అయ్యో అయ్యో. నీ పెళ్ళాం ఎంత మాటన్నదో చూడరా తమ్ముడూ! తోడబుట్టినవాడివి కదా అని చూసి పోదామనొస్తే ఎలాటి తాటాకులు కడుతోందో చూడరా! బెల్లం కొట్టిన రాయిలా మాటాడవేంరా? నేను నీ పెళ్ళాం కళ్ళకి మంధరలా కన్పిస్తున్నానుట్రా?" గొంతు చీరుకుంది.

"తెలిసి తెలీక ఏదో అంటే రాద్ధాతం చేస్తావేంటక్కా?"

"నాది రాద్ధాంతమూ దానిది సిద్ధాంతమూనా? బావుందిరా, చాలా బావుంది. పెళ్ళాం కొంగుపట్టుకుని పాకుతున్నావని అంతా అంటోంటే ఏవిటో అనుకున్నాను. ఇప్పుడు కళ్ళారా చూస్తున్నాను. ఇంత వెన్నెముక

లేనివాడివై పోయావేంరా? పెళ్లాన్ని అదుపులో పెట్టుకోలేనివాడివి నువ్వేం మగాడివి. నాన్నే బ్రతికుంటే ఇంటికోడల్ని వీధిగుమ్మం దాటనిచ్చేవారా?"

"చాలు చాల్లేమ్మా వచ్చినప్పట్నుంచి చూస్తున్నాను నీ తంతు. అయినదానికీ కానిదానికీ మిడిసిపడకపోతే, మీ పని బాగానే వుంది కదా – మీ అన్నదమ్ములకి చెయ్యందించి ఆదుకోరాదూ?" మధ్యలో కల్పించుకుంటూ అంది కాంతమ్మ.

గతుక్కుమంది సుధారాణి. తొట్రుపాటు కప్పిపుచ్చుకుంటూ అంది: "ఆడపిల్లకి మనం పెట్టాలిగాని ఆడపిల్ల సొమ్ము మనం తినకూడదనే వారు నాన్నగారు. అందుకని పెట్టడంలేదుగాని చేతులు రాకకాదు."

"మాటలు కోటలు దాటుతాయి చేతలు గడపదావు!"

"ఇది మా తమ్ముడి కుటుంబ గొడవ. ఇందులో మీకేం సంబంధం వుంది?"

"వుందనుకుంటే అన్నీ వుంటాయి. లేదనుకుంటే ఏమీ లేవు."

అవిడవంక మిర్రిమిర్రి చూసింది.

"ఇంత అవమానం జరిగేక ఈ ఇంట్లో ఒక్కక్షణం వుండను తమ్ముడూ! ఏదో తమ్ముడన్న అనుబంధంకొద్దీ వస్తే నన్నవమానించి పంపుతారా? మీరు బాగుపడతారా......" ఏడుస్తూ ముక్కు చీదుతూ గదిలోకెళ్ళి పోయింది.

"ఇప్పుడు మా అమ్మ ఏమందనీ........"

రాజ్యం ఏదో అనబోతోంటే పాణి కళ్ళెర్రజేశాడు: "నోర్ముయ్. ఇంటికొచ్చిన ఆడబడుచుని మర్యాదగా చూడటం తెలీని మీరూ ఆడ వాళ్ళేనా?"

నివ్వెరబోయిందామె.

"నేనిప్పుడే అరగంటలో వస్తాను. నే వచ్చేదాకా వెళ్ళకు అక్కా!" అని చెప్పి వెళ్ళిపోయాడు పాణి.

పాత భాగస్తుడి షాపుకెళ్ళాడు. బతిమాలి అయిదొందల రూపాయల చీర అరువుమీద తెచ్చాడు.

"దీన్ని మా అక్కకి పెట్టు" అన్నాడు రాజ్యానికిస్తూ.

మారుమాట్లాడకుండా సుధకి బొట్టుపెట్టి చీర పెట్టింది.

చీర ఖరీదు చూసి మురిసిపోయిందామె. "నా తమ్ముడు నా

తమ్ముడే. వాడిది మా నాన్నలానే భారీ చెయ్యి" అని పొగడుతూ వెళ్ళి పోయింది.

ఆమె వెళ్ళేక అంది రాజ్యం: "అసలే డబ్బు ఇబ్బందుల్లో వున్నాం. సాదా చీర కొని తేకపోయారా!"

"మా అక్క పెద్దింటి కోడలు. అల్లాటప్పా చీర కట్టుకెళ్తే వాళ్ళింట్లో అంతా చులకన చేస్తారు."

"అలాగని లేనిగొప్పలకి వెళ్ళాల్సిన పనేముంది? మంచం వున్నంత వరకే కాళ్ళు చాపుకోవడం ఉత్తమం."

"ఆ నీతులన్నీ నీదగ్గరే వుంచుకో. మాకేం చెప్పక్కర్లేదు."

"అసలంత డబ్బు మీ కెక్కడ్నుంచొచ్చింది?"

"ఏం? రాకూడదా? నేను సంపాదించలేనా? నువ్వొక్కదానివే గొప్పదానివను కుంటున్నావా? నేను మగాడ్నే. ఎన్నైనా చేయగలను. ఎంతైనా సంపాదించగలను. చూస్తూండు నాకూ ఓ రోజొస్తుంది. అప్పుడు నే నేమిటో నా ప్రతాప మేమిటో చూపిస్తాను. మీసం మెలేసి నా మగతనాన్ని చాటుకుంటాను."

రాజ్యం మాట్లాడలేదు.

భర్తలో కొత్తమనిషి కన్పిస్తోంటే వింతగా చూస్తూండిపోయింది.

తను ఉద్యోగం చేస్తోందని అతడికన్నా ఎక్కువ సంపాదిస్తోందని ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సుతో రగిలిపోతున్నాడా? తనలో తను కుంచించుకు పోతూ మత్తులో మునిగి పురుషాహంకారాన్ని జోకొట్టుకుంటున్నాడా?

ఇతడ్ని మార్చడం ఎలా?

ఏది దారి?

ఆలోచనలో పడిందామె.

## 24

"ఏమండీ, మీకో శుభవార్త!" స్కూలు నుంచి వస్తూనే అంది రాజ్యం.

ఖల్ ఖల్‌మని దగ్గుతోన్న పాణి నీళ్ళూరిన కళ్ళతో తలెత్తిచూశాడు.

"ఏవిటలా వున్నారు? ఆ మాయదారి దగ్గు మిమ్మల్ని పట్టుకుని వదల్టం లేదు. డాక్టర్‌కి చూపిద్దాం పదండి."

"వేడి చేసుంటుంది. అదే తగ్గిపోతుందిలేగాని శుభవార్తన్నావేమిటి?"

"వచ్చే నెలలో ఇక్కడికి మంత్రి జనార్దనం గారొస్తున్నారంట. ఆయనకి పౌర సన్మానం చేస్తారట. ఆ సందర్భంగా ఆయన నిలువెత్తు చిత్రాన్ని బహూకరించాలని సన్మాన సంఘంవారు నిర్ణయించారట. మంచి ఆర్టిస్టు కోసం వెదుకుతోంటే మా స్కూలు టీచరొకాయన మీ గురించి చెప్పేట్ట. మీ రేసిన చిత్రాన్ని ఆయనెక్కడో చూశాట్ట కూడా. మంత్రి గారి ఫోటో ఇచ్చి అడ్వాన్సు పంపించారు. ఎంత ఖర్చయినా ఫర్లేదు చిత్రం బాగా రావాలన్నారు."

ఫోటోవంకా నోట్లవంకా పిచ్చిగా చూశాడు.

"మీ కళకి గుర్తింపు రాబోతోంది. మీ ప్రతిభని నిరూపించుకునే అవకాశం వెదుక్కుంటూ వచ్చింది. దీన్ని సద్వినియోగం చేసుకోండి. చిల్లర మల్లర పనులు మానేసి దీనిమీదే శ్రద్ధ వహించండి."

"నువ్వే చూస్తావుగా. అంతా మూర్ఛబోయేలా వేస్తాను. నా రక్తాన్ని రంగుల్లో రంగరించి వేస్తాను. నా పేరు చిరస్థాయిగా నిలిచిపోయేలా వేస్తాను. సజీవ చిత్రమా అని భ్రమించేలా వేస్తాను." వెర్రి సంబరంతో వూగిపోతోంటే గబుక్కున చేయి పట్టుకుంది.

"ఉద్రేక పడొద్దు. మీ ఆరోగ్యం అసలే బాగోలేదు......"

"నాకింకేం ఫర్లేదు. నే నేవిటో ప్రపంచానికి చాటే అవకాశం వచ్చింది. దీన్ని వదులుకోను" అంటూ అటకమీద పడేసిన స్టేండునీ బ్రష్షుల్నీ అన్నిట్నీ బయటికితీసి దుమ్ము దులపసాగాడు.

ఆ మర్నాడు కావాల్సిన సరంజామా అంతా కొనుక్కొచ్చి స్కెచ్ గీయటం మొదలెట్టాడు. ఎంచేతో అతడి చేయి వణకసాగింది. దగ్గు నిలవనీయటం లేదు. అయినా శక్తిని కూడదీసుకుని పెయింటింగ్ మీద దృష్టి కేంద్రీకరించాడు.

తల్లి సలహా మీద వరుసగా కొన్ని రోజులపాటు బార్లీ నీళ్ళు కాచిచ్చింది రాజ్యం. మందుల షాపు నుంచి ఏవో బిళ్ళలు కొని తెచ్చింది. అయినా దగ్గు తగ్గుముఖం పట్టలేదు. డాక్టర్ దగ్గరకి రేపు వెళ్దాం, మాపు వెళ్దాం అంటూ వాయిదా వేస్తూనే వున్నాడతడు.

తండ్రి ఒక ఋషిలామారి చిత్రాన్ని చిత్రిస్తోంటే విస్ఫారిత నేత్రాలతో చూస్తూ కూర్చుంటున్నారు పిల్లలు. అతడి ప్రశాంతత కెలాటి భంగమూ

కలక్కుండా విశ్శబ్దంగా వుంటున్నారు. రాజ్యం అతడి క్కావల్సినవి అందిస్తూ మధ్య మధ్య టీ ఇస్తూ ప్రోత్సహిస్తోంది.

అతడి కుంచె కేన్వాసుమీద కదను తొక్కుతోంది.

చెప్పిన సమయానికి వారం రోజులు ముందుగానే చక్కని ఫ్రేము కట్టించి భార్యా భర్తలిద్దరూ వెళ్ళి పెయింటింగు నిచ్చారు.

చిత్రాన్ని చూసి అచ్చెరువందాడు ఆహ్వాన సంఘాధ్యక్షుడు.

"అమోఘం! అద్భుతం! మీరింత గొప్పగా వేస్తారనుకోలేదు. జీవకళ ఇంతగా వుట్టిపడే చిత్రాన్ని నే నెక్కడా చూళ్ళేదు. మా అమ్మా నాన్నల చిత్రాన్ని వేసిపెడతారా ఎంతంటే అంత ఇస్తాను."

"తప్పకుండా వేస్తాను."

"ఈ సన్మానం హడావిడి అయిపోయాక వచ్చి కన్పించండి. మర్చిపోకండి సుమా! నగరంలోని ప్రముఖుల క్కూడా మీ గురించి చెబుతాను. ఇంత గొప్ప కళని ఇన్నాళ్ళూ ఎక్కడ దాచుకున్నారండి బాబూ! నాకు చాలా సంతోషంగా వుంది. మంత్రిగారూ మురిసిపోతారు. చూస్తూండండి ఇహ మీకు ఎడా పెడా ఆర్డర్లొస్తాయి. మీ చేతినిండా పనే. అన్నట్టు సన్మాన సభకి తప్పకుండా రండి. మీలాంటి కళాకారుడ్ని మంత్రిగారిచేత సన్మానింపజేయటం మా ధర్మం."

"మీ చిత్రానికి వెల కట్టలేనుగాని, ఇది వుంచండి" అని డబ్బు ఇచ్చారు.

పరమానంద పడిపోయాడు పాణి. రాజ్యం వుప్పొంగిపోయింది.

ఇంటిల్లపాదికీ బట్టలూ మిఠాయిలూ కొనుక్కు వెళ్ళారు. అవాళ వారికి పండగే అయ్యింది.

సన్మానం రోజు రానే వచ్చింది.

పాణి, రాజ్యం వెళ్ళారు.

మంత్రి జనార్దనంగార్ని స్థానిక నాయకులూ వివిధ సంఘాలవారూ పూలదండల్తో ముంచెత్తేక ఆయన ప్రసంగించారు:

"మన ప్రాంతపు గాంధీగా ప్రసిద్ధి గాంచిన వియ్యన్నగారి శిష్యుడ్ని. ఆయన్తోబాటు ఎన్నో ఉద్యమాల్లో ఎన్నోసార్లు జైలు కెళ్ళాను. వారు చరఖా కేంద్రాన్ని ప్రారంభించి, దాని నిర్వహణభారాన్ని నాకప్పగించారు. ఆయవాళ బతికి వుండివుంటే నేనింత ఉన్నతస్థితికి వచ్చినందు కెంతగా పొంగిపోయేవారో!........."

జనార్దనం గారి ఉపన్యాసం అనర్గళంగా సాగిపోతోంది.

కళ్ళు చించుకుని చూసింది రాజ్యం.

ఆయన్నెప్పుడూ చూసినట్టు లేదు. మరి తన తండ్రి ప్రియశిష్యుడ్నని చెబుతున్నాడేమని ప్రశ్నించుకుంది.

తన అనుమానాన్ని బయటపెట్టగా "ఏవో చెబుతారు. అవన్నీ పట్టించుకోకూడదు" అన్నాడు పాణి. "అసలు కాంగ్రెసు వాళ్ళెప్పుడో పోయారు. చెట్టు పేరుచెప్పి కాయ లమ్ముకుంటున్నవాళ్ళే వీళ్ళంతా!" అనీ అన్నాడు.

అనంతరం జ్ఞాపికగా పాణి వేసిన చిత్రాన్ని బహూకరించారు. తప్పట్లు మార్మోగాయి. మంత్రిగారు చిత్రం చూసి విభ్రాంతికి లోనయ్యారు.

"ఇప్పుడీ చిత్రాన్ని చక్కగా చిత్రించిన ఆర్టిస్ట్ పాణిని మంత్రిగారు శాలువాతో సత్కరిస్తారు" అని ప్రకటించారు మైకులో.

ఒకరొచ్చి పాణిని స్టేజిమీదకి తీసుకెళ్ళి కూర్చోబెట్టారు.

మంత్రిగారు శాలువా కప్పి పూలదండ వేశారు.

"ఇంత గొప్ప చిత్రకారుడు మన ప్రాంతం వాడైనందుకు గర్విస్తున్నాను. ఇతడు మరిన్ని ప్రశంసల్ని మూట గట్టుకోవాలని ఆశీర్వదిస్తున్నాను. ఉడతా భక్తిగా వెయ్యిన్నూట పదహార్లు బహూకరిస్తున్నాను" అంటూ డబ్బు తీసిచ్చారు.

చప్పట్లు వర్షమై కురిశాయి.

వినమ్రంగా ఆయనకీ సభకీ నమస్కరించాడు పాణి.

అంతలో దగ్గు తెర ముంచుకొచ్చింది. ఉక్కిరి బిక్కిరవుతోంటే ఇబ్బందిగా చూశారు స్టేజీ మీద ప్రముఖులు. నిర్వాహకులొచ్చి అతడ్ని స్టేజిమీంచి దింపారు.

దగ్గు ఆగటం లేదు. మెలికలు తిరిగిపోతున్నాడు. రాజ్యం పరుగునొచ్చి తీసుకెళ్ళి రిక్షా ఎక్కించింది.

"మంత్రిగారు మెచ్చుకున్నారు. జనం మెచ్చుకున్నారు. నాకు చాలా ఆనందంగా వుంది. ప్రపంచాన్ని జయించినట్టుగా వుంది. నేను చిత్రకారుడ్ని. ఆర్టిస్టుని. చిరంజీవిని........" దగ్గుతూనే ఆయాస పడ్తూనే అన్నాడు పాణి.

తర్వాత చెబుదురుగాన్లే అన్నా వినిపించుకోలేదు.

ఎంతో ఆనందంగా చెబుతూ చెబుతూ పెద్దగా దగ్గి వూశాడు.

ఉమ్మినిండా రక్తం!

☆ ☆ ☆

"క్షయ. చాలా ముదిరిపోయింది. ఇంత అశ్రద్ధ చేశారేం?" పాణిని పరీక్షించి అడిగాడు డాక్టర్.

అప్పటికే రాజ్యం నవనాడులూ కుంగి పోగా నిస్త్రాణగా కూలబడి పోయింది.

"ఏదో మామూలు దగ్గు అనుకున్నాంగాని ఇలా అనుకోలేకపోయాం. మీరే రక్షించాలి." ఏడుపుస్వరంతో అర్థిస్తూ చేతులు జోడించింది.

"నా ప్రయత్న లోపం వుండదు. ఆపైన మీ అదృష్టం. పిల్లల్ని మాత్రం దూరంగా వుంచండి."

డాక్టర్ రాసిచ్చిన మందులన్నీ కొనుక్కొచ్చారు.

"డాక్టరేమన్నారు?" కాంతమ్మ అడిగింది.

"త్వరలోనే తగ్గిపోతుందన్నారు........"

అదృష్టవశాత్తూ స్కూలుకి వేసవి శలవు లివ్వడంతో పాణి నెంతో జాగ్రత్తగా చూస్తోంది రాజ్యం. వేళకి మందులిస్తూ సపర్యలు చేస్తోంది. పిల్లల్ని సాధ్యమైనంతవరకూ అతడి దగ్గరికెళ్ళ కుండా జాగ్రత్తపడుతోంది. కారణం బోధపడక అయోమయంగా చూస్తున్నారు వాళ్ళు.

"నాకేమైనా ఫర్లేదు, నిశ్చింతగా చనిపోగల్ను. నాకు కళాకారుడిగా ఎనలేని గుర్తింపు వచ్చింది. అది చాలు నాకు" అంటున్నాడు పాణి శాలువాని కప్పుకుని పొంగిపోతున్నాడు.

పిల్లల్ని అక్కున చేర్చుకుని కథలూ కబుర్లూ చెప్పాలన్పిస్తోంది. ఇదివరకెప్పుడూ కలగని కోరిక ఇప్పుడు వేళ్ళూని శాఖోపశాఖలుగా విస్తరిస్తోంది.

తన కోరిక బయటపెట్టాడు.

పమిట కొంగు నోట్లో కుక్కుకుని నిస్సహాయంగా విలపిస్తూండి పోయింది రాజ్యం.

అతడికర్థంకాగా ఆ వేదనని బలవంతాన దిగమింగుకున్నాడు.

నాలుగు రోజులకి రోగం తగ్గినట్టే తగ్గి అమాంతం తిరగబెట్టింది. మరి తట్టుకోలేక రక్తం కక్కుకుని కూలిపోయాడు పాణి.

అతడిలోని చిలుక ఎగిరిపోయింది!

అల్లుకున్న ఆధారం కూలిపోయేసరికి బావురుమంది రాజ్యం. భోరున భోరున విలపిస్తోన్న ఆమెని ఆపటం ఎవరితరమూ కాలేదు!

పాణి తరపు బంధువులంతా కట్టకట్టుకుని నొచ్చారు. ఇన్నాళ్ళూ ఏమయ్యారో ఎలా వున్నారో తింటున్నారో పస్తులుంటున్నారో పట్టించుకోని బంధుజనమంతా మా వాడు మా వాడంటూ వచ్చారు. ఎంత ఘోరం జరిగిందీ అంటూ గుండెలు బాదుకున్నారు.

అత్తవారింటికి ఇల్లరికం వెళ్ళి నాశనమయ్యాడన్నారు. టీ. బీ వస్తే అంత ముదిరే దాకాఎందుకు మగ్గబెట్టేవని రాజ్యాన్ని నిందించారు. పట్నంలో వుండి కూడా డాక్టర్‌కి చూపించ లేదంటే ఏమనుకోవాలని ప్రశ్నించారు. ఆమెకి మొగుడికన్నా ఉద్యోగమే ముఖ్యమై పోయిందని ఆరోపించారు. ఇంతకింతా అనుభవిస్తావని శపించి వెళ్ళిపోయారు.

పెద్ద కర్మ నాటికి మళ్ళీ అంతా వచ్చారు. రాజ్యం మేనమావలు కమ్యూనిస్టులు గనుక ఎక్కడ వితంతువుని చెయ్యనివ్వరో నని కత్తులు నూరుతూ వచ్చారు.

రాజ్యం ఏమీ అన్లేదు. మరేమీ కల్పించుకోలేదు. గుడ్లప్పగించి చూస్తూండిపోయిందంతే.

నిజానికి భర్త మరణం తాలూకు షాక్‌నుండి పూర్తిగా తేరుకోలేదామె. అతడేదో ఊరి కెళ్ళాడు, తిరిగొస్తాడని ఎదురు చూస్తున్నట్టుగా వుంది. ఇంత చిన్న వయస్సులో ఇలా ఒక రోగం పొట్టన బెట్టుకుంటుందంటే ఇంకా నమ్మకం కలగటం లేదామెకి.

మరీ ఆమె తల్లికి చేసినట్టుగా కాదుగాని ముక్తసరిగా రాజ్యాన్ని విధవని చేసి, తెల్ల పంచె కప్పి, ఎవరితోవన వాళ్ళెళ్ళిపోయారు.

గుండెలవిసేలా ఏడుస్తూండిపోయారు రాజ్యమూ ఆమె పిల్లలూ తల్లీనూ.

మరి పది రోజులకి ఊళ్ళోకి స్వామీజీ వచ్చారు. ఆయన కెందరో ఆడ మగ శిష్యులున్నారు. శిష్యసమేతంగా దేశాటన చేస్తూ అన్ని పుణ్యక్షేత్రాలూ దర్శిస్తున్నట్టు కాంతమ్మకి తెలిసింది.

"నేనెందుకో ఈ సంసారపు ఆటుపోట్లకి తట్టుకోలేకపోతున్నాను స్వరాజ్యం! బతికి బట్టకడితే తిరిగొస్తాను. లేకపోతే, ఆ భగవంతుడు నిన్నూ నీ పిల్లల్నీ చల్లగా చూడాలి" అని చెప్పి, స్వామీజీ శిష్యురాలిగా మారిపోయింది. ఆయన బృందంతోబాటు వెళ్ళిపోయింది కాంతమ్మ.

ఆమెని ఆపగల శక్తి రాజ్యానికి లేకపోయింది!

# 25

తెల్లవస్త్రాలు ధరిస్తోంది రాజ్యం.

ఆమెకి తెలీకుండానే తనలో ఏదో న్యూనతాభావం ప్రవేశించినట్టూ ఎంతగానో కుంచించుకుపోయినట్టుగానూ వుంది. తన స్వేచ్ఛ నెవరో హరించి ఖైదీ దుస్తుల్లాంటి దుస్తులు కట్టబెట్టినట్లుగా వుంది. ఒక్కోసారి వాటిని చీలికలు పీలికలు చేసి పారెయ్యాలన్నంత ఆవేశమూ కలిగింది. అయినా అశక్తతతో తనలో తను రగలసాగిందితప్ప ఏమీ చేయ లేనంత బలహీనురాలయ్యింది.

"ఈ బట్టలొద్దమ్మా రంగు చీరలు కట్టుకోమ్మా!" అంటూ పిల్లలు గోల పెట్టారు. కన్నీళ్ళు పెట్టుకుందితప్ప జవాబివ్వలేదు.

పలకరించడాని కొచ్చిన లెనిన్ బాబు కూడా "కాలం మారింది. దానితోబాటే మన పద్ధతులూ ఆచారాలూ మారాలి. అంతకంతకీ మనం ముందుకి నడవాలి గాని వెనక్కినక్కి నడిచి రాతి యుగంలో కెళ్ళకూడదు. భర్త మీది ప్రేమాభిమానాలకీ ఈ వేషానికీ సంబంధం లేదసలు. ఏ భర్త కూడా తను పోయాక ఇలా వుండమని శపించదు. అయినా భర్త లేకపోతే భార్యకి బతుకు లేదనడం అనాగరికం. కొత్తదారి తొక్కినప్పుడు రాళ్ళూ ముళ్ళూ గుచ్చుకుంటాయి. తప్పదు. అయినా ముందుకెళ్తేనే మరికొందరు అనుసరించగలరు. అప్పుడే ఒక దారి ఏర్పడుతుంది. తర్వాతది పాతది అవుతుంది. ఆలోచించుకో" అన్నాడు.

అతడెళ్ళేక తీవ్రంగా ఆలోచించింది.

తండ్రి బతికివుంటే ఏమనేవారో వూహించుకుంది.

ఆ వెంటనే లలిత గుర్తొచ్చింది. ఆమె వితంతువైనా రామనాథనికిచ్చి తండ్రి ఆదర్శ వివాహం చేసిన వైనమూ గుర్తొచ్చింది.

ఆధారం కోల్పోయిన లలితకి మరో ఆధారం చూపారు నాన్న.

వాళ్ళిప్పుడెంతో ఆనందంగా వున్నారు. పిల్లా పాపల్తో చల్లగా వున్నారు.

అలాంటి ఆదర్శమూర్తి కడుపున పుట్టి తనిలా తిరోగమన మార్గాన నడవటం.......తండ్రి బతికివుంటే ఏమాత్రం హర్షించేవారు కాదన్నది సత్యం పునఃసత్యం!

భర్త రాకతో వచ్చినవి పుస్తెలూ మట్టెలూను. అతడ్తో అవే పోవాలి

గాని పుట్టుకతో వచ్చిన బొట్టూ గాజాలూ రంగు బట్టలూ ఎందుకు పోవాలి?

ఒక నిశ్చయానికొచ్చింది. ఒక్కసారి శక్తిసంపన్నురాలైనట్టుగా అన్పించింది. గబ గబా తెల్లచీర విప్పి తలారా స్నానం చేసింది. మునుపటి రంగు బట్టలు ధరించింది. గాజులు వేసుకుంది. నుదుట కుంకుమ బొట్టు పెట్టుకోబోతోంటే ఎందుకో ఆమె చేయి వణికింది. ఆ పనిని విరమించి తిలకంతో చిన్న బొట్టు పెట్టుకుంది.

స్కూలు నుంచొచ్చిన శ్రీకాంత్, గాంధీ, సుబ్బలక్ష్మి సంబరంగా తల్లిదరి చేరారు.

ఆమె వారి తల నిమిరింది ఆప్యాయంగా.

"ఎప్పుడూ ఇలాగే వుండమ్మా!" అన్నారు.

"వుంటాను. తప్పకుండా వుంటాను."

ఆమె ఏవో పనులమీద ఇట్నుంచి బయటికొచ్చినప్పుడు ఇరుగు పొరుగు చూశారు. నుదురు ముడివేసి చూశారు. నోరు తెరిచి చూశారు. ఆడవారుసైతం మూతులు ముడిచారు.

ఆమె కెంతో బాధగా అన్పించింది. అయినా వారిని పట్టించుకోకూడదని నిర్ణయించుకుంది.

శలవు పూర్తయ్యింది. స్కూలుకెళ్ళింది రాజ్యం. భర్త చనిపోయాక ఇదే వెళ్ళటం.

స్కూల్లో అంతా వింతగా చూశారు. కొందరు విద్యార్థులు కూడా వింతగా చూట్టం, కొద్దిమంది ఆడపిల్లలు ఏహ్యంగా చూట్టం ఆమె గమనించకపోలేదు.

"గుండమ్మ కథలో 'లేచింది మహిళాలోకం' అంటే ఏమిటో అనుకున్నాను. విడాకుల చట్టం తేవడమే కాదు, విధవల రాజ్యమూ తెస్తారు." తెలుగు పండితుడు కృష్ణశాస్త్రి అన్నారు రాజ్యాన్ని చూసి.

"ఛా ఛా. దేశం తగులబడి పోతోందండీ! చూస్తూండండి. ఇహ కుక్కమూతి పిందెలే కాస్తాయి." మరో మాష్టారన్నారు.

వాటిని కుక్కమొరుగుళ్ళుగా భావించి హెడ్మాస్టారు గదిలో కెళ్ళింది.

కొత్తగా వచ్చిన హెడ్మాస్టారు పరమానందయ్య నోరు తెరిచేశారొక్కసారే. దెయ్యం నడచి వచ్చినట్టుగా చూశారు. ఆయనకి చాందస చక్రవర్తి అని పేరుంది. నామాలు ధరించి పంచె కట్టుకుని మెడలో

రుద్రాక్షమాల వేసుకుంటారెప్పుడూ. నియమమూ నిష్ఠా ముఖ్యమంటారు. సంప్రదాయాల్ని ప్రాణప్రదంగా భావిస్తారారాయన.

"ఇదేవిటమ్మా ఎంత కలికాలమైనా ఈ అవతారం ఏవిటి? ఉపాధ్యాయులు పిల్లలకి ఆదర్శప్రాయంగా వుండాలితప్ప ఇలా వుంటే ఎలా? మీ పద్ధతేం బావోలేదు" అన్నారాయన మొఖం ముడుచుకుని.

మరేమీ బదులివ్వకుండా గిరుక్కున వెనుదిరిగి వచ్చేసింది రాజ్యం.

మిగతా టీచర్లు నోటితో సానుభూతి చూపి, నొసటితో వెక్కిరించారు.

అంతటితో ఆ సంగతి వదిలేస్తారని భావించింది. కాని నాలుగు రోజులయ్యాక మళ్ళీ పిలిచారు హెడ్మాస్టారు.

"మీ పద్ధతి బావుండలేదని ఫిర్యాదు లొస్తున్నాయి. మీ వల్ల పిల్లలు పాడవుతారని తల్లిదండ్రులు భయపడుతున్నారు. దానికి మీ సంజాయిషీ ఏమిటి?"

పెద్దాయననీ హెడ్మాస్టారనీ ఇంతదాకా ఆయనంటే ఎంతో గౌరవం వుండేదామెకి. కాని ఆ మాటలంటూ ఆయన చూసిన చూపుకి అదంతా కొట్టుకుపోయింది.

"సంజాయిషీ ఇవ్వాల్సినంత తప్పేం చేశాను?"

"సిగ్గులేకపోతే సరి. ఒక విధవ వుండాల్సిన తీరున వున్నావా?"

"నేను పాఠాలు సరిగ్గా చెప్పకపోతే చెప్పండి. అసభ్య వస్త్రధారణ చేస్తే వేలెత్తి చూపించండి. దిద్దుకుంటాను. అంతేగాని, ఎలాటి చీర ధరించాలో ఎలా అలంకరించుకోవాలో మీరు ఆదేశిస్తే సహించను. నా వ్యక్తిగత విషయాల్లో ఇతరుల జోక్యం అనవసరం."

"ఓహో, అంతవరకూ వచ్చిందన్నమాట! బరి తెగించిన ఆడదే ఉద్యోగాని కొస్తుందన్న నా నమ్మకాన్ని నిజం చేశావు. నీలాటివారు నా స్కూల్లో పని చేయటానికి నే నంగీకరించను. నీ పద్ధతి మార్చుకుంటే తప్ప నువ్వు స్కూలుకి రావొద్దు." తెగేసి చెప్పేశా డాయన.

బ్రాన్పడిపోయింది రాజ్యం.

ఉద్యోగంనుంచి తొలగిస్తాడేమోనని భయమేసిందొక్కసారే. అదే జరిగితే పసిపిల్లల్ని పోషించడమెలా?

దిగులుగా చూసింది. బేలగా చూసింది.

విజయగర్వంతో చూశా డాయన. "ఉద్యోగం కావాలంటే నీ అవతారం మార్చుకుని రా."

గుడ్ల నీళ్ళు కుక్కుకుని వెనుదిరిగింది. రిక్షా ఎక్కి ఇంటికెళ్ళిపోయింది.

ఏం చేయాలో తోచలేదు. ఈ పరిస్థితినుండి బయటపడట మెలాగో బోధపళ్ళేదు.

కిం కర్తవ్యం? ఏటి కెదురీదటమా, తలొంచి కొట్టుకుపోవడమా?

ఏవో తెలీని భయాలు, ఆర్థిక భూతాలు కోరలు చాచి భయ పెడుతోంటే సన్నగా కంపించింది. ఒంటరిగా అసహాయురాలిగా భావించుకుని విలపించింది.

ఇంతలో ఓ అయిదారుగురు మహిళలొచ్చారు.

ప్రగతిశీల మహిళాసంఘ సభ్యులమన్నారు. ఆమెకి స్కూల్లో జరిగిన అవమానం గురించి తెలిసిందన్నారు. అనాదిగా ఆడదానిమీద జరుగుతున్న అన్యాయాల్ని ఇక కొనసాగనివ్వమన్నారు. 'నీ వెంట నీ వెనుక నీకు అండగా మేమున్నాం' అని ముక్తకంఠంతో అభయమిచ్చారు.

వారితో మాట్లాడేక వారి కార్యక్రమాలు తెలుసుకున్నాక రాజ్యానికెంతో వూరటగా వుత్సాహంగా అన్పించింది. వారు పెద్దగా చదువుకోకపోయినా వారి తర్కానికీ ధైర్యానికీ తెలివితేటలకీ రాజకీయపరిజ్ఞానానికీ అచ్చెరు వందింది.

తను ఒంటరికాదు. తనకి కొండంత అండగా ఎందరో వున్నారన్న సత్యం ఆమె అణువణువుని వుత్సాహపరిచింది. ఉత్తేజపరిచింది. నూతన శక్తినిచ్చింది. వెన్నుతట్టింది.

మర్నాడు సంఘ మహిళలంతా పొలోమంటూ హెడ్మాస్టారి దగ్గరికెళ్ళారు. వారిని చూసేసరికి పరమానందయ్య కాళ్లు వణకడం మొదలెట్టాయి.

"రాజ్యంగార్ని రావొద్దన్నార్టగా? ఎందుకు స్కూలుకి రావొద్దన్నారో చెప్పండి"

"ఏ జీవో ప్రకారం ఆమె వేషధారణ అభ్యంతరకరమో చెప్పండి."

"ఎవరెలా వుండాలో శాసించే హక్కు మీకెవరిచ్చారో చెప్పండి."

ఒకరి తర్వాత ఒకరు ప్రశ్నలవర్షం కురిపించారు.

ఉక్కిరిబిక్కిరయ్యారు. ఏం చెప్పాలో తోచక నీళ్ళు నమిలారు. దాంతో వారు మరింత విజృంభించారు.

"సానుభూతి చూపాల్సింది పోయి ఆడకూతుర్ని పట్టుకుని అవమాని స్తారా? మీ అభిప్రాయం త్వరగా చెబితే డీ.ఈ.ఓ. గారి దగ్గరకీ కలెక్టరుగారి

దగ్గరికీ వెళ్తాం. ఈ అన్యాయాన్ని వాడవాడలా చాటి ప్రతిఘటిస్తాం. మీలాటి చదువుకున్న మూర్ఖులకి బుద్ధిచెబుతాం."

"అమ్మా – తప్పైపోయింది. పిల్లలుగలవాడ్ని. క్షమించి వదిలెయ్యండి." అంటు ఫెడీ ఫెడీమని లెంపలు వాయించుకున్నా డాయన!

సమస్య ఇంత తేలిగ్గా విడిపోతుందని వూహించని ఆడజనం విస్తు బోయారు. అనంతరం ఆనందంతో జయ జయ నినాదాలు చేస్తూ కదిలారు. సంఘటిత శక్తియొక్క విశ్వరూపం దర్శించినట్టు అపూర్వాను భూతికి లోనైంది రాజ్యం. తను ఒంటరి కాదన్న భావం వేయి ఏనుగులబలాన్నిచ్చింది. అన్నపూర్ణత్త గుర్తొచ్చింది.

"ఇంతవరకూ నా ఒక్కరిగురించే ఆలోచిస్తూండేదాన్ని. ఇకనుంచి అందరిగురించీ ఆలోచిస్తాను. అందర్తో భుజం భుజం కలుపుతాను. స్త్రీకి జరుగుతోన్న అన్యాయాల్ని ప్రతిఘటిస్తాను" అనుకుంది రాజ్యం.

ఆమె పిడికిళ్ళు బిగిశాయి!

## 26

ఒక్కసారిగా జీవితం ఎంతో శూన్యంగా బోరుగా అన్పించసాగింది రాజ్యానికి.

నిన్న మొన్నటివరకూ భర్త వుండేవాడు. అతడివల్ల కుటుంబానికి ఒరిగింది తక్కువ. అయితేనేం పెద్ద దిక్కులా వుండేవాడు. కష్టంసుఖం చెప్పుకోడానికి తోడునీడగా వుండేవాడు. పనొచ్చినా ప్రయాణ మొచ్చినా నేనున్నానంటూ ముందుకొచ్చేవాడు!

నాన్న పోయినప్పట్నుంచీ తనని అంటిపెట్టుకునుంది తల్లి. ఆమె అసరా లేకపోతే తనేమయ్యేదో ఊహించడం కష్టం. తనుస్కూలుకెళ్తే పిల్లల ఆలనా పాలనా చూసేది. పెద్దదానిలా సలహాలిచ్చేది. అవసరమైతే మందలించేదికూడా.

ఇద్దరూ ఒకేసారి దూరమయ్యారు.

ఒకరు కనిపించని తీరాలికి వెళ్ళిపోతే, మరొకరు వినిపించనంత దూరం వెళ్ళిపోయారు!

పొద్దుటే లేవటం, వంట చెయ్యడం, పిల్లల్ని స్కూలుకి పంపడం స్కూలయ్యాక రావటం, మళ్ళీ వంటా తిళ్ళూ నిద్రా.........అంతా రొటీన్.

గుడ్ల నీళ్ళు కుక్కుకుని వెనుదిరిగింది. రిక్షా ఎక్కి ఇంటికెళ్ళిపోయింది.

ఏం చేయాలో తోచలేదు. ఈ పరిస్థితినుండి బయటపడట మెలాగో బోధపళ్ళేదు.

కిం కర్తవ్యం? ఏటి కెదురీదటమా, తలొంచి కొట్టుకుపోవడమా?

ఏవో తెలీని భయాలు, ఆర్థిక భూతాలు కోరలు చాచి భయ పెడుతోంటే సన్నగా కంపించింది. ఒంటరిగా అసహాయురాలిగా భావించుకుని విలపించింది.

ఇంతలో ఓ అయిదారుగురు మహిళలొచ్చారు.

ప్రగతిశీల మహిళాసంఘ సభ్యులమన్నారు. ఆమెకి స్కూల్లో జరిగిన అవమానం గురించి తెలిసిందన్నారు. అనాదిగా ఆడదానిమీద జరుగుతున్న అన్యాయాల్ని ఇక కొనసాగనివ్వమన్నారు. 'నీ వెంట నీ వెనుక నీకు అండగా మేమున్నాం' అని ముక్తకంఠంతో అభయమిచ్చారు.

వారితో మాట్లాడేక వారి కార్యక్రమాలు తెలుసుకున్నాక రాజ్యానికెంతో వూరటగా వుత్సాహంగా అన్పించింది. వారు పెద్దగా చదువుకోకపోయినా వారి తర్కానికీ ధైర్యానికీ తెలివితేటలకీ రాజకీయపరిజ్ఞానానికీ అచ్చెరు వందింది.

తను ఒంటరికాదు. తనకి కొండంత అండగా ఎందరో వున్నారన్న సత్యం ఆమె అణువణువుని వుత్సాహపరిచింది. ఉత్తేజపరిచింది. నూతన శక్తినిచ్చింది. వెన్నుతట్టింది.

మర్నాడు సంఘ మహిళలంతా పాలో మంటూ హెడ్మాస్టారి దగ్గరికెళ్ళారు. వారిని చూసేసరికి పరమానందయ్య కాళ్లు వణకడం మొదలెట్టాయి.

"రాజ్యంగార్ని రావొద్దన్నార్టగా? ఎందుకు స్కూలుకి రావొద్దన్నారో చెప్పండి"

"ఏ జీవో ప్రకారం ఆమె వేషధారణ అభ్యంతరకరమో చెప్పండి."

"ఎవరెలా వుండాలో శాసించే హక్కు మీకెవరిచ్చారో చెప్పండి."

ఒకరి తర్వాత ఒకరు ప్రశ్నలవర్షం కురిపించారు.

ఉక్కిరిబిక్కిరయ్యారు. ఏం చెప్పాలో తోచక నీళ్ళు నమిలారు. దాంతో వారు మరింత విజృంభించారు.

"సానుభూతి చూపాల్సింది పోయి ఆడకూతుర్ని పట్టుకుని అవమాని స్తారా? మీ అభిప్రాయం త్వరగా చెబితే డీ.ఈ.ఓ. గారి దగ్గరకీ కలెక్టరుగారి

కాంట్రాక్టర్లూనూ. కూడూ గూడూ గుడ్డ అన్నది సామాన్యులకి ఓ కలగానే మిగిలిపోయింది. స్వాతంత్ర్యం వచ్చి పది పదిహేనేళ్ళవుతోన్నా ఎక్కడ వేసిన గొంగళి అక్కడే వున్నట్టుగా వుంది. ఎటు చూసినా దారిద్ర్యం ఆకలిచావులు నిరుద్యోగం అధికధరలు గిట్టుబాటుధర లభించని రైతులు దెబ్బతిన్న చేతివృత్తులు.........!"

"స్వరాజ్యం వస్తే రామరాజ్యం వస్తుందనీ అంతా చల్లగా సుఖంగా సంతోషంగా వుంటారనీ ఆశించాం......."

"దేశ సంపద అరవై డెబ్బై కుటుంబాల చేతుల్లో వుండిపోయినప్పుడు కొట్లాది జనుల బతుకుల్లో వెలుగు పూలెలా పూయగలవు చెప్పు? దున్నే వాడిదే భూమి కావాలి. శ్రమకి తగ్గ ఫలం లభించాలి. చేతి వృత్తుల్నీ కుటీర పరిశ్రమల్నీ ప్రోత్సహించాలి. ఉపాధి మార్గాలు కల్పించాలి. ఇదంతా జరగాలంటే కార్మిక కర్షక రాజ్యం రావాలి తప్ప ఈ బూర్జువా ప్రభుత్వాల వల్ల ఎలాటి లాభమూ వుండదు. వారి ఆస్తులు పెరిగి ధనిక పేద వర్గాల మధ్య అగాధం మరింత పెద్దదవుతుందంతే!"

"ప్రభుత్వం ఎన్నో ప్రాజెక్టులు కడుతోంది. ప్రణాళిక లేస్తోంది కదా?"

"నొప్పి తగ్గితే చాలదు, రోగం నయం కావాలి: అసలు రోగాన్ని అలాగే వుంచి పైపైన లేపనాలు పూస్తే ప్రయోజన మేముంటుంది చెప్పు."

"మీ మాటలు వింటోంటే ఏదో చెయ్యాలన్న ఉత్సాహం కలుగుతోంది." ఉత్తేజితురాలవుతూ అంది రాజ్యం.

"పాలకుల స్వభావాన్ని తెలియ జేస్తూ జనాన్ని జాగృతం చెయ్యాలి. చైతన్యవంతుల్ని చెయ్యాలి. విద్యార్థుల్ని, మహిళల్ని, యువజనుల్ని, కార్మికుల్ని, కర్షకుల్ని అందర్నీ సంఘటితపరచాలి. వారందరినీ ఐక్యవేదికమీదకి తీసుకరావాలి. పోరాటపటిమ గరపాలి. హక్కుల్ని సాధించుకోవాలి. సమసమాజ నిర్మాణానికి బాట వేయాలి."

"ఇవాళ్టి నుంచీ మహిళా సంఘంలో చురుకైన పాత్ర ధరిస్తాను. మూఢ నమ్మకాలనీ మూఢాచారాలనీ విసర్జించేలా కృషి చేస్తాను. విద్యావిజ్ఞానం ఆరోగ్యం పరిశుభ్రత – అన్నిట్లోనూ సహకరిస్తాను. లింగవివక్షని ఎదుర్కొంటాను. అన్యాయాలకీ అసమానతలకీ వ్యతిరేకంగా మహిళల చేత పిడికిళ్ళు బిగింప జేస్తాను."

"ముదితల్ నేర్వగరాని విద్య కలదే ముద్దార నేర్పించినన్ అన్నారు. సరైన దారికి మళ్ళిస్తే స్త్రీ శక్తిని మించినదీ వుండదు, స్త్రీలు సాధించలేనిదీ వుండదు" అన్నారు సుందరం అభినందనపూర్వకంగా చూస్తూ.

☆ ☆ ☆

శ్రీకాంత్, గాంధీ తొమ్మిదో క్లాసులో కొచ్చారు.

సుబ్బలక్ష్మి ఏడో తరగతి చదువుతోంది.

స్కూలూ ప్రైవేటూ అంటూ పిల్లలు బిజీగా వుంటున్నారు. ఎవరి పనులు వారు చేసుకుంటున్నారు.

రాజ్యానికి ధాంతో సమయం మిగుల్తోంది. దాన్ని ఉపాధ్యాయ సంఘానికి మహిళా సంఘానికి వినియోగిస్తోంది.

పల్లెల్లో బస్తీలో తిరుగుతూ మహిళలకెన్నో విషయాలు బోధిస్తున్నారు. ముఖ్యంగా పరిశుభ్రత ఆరోగ్యం కుటుంబ నియంత్రణ అక్షరాస్యత వగైరాల గురించి విరివిగా ప్రచారం చేస్తున్నారు.

ఎక్కడ ఏ ఆడ కూతురికి అన్యాయం జరిగినా సరే అక్కడ ప్రత్యక్షమై బాధితులకి అండగా నిలుస్తున్నారు. పోరాడుతున్నారు.

ఈ క్రమంలో తమ భావాన్ని తేలికగా చెప్పడానికీ ప్రచారంలో పెట్టడానికీ వివిధాంశాలమీద పాటలు రాయసాగింది రాజ్యం. వాటిని పాడుతూ ఉత్తేజపరుస్తున్నారు సంఘసభ్యులు.

స్కూల్లోకి కొత్తగా ఇద్దరు టీచర్లొచ్చారు. మరియమ్మ కొత్తగా నియమించబడగా, రాజారావు ట్రాన్స్ఫర్ మీద వచ్చాడు.

మరియమ్మని చూసి రాజ్యం ఎంతో సంతోషపడింది. తనకి తోడుగా మరో ఆడ టీచర్ లభించడం ఓ కారణమైతే హరిజన మహిళ చదువుకోవడమేగాక ఉద్యోగినిగా రావడం మరో కారణం.

హరిజనుల సాంఘిక ఆర్థిక పరిస్థితుల్లో బహుముఖంగా వస్తోన్న మార్పులకి వికసిస్తోన్న వికాసానికి ఎంతగానో పొంగిపోతోంది.

వాళ్ళు అన్ని రంగాల్లోకీ మరింతగా చొచ్చుకుపోయి జన జీవన స్రవంతిలో పాలు నీళ్ళలా కలిసిపోవాలని మనసారా ఆశిస్తోంది. ఆకాంక్షిస్తోంది.

రాజ్యం గురించి ఎన్ని వివరాలు ఎలా సేకరించాడో గాని ఆమెని పొగట్టమే పనిగా పెట్టుకున్నాడు రాజారావు.

అసలు సిసలు త్యాగధనులంటూ ఒకసారి వియ్యన్నని పొగుడుతాడు.

ఉద్యోగం చేస్తున్న మొదటి తరపు మహిళ అంటూ ఆమెని ఆకాశాని కెత్తుతాడింకోసారి.

భర్త చనిపోయినా ఒంటిగా సంసార రథాన్ని లాగుతూ పిల్లల్ని ప్రయోజకుల్ని చేస్తున్నారంటూ మెచ్చుకుంటాడు మరోసారి.

ఎవరూ లేనప్పుడు ఆమె అందాన్నీ తెలివితేటల్నీ ప్రత్యేకంగా ప్రశంసిస్తూంటాడు.

అంతేకాదు. రాజ్యానికేం కావాలన్నా క్షణాల్లో తెచ్చిస్తూ చేదోడు వాదోడుగా వుంటున్నాడు. ఒక్కోసారి ఇంటికొచ్చి పిల్లలతో చక్కగా కబుర్లు చెప్పి నవ్విస్తున్నాడు కూడా

రాజ్యం పరిస్థితి అడకత్తెరలో పోకలా వుంది.

అతడ్ని దూరంగా వుంచలేకపోతోంది. పరిచయాన్ని తుంచలేక పోతోంది. అదేసమయంలో అంతా తమగురించి ఏమనుకుంటారోనని భయంగా వుంది. బంధువులూ మిత్రులూ ఏమంటారోనని ఆందోళనగానూ వుంది. పిల్లల భవిష్యత్తేమవుతుందోనని ఆరాటంగానూ వుంది.

అటువంటి సమయంలో లెనిన్‌బాబు వచ్చాడు.

అతడిప్పుడు పార్టీలో బాగా ఎదిగాడు. ఈసారి ఎమ్మెల్యే పదవికి పోటీ చేయనున్నట్టూ అందుకు తగిన ఏర్పాట్లు చేసుకోడానికొచ్చి నట్టూ చెప్పేడు.

"నువ్వో నాయకుడిగా ఎదిగినందుకు అత్తయ్యా మావయ్యా వుండి వుంటే ఎంత పొంగిపోయుందురో" అంది రాజ్యం.

"వాళ్ళదంతా గొర్రెల పద్ధతి. గుడ్డిగా అనుసరించడమే తెలుసు. నాయకులవ్వడం వాళ్ళకి తెలీదు. అంది వచ్చిన ప్రతి అవకాశాన్నీ సద్వినియోగం చేసుకున్నవాడే చక చకా అందలం ఎక్కగలడు. అధికారాన్ని అందుకోగలడు"

పెను కెరటమేదో మొఖాన్ని తాకినట్టు ఉల్కిపడింది. అనుమానంగా నమ్మలేనట్లుగా చూసింది. ఆమె భావం గ్రహించినట్టు నవ్వేడతడు.

"పార్టీ ఏదన్నది ముఖ్యం కాదు, పదవి ముఖ్యం. అధికారం ముఖ్యం!"

"నమ్మలేకపోతున్నాను. అనేక ఏళ్ళుగా కమ్యూనిష్టు పార్టీలో వున్న నువ్విలా మాట్లాట్టం........"

"అందరి కోసం అరుస్తూ కూర్చుంటే మనకేం మిగులుద్దీ! మన పిల్లలకేం దక్కుద్దీ! అందుకే మా పిల్లల్ని పార్టీ గొడవలకి దూరంగా

హైదరాబాదులో వుంచి చదివిస్తున్నాను. పైకి తామేదో నిస్వార్థపరులమని కబుర్లు చెబుతారుగాని అంతా ఇంతేనే. కీర్తి కోసం కొందరు, అధికారం కోసం కొందరు, డబ్బు కోసం ఇంకొందరు. అన్ని పార్టీల నాయకులూ రంగులు తేడాలున్నా ఒక తానుగుడ్డలే!"

తను పతనమవడమేగాక తన దిగజారుడుతనాన్ని ఎంత చక్కగా సమర్థించుకున్నాడు!

సుందరంలాంటి నిస్వార్థ నాయకులు త్యాగధనులు ఎందరో వున్నారన్న సంగతి కన్వీయంట్‌గా విస్మరించాడు!

అతడన్నదాంట్లో ఒక్కటిమాత్రం నిజం.

"ఒకప్పుడు నిస్వార్థపరులు నాయకులయ్యారు. ఇప్పుడు భూస్వాములూ పెట్టుబడిదార్లూ కాంట్రాక్టర్లూ నాయకులవుతున్నారు. రాబోయే కాలంలో దొంగలూ గూండాలూ కూడా నాయకులైనా ఆశ్చర్యపడక్కర్లేదు!"

"రాజకీయ గొడవల్లో పడి నీ సంగతి మర్చిపోయాను. ముఖ్యంగా నే వచ్చిన పనేవిటంటే నువ్వు మళ్ళీ పెళ్లిచేసుకో స్వరాజ్యం! జీవితాంతం ఒంటరిగా బతకలేవు........"

"ఈ వయస్సులో నాకు పెళ్లా?"

"నీకేమంత వయస్సు మించిపోయిందనీ? ఒంటిమీద ముప్పై అయిదేళ్ళుకూడా లేవుకదా......"

"ఎదిగిన పిల్లల్ని పెట్టుకుని పెళ్ళిపీటలమీద కూర్చోనా?"

"అదంతా ట్రాష్. పిచ్చిసెంటిమెంట్లతో జీవితాన్ని పాడుచేసుకోకు. నీకు నచ్చినవాడు తారసపడితే సరే. లేకపోతే నన్ను చూడమంటే నేను చూస్తాను."

"నన్ను కొంచెం ఆలోచించుకోనీ."

అతడెళ్ళిపోయాడు.

అతడి మాటలు మళ్ళీ మళ్ళీ చెవుల్లో మార్మోగాయి.

రాజారావు కళ్ళముందు కదిలాడు.

గుండెలు ఝల్లుమన్నాయొక్కసారే!

# 27

"మాలపల్లెపై అగ్రవర్ణాలదాడి. ముగ్గురు హరిజనుల సజీవదహనం!"

పత్రికలో వచ్చిన వార్తని చూసి సభ్యసమాజం సిగ్గుతో తలదించుకుంది.

అభ్యుదయవాదులంతా ఆక్రోశించారు. ఆగ్రహంతో వూగిపోయారు.

"ఇదా మనం సాధించిన ప్రగతి?" అని ప్రశ్నించుకుని విలవిల్లాడింది రాజ్యం.

సుందరం సలహా మేరకు ఓ బృందం ఆ గ్రామానికి పయనమైంది. వాస్తవ స్థితిగతుల్నీ, ఆ ఘోర దురంతానికి కారణాలనీ అధ్యయనం చెయ్యదలిచారు.

బృందానికి – అటు పోలీసుల్నుంచీ ఇటు అగ్రవర్ణాలవారినుంచీకూడా సహాయసహకారాలు లభించలేదు.

"మీరనవసంగా తలదూర్చి రాద్ధాంతం చేశారో మర్యాద దక్కదు" అని హెచ్చరించారు కూడా.

అయినా వెనకాడకుండా బాధితుల్ని పరామర్శించారు. హరిజనుల్నందర్నీ కలిసి మాట్లాడారు. గ్రామపెద్దల్నీ ప్రశ్నించారు.

సేకరించిన వివరాలని ఒక క్రమంలో పేర్చి "ఔరా!" అని ముక్కుమీద వేలేసుకున్నారు.

వరి కోతలు సీజన్ మొదలయ్యింది. కూలి రేట్లు పెంచమన్నారట కూలీలు. భూస్వాము లంగీకరించలేదు. రేటు పెంచితే తప్ప కూలికి రామని తెగేసి చెప్పేర్ట.

దాంతో ఆగ్రహంతో మండిపోయారు. వారిని చావుదెబ్బ తీసి చెప్పుకింద వుంచుకోవాలని చూశారు. మళ్ళీ ఎప్పుడూ తలెత్తకుండా గుణపాఠం చెప్పాలనుకున్నారు. అదనుకోసం చూస్తోంటే ఓ హరిజనుడు అగ్రకులపు అమ్మాయిని ప్రేమిస్తున్నానని చెప్పేట్ట.

దాన్ని సాకుగా తీసుకుని పెద్దలంతా ఒంటి కాలి మీద లేచారు. నిమ్నకులస్తుడు బరి తెగించి అగ్రవర్ణపు అమ్మాయిని ప్రేమిస్తాడా? అని నిలదీశారు. ఆ సంగతి ఆ అమ్మాయితో చెప్పడానికి వాడి కెన్ని గుండె లంటూ వీరంగ మాడారు.

అర్ధరాత్రి వేళ ఆ ప్రేమికుడి ఇంటి మీద దాడి చేశారు. తలుపు

గొళ్ళెం పెట్టి గుడిసెకి నిప్పెట్టి అతడ్నీ అతడి తల్లితండ్రుల్నీ సజీవ దహనం చేశారు.

అంతటితో ఆగలేదు. కన్పించినవాడినల్లా కొట్టారు. గుడిసెల్ని తగలెట్టారు. నానా బీభత్సం సృష్టించారు.

ఫలితంగా హరిజనులంతా కొంపాగోడూ వదిలి ప్రాణభయంతో పొరుగూరు పారిపోయారు. "మాకు న్యాయం చేయండి. మళ్ళీ మేం మా వూరెళ్ళడానికి సాయపడండి" అని చేతులెత్తి మరీ ప్రార్థిస్తున్నారు.

ఇంతటి దారుణ కాండకి కర్తలెవరో తెలుసు. దోషులెవరో తెలుసు. అయినా ప్రభుత్వం ఎవర్నీ అరెస్టుచెయ్యలేదు.

"నిందితుల్ని బంధిస్తాం, మీకు న్యాయం చేస్తాం" అని హామీలైతే గుప్పిస్తున్నారుగాని ఆచరణ మాత్రం శూన్యం!

స్వతంత్ర భారత చరిత్రలో ఒక మాయని మచ్చగా మిగిలిపోయే ఆ దారుణ కాండని ప్రజాస్వామ్యవాదులూ ప్రగతిశీలులూ ముక్తకంఠంతో ఖండించారు. దోషుల్ని దండించమనీ అలాటి ఘటనలు పునరావృత్తం గాకుండా చర్య తీసుకోమనీ ప్రభుత్వానికి విజ్ఞప్తి చేశారు.

బృందం తమ రిపోర్టుని అధికారులకీ పత్రికలవారికీ ఇచ్చి తక్షణం చర్యతీసుకోమని డిమాండ్ చేసారు.

ఆ ఘటన ఆధారంగా రాజ్యం "గబ్బిలం" అనే బుర్రకథ రాసింది. దాన్ని యువజనులు ఉత్సాహంగా ప్రదర్శించారు. ప్రదర్శించిన ప్రతి చోటా జనాన్ని కదిలించింది. కంట తడి పెట్టించింది. కసాయిలపై కారాలూ మిరియాలూ నూరేలా చేసింది. ఏక కంఠంతో ఆ దారుణ మారణ కాండని ఖండించడమేగాక బాధితులకి మద్దత్తు పలికేలా చేసింది!

☆ ☆ ☆

"గబ్బిలం" గురించి స్కూల్లోని అందరికీ తెలిసింది.

రాజ్యాన్ని కొందరు అభినందించారు. కొందరు విమర్శించారు.

హెడ్మాస్టారు పరమానందయ్య చిటపటలాడారు.

"ప్రతీదానికీ తగుదునమ్మా అని సిద్ద మవడం ఏం బావోలేదు. రాజకీయాలు కావాలంటే రాజీనామా చేసి వెళ్ళు. అంతేగాని ఇలాటి వాటిల్లో తలదూర్చి స్కూలుకి అప్రతిష్ఠ తెస్తానంటే సహించి వూరుకోలేను

పై అధికారులకి రిపోర్టు రాయాల్సొస్తుది. ఆ పైన నీ ఇష్టం మరి" అన్నారు.

ఆమె బెదర్లేదు. టీచర్స్ యూనియన్ నాయకులకి చెప్పింది. "ఆ తాటాకు చప్పుళ్ళకి బెదరాల్సిన పనిలేదు. మీకు అండగా మేమున్నాం" అని హామీ ఇచ్చారు.

"మీరంటే నాకు అసూయగా వుంది." స్కూలయ్యాక రాజ్యం పక్కనే తన సైకిల్ని నడిపిస్తూ అన్నాడు రాజారావు.

"ఏం పాపం?"

"స్టూడెంట్లు టీచర్లు ప్రజలు నాయకులు అంతా మిమ్మల్ని పొగిడేవారే!"

"ఇకనుంచి మిమ్మల్నికూడా పొగడమంటాల్లెండి!" నవ్వుతూ అంది.

"నలుగురూ మెచ్చే ఘనకార్యం చెయ్యాలని నాకూ వుంది."

"అయితే ఇంకెందుకాలస్యం? వారం వర్జ్యం చూస్తూ కూర్చున్నారా? మంచి పని చెయ్యాలనుకున్న క్షణాన్ని మించిన మంచి ముహూర్తం వుండదండీ!"

"చూశారా చూశారా, అందుకే మీరంటే నా కిష్టం."

బుగ్గలు ఎరుపెక్కుతోంటే ఇబ్బందిగా కదిలిందామె.

"మీ గురించి విన్నాను. మిమ్మల్ని చూశాను. అర్థం చేసుకున్నాను. మీ కష్టాలకి తెరదించాలనీ, మీకు మగతోడునివ్వాలనీ వుంది."

ఆమె మొఖం తెల్లగా పాలిపోయింది.

కళ్ళల్లో బాధ కదుల్తోంటే చురుగ్గా చూసింది.

అతడదేమీ పట్టించుకోలేదు.

"మీ పరిస్థితి, మీ వేదన నేనర్థం చేసుకోగలను. నడివయస్సులో వున్నారు. ఎదిగిన పిల్లలున్నారు. వారి భాధ్యత లున్నాయి. ఇటువంటి పరిస్థితిలో పెళ్ళేమిటని సంకోచిస్తున్నారు కదూ? చూడండి రాజ్యంగారూ! పెళ్ళి ఆడదాని కెంతో ముఖ్యం. ఆడదాని భాగ్యం సౌభాగ్యం సంతోషం సద్గతి అన్నీ పెళ్ళిలోనే వున్నాయి. ఒక పెళ్ళి విఫలమైనందున కోర్కెలు చంపుకుని మోడుగా వుండక్కర్లేదు. మళ్ళీ చిగురించొచ్చు. బతుకు పండించుకోవచ్చు. స్త్రీ జన్మని సార్థకం చేసుకోవచ్చు."

"నన్ను మళ్ళీ పెళ్ళి చేసుకోమంటారు?......." నీళ్ళు నిండిన కళ్ళు అతడిక్కన్పించకుండా తలొంచుకుని నడుస్తూ అంది.

"ఒక్కసారికాదు, వెయ్యిసార్లంటాను. మీ అందం వయస్సూ అడవి

కాచిన వెన్నెల కాకూడదు. మీ బతుకు రసహీనమూ దుఃఖభరితమూ కాకూడదు. అఫ్‌కోర్స్. మీలాటి వారిని పెళ్ళాట్టానికి ఎవరూ ముందుకు రారనుకోండి. అయినా ఎక్కడో నాలాటి సంస్కారవంతులుండక పోరు........"

ఆగింది. అతడి మొఖంలోకి సూటిగా చూసింది.

చొక్కా సరిచేసుకుని స్టడీగా నిలబడ్డాడు.

"మీరు నన్ను పెళ్ళాడి ఉద్ధరిస్తానంటారు."

"కరక్ట్. నా మనస్సులోని మాట చదివినట్టు చెప్పేరు?"

"మీ భార్యకి విడాకులిస్తారా?"

ఊహించని ప్రశ్నకి ఖంగు తిన్నాడు. దిమ్మెరబోయి, నీళ్ళు నములుత్తూ చూశాడు.

"మాట్లాడరేం? నన్నుద్ధరించడంకోసం ఆ మాత్రం త్యాగం చెయ్యలేరా?"

"అహ. అదికాదు.......... ఈ మాత్రానికి విడాకులెందుకు మా ఆవిడ మా వూళ్ళో వుంటుంది. మీరిక్కడ.... .....అటూ ఇటూ తిరుగుతుంటాను. మీకేం లోటు రానివ్వను. అసలు ఇందులో తప్పేం లేదు. మనిద్దరికీ లాభమేగాని నష్టంలేదు. మీరు గమనించారో లేదో మన దేవుళ్ళలో చాలా మందికి ఇద్దరు పెళ్ళాలున్నారు......"

"మీకు సిగ్గూ, లజ్జా; మానం, అభిమానం చీమూ, నెత్తురూ ఏమీ లేవా?"

ఆమె గొంతు చించుకుని మరీ నిలదీసేసరికి సన్నగా కంపించి పోయాడు. నలుగురూ విని పోగవుతారేమోనని కంగారుపడ్డాడు.

"మీ మూడ్ బాగోలేనట్టుంది. తర్వాత మాట్లాడుకుందాం."

"ఏమీ అక్కర్లేదు. నీలాటి మగాడి కోసం ఎ ఆడదీ అంగలార్చడం లేదని గ్రహించండి, చాలు. మంచితనం తోలు కప్పుకుని పెళ్లి కాలేదని నటిస్తే మోసబోయేంత అమాయకు లెవరూ లేరని తెలుసుకోండి. మీరిలా నయవంచనతో మరో అమ్మాయి మీద వల వేసినా మోసం చేసినా మళ్ళీ తలెత్తుకోలేనంత గుణపాఠం చెబుతాను, ఖబడ్దార్!........"

"డామిట్!......" గొణుక్కుంటూ సైకిలు వెనక్కి తిప్పి వెళ్ళబోతోంటే సైకిలాపి అంది రాజ్యం: "ఒకానొక మగాడే ఆడదాని గమ్యం అని ఈ నాటి స్త్రీ భావించడం లేదని మీరు గ్రహించలేకపోవడం మీ అజ్ఞానం!"

# 28

"విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు!"

పల్లెల్లో పట్టణాల్లో కాలేజీల్లో స్కూళ్ళల్లో వీధుల్లో మైదానాల్లో అన్నిటా మార్మోగుతున్న నినాదం అది.

ఆంధ్రరాష్ట్రం విర్పాటోద్యమం తర్వాత రాష్ట్రాన్ని కుదిపేసిన ఉద్యమం. అది అమృతరావు ఆమరణ నిరాహార దీక్ష ఆ ఉద్యమానికి మరింత వూపూ వేడీ ఇచ్చింది.

నిపుణుల కమిటీ అన్ని అంశాలూ పరిశీలించి ఉక్కు ఫ్యాక్టరీ నిర్మాణానికి విశాఖపట్నం అన్ని విధాలా అనుకూలంగా వుంటుందని పేర్కొంది. అయినా రాజకీయనాయకులు స్వార్థ రాజకీయాల వల్ల దాన్ని మరో చోటుకి తరలించడానికి ప్రయత్నిస్తోంటే ఆంధ్రప్రజానీకం ముఖ్యంగా విద్యార్థిలోకం ఉప్పెనై లేచింది.

ఎటు చూసినా సమ్మెలూ బంద్‌లూ సభలూ ఊరేగింపులూ!

రాష్ట్రానికీ తద్వారా స్థానిక ప్రజకీ జరుగుతోన్న అన్యాయానికి కదలి పోయింది రాజమ్మ.

"ఉక్కు హక్కు నాదిరా
గుండు లేమి చేయలేని
ఉక్కు గుండె నాదిరా..........." అంటూ పాట రాసింది.

ఆ పాట స్థానిక విద్యార్థులు పాడుతూ వురక లేస్తోంటే సంతృప్త మనస్సుతో పొంగిపోయింది.

ప్రగతి శీల మహిళా సంఘపు కార్యక్రమాలు ఆమె దృక్పథాన్ని బాగా మార్చివేశాయి.

తనకంటే హీనులు దీనులు బాధా సర్పదష్టుల గురించి తెలుసుకుంది. చలం ఓ పక్క, శ్రీశ్రీ మరో పక్కా ఆమె ఆలోచనలకి పదును పెట్టారు.

రక రకాల ఆంక్షలకీ అవమానాలకీ విచక్షణకీ దోపిడికీ గురవుతోన్న మహిళల తరఫున వకాల్తా తీసుకుంది. తన భావావేశాన్ని కవితల రూపాన కాగితం మీద పెట్టింది. అవి కొన్ని పత్రికలలో అచ్చయి ప్రశంసలు తెచ్చాయి. "గబ్బిలం" బుర్రకథ ఆమెని పది మెట్లు పైకెక్కించింది. సుందరంతో

సహా ఎందరో అభినందించారు. దాంతో మరింత ఉత్సాహంతో పాటలు రాసి బాణీలు కట్టసాగింది.

జనం గుండెలోకి దూసుకు పోవడానికి పాటకి మించిన కళా రూపం లేదని గ్రహించింది. సభల్లో సమావేశాల్లో పాడుతోంటే జనం వుర్రూతలూగిపోయేవారు.

పాటల్ని జనం గుండె చప్పుళ్ళుగా మారుస్తూ రాజ్యం రాజమ్మగా మారిపోయింది!

మహిళా సంఘం వారు ఆమె పాటలకి విపరీత ప్రచారమిచ్చారు. ఆ పాటలంటే గాంధీకి మరీ ఇష్టం. తొలి బాణీ అతడే కట్టేవాడు కూడా.

ఆమె పిల్లలు ముగ్గురూ మూడు రకాలు.

పెద్దవాడు శ్రీకాంత్ ఎవర్తోనూ కలవడు. ఏదీ పట్టించుకోడు. తనేమిటో తన చదువేమిటో. అంతే. కాని అతడి కళ్ళూ కలలూ డబ్బున్న వారిమీదే. వారి గురించే!

గాంధీ ఆవేశపరుడు. ఎక్కడే అన్యాయం జరిగినా సహించడు. పదిమంది కోసం తపిస్తాడు. పాడతాడు. డప్పు వాయిస్తూ గంతు లేస్తాడు. అలా చెయ్యడం ఇన్సల్ట్ అంటాడు శ్రీకాంత్. కాదని వాదనకి దిగుతాడు గాంధీ. ఇద్దరూ గొడవ పడితే రాజ్యం కల్పించుకుంటేతప్ప ఆగదు.

కూతురు సుబ్బలక్ష్మి నెమ్మదస్తురాలు. అన్నీ చూస్తుంది. ఆలో చిస్తుంది. కానేమీ చెప్పదు "నిండు కుండ" అని మురిసిపోతూంటుంది తల్లి.

మగపిల్లలిద్దరూ స్కూల్ ఫైనల్ చదువుతోంటే సుబ్బలక్ష్మి ఎనిమిదో క్లాసు చదువుతోంది.

విశాఖ ఉక్కు ఉద్యమం అనుకోకుండా మరో మలుపు తిరిగింది.

ఊరేగింపు జరుపుతున్న విద్యార్థులపై పోలీసు తుపాకుల నిప్పులు కక్కాయి. సుమారు ముప్పై రెండు మంది విద్యార్థులూ యువకులూ నేల కొరిగారు.

యువతలో హింసాగ్ని రగిలింది. బస్సుల్ని తగలబెట్టారు. రైళ్ళని నిలిపివేశారు. గూడ్సు బండ్ల తాళాలు బద్దలుగొట్టారు టెలిఫోన్ తీగలు తెంచారు.

రాజమ్మ భయకంపితురాలయ్యింది. ఏవో తెలీని భయాలు ఆమెని చుట్టుముట్టి గుండె గుబ గుబలాడేలా చేశాయి.

"పరిస్థితి ఇదివరకట్లా లేదురా! మీరిహ బయటి కెళ్ళొద్దు" అంది పిల్లల్తో.

"నేను మొదట్నుంచీ మొత్తుకుంటూనే వున్నాను. ఉక్కు ఫ్యాక్టరీ గొడవలు నాయకులు చూసుకుంటారు. విద్యనభ్యసించడమే ప్రధాన ధ్యేయమైన విద్యార్థులు ఆ ఉద్యమంకోసం చదువులు పాడుజేసుకోవడం అనవసరం? అన్నాడు శ్రీకాంత్.

"విద్యార్థులే రేపటి నిరుద్యోగులు" కదా అన్నయ్యా? విశాఖలో ఉక్కుఫ్యాక్టరీ వస్తే ఆ ప్రాంతం ఎంతగా అభివృద్ధి చెందుతుందో, ఎన్ని వేల మందికి ఉద్యోగాలూ ఉపాధీ లభిస్తాయో ఆలోచించు" అన్నాడు గాంధీ.

"అది ఆలోచించాల్సింది మనం కాదు, మన నాయకులు."

"వాళ్ళకి వాళ్ళ స్వార్థం ఎత్తులూ కుయుక్తులూ తప్ప ఇంకేం పట్టవు."

"కావొచ్చురా! అయినా వాళ్ళు మన నాయకులు. ప్రజలు ఓట్లేసి గెలిపించిన నాయకులు. ప్రభుత్వం మనది. అంతేగాని విదేశీయులెవరో పాలిస్తున్నట్టు మరీ దారుణంగా మాట్లాడొద్దు."

తల్లి మాటలకి గట్టిగా నవ్వేశాడు గాంధీ.

"ఉద్యమాలకి బ్రిటీషు వాళ్ళెలా స్పందించేవారో తెలీదు గాని మన వాళ్ళు మాత్రం వులకరు పలకరు. వీళ్ళ చర్మం చాలా మందం. సమ్మెలకీ సత్యాగ్రహాలకీ కదలరు. పొట్టి శ్రీరాములు ఆత్మ బలిదానం చేస్తేగాని ఆంధ్రరాష్ట్రం ఏర్పాటు కంగీకరించలేదు. ప్రతీ దానికీ రోడ్డు మీద పడాలి. హర్తాళ్ళూ అలజళ్ళూ చెయ్యాలి. అప్పుడే ఈ చెవిటి ప్రభుత్వానికి వినిపిస్తుంది."

"పోనీ అలాగే అనుకోగాని చూస్తోంటే పరిస్థితి ఆందోళనకరంగా పరిణమిస్తోందిరా! మీ రిహ బయటి కెళ్ళొద్దు. మీకేమైనా అయితే భరించ లేనురా! జీవితంలో ఎన్నో ఎందర్నో పొగుట్టుకుని ఆశలన్నీ మీ మీద పెట్టుకుని బతుకుతున్నదాన్ని. నా వేదన అర్థం చేసుకోండ్రా!" అన్నది రాజమ్మ.

"నీ పాటల్లో మాటల్లో నువ్వు ఉద్బోధిస్తున్నదేమిటీ, ఇప్పుడు చెబు తున్నదేమిటమ్మా కొన్ని కొన్ని సాధించాలంటే ఎదుర్కోవాలి పోరాడాలి

చేజిక్కించుకోవాలంటావుగా. మరేవిటిలా పిరికిపాలు పోస్తున్నావిప్పుడు?"

గాంధీ ప్రశ్నకి రాజమ్మ తల తిరిగిపోయింది. కన్నీళ్ళు పొంగి వచ్చేయి. బాధ గొంతులో సుళ్ళు తిరుగుతోంటే "కడుపు తీపి అంటే ఇదేనేమోరా!" అంది.

"కడుపు తీపి కాదమ్మా! బలహీనత, స్వార్థం దానికి వేసిన అందమైన ముసుగు పేరు కడుపు తీపి!"

గాంధీ మాటలకి అవాక్కై పిచ్చిగా చూస్తూండిపోయింది రాజమ్మ.

☆ ☆ ☆

సుబ్బలక్ష్మి పుష్పవతి అయ్యింది.

తను పెద్దమనిషైనప్పుడు తండ్రి ఎంత వేడుకగా చేశాడో రాజమ్మ మర్చిపోలేదు.

ఆడవారికైనా మగవారికైనా వయస్సు రావడం అనేది శారీరకధర్మమనీ దానికి స్త్రీల విషయంలో ప్రత్యేకత నాపాదించడం అనవసరమనీ ఆమె అభిప్రాయం. పూర్వం రజస్వల కాకుండానే వివాహమూ రజస్వలయిన వెంటనే కార్యమూ చేసేవారు గనుక ఆ కాలంలో ఆ దశకి ఒక ప్రత్యేకత నిచ్చారనీ; అది ఇప్పుడూ అమలు చేయడం అన్యాయమనీ కవిత రాసింది. ఆ వంకన కొన్నాళ్ళు చాపమీద కూర్చోబెట్టడం, అదేదో ఘనకార్య మైనట్టు ఊరూ వాడని పిలిచి బంతు లెయ్యడం అనాగరికమని చీల్చిచెండాడింది.

కాని తనదాకా వచ్చేసరికి మీమాంసలో పడింది.

ఎలాంటి కార్యక్రమమూ చెయ్యకపోతే బంధువు లేమనుకుంటారో ననుకుంది. రేపు పెళ్లి సంబంధాలు చూసేప్పుడు ఏం లోపాలెన్నుతారో నని సంశయించింది. ఎలాగూ పైట లెయ్యాలి గనుక మధ్యేమార్గంగా సింపుల్‌గా చేసేస్తే మంచిదనుకుంది.

ఒకరిద్దరు స్నేహితురాళ్ళని సంప్రదించగా వాళ్ళూ అదే సలహా ఇచ్చారు.

మనస్సులో ఏదో అపరాధ భావన తొంగి చూస్తోంటే "పదిమంది కోసం కొన్ని కొన్ని చెయ్యక తప్పదు మరి" అనుకుంది.

ఆ కార్యక్రమం పూర్తయ్యాక "హమ్మయ్య" అని నిట్టూర్చింది.

# 29

శ్రీకాంత్, గాంధీ ఇద్దరూ కూడా పీయూసీ ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యారు. ఇద్దరూ ఇంజినీరింగు సీటుకి అప్లై చేశారు. గాంధీకీ ఎక్కువ మార్కులు వచ్చి ఉండటంతో అతడికి విశాఖపట్నం ఇంజనీరింగు కాలేజీలో సీటు వచ్చింది. శ్రీకాంత్‌కి రాలేదు.

అతడు బాగా కృంగిపోయాడు. తమ్ముడికన్నా ఎక్కువ చదివేను. ఎక్కువసేపు చదివాను. ఎక్కువ శ్రద్ధతో చదివాను. అయినా అతడి కన్నా తక్కువ మార్కు లొచ్చాయని కుమిలిపోయాడు. అతడికి ఇంజినీరింగు సీటు కూడా వచ్చేసరికి మరింతగా బాధ పడిపోయాడు. అతడి కోసం ఉజ్వల భవిష్యత్తు ఎదురు చూస్తోందని తన పని ఎటూ గాకుండా పోయిందనీ అనేకవిధాల వాపోయాడు. నిస్పృహకి లోనయ్యాడు.

"ఎవరి అదృష్టం వారిది. మరీ అంతగా ఇదవుతావేంరా? వచ్చే సంవత్సరం రావొచ్చేమో చూద్దాం."

"ఇంకేం వస్తుందీ? బాగా చదివిన నా కన్నా కాలేజికి సరిగ్గా రాని తమ్ముడి కెక్కువ మార్కులొచ్చాయి చూడు. అంతా కాపీల మహత్యం."

"దారుణంగా మాట్లడకురా! గాంధీ ఎలాటివాడో నీకు తెలీదూ? తప్పుడు పనులు తను చెయ్యడు, ఇంకొకర్ని చెయ్యనివ్వడు."

"నువ్వు వాడ్నే వెనకేసుకొస్తావులే. నీకు వాడంటేనే ఎక్కువ ఇష్టం."

కొత్త మాట చెవిన బడేసరికి అమితాశ్చర్యంగా చూసింది. పెద్ద కొడుకు వంక చిత్రంగా చూసింది.

"అవే మాటల్రా? మిమ్మల్నెప్పుడైనా వేరుగా చూశానా?"

"ఆ సంగతి నీకు తెలుసు, నాకు తెలుసు" అనేసి విసురుగా బయటి కెళ్ళిపోయాడు.

నిలబడే శక్తికూడా లేక నేలమీద చతికిలబడిపోయింది.

పల్లెలోని తండ్రిఇంటిని అమ్మేసి గాంధీని ఇంజినీరింగ్ కాలేజీలో చేర్పించింది. ఇక పల్లెకీ తనకీ మిగిలిన బంధం చరఖా కేంద్రమున్న తోట మాత్రమే.

"అమ్మేసెయ్. అంతా కరిగించి వాడి మొహాన కొట్టెయ్. వాడే నిన్ను ఉద్ధరిస్తాడు!"

శ్రీకాంత్ మాటలకి రాజమ్మ మాట్లాడలేకపోయింది కాని సుబ్బలక్ష్మి వూరుకోలేదు.

"నీకు సీటొచ్చి వుంటే నీ నీకోసం అమ్మేవాళ్ళం."

"అది నీ భ్రమ. అప్పుడు డబ్బులేదురా, ఎలా చదివించన్రా అనేది."

కళ్ళల్లోకి నీళ్ళు చిమ్ముకొస్తోంటే "నా కడుపు చీల్చుకు పుట్టిన బిడ్డేనా వీడు?" అని చూస్తూండిపోయింది రాజమ్మ.

శ్రీకాంత్ అయిష్టంగానే బీయస్సీలో చేరాడు.

☆ ☆ ☆

ఇంజినీరింగులో చేరాక గాంధీలో చాలా మార్పు వచ్చింది.

ఇది వరకన్నా చక్కగా మాట్లాడుతున్నాడు. అన్ని కోణాలనుంచీ తర్కిస్తున్నాడు. ఉపన్యాసాలూ ఇస్తున్నాడు. ఎంతో ఆత్మ విశ్వాసంతో వ్యవహరిస్తున్నాడు.

స్టూడెంట్స్ యునియన్ నాయకుడిగా ఎన్నికయ్యాడని తెలుసుకు నెంతో పొంగిపోయింది రాజమ్మ.

"మీ తాత వియ్యన్నగారిలా మంచి నేతవి కావాలా! నీ పద్ధతీ పట్టుదలా పదిమందికోసం తపించే నీ మనస్తత్వం చూస్తోంటే నువ్వు కూడా అయన్లా దేశంకోసం పాటుపడే మహనీయుడి వవుతావన్పిస్తోందిరా!" అనాలనుకుంది.

కాని శ్రీకాంత్ అక్కడే వుండటంతో ఆ మాటల్ని మింగేసింది.

శ్రీకాంత్ గాంధీతో అంటీ ముట్టనట్లుగా వుంటున్నాడు ఎక్కువగా ముభావంగా దూరం దూరంగా మసల్తున్నాడు. గాంధీ సుబ్బలక్ష్మి మాత్రం చాలా స్నేహంగా వుంటున్నారు. ఎన్నో కబుర్లు చెప్పుకుంటున్నారు.

రాజమ్మకి మంత్స్యపురి స్కూలుకి ట్రాన్స్‌ఫర్ అయ్యింది.

శ్రీకాంత్ సుబ్బలక్ష్మి చదువుల దృష్ట్యా రోజూ భీమవరం నుంచి బస్సులో వెళ్ళివస్తోంది.

సుబ్బలక్ష్మి పీయూసీ చదువుతోంది. కాలేజీ ఇంటికి చాలా దూరం. అందుకని సైకిలు కొనిచ్చింది రాజమ్మ

సుబ్బలక్ష్మి ఆమె స్నేహితురాళ్ళు గుంపుగా సైకిళ్ళ మీద వెళ్ళేవారు. జనం వాళ్ళని వింతగా చూసినా తర్వాత్తర్వాత పట్టించుకోవడం మానేశారు.

చిత్రమేమిటంటే, మగవారికన్న ఆడవారే వాళ్ళగురించెక్కువగా కామెంట్ చేసేవారు!

ఒకరోజున రాజమ్మ స్కూలునుంచి వచ్చేసరికి సుబ్బలక్ష్మి ఏడుస్తోంది. ఏమయ్యిందో అర్థంగాక తల్లడిల్లిపోయింది రాజమ్మ.

"ఏవయ్యిందే?" ఆదుర్దాగా అడిగింది.

"నేను కాలేజీ మానేస్తానమ్మా?"

"ఏం, ఏవయ్యింది తల్లీ?"

"పోకిరీగాళ్ళ గోల పడలేకపోతున్నాం.........ఇవాళ నా సైకిల్ని డాష్ కొట్టించారు. పడిపోయాను......"

"ఆడపిల్లల్తో.........వాళ్ళకి సిగ్గూ ఎగ్గూ లేదుటే? ఎవరు వాళ్ళు."

"రోడ్ సైడ్ రోమియోలు. మా కాలేజిలోనే చదువుతూంటారు. అమ్మాయిల బాడీగార్డుల్లా కూడాకూడా తిరుగుతుంటారు. కామెంట్లు చేస్తూ ఏడిపిస్తూంటారు............"

"నీతోబాటు మనింటిదాకా కూడా ఫాలో అవుతూ వస్తున్నారా?"

"వూఁ.........."

"అన్నయ్య వాళ్ళ నేమీ అనటం లేదా?"

"నన్నే తిడుతున్నాడు. చదువు మానెయ్యమంటున్నాడు......."

హతాశురాలయ్యింది. శ్రీకాంత్ అలా మాట్లాడగలడని వూహించను కూడా లేదామె.

"కాలేజీలో చదువుతున్న పిల్లలు? ఇంత అధైర్యపడితే ఎలా చెప్పు. రేపు నే నొచ్చి ప్రిన్సిపాల్ కి రిపోర్టు చేస్తాన్లే."

"వాళ్ళు రెచ్చిపోతారేమో?!"

"వాళ్ళ మొహం! ప్రిన్స్పాల్ అంటే భయపడని వాళ్ళెవరూ?"

"వాళ్ళంతా రౌడీ మూక. వాళ్ళలో మున్సిపల్ ఛైర్మెన్ గారబ్బాయి కూడా వున్నాడు. ఇవాళ నా సైకిల్ కి డాష్ ఇచ్చిందతడే."

నిటారుగా అయ్యిందామె.

బుద్ధిగా చదువుకోవాల్సిన యువకులు, రాబోవు తరపు దూతలు ఇలా దారి తప్పటమా?

"నేను మాట్లాడతానుగా........."

"దేని గురించమ్మా?" లోపలికొస్తూ అన్నాడు శ్రీకాంత్.

"మీ కాలేజీలో కొందరు కుర్రాళ్ళు రౌడీగ్యాంగ్‌గా తయారయ్యారట కదురా?"

"మా కాలేజీలో అనేవిటీ అన్ని చోట్లా అలాటి వాళ్ళుంటారు. టైంపాస్ కోసమో కట్నం కోసమో కాలేజీలో చేరతారంతే."

"వాళ్ళలా చెడిపోతుంటే ఎవరూ పట్టించుకోరా?"

"వాళ్ళేమో కాలేజీ హీరోల మనుకుంటారాయె! వాళ్ళంతా పెద్ద పెద్ద వాళ్ళ పిల్లలు. వాళ్ళజోలికెవరు వెళ్ళగలరు"

"నీ చెల్లెల్ని అవమానిస్తున్నా పట్టించుకోవా?"

తల్లి స్వరతీవ్రతని గమనించి గంభీరంగా మారాడు.

"దీని కొకటే పరిష్కారం. దీన్ని చదువు మాన్పించెయ్యడమే!"

"శ్రీకాంత్!"

"వాళ్ళు రౌడీలమ్మా! ఎంతకైనా తెగించగలరు. వీళ్ళేమో సీతాకోక చిలకల్లా అలంకరించుకుని ఫేషన్ పెరేడ్ కెళ్ళినట్లు వస్తారాయె. వాళ్ళు ఏడిపించారంటే ఏడిపించరూ?"

"అలా మాట్లాట్టానికి సిగ్గెయ్యటం లేదూ?"

"వాళ్ళ గురించి బాగా తెలుసు గనుకే దుష్టులకి దూరంగా వుండమంటున్నాను. ఆ తర్వాత నీ ఇష్టం."

మర్నాడు కూతుర్ని తీసుకువెళ్ళి ప్రిన్సిపాల్‌ని కలిసింది రాజమ్మ.

ఆమె చెప్పిందంతా శ్రద్ధగా విన్నాడాయన.

"మీరేం చేస్తూంటారు?"

"హిందీ టీచర్ని సార్!"

"మనం పాతకాలపు ఉపాధ్యాయులం గనుక ఇప్పటి కుర్రకారు పద్ధతీ ప్రవర్తనా మనకి విడ్డూరంగా వుంటుంది. విద్యార్థుల్లో ఇదివరకటి విజ్ఞానతృష్ణా క్రమశిక్షణా లేవు. కాపీ కొట్టో, లెక్చరర్స్‌ని బెదిరించో పాసైతే చాలనుకుంటున్నారు. ఆడపిల్లల్ని ఏడిపించడమే కాదు, మత్తు పదార్థాలు కూడా మింగుతారు. క్లాసులకి సరిగ్గా రారు సరికదా, అదేమని అడిగిన లెక్చరర్ల మీదకూడా ఎదురుతిరుగుతారు. ఏం చేస్తాం చెప్పమ్మా? కాలం చెడిపోయింది. తలొంచుకు పోవాలంతే. తప్పించుకు తిరుగువాడు ధన్యుడు సుమతీ అన్నారు."

"విద్యార్థుల్ని సరైన మార్గాన నడిపించాల్సిన మీరిలా మాట్లాడుతోంటే నా చెవుల్ని నమ్మలేకపోతున్నాను సార్!"

"చదువుకోవాలి బాగుపడాలి అన్న యావఁవుంటే బాగుచెయ్యగలం గాని వూరికే పోజులు కొడుతూ తిరగాలి, లీడర్లం అవ్వాలి, కాపీలు కొట్టాలి – అంటే ఏం చెయ్యగలం చెప్పు? కొంతమందైనా బుద్ధి మంతులున్నార్లే అని తృప్తిపడి పోతూంటాం."

"గొప్పగా శలవిచ్చారు సార్! అయితే ఈ విషయంలో మీరేం చర్య తీసుకోలేనంటారు?"

"రూల్స్ప్రకారం మాట్లాడాలంటే కాలేజీ బయట జరిగే గొడవలకి నా బాధ్యత లేదు. ఐ కాంట్ హెల్ప్. అది పోలీసు పరిధిలో కొస్తుంది. కొరివితో తలగోక్కోవాలనుకుంటే వాళ్ళ దగ్గరి కెళ్ళండి"

నిరాశగా వెనుదిరిగారు.

బిల్డింగ్ బయట మెట్ల దగ్గర నిలబడి వున్న కుర్రాళ్ళలో ఒకడు "ఏయ్ సుబ్బూ నా మైసూర్ శాండల్ సబ్బూ – ప్రిన్సిపాల్ కి రిపోర్టు చేశావా? ముసలేడేమన్నాడు?" అన్నాడు.

మరో ముగ్గురు కిచకిచలాడారు.

వాళ్ళ దగ్గరి కెళ్ళి "మీకు అక్కా చెల్లెళ్ళు లేరూ?" అని కోపంగా అడిగింది రాజమ్మ.

"వున్నారు మేడం, ప్రేయసుల్లేరు."

మళ్ళీ వెకిలిగా నవ్వేరంతా.

"సంస్కారం లేని చదువు చదవటం ఎందుకు?"

"కట్నం బాగా వస్తుందని."

"మీ కెలా బుద్ధి చెప్పాలో నాకు తెలుసు."

విసవిసా ముందుకి నడిచింది. "పిల్లే కాదు, తల్లికూడా పిట పిటలాడుతూ బాగానే వుందిరా అని ఒకరంటే పాపం! "పోలీస్ స్టేషన్కి దారెటో చెప్పండ్రా!" అన్నాడింకొకడు.

తిన్నగా వెళ్ళి సుందరంగార్ని కలిశారు.

జరిగిందంతా చెప్పి, "కుర్రకారు ఎంతగా పతనమవుతోందో చూడండి" అని ఆవేదన పడింది రాజమ్మ.

"విష సంస్కృతి పూచిన కుక్క మూతి పిందెలు వీళ్ళు. సినిమాలూ డిటెక్టివ్ నవలూ విదేశీ సంస్కృతి మీది వ్యామోహం వీళ్ళ నిలా దిగజారుస్తున్నాయి. అన్నట్టు నీ పేరేమిటమ్మా?"

"సుబ్బలక్ష్మండీ........"

"ఇదేమంత పెద్ద సమస్యనీ వెళ్ళి మీ అమ్మకి ఫిర్యాదు చేశావు?"
అవాక్కై ఆయనవంక చూశారిద్దరూ.

"ఇది మీ విద్యార్థినుల సమస్య. మీరే పరిష్కరించు కోవాల్సిన విషయం........"

"వాళ్ళొట్టి రౌడీలు........"

రాజమ్మ ఏదో చెప్పబోతోంటే ఆపేరాయన.

"స్టూడెంట్స్ ఫెడరేషన్ వుంది కదా! మీరంతా అందులో చేరండి. మీ ఆలోచనాపరిధిని విస్తృతపరుచుకోండి. చైతన్యవంతులుకండి. మీరంతా సంఘటిత శక్తిగా రూపొందినప్పుడు మీ జోలి కెవ్వరు రాలేరు. పైగా మీరు దారితప్పిన వాళ్ళని చక్కదిద్దొచ్చు. కాలేజీ పాలననికూడా సరిదిద్దొచ్చు. విద్యార్థులంతా కలిసి పిడికిళ్ళు బిగిస్తే ప్రభుత్వమే గడ గడలాడ్తుంది. ఊహ ఈ బురద పాములో లెక్కా?"

"నిజమేసుమా! నేను సంఘాలంటూ తిరుగుతున్నానుగాని మీరు కూడా విద్యార్థి సంఘాల్లో చేరమనీ చురుకైన పాత్ర ధరించమనీ చెప్పనే లేదు. రేపు అన్నయ్యా నువ్వూ చేరండి" అంది రాజమ్మ.

శ్రీకాంత్ చేరనన్నాడు. తనకి రాజకీయాలంటే అసహ్యం అన్నాడు.

సుబ్బలక్ష్మి ఆమె స్నేహితురాళ్ళూ చేరారు. మొదటి సమావేశంలోనే తమ ఇబ్బందుల్ని వివరించారు.

ఆ మర్నాడే రోడ్ రోమియోలకి అల్టిమేటం ఇచ్చేశారు దాన్ని లెక్కచెయ్యని ఒకరిద్దరికి దేహశుద్ధి చేసారుకూడా.

మంత్రించినట్టుగా ఈవ్ టీజింగ్ అదృశ్యమైంది!

## 30

మహిళా సంఘం వారు రాజమ్మ రాసిన పాటల్ని "స్వేచ్ఛ" పేరిట పుస్తకంగా ప్రచురించారు.

స్థానిక గ్రంథాలయంలో చిన్న సమావేశం ఏర్పాటు చేసి, ప్రముఖ అభ్యుదయ కవి చేత ఆవిష్కరింపచేశారు. సభకి కవులూ సాహితీ వేత్తలేగాక అనేక సంఘాలకి చెందిన ప్రగతివాదులూ విచ్చేశారు. వైజాగ్ నుంచి గాంధీకూడా వచ్చాడు.

వక్తలంతా రాజమ్మని వేనోళ్ళ పొగిడారు. "పురుష ప్రపంచంలోంచి

పెట్టిన స్త్రీ పొలికేక" అన్నారొకరు. "స్త్రీ విముక్తికిది నాంది" అన్నారింకొకరు.

"సాంప్రదాయ సంకెళ్ళని ఛేదించుకుని స్త్రీ, భావ దాస్యాన్ని వదిలించుకుని మధ్య తరగతి, సంఘటిత శక్తిగా రూపొంది అట్టడుగు వర్గాలూ స్వేచ్ఛ కోసం పోరాడాలన్నది ఈ పాటల సారాంశం" అంటూ సమీక్షించారొకరు.

ఎవరి అర్థాలు వారు, ఎవరి భావాలు వారు చెప్పారు.

ముఖ్య అతిధి అరసం విరసంల చీలిక గురించీ విభేదాల గురించే చెప్పేరు. దిగజారుతోన్న సాహిత్య విలువల గురించీ వ్యాపార సాహిత్యాన్ని ప్రోత్సహిస్తోన్న పత్రికల గురించీ ఎక్కువసేపు మాట్లాడారు. రాజమ్మ పాటల గురించి తక్కువగా మాట్లాడారు.

ఆయన శ్రీశ్రీని మించిన మహాకవి అనీ ఆ సంగతి గుర్తించక పోవడం దురదృష్టకరమనీ బాధపడ్డారింకొకరు. కనీసం ప్రభుత్వమైనా గుర్తించి. యమ్మెల్సీని చెయ్యాలని డిమాండ్ చేశారు.

ఆఖర్న గాంధీ కూడా ప్రసంగిచాడు:

"దేశం ఇప్పుడు నాలుగు రోడ్ల కూడలిలో వుంది. ఒక పక్క ప్రజా స్వామ్యం అంటున్నాం ఇంకో పక్క సోషలిజం అంటున్నాం ఒకసారి మిశ్రమ ఆర్థిక విధానం అంటున్నాం. మరోసారి బడా పరిశ్రమలకీ పెద్ద పెట్టుబడిదార్లకీ ప్రోత్సాహమిస్తున్నాం. ఒకప్పుడు అహింసే మన ఆయుధం అన్నాం. ఇప్పుడు నగ్సల్ బరిలో సాయుధ పోరాటమే శరణ్యం అంటున్నారు. ఒకప్పుడు విదేశీయుడు మన దేశాన్ని దోచుకుంటున్నాడని ఎదిరించాం. ఇప్పుడు మనవాళ్ళే మనని నిలువుగా దోచేస్తోంటే నిస్సహాయంగా చూస్తున్నాం. నాయకులకి ఓట్లూ ముఖ్యం. ఉద్యోగులకి సీట్లూ డీఏలూ లంచాలూ ముఖ్యం. వ్యాపారులకి లాభాలు ముఖ్యం. వాళ్ళంతా సుఖంగానే వున్నారు. కాని సామాన్యజనం పెరిగే ధరలూ తరుగుతోన్న జీవన ప్రమాణాల మధ్య దుర్భర జీవితాల్ని గడుపుతున్నారు. వారి గురించి పట్టించుకోవాల్సిన మేధావివర్గం అవార్డులకోసం సత్కారాల కోసం మెడ చాస్తోంది. ఇక. జనానికి దిక్కెవ్వరు? ఇదే పరిస్థితి కొనసాగితే దేశం ఏమవుతుంది? ఏమవుతుంది?" అంటూ ఆవేశంగా మాట్లాడాడు.

అతడి వంక చాలా మంది వింతగా చూశారు. కొందరు భుజాలు తడుముకున్నారు. యువకులు మాత్రం చప్పట్లు కొట్టారు. ఇంకొందరు "అతడేం చెబుతున్నాడూ?" అని అయోమయంగా చూశారు.

సభానంతరం ఇంటికొచ్చేక "నీలో చాలా మార్పు కన్పిస్తోందిరా గాంధీ? చాలా అశాంతిగా వున్నావేమిటి!" అనడిగింది రాజమ్మ.

"నాకీ పాలనా పరిస్థితులూ పద్ధతులూ నచ్చటల్లేదమ్మా! అన్నిటా హిపోక్రసీ. చెప్పేదొకటి చేసేదొకటి. క్లాసులో అభ్యుదయం సమానత్వం అని లెక్చర్లిస్తారు. బయట కుల రాజకీయాలు నడుపుతారు. సభల్లో జనం కోసమే ప్రభుత్వాలంటారు. స్టేజిదిగేక కాంట్రాక్టర్లతో కుమ్మక్కవుతారు. లంచం తీసుకునేవాడ్ని విమర్శిస్తారు. వాళ్ళే అవకాశం వస్తే లంచం తీసుకోడానికి ముందుంటారు. అన్ని విధాలా దోచుకు తిందామన్న ధ్యాస తప్ప మరేం కన్పించటల్లేదు. వీళ్ళందరి స్వార్థానికీ సామాన్యజనం సమిధల్లా మాడిపోతున్నారు. దారిద్ర్యంలో మగ్గిపోతున్నారు. వారి గోడు పట్టించుకునే దెవరు?"

"భ్రష్టు పట్టిన సమాజాన్ని శుద్ధి చేయగల శక్తి మీ యువతకే వుందిరా మీలోని త్యాగనిరతి నిస్వార్థత కార్యదక్షత మరెవర్లోనూ వుండదురా! మీరు తలచుకుంటే దేశాన్ని సస్యశ్యామలంచేయగలరు"

"కబుర్లతో కార్యాలు నెరవేరవమ్మా! అన్నయ్యా యువకుడే. ఏం చేస్తున్నాడు?"

ఆమె మాట్లాడలేకపోయింది.

"ఒక్కసారిగా అందర్లోనూ స్వార్థం పెరిగిపోయింది స్వలాభాపేక్ష స్వసుఖం పెరిగిపోయాయి!"

"అంతేకాదమ్మా! ఒక చెంప మీద కొట్టేరని రెండో చెంప చూపిస్తే దానిమీద కొట్టి బూటుకాలితో తంతున్నారు!"

"అయినా కారుచీకట్లో కాంతిరేఖలు లేకపోలేదురా! ఇందిరా గాంధీ బ్యాంకుల జాతీయకరణ, రాజభరణాలరద్దు చెయ్యలేదా? గరీబీ హరావో అంటూ బృహత్కార్యం చేబట్టడంలేదా?"

"అదంతా ఎన్నికల స్టంట్! నీదాకా వచ్చిందో లేదోకాని అమ్మా – శ్రీకాకుళం అడవుల్లో గిరిజనుల్ని గిరిజనేతరులు నిలువునా దోచేస్తున్నారు. వారి పంటల్ని అయినకాడికి కొంటూ వారి భూముల్ని ఆక్రమించుకుంటూ దొరలై పాలిస్తున్నారు. వడ్డీల పేరిట, శిక్షల పేరిట జులుం చెలాయిస్తూ బానిసల్ని చేసుకుంటున్నారు. వెంపటాపు సత్యం లాటివారు వారిలో చైతన్యం రగులుస్తున్నారు. తుపాకి పట్టడం నేర్పుతున్నారు. పోరాటం నేర్పుతున్నారు. హింసతో తమ హక్కుల్ని సాధించుకోమంటున్నారు.

ఆ సాయుధ ఉద్యమం దావానలంతా అడవులన్నిట్నీ చుట్టుముట్టేస్తోందమ్మా!........"

ఆమె ఒళ్ళు జలదరించింది. భయంగా చూసింది. "గాంధీ! నీ పేరు గాంధీ. అహింసకి ప్రతిరూపానివి. ఆ సంగతి మర్చిపోకు."

"అందుకే పేరుమార్చుకుంటే బాగుంటుందనుకుంటున్నాను."

శ్రీకాంత్ బీ.ఎస్సీ. ఫస్టుక్లాసులో పాసవ్వడమే కాదు, కాలేజీ ఫస్ట్ వచ్చాడు.

తల్లీ కొడుకుల ఆనందాని కవధుల్లేకపోయాయి.

తర్వాతేమిటన్న ప్రశ్న ఎదురైంది.

కొందరు ఎమ్మెస్సీ చదవమన్నారు. మరికొందరు ఉద్యోగ ప్రయత్నాలు చెయ్యటం మంచిదన్నారు. కాలేజీ ఫస్టువచ్చాడు గనుక ఆఫీసర్ ర్యాంక్ ఉద్యోగం రావొచ్చన్నారింకొందరు.

అటు గాంధీ చదువు ఖర్చు ఇవతల ఇంటి ఖర్చు, పెళ్లి కెదిగి వున్న సుబ్బలక్ష్మి.

ఇప్పటికే అతికష్టంమీద పిల్లల్ని చదివిస్తోంది రాజ్యం. శ్రీకాంత్ ఎమ్మెస్సీ చదవాలంటే వైజాగ్ వెళ్ళాలి. అంత ఖర్చు భరించగల స్తోమతు లేదు.

కానాసంగతి చెబితే శ్రీకాంత్ అపార్థం చేసుకోవచ్చు. తమ్ముడికి ఎంతైనా ఖర్చుపెట్టి చదివిస్తావుగాని నన్ను చదివించవని నిష్ఠురం వేస్తాడని భయపడింది.

అందుకని తన అభిప్రాయం బయటపెట్టకుండా 'నీకెలా బావుంటుందంటే అలా చెయ్యరా!" అంది.

"ఎమ్మెస్సీకి చాలా ఖర్చవుతుందమ్మా! మెల్లగా డబ్బు కూడబెట్టి చెల్లాయి పెళ్ళి చెయ్యాలి కదా! అందుకని ఉద్యోగ ప్రయత్నాలు మొదలెడతాను. రేపు ఏలూరు వెళ్ళి ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్ఛేంజీలో పేరు నమోదు చేయించి వస్తాను."

"పెద్దవాడివి. నీకు నేను చెప్పాలేవిట్రా? నీకెలా బావుంటుందనిపిస్తే అలా చెయ్యి. పై చదువు చదివితే మంచి ఉద్యోగం వస్తుందేమో ఆలోచించు మరి......"

"పోస్ట్‌గ్రాడ్యుయేట్లు కూడా డిగ్రీవాతి పోస్టులకే పోటీ పడుతున్నారమ్మా! వెంటనే ఉద్యోగం వస్తే రెండేళ్ళ సీనియారిటీ వస్తుంది" అన్నాడు.

వెంటనే ఉద్యోగం వేటలో పడ్డాడు.

రోజూ లైబ్రరీ కెళ్ళడం అన్ని పేపర్లూ తిరగెయ్యటం, అన్ని ప్రకటనలకీ అప్లై చెయ్యడం అతడి దినచర్య అయిపోయింది.

అప్లికేషన్లకీ ట్రూకాపీలకీ పోస్టేజీకీ చాలా ఖర్చువుతోంది. ఇది చాలదన్నట్టు కొందరు పోస్టల్ ఆర్డర్లని జత చేయమంటున్నారు.

ప్రభుత్వ సంస్థలు కూడా వందా యాభైచొప్పున నిరుద్యోగుల్నుండి వసూలు చెయ్యడం రాజ్యానికి నచ్చలేదు.

ఇది దారుణమంటూ దినపత్రికలకి సంపాదక లేఖలు రాసింది కూడా.

అయినా ప్రయోజనమేమీ లేకపోయింది.

కాలేజీ ఫస్ట్ వచ్చాడు గనుక ఇంచక్కని ఉద్యోగం వచ్చి ఒళ్ళో వాలుతుందనుకున్నాడు శ్రీకాంత్. ఆఫీసరు హోదాలభించొచ్చని కలలు కూడా కన్నాడు.

ఎన్నో ఇంటర్వ్యూలకీ పరీక్షలకీ వెళ్తున్నాడు, వస్తున్నాడు.

రిగ్రెట్ లెటర్స్ మాత్రం క్రమం తప్పకుండా వస్తున్నాయి!

☆ ☆ ☆

రామనాథం దంపతు లొచ్చారు. వారితోబాటు వారమ్మాయి భారతి కూడా వచ్చింది.

అతడిప్పుడు కొవ్వూరులో పని చేస్తున్నాడు. రాజమ్మనీ పిల్లల్నీ చూసి వెళ్దామనొచ్చాడు. భారతి రాజమ్మని బాగా ఆకర్షించింది.

చూడముచ్చటగా వుంది. చురుకైంది. ఏ పని చెప్పినా సరే, చక చకా చేస్తోంది. అల్లి కలూ కుట్లూ బాగా వచ్చట. కొన్ని బొమ్మలు కుట్టి తెచ్చింది. ఈమధ్యే కాలేజీలో చేరింది.

శ్రీకాంత్‌కి ఆ అమ్మాయిని చేసుకుంటే బావుంటుందన్పించిది.

తోడబుట్టకపోయినా తోడబుట్టినవాడికన్నా ఎక్కువ అభిమానంగా వుంటున్నాడు రామనాథం. పైగా తండ్రికి తలకొరివి పెట్టిన వాడు!

వాళ్ళెళ్ళేక తన మనస్సులోని అభిప్రాయాన్ని కొడుకు దగ్గర బయట పెట్టింది రాజమ్మ.

"వాళ్ళదగ్గరే ముందనీ?" అనేశాడు.

"ఏముండటం ఏవిట్రా? లక్షణమైన పిల్ల. మనమంటే ప్రాణం పెట్టేవాళ్ళు. అంతకంటే ఏం కావాలి చెప్పు?"

"లక్షణమైన పిల్లేకాని లక్షలున్నపిల్లకాదు!" నవ్వేడు శ్రీకాంత్.

నిర్ఘాంతపోయింది. "కట్నం కావాలనా?"

"అందులో తప్పేముంది? నల్లగ్రోటాటే మనమూనూ. ఊరికే లక్షల్లొచ్చి పడుతోంటే మోకాలొడ్డుతామా?"

"అంటే ఏవిట్రా నీ ఉద్దేశ్యం కట్నానికి అమ్ముడుపోతావా?"

"అమ్మడం కొనడం అన్నది వ్యాపారసూత్రం. సరుకునిబట్టి డిమాండ్ వుంటుంది. డిమాండ్‌నిబట్టి లాభముంటుంది. మనం హాయిగా బతకాలంటే, మన స్టేటస్ పెరగాలంటే డబ్బు కావాలి. అది ఏ రూపంలో వస్తేనేం? వచ్చింది రాబట్టుకోవడమే తెలివైన పని!"

అయోమయంగా చూసింది. "నీ మాటలు గాంధీ వింటే ఏమంటాడో తెలుసా?"

"అరగంటసేపు ఉపన్యాసమిస్తాడు. నేనూ ఇవ్వగలను. కావల్సింది ఉపన్యాసాలుకాదు, ఆచరణ. ఆచరణలో చూపినవాడే అసలు సిసలు ఆదర్శవాది. అలాటివాళ్ళు కాగడా పెట్టి వెదకినా కన్పించరు. అయినాఇప్పుడీ గొడవంతా ఎందుకులేమ్మా! ముందు 'ఉద్యోగంరానీ, తర్వాత ఆలోచిద్దాం, అన్నట్టింకోసంగతి, నీ కిష్టమున్నా లేకున్నా కట్నం ఇవ్వకపోతే సుబ్బలక్ష్మికి పెళ్ళికాదు!"

త్రాన్పడిపోయి పిచ్చిచూపులు చూసింది రాజమ్మ!

## 31

గాంధీ సరిగా కాలేజీకి రావట్లేదనీ అతడు సవ్యంగా క్లాసులు కొచ్చేట్లు శ్రద్ధ తీసుకోమని ఇంజనీరింగుకాలేజీ ప్రిన్సిపాల్ ఉత్తరం రాశారు.

"ఇదేవిట్రా శ్రీకాంత్! గాంధీ కాలేజీలోనే వుంటున్నాడు కదా, ఇలా రాశారేవిటి?" రాజమ్మ అడిగింది.

"వాడెప్పుడు తిన్నగా కాలేజీ కెళ్ళేడనీ! లక్కీగా సీటొచ్చేసిందంతే!" అన్నాడు శ్రీకాంత్.

"కాలేజీ కెళ్ళకుండా ఏం జేస్తున్నాడంటావు?"

"సభలూ సమావేశాలూ రాజకీయాలూ ఎల్లక్షన్లూ! చూస్తూండు. నాకన్నా వాడికే ముందు ఉద్యోగం వస్తుంది. ప్రతిభకీదేశంలో గుర్తింపు వుండదు!" అసహనంగా అన్నాడు.

"అలా నిరాశ పడతావేంరా? చూస్తూండు నీకే మంచి ఉద్యోగం వస్తుంది."

"నాకు నమ్మకం లేదు."

చొక్కా తొడుక్కుని బయటి కెళ్ళిపోయాడు.

ఈ మధ్య శ్రీకాంత్ చాలా చిక్కాడు. ఎప్పుడూ దిగులుగా వుంటున్నాడు. మరీ నిరాశకిలోనై ఎప్పుడేం చేస్తాడో, ఏ అఘాయిత్యానికి తలపడతాడోనని రాజమ్మ భయం.

"పెద్దన్నయ్య మాట లెప్పుడూ ఇంతేగాని ముందు చిన్నన్నయ్యకి ఉత్తరం రాయమ్మా!" అంది సుబ్బలక్ష్మి.

అతడిమీద తాము పెట్టుకున్న ఆశల్నీ ఇంటి ఆర్థిక పరిస్థితినీ వివరిస్తూ శ్రద్ధగా చదువుకోమని కోరుతూ ఉత్తరం రాసింది. ఈ ఏడాదితో చదువు ముగుస్తుంది గనుక ఫస్టుక్లాసులో పాసై చక్కని ఉద్యోగంలో చేరి చెల్లెలి పెళ్ళి చేస్తావని ఆశిస్తున్నానని కూడా రాసింది రాజ్యం.

ఉత్తరం పోస్టు చేసి కించిత్తు నిశ్చింతగా ఫీలైంది. అయినప్పటికీ గుండెలోతుల్లో ఏదో తెలీని భయం నీడలు కదుల్తూనే వున్నాయి, భయ పెడుతూనే వున్నాయి!

☆ ☆ ☆

"అమ్మా, మంత్రి జనార్దనంగారు వాళ్ళూరికి వచ్చారు." బయట్నుంచి ఉత్సాహంగా వచ్చి అన్నాడు. శ్రీకాంత్.

"వస్తే ఏవిట్రా?"

"ఆయన మా తాతయ్య శిష్యుడు కదా! వెళ్ళి కలుద్దాం అమ్మా! ఆయన తలచుకుంటే ఫస్ట్‌క్లాసైన ఉద్యోగం వేయించగలడు."

అతడి కళ్ళల్లో దేదీప్యమానంగా వెలుగుతోన్న ఆశాదీపాలని చూసి చిన్నగా నిట్టూర్చింది రాజమ్మ.

"అతడు మా నాన్న శిష్యుడు కాదురా!"

"కాకపోతే ఎందుకలా చెప్పకుంటాడు?"

"తను చరిత్రహీనుడు. అంచేత నాన్న పేరు ఉపయోగించుకుని తనకి తాను ఘనచరిత్ర రాసుకుంటున్నాడు. స్వతంత్ర్యపోరాటంలో పాల్గోలేదు కూడా. కాని స్వాతంత్ర సమర సేనానిగా గొప్పలు చెబుతూ రాయితీలూ పదవులూ పొందుతున్నాడు."

"అయితేనేం? అతడిప్పుడు కేంద్ర మంత్రి. మన మెళ్ళి అర్థిస్తే తప్పక సాయపడ్తాడు. నాకు ఉద్యోగం వస్తుందమ్మా!"

"ఒక మోసగాడు మనకి సాయపడతాడంటావా?"

"ఎన్నో ఫ్యాక్టరీల వాళ్ళకి ప్రముఖ కాంట్రాక్టర్లకి బిజినెస్ ప్రముఖులకి ఎన్నో రకాల సహాయాలు చేస్తున్నారు. మన కింత చిన్న సాయం చెయ్యలేరా చెప్పు? ఈ రోజుల్లో ఉద్యోగాలు ప్రతిభని చూసివ్వడం లేదమ్మా! లంచాలైనా ఇవ్వాలి, రికమండేషన్ అయినా చెయ్యాలి. ఆ రెండూ లేకపోతే ఉద్యోగంరాదు." నిస్పృహగా అన్నాడు శ్రీకాంత్.

"పోనీ, మా లెనిన్ బాబు నడుగుదాం. అతడు ఎమ్మెల్యేకదా?"

"పవర్‌లో లేని కమ్యూనిస్టు ఎమ్మెల్యేలకి పవరేం వుంటుంది? జనార్ధనంగారు కేంద్ర మంత్రివర్గంలో ముఖ్యమైన శాఖ నిర్వహిస్తున్నారమ్మా. ఆయన చేతికింద బోల్డు ఉద్యోగాలుంటాయి. నా కోసం ఒక్కసారి వెళదామమ్మా!"

ఆయన్ని అర్థించడం రాజమ్మకిష్టం లేదు. ఒకవ్వేళ అర్థించినా ఆయన సాయపడ్తాడన్న నమ్మకం ఏ కోశానా లేదు. కానామాట చెబితే శ్రీకాంత్ మరోలా భావిస్తాడు. మరోరకంగా ప్రతిస్పందిస్తాడు. అతడ్ని మరింత ఆందోళన పెట్టడం మంచిది కాదనుకుంది.

తల్లీ కొడుకు లిద్దరూ జనార్ధనం గారింటి కెళ్ళారు.

ఇంటి నిండా వంది మాగధులూ అధికార్లూ పరిసర ప్రముఖులూ వున్నారు. అంతా బిజీబిజీగా వున్నారు. వారినెవ్వరూ పట్టించుకోలేదు.

కడకి మంత్రిగారి అనుచరుడ్ని పట్టుకుని విషయం వివరించారు.

అతడు నవ్వేశాడు "ఇలాటి చిన్న చిన్న విషయాలు పట్టించుకునే తీరికెక్కడిదీ! మంత్రిగారు యమబిజీ?"

"మాకిదే పెద్దది. ఆయన మా నాన్నగార్కి శిష్యులు. నేను ఫలానా అని చెప్పండి చాలు. మమ్మల్ని కలవడానికిష్టపడకపోతే వెళ్ళిపోతాం!" అంది రాజమ్మ.

"మీరు వియ్యన్నగారమ్మాయా? మరలాచెప్పరేం? మీరు కూడా ఇలాంటి చిల్లర పనుల కోసం వస్తే ఎలాగమ్మా? ఏదో పెద్ద పనికి టెండరు పెట్టండి. అయిదారు లక్షలు మిగుల్చుకోండి. పెట్టుబడికి మీరేం ఇదవ్వద్దు. మీపేరున పెట్రోలు బంకో గ్యాస్ ఏజన్సీయో మరో లైసెన్సో ఇప్పించుకుంటే చాలు, మీకు కమీషన్ ఇచ్చి ఆయా వ్యాపారాలు

నడిపేవాళ్ళు బోల్డు మందున్నారు. పైసా పెట్టుబడి లేకుండా మీరు లక్షలు కళ్ళజూడొచ్చు"

"అన్యాయపు సొమ్ము మా కొద్దు లెండి. ఈ చిన్నపని చేసిపెడితే చాలు."

పెదవి విరుస్తూ కళ్ళజోడు పైనుంచి చూశాడు. "అంతా శ్రీ వైష్ణవులే. రొయ్య బుట్ట మాయం......" అని గొణుక్కుంటూ మంత్రిగారి గదిలోకెళ్ళాడు.

చీకటి పడింది. చాలామంది వెళ్ళిపోయారు.

రాజమ్మా శ్రీకాంత్ అభోజనంగా నిరీక్షిస్తుండిపోయారు.

"నే న్చెప్పలేదూ? ఆయన కళ్ళకి మనం చీమల్లా కన్పిస్తాంరా! వెళ్ళి పోదాం పద."

"ఇంత దూరం వచ్చి కలుసుకోకుండా ఎలా వెళ్తాం? అవసరం మనది. ఆయనకి బోల్డన్ని పనులుంటాయి మరి......"

కొడుకువంక చిత్రంగా చూసింది రాజమ్మ.

మరికాస్సేపటికి మరికొందర్తో గదిలోంచి బయటికొచ్చారు జనార్దనం.

రాజమ్మ శ్రీకాంత్ లేచి నమస్కరించారు.

ఎవరన్నట్టు చూశారాయన.

"వియ్యన్నగారమ్మాయీ మనవడూనూ." ఆయన అనుచరుడు చెప్పేడు.

"అలాగా! మరింతసేపూ చెప్పలేదేం అరెరె, ఎంత పొరబాటయ్యిందీ? చెప్పమ్మాయ్! నీ కేమైనా చేసిపెట్టాల్నా?"

"మా అబ్బాయి బీఎస్సీ ఫస్టుక్లాసులో పాసయ్యాడు. మీరేమైనా ఉద్యోగం ఇప్పిస్తారనీ......"

"ఈ మాత్రానికి నువ్వు రావాలా? కాకితో కబురంపితే చేసి పెట్టేవాడ్ని కదా? ఇదిగో అబ్బాయ్! ఫలానా చోట ఖాళీ వుందని చెప్పు, వెంటనే చేసిపెట్టేస్తాను" శ్రీకాంత్ నుద్దేశించి అన్నారు.

"వైజాగ్ స్టీల్ ప్లాంట్ లో ఖాళీలున్నాయండి....."

"అందులో డైరెక్టుగా వేసుకోడానికి వుండదు. పేపర్లో నోటిఫికేషన్ వస్తుంది. అప్పుడు చెప్పు చూద్దాం........"

ముందు కదుగెయ్యబోతోంటే అన్నాడు శ్రీకాంత్: "కలెక్టరాఫీసులో చాలా వేకెన్సీ లున్నాయండి."

"అవి స్టేట్ గవర్నమెంటు పరిధిలో కొస్తాయి. నేను చెబితే బావుండదు........"

"స్టేట్ బ్యాంకులో......"

"అదీ నా శాఖ పరిధిలోకి రాదోయ్! తొందరేం లేదు. అన్ని వివరాలూ సేకరించేక చెప్పు. లేదూ ఫలానా ఇంటర్వ్యూకి అటెండయ్యానని చెప్పు, చేసేస్తాను. మా వియ్యన్నగారి మనవడివి నీకు గాకపోతే ఎవరికి చేస్తాను చెప్పు వుంటాను........." అంటూ ముందుకి నడుస్తూ "వియ్యన్నగారు చాలా గొప్ప మనిషి. అలాటి వాళ్ళిప్పాడు కలికాని క్కూడా కన్పించరనుకోండి వారి శుశ్రూష భాగ్యం నా క్కలగటం నా అదృష్టం. వారి ప్రాణాలు పోయేముందు వారి నోట్లో తులసి తీర్థం పోసింది నేనే........." అంటూ ప్రక్కనున్న గణానికి చెప్పాసాగారాయన!

రాజమ్మకి నవ్వొచ్చింది.

"నువ్వు గట్టిగా బతిమాలుండాల్సింది......." నిష్ఠురంగా అన్నాడు శ్రీకాంత్.

కొడుకువంక జాలిగా చూసింది.

☆ ☆ ☆

చక్రపాణి పెద్దన్నగారు చనిపోయినట్టు కార్డు వచ్చింది.

ఆయన తన మీద చూపిన అభిమానం, సావిత్రి కురిపించిన ఆప్యాయతా గుర్తొచ్చాయి. కన్నీళ్ళు పొంగివచ్చాయి.

చాలాసేపు గడపకి చేరబడి కూర్చుండిపోయింది రాజమ్మ. అత్త వారింట్లో గడిపిన రోజుల్ని స్మరించుకుంటూండిపోయింది.

పిల్లల్ని ఇంట్లోపెట్టి తనొక్కతీ పెద్దకర్మ కెళ్ళింది.

ఆమెని కావలించుకుని బావురుమంది సావిత్రి. ఆమెని ఓదార్చడం రాజమ్మకి సాధ్యం కాలేదు.

పాణి అన్నల పరిస్థితేమీ బావుండలేదు. అంతా వ్యవసాయాన్ని నమ్ముకుని పల్లెలో వుండిపోయారు. వారి పిల్లలు కొందరు నర్సాపురం పాలకొల్లు వెళ్ళి ఏవో వ్యాపారాలు చేపట్టారు. వారి పరిస్థితి కొంతలో కొంత మెరుగ్గా వుంది.

పాణి తమ్ముడు డిప్యూటీ కలెక్టరు. కాని శుభాశుభకార్యాలు దేనికీ రావట్లేదు. ఒకరకంగా రక్తసంబంధాన్ని తెంచేసుకున్నాడని చెప్పాలి.

ఆడబడుచు సుధారాణి పరిస్థితి కూడా బావుంది. కాంట్రాక్టుల

మీద బాగా సంపాదించారు. ఆమె భర్త మరొకామెని వుంచుకున్నాడని అంతా చెవులు కొరుక్కున్నారు.

పెద్దన్నగారి కర్మకి రాని పాణితమ్ముణ్ని ఎవరూ తప్పుబట్టలేదు. "పెద్ద ఉద్యోగమాయె. చీటికీ మాటికీ రావటం కుదుర్తుందేవిటి?" అని సమర్థించుకున్నారు.

పుట్టింటివారికి కాస్తంతకూడా విదపని సుధారాణినీ పల్లెత్తు మాటన్లేదు. "తరగని ఆస్తి సంపాదించినా పుట్టిల్లన్న మమకారంతో రావడమే ఓ గొప్ప" అన్నారు.

కాని రాజమ్మ అత్తారింట్లోని అన్ని కధా కార్యాలకీ రావట్లేదని దెప్పి పొడిచారు. మొగుడు పోయేసరికి అత్తింటితో సంబంధం తెంచేసుకుందని నిందించారు. ఉద్యోగం చేస్తున్నందుకు కళ్ళు నెత్తిమీద కొచ్చాయన్నారు.

"ప్రతి ముఖ్యకార్యానికీ వస్తూనే వున్నాగా" అందామె. కానెవరూ విన్పించుకోలేదు. "నీ పిల్లల్నికూడా మాకు చూపించలేదు. అత్తింటి వారు విషమయ్యారు నీకు" అని చెప్పేసరికి ఆమె కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

తనూ భర్తా భీమవరంలో కాపురం పెట్టిన కొత్తల్లో ఎన్ని కష్టాలు పడ్డారు! ఎన్ని కన్నీళ్ళు తాగారు! తనకి ఉద్యోగం వచ్చేవరకూ పచ్చడి మెతుకులే పరమాన్నంగా తిన్నారు!

అప్పుడు తనెవరికీ గుర్తు రాలేదు.

ఎవరూ తమింట్లోకి తొంగిచూళ్ళేదు.

తమ పరిస్థితి మెరుగుపడ్డాక రాకపోకలు మొదలయ్యాయి. అదైనా తమనుంచి ఏదో ఆశించి దగ్గరయ్యారు. కాని తన పిల్లల చేతిలో ఎప్పుడూ ఎవ్వరూ పావలా పెట్టి ఎరుగరు!

అయినా సరే అదేమీ మనస్సులో పెట్టకోకుండా వున్నంతలో పెడుతూనే వస్తోంది. అయినా తృప్తి లేదెవరికీ!

"సుధ కొడుక్కి నీ కూతుర్ని చేస్తే బావుంటుంది." తోడికోడలు దమయంతి అంది.

"వాళ్ళకి మేం కన్పిస్తా మేమిటి?"

"కావాల్సిన సంబంధం కాదంటారనుకోను. సుధకి మిడిసిపా టెక్కువగాని వాళ్ళాయన బోళాబోళీ మనిషే. వీలు చూసుకుని మీ బావగార్ని సంబంధం కదపమంటాను."

"మగపిల్లలో దారిలో పడలేదు. ఇప్పుడు పిల్ల పెళ్లెలా చెయ్యగలను అక్కా?"

రాజమ్మ మాటలు సుధారాణి విని రయ్‌మని లేచింది. "అక్కడికి మేమేదో దేబిరించినట్టు మాట్లాడతావేంటే? మీ ముష్టి సంబంధం మాకేం అక్కర్లేదు. మా వాడికి పిల్లనిస్తామని గొప్ప గొప్పవాళ్ళు వస్తున్నారు, తెలుసా?"

"మాకు తగ్గ సంబంధం మాకూ వస్తుంది" అని చక్కా వచ్చేసింది రాజమ్మ.

## 32

శ్రీకాంత్‌కి ఎంప్లాయ్‌మెంట్ ఎక్ఛేంజినుంచి కాల్ లెటర్ వచ్చింది. సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులోని ఎల్డీసీ పోస్టుకోసం ఇంటర్వ్యూకి రమ్మన్నారు.

పెన్నిధి లభించినట్టు ఎగిరి గంతేశాడు శ్రీకాంత్. ఆ ఉద్యోగం తనకొస్తే తిరుపతి వచ్చి జుట్టు ఇస్తానని మొక్కేసుకున్నాడు కూడా.

తన స్నేహితుల్నీ పరిచయస్తుల్నీ అందర్నీ వాకబు చేశాడు.

"జాక్ పాట్ తగిలినట్లే" అన్నారంతా.

పోటీ ఎక్కువగా వుంటుందనీ, హైలెవెల్ రికమండేషన్ లేదంటే పెద్ద మొత్తం లంచం ఇవ్వాలనీ చెప్పేరు.

తల్లితో అదేమాట చెప్పేడు. తల తాకట్టుపెట్టి డబ్బు సర్దితే జీతం మీద తీర్చుకుంటానని కూడా అన్నాడు.

"నీలాంటి తెలివైనవాడ్నిగాక ఇంకెవర్ని సెలక్టు చేస్తార్రా? నీకా ఉద్యోగం వచ్చి తీర్తుంది, ధైర్యంగా వుండు."

"ఆకాలం ఎప్పుడో వెళ్ళిపోయింది."

"ప్రతిభ నెవరూ తోసిపుచ్చలేర్రా!"

"నీ వన్నీ సత్యమేవ జయతే కాలం మాటలమ్మా ఆ కాలం ఎప్పుడో మారిపోయింది. ఇది కలికాలమమ్మా డబ్బుకే విలువిచ్చే కాలం, డబ్బున్నవారినే గౌరవించే కాలం, డబ్బుకే పట్టంకట్టే కాలం!"

"శ్రీకాంత్!"

"అవునమ్మా! డబ్బు కోసం ఎన్ని అడ్డదార్లు తొక్కడానికైనా అంతా సిద్ధమే. క్రిందినుంచి పైవరకూ అడుగడుగునా పరచుకునుంది అవినీతి

ఆశ్రిత పక్షపాతమూనూ. దీన్నుండి నాలాటివారిని రక్షించేందు కెవరూ లేరు, ఎవరూ రారు!"

"అలా నిరాశ పడతావేంరా? గీతలో కృష్ణుడన్నట్టు నీ పని నువ్వు చెయ్యి. ఓటమి భయంతో అస్త్రసన్యాసం చేస్తావెందుకు?"

"లంచమూ సిఫారసూ – ఇవే ఈ నాటి అస్త్రాలు. లంచమివ్వడాని క్కూడా సరైనా సిఫారసు వుండాలి. ఏం చేసైనాసరే ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలమ్మా ఇది చేజారితే నాకీ జన్మలో ఉద్యోగం రాదు!"

అతడి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి.

"నన్నేం చెయ్యమంటావో చెప్పు, చేస్తాను."

"డబ్బు కావాలి, రికమండేషన్ కావాలి....."

"మనకెవరున్నారు మరి?"

"లెనిన్ బాబాయి లేడూ! ఆయనిప్పుడు యమ్మెల్యేకదా!"

"ఆయన కమ్యూనిష్టుకదా. ఇలాటివి చేస్తాడా?"

"ఎందుకు చేయడు? అధికారం వున్న ప్రతివాడూ దాన్ని వినియో గించుకుని తీరతాడు."

"ఇదివరకు రికమండేషన్‌వాళ్ళు ఉద్యోగాన్ని తన్నుకుపోతున్నా రన్నావు. మరి నువ్వు చేస్తున్నదేమిట్రా?" అని అడగాలన్పించింది. కాని అడగలేదు.

"మాట్లాడవేం అమ్మా? నీ కిష్టం లేదుకదూ? అవున్లే. ఇదే గాంధీఐతే పరుగునెళ్ళి అర్థించేదానివి. నాకెందుకు చేస్తావులే నేనంటే నీ కెప్పుడూ చిన్నచూపే. నేను బాగుపట్టం నీ కిష్టం లేదు." నిష్ఠురంగా అన్నాడు.

"ఛా ఛా. అవేం మాటల్రా? వక్రమార్గం తొక్కాలంటే సంకోచంగా వుంది. బాధగాను వుంది గాంధీ వుంటే ఒప్పుకోనిచ్చేవాడే కాదు."

"అయితే ఒప్పుకోనంటావు. నా దారి నన్ను చూసుకోమంటావు."

"అలాగని నేనెక్కడన్నా. మనిద్దరం వెళ్ళి అడుగుదాంలేం? జనా ర్దనంగార్ని అడిగి లేదన్పించుకున్నాం. ఇతడే చెయ్యి చూపిస్తాడో చూద్దాంలే."

"నువ్వు మనస్ఫూర్తిగా అడిగితే తప్పకుండా చేస్తాడు."

"చేస్తే మంచిదే. నువ్వోదారిన పడితే నా కంతేచాలు!"

ఇద్దరూ లెనిన్‌బాబు ఇంటికెళ్ళారు.

అతడికి ప్రజల్లోనూ పార్టీలోనూ పట్టూ పలుకుబడీ పెరిగాయి. ప్రభుత్వంతో అధికారుల్తో పోట్లాడిమరీ తన నియోజకవర్గంలో చాలా మంచి పనులు చేయించాడు. అదే సమయంలో కాంట్రాక్టర్లతో వ్యాపారస్తులతో సంబంధాలు పెరిగాయి. ఇటు వీరితోనూ అటు ప్రజల్తోనూ సమాన సంబంధాలు కొనసాగిస్తూనే - తనూ - పార్టీకి తెలీకుండా బాగా ఆర్జించసాగాడు!

"సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో ఉద్యోగమంటే చాలా కాంపిటీషన్ వుంటుంది. చాలా కష్టం" అన్నాడతను.

"ఎంప్లాయ్‌మెంట్ ఎక్స్చేంజిద్వారా కదా! పోటీ తక్కువ వుంటుంది. మీరు తలచుకుంటే ఇదేమంత కష్టం కాదు బాబాయ్!" అన్నాడు శ్రీకాంత్.

"పాయింటే. నేను చెప్పేననుకో, కటించొచ్చు. అంచేత ఒక మంత్రితోనైనా చెప్పించాలి. మంత్రులదేం పోతుంది? వచ్చిన వాళ్ళందరికీ లెటర్స్ రాసిచ్చేస్తూంటారు. అందుకని అధికారుల్ని కూడా మేనేజ్ చెయ్యాలి. డబ్బు చాలా ఖర్చు అవుతుంది. నువ్వు పెట్టుకోగలవా?"

రాజమ్మ వంక చూశాడు.

"నా సంగతి నీకు తెలీదు. పిల్లల్ని చదివించడానికే తలప్రాణం తోక కొస్తోంది!"

"మరెలా చెప్పు?"

"నువ్వే ఏదో దారి చూడాలి బాబాయ్!........"

"మా అన్నయ్య గారమ్మాయిని చేసుకుంటారేమో?......." మెల్లగా అంది లెనిన్‌బాబు భార్య.

"ఓ పని చేద్దాం అయితే. నేనేవో తిప్పలుపడి ఈ ఉద్యోగం వీడికి వేయిస్తాను. మా బామ్మర్ది కూతుర్నిచ్చి పెళ్లిచేద్దాం."

"దానికీ దీనికీ ముడేవిటి?"

"వాళ్ళు పెద్దగా కట్నం ఇచ్చుకోలేరు. అందుకని వాళ్ళకీ సాయ పడినట్లుంటుందికదా! ఇద్దరూ కావాల్సినవాళ్ళేనాయె!"

ఆమె కర్థమైంది. ఉద్యోగం వేయించడానికది "లంచం"గా అడుగు తున్నాడు. ఆమె మనస్సు చేదుగా అయ్యింది.

ఒకప్పుడు త్యాగధనుల దేశభక్తుల పార్టీగా వున్న కాంగ్రెస్‌పార్టీ స్వార్థ పరులకీ అవినీతిపరులకీ అవకాశవాదులకీ స్థావరమయ్యింది!

పేదజనోద్ధరణే లక్ష్యంగా రక్తాన్ని సైతం చిందిస్తూ శ్రామికుల జెండాని మోస్తోన్న తులసి వనం లాంటి కమ్యూనిస్టు పార్టీలో కూడా గంజాయి మొక్క! పార్టీ ఆదేశానుసారం తెలంగాణా గడ్డమీద పోరాడి రజాకార్ల చేతిలో అమరుడైన శివయ్యకీ మహిళా జన చైతన్యస్ఫూర్తియై నిలిచి పోలీసు లారీ దెబ్బలకి మంచం పట్టి మరణించిన అన్నపూర్ణకీ జన్మించిన లెనిన్ బాబు పోరుబాట విడిచి స్వార్థపు పడగనీడ చేరడం ఆశ్చర్యమూ ఆవేదనా కల్గించాయి.

బాధగా చూసింది. సానుభూతిగా చూసింది. రామనాథం అన్నయ్య కూతుర్ని చేసుకోవాలనుందని చెప్పబోయింది.

కాని ఆమె నోరుతెరచేలోపు "మీరెలా చెబితే అలా వింటాం. ఈ ఉద్యోగం వచ్చేట్లు చూడండి, చాలు" అన్నాడు శ్రీకాంత్.

"గుడ్! బాగుపడే లక్షణం అంటే అదీ. సబ్ రిజిస్ట్రార్ ఆఫీసు పాడికుండలాంటిదిరా!" నవ్వేడతడు. సిగ్గుపడ్డాడు శ్రీకాంత్.

అయోమయంగా చూసింది రాజమ్మ.

మరికొద్దిరోజులకే శ్రీకాంత్‌కి ఉద్యోగం వచ్చింది. ఏలూర్లోని సబ్ రిజిస్ట్రార్ ఆఫీసులో వేశారు.

నెల తిరక్కుండానే లెనిన్ బావమరిది కూతుర్తో పెళ్ళయ్యింది.

పెళ్లికి తప్పకుండా రమ్మని రాజమ్మ ఉత్తరం రాసింది. కాని గాంధీ రాలేదు. కనీసం గ్రీటింగ్స్ కూడా పంపలేదు.

ఏలూర్లో కాపురం పెట్టి వెళ్ళిపోయాడు శ్రీకాంత్.

☆ ☆ ☆

అనుకోకుండా మ్యూచ్యువల్ దొరకడంతో మళ్ళీ భీమవరం స్కూలుకి వచ్చేసింది రాజమ్మ.

స్కూలు స్టాఫ్ అంతా మారారు సైన్స్ టీచరు ఆనందమోహన్ అభ్యుదయవాది. స్త్రీ పక్షపాతిగా పేరు తెచ్చుకోవాలన్న తహ తహ ఎక్కువగా వుంది. దొరికిన ప్రతి సందర్భాన్నీ ఉపయోగించుకుని ఉపన్యాసాలిచ్చి చప్పట్లు కైవసం చేసుకోవడం అతడి హాబీ అయిపోయింది.

"పితార్రక్షతి కౌమారే భర్తార్రక్షతి యవ్వనే రక్షంతి స్థవిరే పుత్రాః నస్త్రీస్వాతంత్ర్య మర్హతి – అన్నారు. అంటే ఆడది ఎప్పుడూ ఎవరో ఒకరి రక్షణలో వుండాలి. ఎవరోఒకరి మీద ఆధారపడి వుండాలి. తను

స్వేచ్ఛగా వుండటానికి వీల్లేదు. అసలామెకి స్వతంత్రం వుండకూడదుట. ఎంత దారుణమో చూడండి........" పేపర్లో వచ్చిన ఒక వార్తకి స్పందిస్తూ అన్నాడు ఆనందమోహన్.

"చాలా బాగా చెప్పేరు చట్టం సంప్రదాయం సంస్కృతీ స్త్రీకి సంకెళ్ళు వేస్తున్నాయి. శరీరాన్నీ మనస్సునీ కూడా బంధించాలని చూస్తున్నాయి. వాటిని ఫట్ ఫట్ మని తెంచుకుంటే తప్ప స్త్రీకి విముక్తి వుండదు" అంది రాజమ్మ.

"వ్వావ్! ఎంత గొప్పగా చెప్పేరు ఎంతైనా కవయిత్రి అన్పించుకున్నారు." మెచ్చుకున్నాడతడు.

"స్త్రీ జన్మించడంకాదు స్త్రీగా తయారు చేయబడుతుంది అన్నారు ఫ్రెంచి మహిళా వాద ఉద్యమ సారథి సిమోన్ ది బోవా స్త్రీలు తమకాళ్ళకీ చేతులకీ నోటికీ మనస్సుకీ వేయబడ్డ సంకెళ్ళు తెంపుకుని సామాజిక రాజకీయ ఆర్థిక రంగాలలో సమాన స్థాయికోసం ఉద్యమించాలి. అందుకోసం నాకు చేతనైనది నేను చేస్తున్నాను. స్త్రీలు స్వేచ్ఛ నా స్వప్నం."

"వెల్ సెడ్!" చప్పట్లు కొట్టాడు ఆనందమోహన్. మిగతావాళ్ళు కూడా ఆమెవంక ప్రశంసాపూర్వకంగా చూశారు.

"చలం ఏమన్నారంటే, స్త్రీ స్వాతంత్ర్యం అంటే అందరికీ ఇష్టమేనట. కాని ఆ స్త్రీ పరాయిదై వుండాలిట" అని నవ్వి, "మగాళ్ళలో హిపోక్రసీ పోనంతవరకూ ఉపన్యాసాలిచ్చి ప్రయోజనమేమిటి చెప్పండి?" అంది.

ఆమె మాటలు చురుక్కుమని తగిలేసరికి గతుక్కుమన్నారంతా. ఆనందమోహన్ మొహం జేవురించింది.

"మీ రెవరి గురించి చెబుతున్నారో లేక మీ అనుభవాన్ని దృష్టిలో పెట్టుకుని చెబుతున్నారోగాని అంతా అలాటివాళ్ళే అంటే నే నొప్పు కోను. స్త్రీల ఉన్నతికి పాటుపడిన రాజారాంమోహన్‌రాయి, వీరేశలింగం వగైరాలంతా పురుషులే. నామటుకు నేను నా భార్యకి సమానస్థాయి హోదా కల్పించాను."

"అయితే ఆమె అంత అదృష్టవంతురాలు మరొకరుండరు........."

సరిగ్గా అప్పడొచ్చి ఆనందమోహన్‌కి ఫోన్ వచ్చిందని చెప్పేడు అటెండర్.

ఫోన్ మెస్సేజ్ వింటూనే కూలబడిపోయాడు ఆనందమోహన్.

సంగతి విని బెంబేలుపడ్డారంతా. హెడ్మాస్టారూ మరి ముగ్గురు టీచర్లు గుమాస్తా రహస్యంగా గుంపు చింపులు పడ్డారు. తర్వాత ఆనంద మోహన్ని తీసుకువెళ్ళిపోయారు.

ఏం జరిగిందో ఏవిటో అర్థంగాక ద్రమాన్పడి చూస్తూండిపోయారంతా.

కాసేపటికి వార్త గుప్పుమంది.

ఆనందమోహన్ భార్య ఆత్మహత్య చేసుకుందిట!

వార్త నెవరూ విశ్వసించలేకపోయారు. రాజమ్మ కూడా అదంతా అభూత కల్పన అయ్యుంటుందని తోసిపుచ్చేసింది.

కాని ఒక్కొక్కటిగా నిజాలు బయటికొచ్చాయి.

ఆయనింటికి దగ్గర్లో వుంటోన్న విద్యార్థి లెక్కువ వివరాలు చెప్పేరు.

ఆనందమోహన్ అనుమాన రోగి అట. భార్య మీద పిచ్చి అను మానమట. ఆమెని ఎక్కడికీ వెళ్లనివ్వట్ట. ఎవ్వర్తోనూ మాట్లాడనివ్వట్ట. ఆఖరికి స్కూలుకొచ్చేప్పుడు ఆమెని ఇంట్లోపెట్టి తాళంవేసిమరీవస్తాట్ట!

"ఎంత దారుణం! గోముఖ వ్యాఘ్రం అన్నమాట!" తల్లడిల్లిపోతూ అనుకుంది.

వెంటనే మరికొందర్తో కలిసి అతడింటికి వెళ్ళింది రాజమ్మ.

వారెళ్ళేసరికి అంతా గప్‌చిప్‌గా అరేంజ్ చేసేశారు. ఆత్మహత్య కాదనీ ప్రమాదవశాత్తూ చనిపోయిందనీ అందర్నీ నమ్మించారు. పోలీసుల్ని ఆ కట్టుకున్నారు. ఆమెపుట్టింటివారికి కబురైనా చెయ్యకుండా శవదహన యత్నాలు మొదలెట్టారు.

కళ్ళెదుట న్యాయం ఉరి తీయబడుతోంటే అత్యాచారం అందమైన తొడుగు తొడుక్కుంటోంటే సహించలేకపోయింది రాజమ్మ.

ఇలాటి ఘటన మళ్ళీ మళ్ళీ జరక్కూడదంటే నేరస్తుడి చేతికి సంకెళ్ళు పడాలి!

అతడి శిక్ష మరికొందరికి హెచ్చరిక కావాలి!

స్త్రీని మౌనహింసకి గురిచేస్తున్న వాళ్ళంతా కళ్ళు తెరవాలి!

ఆమె కూడా తమలాంటి ఒక మనిషేననీ ఆమెకీ స్పందించే హృదయమూ ఆలోచించే మెదడూ వున్నాయనీ మగప్రపంచం గుర్తించాలి!

మహిళా సంఘానికి ఫోన్ చేసి చెప్పింది.

వాళ్ళు వెంటనే రంగంలోకి దిగిపోయారు. పోలీసులూ అయిష్టంగానే అయినా శవాన్ని పోస్టుమార్టంకి తరలించకతప్పలేదు.

ఫలితంగా రాజమ్మకి కొందరితో వైరం ఏర్పడింది.

## 33

"అమ్మా! అడవి పిలుస్తోంది, జనత పిలుస్తోంది దేశం పిలుస్తోంది, వెళ్ళిపోతున్నాను. నాకోసం వెదకడం వృధా. నాగురించి ఆందోళన పడొద్దు. ఒక్క కన్నీటి బొట్టు రాల్చినా నా మీద ఒట్టే. నా జన్మని సార్థకం చేసుకుంటానని మాట ఇస్తున్నాను శలవు. అన్నట్టు ఇప్పుడు నా పేరు గాంధీకాదు సూరీడు!"

గాంధీ దగ్గర్నుంచి ఒచ్చిన ఉత్తరం చూసి కలవరపడుతూ చదివింది. ఏమీ అర్థంకాలేదు మళ్ళీ మళ్ళీ చదివింది.

దుఃఖం వెల్లువైంది.

గుండెలు గుబగుబలాడాయి.

సర్వం కోల్పోయిందాన్లా కూలబడిపోయింది రాజమ్మ.

"అమ్మా! ఏమైందమ్మా?............" కంగారుగా వచ్చి తల్లిని పొదవి పట్టుకుందిసుబ్బలక్ష్మి.

గబుక్కున ఉత్తరం అందుకుని చదివి ఏడ్చేసింది "చిన్నన్నయ్య ఎక్కడికెళ్ళేడమ్మా?"

"అడవిలోకి. జనాన్ని కాదని..........అడవిలోకి వెళ్ళేడు. నక్సలైటుగా మారిపోయాడు!"

"ఆఁ!"

"వాడి ఆవేశం తపన ఆకాంక్ష ఆయుధమై సువ్యవస్థ నిర్మాణానికి రాచబాట వేస్తుందనుకున్నాను. ఇలా ఆయుధంతో వర్గశత్రునిర్మూలన చేయడానికి అపర పరశురాముడవుతాడనుకోలేదు."

"మనం వెళ్దామమ్మా! నువ్వెళ్ళి పిలిస్తే తప్పక వస్తాడు."

"ఏ అడవిలో వెదకను? ఈ అమ్మ కడుపుకోత వాడి కెలా అర్థమవుతుందని వెదకను?"

"నీలాంటి ఎందరో అమ్మల కడుపు చల్లగా వుండటానికి వెళ్ళేడమ్మా! అంతా పచ్చగా వుండటానికి గరళం తాగిన పరమ శివుడమ్మా అన్నయ్య.

అన్నయ్యనేమీ అనొద్దు. అన్నయ్య ఈనాటి మహాత్ముడు, విప్లవ దూత!"
కూతురివంక వెర్రిగా చూసింది. తల నిమిరింది.
"అన్నయ్య కాలేజీకెళ్ళి కనుక్కుంటే అచూకీ తెలియొచ్చమ్మా!"
సాభిప్రాయంగా చూసి తలాడించింది.
"పెద్దన్నయ్యకి ఫోన్ చేసి వెంటనే రమ్మని చెప్పు. విషయం ఏమీ చెప్పకు. గాంధీ పనంటే వాడు రాడు. వస్తానన్నా వాడి భార్య రానివ్వదు."
తలాడించి పోస్టాఫీసు కెళ్ళి ఫోన్ చేసింది సుబ్బలక్ష్మి.
రాత్రి కొచ్చాడు శ్రీకాంత్.
మంచినీళ్ళిచ్చేక గాంధీ ఉత్తరాన్ని చేతిలో పెట్టింది.
"అన్నివేలు పోసి ఇంజనీరింగు చదివిస్తే ఆఖరికి నక్సలైటుగా మారాడన్నమాట!"
"నాకు కాళ్ళూ చేతులూ ఆడటం లేదురా. నువ్వే ఏదోటి చెయ్యాలి!"
"నేనేం చెయ్యగలను?"
"వాడి అచూకీ తీస్తే వెళ్ళి మందలించొచ్చు. మళ్ళీ జనజీవన స్రవంతిలోకి తీసుకురావచ్చు."
"నాది గవర్నమెంటు ఉద్యోగం. ఆ గొడవల్లో తలదూరిస్తే ముందు నా ఉద్యోగం ఊడుద్ది."
"నువ్వేం నేరం చెయ్యందే నిన్నెందుకంటార్రా?"
"ఉద్యమంతో సంబంధం వుందనుకోవచ్చు. ఇన్ఫార్మర్నని అనుమానించొచ్చు."
"మరేం చేద్దామంటావు?"
"నాకేం తోచటం లేదు."
"మనం తొందర పడకపోతే వాడేమైపోతాడోనని భయంగా వుందిరా! పోలీసులు వాళ్ళని పిట్టల్ని కాల్చినట్టు కాలుస్తున్నార్రా!"
"ఎవరి కర్మ కెవరు కర్తలు?"
నిస్సహాయంగా గోడకి జేరబడింది రాజమ్మ. కళ్ళముందు అంధకారం తప్ప మరేమీ కన్పించట్లేదు.
"లెనిన్‌బాబాయిని అడిగితే?" సుబ్బలక్ష్మి అంది.
సన్నని వెలుగు రేఖ కన్పించింది.

"అది మంచి ఆలోచన. వెళ్ళి ఆయన్నడుగు. ఏమైనా హెల్ప్ చేస్తే ఆయనే చెయ్యాలి. ఇక నే వెళ్తాను. ఇంట్లో ఒక్కత్తే వుండలేదు."

శ్రీకాంత్ వెళ్ళిపోయాడు.

మర్నాటి ఉదయమే రాజమ్మ వెళ్ళి లెనిన్‌బాబుని కలిసి అంతా వివరించింది.

"అరెరె, ఎంత పని చేశాడు! ఎంతో చురుకైనవాడూ పైకొస్తాడూ అనుకున్నాను. కడకిలా దారి తప్పేడన్నమాట? ఎన్నో ఏళ్ళనుంచి ఎన్నో ఉద్యమాలు నిర్వహిస్తూ, ఎందరినో సంఘటితపరుస్తూ, ఎన్నో పోరాటాలు సాగిస్తున్నా వ్యవస్థని మార్చలేక మేమే చల్లబడిపోతున్నాం అలాటిది నిన్నగాక మొన్న కళ్ళు తెరిచిన వీడు తుపాకిగొట్టంద్వారా విప్లవం సాధిస్తాడా? అసంభవం!"

"వేడిరక్తం. దుడుకుతత్వం......."

"అందుకే ఏదేదో చేసెయ్యగలం క్షణాల్లో మార్పు తీసుకొచ్చెయ్యగలం అని ఆవేశపడతారుతప్ప నిర్మాణాత్మకంగా ఆలోచించరు. వాస్తవ పరిస్థితుల్ని ఆకళింపుచేసుకోరు. స్థానిక అణచివేతలకీ, దౌరతనానికీ, దోపిడీకీ వ్యతిరేకంగా కొందరు ఎదురుతిరిగి పాక్షికవిజయం సాధించి వుండొచ్చు. కాని అదే సూత్రాన్ని వర్తింపజేసి మొత్తం దేశమంతా విప్లవానికి సన్నద్ధమైందంటూ ఆయుధం పట్టడం అవివేకం. దుందుడుకువాదం. ఆత్మవినాశనానికే ఇది దారి తీస్తుంది."

"ఇప్పుడేవిటి చెయ్యడం? వాడ్నెలా వెదికి పట్టుకోవడం?"

"ఎక్కడున్నాడని వెదుకుతాం చెప్పు? శ్రీకాకుళపు అడవుల్లోనే వున్నాడో లేక మరే అడవికైనా వెళ్లేడో! మనం వూరికే హైరాన పడటం తప్ప చేసేదేం లేదు. వేడి తగ్గేక పోలీసుదెబ్బ రుచి చూశాక వాడే తిరిగొస్తాళ్ళే. ఒకవేళ పోలీసులకి పట్టుబడితే అప్పుడెళ్ళి అప్రూవరుగా మార్చి తీసుకొద్దాంలే!"

"అంతవరకూ......."

"ఓపిగ్గా ఎదురుచూట్టమే!"

"ఈలోగా జరక్కూడనిది జరిగితే........?"

"ఆవేశానికి మూల్యం చెల్లించాడనుకోవడమే!"

మరి తర్కించలేక తిరిగొచ్చేసింది.

కాని అన్నం సహించటల్లేదు. నిద్ర రావట్లేదు.

ఏదో తప్పు చేశానన్న భావం, వాడి కర్మకి వాడ్ని వదిలేశానన్న భావన ఆమెని తొలిచెయ్యసాగాయి.

"నేను వైజాగ్ వెళ్ళొస్తానే" అంది కూతుర్తో.

"అదే మంచిదమ్మా! చిన్నన్నయ్య ఫ్రెండ్స్ ఏమైనా క్లూ ఇవ్వగలరు."

రాజమ్మ విశాఖపట్నం వెళ్ళి ప్రిన్సిపాల్‌ని కలిసింది.

ఆమె ఫలానా అని చెప్పగానే ఆమె అంటురోగి అన్నట్టు దూరంగా జరిగాడాయన.

"మీ వాడి గురించి మాకేం తెలీదు. అంతా చేరి కాలేజీలో ముసలం పుట్టించారు ఇడియట్స్......." అంటూ చెడా మడా తిట్టేశారు.

"ఇక మీ వాడి గురించి ఇక్కడికి రావల్సిన పని లేదు. అతడి ఎడ్రస్సు కేరాఫ్ అడవి లేదా కేరాఫ్ పోలీస్. ఇక వెళ్ళొచ్చు"

గాంధీ మిత్రుల్నీ హాస్టల్‌మేట్స్‌నీ కలిసింది.

విద్యార్థుల్లో ఒక యూనియన్ వారంతా నక్సలైట్ల సానుభూతిపరులని చెప్పేరు. గాంధీయేగాక ఇంకా చాలామంది ఆకర్షితులై చదువులు వదిలి వెళ్ళిపోయారన్నారు. కొందరు వాళ్ళని అభినందిస్తూ మాట్లాట్టం ఆమెని ఆశ్చర్యపరిచింది.

గాంధీ ఆచూకీ తెలీడం అసంభవమన్పించిందామెకి.

నిట్టూర్చి వెనుదిరుగుతోంటే ఒకతను పరుగున వచ్చి "గాంధీ కోసం వెదక్కండి. అతడి ఆచూకీ తెలిస్తే అతడి ప్రాణాలకే ప్రమాదం. అన్ని చోట్లా పోలీసు కుక్కలున్నారు" అని చెప్పి వడి వడిగా వెళ్ళిపోయాడు.

నిశ్చేష్టమయ్యింది.

మెల్లగా కదిలి కేంపస్ దాటుతోంటే గోడమీద రాతలామె దృష్టిలో పడ్డాయి.

"కసితో శత్రువు శిరస్సు నరకగలిగినవాడే నేటి హీరో!"

## 34

శ్రీకాంత్ భార్యాసమేతంగా వచ్చాడు.

"ఏలూరు నరసింహారావు పేటలో ఇల్లు కొన్నానమ్మా! వచ్చే బుధవారం గృహప్రవేశం. కొంచెం ముందు వచ్చెయ్యి చేదోడుగా వుందువుగాని" అన్నాడు తల్లితో.

"ఉద్యోగంలో చేరి ఏడాది కాలేదు. మీ అత్తవారి పరిస్థితీ సామాన్యమైందే. నీ జీతమూ మూడొందల చిల్లరే. అయినా ఇల్లుకొన గలిగావంటే అదంతా పాపిష్టి సొమ్మేనన్నమాట!"

తల్లి మాటలకతడు భయపళ్ళేదు. సిగ్గుపళ్ళేదు. తేలిగ్గా నవ్వేశాడు.

"పాపిష్టి సొమ్ము, లంచం, నజరానా, బహుమతి – ఏపేరైనా పెట్టుకో. నడుస్తోన్న భారతానికదే కేంద్ర బిందువు. కానొక్కటి, నేనెవర్నీ పీడించడం లేదు. కనీసం చెయ్యి కూడా చాచడం లేదు. ప్రతి పనికీ ఇంత రేటని వుంది. ఆ ప్రకారం లేఖకులే వసూలు చేస్తారు. సాయంత్రమయ్యాక హోదాల నిష్పత్తిలో వాటాలు పంచేసి తెచ్చి జేబులో కుక్కేస్తారంతే. నలుగుర్తోబాటు నారాయణా కులంతోబాటు గోవిందా అన్నారు కదా!"

"భలేగా సమర్థించుకుంటున్నావురా! కేవలం నిమిత్తమాత్రుడివన్నట్లు మాట్లాడుతున్నావు. ఒరే అబ్బాయ్! ఒకర్ని కొట్టుకు తినడం పాపం హేయం. ఆ డబ్బు నిలవదురా. దాంతో నువ్వు సుఖపళ్ళేవు. ఇవాళగాక పోయినా రేపైనా అంతకంతా ముట్టేస్తుందిరా!"

"నువ్వెక్కడో పిచ్చిదానివి. పై సంపాదన లేనివాడ్ని అమాయకుడూ పిచ్చివాడూ అంటారు తెలుసా?"

"అంటే అననీరా, నా కొడుకు లంచం గొండిగా మారాడనుకుంటే చాలు, నా ఒళ్ళు భగ భగ మండిపోతోందిరా! నా బిడ్డలు ఎంతో గొప్ప వాళ్ళు కావాలి, ఎందరికో మేలు చెయ్యాలి, ఎంతో ఆదర్శంగా వుండాలి అని తపించినందుకు మా బాగా తయారయ్యావురా!"

"నీ చిన్నకొడుకు చేస్తున్నాడుగా!" వ్యంగ్యంగా అన్నాడు.

అంతవరకు మౌనంగా వున్న శ్రీకాంత్ భార్యరత్నం కల్పించుకుంది: "మీ కన్నా మీ అమ్మకి మీ తమ్ముడే ఇష్టమని మీరంటోంటే ఏమిటో అనుకున్నాను. ఆ మాట నిజమేనండీ. మీరంటే ఇష్టం లేదు. అందుకే మీరు ఇల్లు కొన్నారనీ బాగుపడుతున్నారనీ చూసి ఓర్వలేక కళ్ళల్లో నిప్పులు పోసుకొంటోంది, చూడండీ!"

"కొడుకు బాగుకన్నా ఏ తల్లీ ఏమీ కోరుకోదమ్మా! కాని ఆ బాగు సవ్యమైనదిగా నీతివంతంగా వుండాలని నా ఆరాటం."

"అదంతా మీ చిన్నకొడుక్కి నూరిపోయ్యండి. పదండి, వచ్చిన పనయ్యిందిగా. ధర్మపన్నాలు వింటూ కూర్చుంటే పనైనట్టే" అంటూ లేచింది కోడలు రత్నం.

"భోంచేసి వెళ్ళురుగానిరా."

"నీ మాటలకే కడుపు నిండిపోయిందిలే!"

ఆమె కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

"చెల్లాయి పెళ్లి గురించేమైనా ఆలోచించేవుట్రా అబ్బాయ్?" సాగనంపుతూ మెల్లగా అంది రాజమ్మ.

"ఆలోచించడానికి నా దగ్గరేముంది, పాపిష్టి డబ్బుతప్ప!"

ఆమె శిలఅయ్యింది. అతడెళ్ళిపోయాడు.

గృహప్రవేశం రోజు దగ్గరపడింది. వెళ్ళాలో మానాలో తోచలేదు. ఒక పక్క కొడుకు ఇల్లు కొని సంబరంగా గృహప్రవేశం చేస్తున్నాడన్న ఆనందం. మరో పక్క ఒక దేశభక్తుడి మనవడు లంచ గొండై లంచపు సొమ్ముతో ఇల్లు కొన్నాడే అన్న దుఃఖం.

ఎటూ తేల్చుకోలేక సతమతమవుతోంటే సుబ్బలక్ష్మి అంది "వెళ్ళకపోతే బాగోదమ్మా! వెళదాం. నువెళ్ళకపోతే వదిన నానా మాటలూ అంటుంది. అన్నయ్య మనస్సు విరిచేస్తుంది. అన్నయ్య బాధపడ్తాడు. చెట్టంత ఎదిగినవాళ్ళకి వాళ్ళకే తెలియాలిగాని ఎవరైనా ఎంతని చెప్పగలరు?"

"నేను దురదృష్టవంతురాల్నే. నా బతుకంతా కష్టాలే. ఆఖరికి కొడుకుల వల్లనైనా సుఖపడతా ననుకుంటే చూడు, ఎలా అయ్యిందో ఒకడు అవినీతి పరుడై గుండెల్లో చిచ్చుపెడితే మరొకడు గుండెలమీద తన్నేసి పోయాడు. ఇంకెలా బతికేది? ఇంకెవరి కోసం బతికేది? ఇంకేం చూడాలని బతికేది?......" అంటూ ఏడ్చేస్తోంటే తనూ ఏడుస్తూనే ఓదార్చింది సుబ్బలక్ష్మి

తెల్లవారుతోంటే అందామె: "శుభమా అంటూ గృహప్రవేశం చేస్తోంటే తల్లి రాలేదు అన్న బాధ వాడి కుండకూడదు. త్వరగా తెములు, ఏలూరు వెళ్దాం."

తల్లీ కూతుళ్ళూ వెళ్ళేసరికి గృహప్రవేశం అయిపోయింది. సత్యనారాయణస్వామి వ్రతం చేస్తున్నారు. మరో చెంప భోజనాలు వడ్డిస్తున్నారు.

వాళ్ళని చూసి మూతి ముడిచింది కోడలు. "భోజనాల వేళ కొచ్చారు" అంది కోడలి తల్లి. కొడుకు పలకరించలేదు. ముహూర్తం వేళకి రాలేదని కోపంగా వున్నాడు.

రాజమ్మ ఆడబడచు సుధారాణీ ఆమె భర్తా చిన్న మరిదీ దమయంతీ కొడుకూ వచ్చారు. రాజమ్మ అత్తవారి తరపు బంధువుల్తో శ్రీకాంత్ బాగా సంబంధాలు పెట్టుకున్నాడు. భర్త పోయినా రాజమ్మ ఉద్యోగం చేస్తున్నందుకు కుటుంబం గౌరవం మంట కలిసిందనుకుని తగ్గించిన రాకపోకలు పెరిగాయి. అతడితోడి పనులదృష్ట్యా వాళ్ళు వస్తూ వెళ్తున్నారు.

"ఎలా అయిపోయావు వదినా? నిజంగా అష్టకష్టాలు పడ్డావు. ఏమైతేనేంలే, కొడుకులు చేతికందేరు. పెద్ద కొడుకు ఇంచక్కటి ఇల్లు కొన్నాడు చిన్నవాడు ఇంజినీరు. భాగ్యమంటే నీదే" అంది సుధారాణీ. ఆ వెంటనే "చిన్నకొడుకు అతీ గతీ ఏమైనా తెలిసిందా?" అనడిగింది.

తల అడ్డంగా వూపి మొఖం చాటేసింది రాజమ్మ.

"సుబ్బలక్ష్మి కేదైనా సంబంధం చూస్తున్నారా?" చిన్న మరిది అడిగాడు.

"లేదింకా. మీరు మీరు వూనుకుని దాన్నో ఇంటిదాన్ని చేస్తే మీకు ఋణపడి వుంటాను" అంది రాజమ్మ.

"పిండికొద్దీ రొట్టే కట్నంకొద్దీ సంబంధమూనూ. ఏ మాత్రం ఇస్తారేవిటి?"

"నీకు తెలీందేవుందయ్యా? అత్తవారి వూళ్ళో రెండు గదుల ఇంటి భాగం, కన్నవారి వూళ్ళో చిన్నతోటా వున్నాయి."

"ఇంకెక్కడి ఇల్లు? ఆ లోగిలెప్పుడో కూలిపోయింది. ఉమ్మడి లోగిలాయె. ఎవరూ పట్టించుకోకోకపోతేకూలక ఏం జేస్తుంది? సావిత్రీ వాళ్ళూ ఆ పక్కన పాక వేసుకున్నారు. దమయంతీ వాళ్ళూ పాలకొల్లు వెళ్ళిపోయరు"

"అయితే అక్కడ్నుంచేమీ రాదన్నమాట?" నిట్టూరుస్తూ అంది.

"ఆ స్థలం చిన్నమరిది కొందామని చూస్తున్నాడు. అమ్మే ఉద్దేశ్యం వుంటే చెప్పు. ఆఖరికెలాగూ అంతా అతనే వేసుకుంటాళ్ళే" అన్నాడు చాటుగా దమయంతి కొడుకు.

"మీరే అమ్మిపెట్టండి. పిల్ల పెళ్లి కుపయోగిస్తుంది."

"అలాగే పిన్నీ"

లెనిన్ బాబు మందీ మార్బలంతో వచ్చాడు.

శ్రీకాంత్ అతడి భార్య రత్నమూ పోటీపడిమరీ మర్యాదలు చేశారు. రాజమ్మ సుబ్బలక్ష్మి భోజనం చేశారు లేదో కూడా పట్టించుకోలేదు.

"గాంధీ సంగతేం తెలీలేదు కదా?" వెళ్తూ అడిగాడు లెనిన్‌బాబు.

కళ్ళల్లో నీటిపొర కదుల్తోంటే తల అడ్డంగా వూపింది రాజమ్మ.

"ఆ ప్రాంతంలోని మా పార్టీవారికి చెప్పేస్లే. ఏమాత్రం ఉప్పు అందినా మనకి తెలియజేస్తారు."

సాయంత్రందాకా ముళ్ళమీద కూర్చున్నట్టు కూర్చుని "ఇక వెళ్ళొస్తాంరా!" అంది కొడుకుతో రాజమ్మ.

ఉండమని అన్లేదతడు. కోడలు మొఖం తిప్పుకుని, ఆ మాటలు విన్నా విననట్టుండిపోయింది.

తిరుగుప్రయాణమయ్యారు తల్లీ కూతుళ్ళు.

# 35

రామనాథం లలితా – స్వీట్స్ పట్టుకొచ్చారు.

"తీపి వార్త తెచ్చేవా అన్నయ్యా?" నవ్వుతూ అడిగింది రాజమ్మ.

"అవునమ్మా! భారతి పెళ్ళి నిశ్చయమైంది. సుబ్బలక్ష్మికి కూడా సంబంధం చూస్తున్నారా?"

"ఇంకా లేదు. పెద్దబ్బాయి ఏవో చూస్తున్నాడుగాని ఇంకా ఏవీ కలిసిరావట్లేదు." అబద్ధమాడింది.

"పెళ్ళంటే పెద్ద వ్యాపారమై పోయింది కట్నానికీ లాంఛనాలకే లక్షలు పోయాల్సొస్తోంది!" అంది లలిత.

"భారతి కేవూరు సంబంధం కుదిర్చారు?"

"మేం కుదిర్చింది కాదు. ప్రేమ వివాహం. అబ్బాయి ముస్లిం......."

నిటారుగా ఐ విస్ఫారిత నేత్రాలతో చూసింది రాజమ్మ. సుబ్బలక్ష్మి కూడా వారివంక అపురూపంగా చూసింది.

ఈమధ్య అక్కడక్కడా ప్రేమ వివాహాలు కులాంతర మతాంతర వివాహాలు జరుగుతూనే వున్నాయి. కాని ఎక్కువగా వారి తల్లిదండ్రులున్నుంచి అవరోధాలూ ఒత్తిళ్ళూ పంతాలూ ఎదుర్కొంటున్నారు. అలాటిది వీళ్ళు పిల్లల ప్రేమని ఆమోదించి వివాహం చేయబూనటం సుబ్బలక్ష్మిని అబ్బురపరిచింది.

"అబ్బాయీ వాళ్ళ కుటుంబం మా ఇంటి పక్కనే వుంటోంది. అన్నదమ్ముల్లా కలిసుంటాం సలీం చాలా మంచి కుర్రాడు. రాజమండ్రిలో

రేడియో మెకానిక్ షాపునడుపు కుంటున్నాడు. పిల్లలిష్టపడ్డారు. మేం తథాస్తు అంటున్నాం." రామనాథం వివరించాడు.

"నాకు చాలా చాలా ఆనందంగా వుందన్నయ్యా! ఆదర్శాలు వల్లించడమేగాని ఆచరణలో అణువంత కూడా చూపని ఈ కాలంలో మీరిలా ముందడుగు వేయడం నిజంగా గొప్ప సంగతి ఒకనాడు వితంతువైన లలితని పెళ్లాడి ఆదర్శప్రాయుడి వయ్యావు. ఇప్పుడు కూతురికి మతాంతర వివాహం చేస్తూ చాలా ఎత్తులకి ఎదిగిపోయావు. నీ కాళ్ళకి మొక్కాలనిపిస్తోందన్నయ్యా!"

కళ్ళనుండి ఆనంద బాష్పాలు రాలుతోంటే అంది రాజమ్మ. ఆవెంటనే "ఈ మహత్తర కార్యంలో నీకన్నా లలిత కెక్కువ భాగముందన్నయ్యా! కూతురి ప్రేమపెళ్లిని హర్షించడమేగాక మతాంతర వివాహాన్ని కూడా అంగీకరించడం లలిత గొప్ప మనస్సుకు నిదర్శనం" అంటూ లలితను అక్కున చేర్చుకుంది.

"ఈ జీవితం మీ నాన్నగారు పెట్టిన భిక్షే" అందామె.

భోజనాలు చేస్తూండగా అన్నాడు రామనాథం: "మా పెళ్లి జరిగిన చరఖా కేంద్రంలోనే భారతి పెళ్లి చెయ్యాలనుందమ్మా!"

"చాలా సంతోషం అన్నయ్యా! నాన్న ఆత్మ ఎంత పొంగిపోతుందో!"

"ఈ పెళ్లి నీ చేతులమీదుగా జరిపించాలి."

ఆమె నేత్రాలు సజలమయ్యాయి.

ఒక నిమిషమయ్యాక అంది: "నీ అభిమానం నాకు తెలీదా అన్నయ్యా? సుందరం గారని ప్రముఖ కమ్యూనిష్టు నాయకులున్నారు. ఆయన్ని పిలుస్తాను. అలాటి పెద్దల చేతుల మీదుగా ఈ ఆదర్శ వివాహం జరగాలి. వారి మాటలు మరిందరికి స్ఫూర్తినివ్వాలి."

"అలాగే చేద్దాం."

పెళ్ళిరోజుకి రెండ్రోజులు ముందే పల్లెకెళ్ళారు రాజమ్మా సుబ్బలక్ష్మి.

మహిళా సంఘంవారినీ యువజన సంఘంవారినీ కలిసి అంతా చెప్పింది. అంతా శుభకార్యాన్ని తమ భుజస్కందాలమీద వేసుకున్నారు.

చరఖా కేంద్రం చుట్టూ వున్న పిచ్చి మొక్కల్ని పీకి శుభ్రం చేశారు. రంగు కాగితాల తోరణాలతో అలంకరించారు. పరిసరాలు పండుగ వాతావరణాన్ని పులుముకున్నాయి.

కేంద్రం పక్కనే ఎత్తైన వేదికి నిర్మించారు.

భారతి, సలీం, సుందరంగారు, రాజమ్మ వేదికమీద ఆసీనులయ్యారు.

రామనాధం బంధువులూ సలీం బంధుమిత్రులూ – గ్రామస్తులూ ఎందరో విచ్చేసారు.

వందేమాతర గీతంతో సభని ప్రారంభించారు.

సుందరంగారు వివాహానికి పౌరోహిత్యం వహించారు. దండలు మార్పించి భారతీ సలీంల చేత ప్రమాణాలు చేయించారు.

వారిని అభినందిస్తూ సుందరంగారూ రాజమ్మా మరికొందరూ ప్రసంగించారు.

"కొంతమంది యువకులు రాబోవు తరం దూతలన్నాడు శ్రీ శ్రీ. ఇలాటివారే ఆ దూతలు. వీరివల్లే సమాజం ప్రభాతకాంతుల్తో వెలుగొందుతుంది. కుల మత వర్గ రహిత సమాజం శ్రీకారం చుట్టుకుంటుంది" అంటూ ఆశీర్వదించారు సుందరంగారు.

సాయంత్రానికి తిరిగి వచ్చిన రాజమ్మా సుబ్బలక్ష్మీ ఇంటి తాళం బద్దలు కొట్టి వుండటం చూసి కంగారుపడ్డారు.

"దొంగలు పడ్డట్టున్నారే!"

గబ గబా ఇంట్లో కెళ్ళారు.

బట్టలూ పుస్తకాలూ సామాన్లు అన్నీ నేలమీద చిందరవందరగా పడివున్నాయి.

విలువైన బట్టలూ సామాన్లూ రేడియో వగైరాలన్నీ ఎక్కడివక్కడే వున్నాయి. ఏం పోయివుంటాయోనని చూశారుగాని ఏమీపోయినట్టన్పించ లేదు.

"ఇది దొంగలపని కాదే!" రాజమ్మ అంది.

"ఇంకెవరైనా ఎందుకొస్తారు? పుస్తకాలుకూడా ఎందుకు వెదుకుతారు?"

ఏదో ఆలోచనరాగా "పోలీసులేమోనే?" అంది.

"చిన్నన్నయ్యకోసం వచ్చివుంటారా?"

"కావచ్చు. లేదా చిన్నన్నయ్య ఆచూకీ తెలిపేవేమైనా దొరుకుతాయేమోనని........"

గబుక్కునవెళ్ళి ఫోటో ఆల్బం చూసింది.

ఓ పక్కన పడేసివున్న ఆల్బంలో గాంధీఫోటోలు మాయమయ్యాయి!

మరేదో ఆలోచనరాగా ఉత్తరాల కొక్కేనికి గుచ్చిన ఉత్తరాలు బొత్తి వంక చూసింది. అన్నీ తీసేసి మళ్ళీ అడ్డదిడ్డంగా గుచ్చేరెవరో.

గాంధీ ఆఖర్న రాసిన ఉత్తరాన్ని సైతం దానికే గుచ్చింది. ఆత్రంగా వెదికిందిగాని అది కన్పించలేదు! ఒంట్లోని శక్తినంతా ఒక్కసారే తోడేసినట్టు కూలబడిపోయింది రాజమ్మ.

కన్నీళ్ళు పొంగివచ్చాయి.

"ఏమయ్యిందమ్మా?"

"పోలీసులు మనింట్లో దొంగల్లా ప్రవేశించారే! గాంధీ ఫోటోల్నీ ఉత్తరాల్నీ కూడా పట్టుకుపోయారు."

"వాళ్ళ కెందుకమ్మా?"

"గాంధీ కొత్తపేరు సూరీడని కూడా వారికి తెలిసిపోయిందే....." నోట్లో చీర కొంగు కుక్కుకుని బిగ్గరగా ఏడ్చేసింది రాజమ్మ.

☆ ☆ ☆

రోజులు యాంత్రికంగా గడిచిపోతున్నాయి రాజమ్మకి.

భారతి పెళ్ళైనప్పట్నుంచీ సుబల్క్ష్మి పెళ్లి చేసెయ్యాలని తొందరగా వుందామెకి. ఇద్దరూ ఒక ఈడువారే మరి.

మిత్రులద్వారా వీలైన సంబంధంకోసం వాకబు చేస్తూనే వుంది.

ప్రతీ వాళ్లూ "కట్నం ఎంతిస్తారు?" అన్న ప్రశ్నని వెంటనే సంధించడం చూసి దిమ్మెరబోవటం తప్ప ఏమీ చెయ్యలేకుండా వుంది.

ఉద్యోగాన్నిబట్టి ఆస్తుల్నిబట్టి ఆదాయాన్నిబట్టి కట్నపు రేట్లున్నాయని గ్రహించి విలవిల్లాడింది. కట్నం ఇవ్వలేకపోతే పెళ్లి కాదన్న నిజం జీర్ణించుకోలేకుండా వుందామె.

తనకి ఆస్తంటూ మిగిలింది చరఖా కేంద్రాన్నానుకుని వున్న ఎకరం తోటా అత్తవారి వూళ్ళో యాభై గజాల స్థలమునూ.

పెళ్లి ఖర్చులకి పీ.ఎఫ్. తీసుకున్నా కట్నంకోసం లక్షలు గుమ్మరించడం తన రెక్కలకి మించిన పని అని గుర్తించి మధనపడసాగింది.

తల్లి పరిస్థితి గ్రహించినట్టుగా అంది సుబ్బలక్ష్మి: "కట్నం ఇచ్చి! పెళ్లి చేసుకోవడం ఇష్టంలేదమ్మా"

"నాకూ ఇష్టం లేదమ్మా! కాని సలీంలాంటి యువకులు అరుదుగా వుంటారు"

"నేను ఉద్యోగం చేస్తాను."

"తప్పకుండా చెయ్యి. ఆడదానికి ఆర్థిక స్వాతంత్ర్యం వుండితీరాలి.

లేకపోతే మగాడు నా ఇంట్లోంచి ఫో అంటే నుయ్యో గొయ్యో తప్ప మరేదిక్కూ వుండదు."

"అమ్మా!"

"మాట వరసకంటున్నానమ్మా నీ కేమే! లక్ష్మీదేవిలా వుంటావు. డిగ్రీ పాసయ్యావు. రేపో మాపో చక్కని ఉద్యోగం వస్తుంది మగవారితో పోటీపడి పని చెయ్యగలవు. శిఖరాగ్రం చేరగలవు. నా ఆశలన్నీ నీ మీదే తల్లీ!"

"ఆఫీసర్ కావాలనుందమ్మా! చేతిలో అధికారం వుంటే ఏమైనా చెయ్యొచ్చు. ఎందరికన్నా సాయపడొచ్చు."

మురిసిపోయింది రాజమ్మ. కూతురి బుగ్గలు పుణికింది.

"నీ కోరిక తప్పకుండా తీర్తుందమ్మా! అప్పుడు కట్నం లేకుండా నిన్ను పెళ్లి చేసుకోడానికి ఎందరు ముందుకొస్తారో నువ్వే చూస్తావుగా!"

సిగ్గుమొగ్గయ్యింది సుబ్బలక్ష్మి.

## 36

సుబ్బలక్ష్మికి స్టేట్ బ్యాంక్‌లో క్లర్క్‌గా ఉద్యోగం వచ్చింది.

విజయవాడ బ్రాంచిలో పోస్టు చేశారు.

వెంటనే వెళ్ళి జాయినవ్వడానికి ఉత్సాహపడిందామె. "అందులో చేరి మరిన్ని కాంపిటీటివ్ ఎగ్జామ్స్‌కి రాస్తాను. మరింత పెద్ద జాబ్ సంపాదిస్తా"నంది ధీమాగా.

"అది నిజమే తల్లీ. కాని ఊరుగాని ఊళ్ళో ఒక్కదానివీ ఎలా వుంటావు చెప్పు? బంధువుల్లేరాయె." దిగులుపడింది రాజమ్మ.

"నువ్వుకూడా పిరికిపాలు పోస్తావేం అమ్మా? అది ఊరుగాని అడవి కాదు కదా! బంధువుల్లేకపోవచ్చుగాని స్నేహితులుంటారు కదా? ఒక మహిళ ఏకఛత్రాధిపత్యంగా పరిపాలిస్తున్న దేశమమ్మా మనదీ. ఇవాళ ప్రపంచంలో ముగ్గురు పవర్‌ఫుల్ లేడీస్ – మార్గరెట్ థాచర్, గోల్డమిర్, ఇందిరాగాంధీయే తెలుసా?"

తేలిగ్గా నవ్వేసింది రాజమ్మ.

"ఏమిటో అనుకున్నాను, నువ్వూ గట్టిగానే వాదించగలవు!"

"నీ కూతుర్ని కదమ్మా!"

మురిసిపోయిందా మాటలకి.

శ్రీకాంత్ వచ్చాడు. ఏలూర్నుంచి రోజా షటిల్ చెయ్యమంటాడే మోనని ఎదురుచూశారు. కానతడా వూసే ఎత్తలేదు.

"ఇప్పుడుద్యోగం చేయించడం ఎందుకమ్మా? పెళ్ళి చేసి అత్తారింటికి పంపేస్తే సరిపోతుందిగా?"

"పెళ్లి ఘడియ రావాలి కదురా!"

"ఇప్పటికే డిగ్రీ చదివింది. ఇక ఉద్యోగంకూడా చేస్తే దీనికన్నా ఎక్కువ చదివినవాడ్నీ పెద్ద ఉద్యోగం చేస్తున్నవాడ్నీ చూడాలి. అంతకి తూగ్గలమా చెప్పు"?

"నాకంటే హెచ్చుస్థాయిలో వున్నవారినే పెళ్లాడాలని నాకేం పట్టింపుల్లేవన్నయ్యా!" అంది సుబ్బలక్ష్మి.

"నీకు లేకపోవచ్చు. చేసుకునే వాళ్ళకుంటుంది కదా! మొగుడికన్నా పెళ్లాం అరంగుళం పొడుగెక్కువుంటేనే ఎవరూ సహించలేరు. ఇక చదువులోను ఉద్యోగంలోనూ కూడా వుంటే ఎవరంగీకరిస్తారు?"

"గంతకితగ్గ బొంత దొరక్కపోతుందేవిట్లే అన్నయ్యా! నేను ఉజ్జోగంలో చేరడానికే నిశ్చయించుకున్నాను."

"గాంధీలాగానే నీకూ మొండితనం ఎక్కువ."

గాంధీ మాటొచ్చేసరికి రాజమ్మ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. డీలాపడి చతికిలబడిపోయింది.

"బిడ్డ ఎక్కడున్నాడో ఎలా వున్నాడో! వేళకి తింటున్నాడో లేదో! అడవిలో తినడానికీ పడుకోడానికీ సౌకర్యంలేక ఎంతగా ఇబ్బంది పడుతున్నాడో నా చిట్టితండ్రి! ఒక్కసారి.........ఒకే ఒక్కసారొచ్చి ఈ అమ్మకి కన్పించి వెళ్ళకూడదుట్రా పిచ్చికన్నా!"

రాజమ్మ ఏడ్చేసింది.

"ఇప్పుడే వయ్యిందనీ ఈ ఏడ్పులు? ఎక్కడో అక్కడ బాగానే వుంటాళ్ళే. వాడికేం, ఎలాగైనా బతికెయ్యగలడు!"

శ్రీకాంత్ మాటల కందామె: "వాడు బతుకుతోంది వాడికోసం కాదురా, జనం కోసం – పీడిత జనశ్రేయస్సుకోసం!"

"హు! వీడింకో అల్లూరి సీతారామరాజు!"

"అందులో సందేహమేమీలేదురా పీడితులకోసం ప్రాణాలర్పించే ప్రతీ వాళ్ళు అల్లూరి సీతారామరాజే, భగత్సింగే, సుభాస్‌చంద్రబోసే!"

"మీ కందరికి కీర్తి జబ్బు పట్టింది. సుఖంగా బతకాలని కోరుకోవడం పోయి కష్టాలు పడాలి, ప్రాణాలు త్యాగం చెయ్యాలని చూస్తున్నారు. ఇదివరకు స్వాతంత్ర్యంకోసం తాతావాళ్ళూ ఎన్నో త్యాగాలు చేశారు. కడకేమయ్యింది? తెల్లదొరలు పోయి నల్లదొరలొచ్చారు. సామాన్యులకేం ఒరిగింది చెప్పు? దారిద్ర్యం పెరిగింది. నిరక్షరాస్యత పెరిగింది. నిరుద్యోగం పెరిగింది. ధనిక పేదల మధ్య వ్యత్యాసం పెరిగింది. ఫ్యాక్టరీలూ పరిశ్రమలూ ప్రాజెక్టులూ ప్రణాళికలూ ఎన్ని వచ్చినా లాభపడుతున్నది ఒక వర్గమే. అప్పుడూ ఇప్పుడూ ఎప్పుడూ కూడా ధనవంతుడే బలవంతుడు. నోరున్నవాడిదే రాజ్యం. కర్రగలవాడిదే బర్రె. ఆ సంగతి నువ్వు తెలుసుకోవడం మంచిది."

రాజమ్మ ఏదో అనబోతోంటే సుబ్బలక్ష్మి వారించింది: "వాదన లెందుకులేమ్మా! నువ్వెంత వాదించినా పెద్దన్నయ్యని ఒప్పించలేవు. ఒప్పించినా మార్చలేవు. తన సిద్ధాంతం తనది. ప్రతీవారికీ తమ చర్యల్ని సమర్థించుకోడానికో సిద్ధాంతం కావాలికదా!"

చెల్లెలి ఎత్తిపొడుపు అర్థమైందతడికి. తను అవినీతిపరుడుగనుక ఆ రకంగా సమర్థించుకుంటున్నాడని భావిస్తోందని గ్రహించాడు.

మొఖం మాడ్చుకుని బయటి కెళ్ళిపోయాడు.

సుబ్బలక్ష్మిని విజయవాడ తీసుకెళ్ళి బ్యాంకులో చేర్పించింది రాజమ్మ. తెలిసున్నవారిద్వారా వాకబు చేసి బ్యాంకుకి దగ్గర్లోనే చిన్న పోర్షన్ అద్దెకు తీసుకుంది.

మేడమీది పోర్షన్. గదీ వసారా మాత్రమే వున్నాయి. మూడు పక్కల ఖాళీ ప్రదేశముంది. ఏవైనా ఎండబెట్టుకోడానికితప్పకింది భాగంలోనివాళ్ళెవరూ పైకి రారు.

ప్రశాంతంగాను సెక్యూర్డ్‌గానూ అన్పించింది.

"బయట కుర్చీ వేసుకుని హేపీగా చదువుకోవచ్చమ్మా!" అంది సుబ్బలక్ష్మి.

మంచం పరుపూ కుర్చీ టేబులూ ఫాన్ వంటసామాన్లూ పచారీ సరుకులూ కొన్నారు.

రెండు నెలలపాటు శలవుపెట్టి కూతుర్తో వుండిపోయింది రాజమ్మ.

☆ ☆ ☆

భార్యాబిడ్డల్తో వచ్చాడు శ్రీకాంత్.

మనవడ్నెత్తుకుని "ఏం చదువుతున్నావురా బుజ్జికన్నా!" అనడిగింది రాజమ్మ.

"వాడు ఇంగ్లీషు మీడియంలో చదువుతున్నాడు. తెలుగురాదు" గొప్పగా చెప్పింది కోడలు రత్నం.

"స్కూల్లో ఇంగ్లీషు నేర్చినా ఇంటిదగ్గర తెలుగు నేర్పకపోయావా తెలుగు మన మాతృభాష కదా!"

"మీకు నాకు తెలుగే మాతృభాష. మా అబ్బాయికి ఇంగ్లీషే మాతృభాష!"

ఆశ్చర్యంగా చూసింది.

ఆమె చూపుల భావం గ్రహించి శ్రీకాంత్ కల్పించుకున్నాడు: "ఇక ఇంగ్లీషు చదువులకే విలువమ్మా! తెలుగు చదివినవాళ్ళకి చిల్లర ఉద్యోగాలే వస్తాయి. ఐ ఏ ఎస్ లాటివన్నీ ఇంగ్లీషులోనే వుంటున్నాయి తెలుసా?"

"బతకలేని బడిపంతులకేం తెలుస్తాయిలెండి!" మూతి తిప్పింది కోడలు.

"మీకెలా బావుంటే అలా చదివించండి కాని మాతృభాష మాట్లాడలేని వాడిగా తయారుచెయ్యకండి: చాలు."

"మీ దంతా చాదస్తం. దొరల భాష గొప్పతనం పల్లెటూరి వాళ్ళకేం తెలుస్తుందీ?"

నవ్వింది రాజమ్మ. "నావేకాదు నీ వేళ్ళూ పల్లెలోనే వున్నాయమ్మా!"

"దాని మాటలకేంగాని సుబ్బలక్ష్మికిక్కడెలా వుంది? ఉద్యోగానికి అలవాటు పడిపోయిందా!" అడిగాడు శ్రీకాంత్.

"రెండ్రోజుల్లోనే అంతా నేర్చేసుకుంది. మేనేజరుకూడా మెచ్చుకున్నాడు."

మాటల్లోనే వచ్చింది సుబ్బలక్ష్మి. అన్నా వదినెలని చూసెంతో సంబరపడింది. మేనల్లుడ్ని కిందికి తీసుకెళ్ళి ఇన్ని చాక్లెట్లూ బిస్కెట్లూ కొనిచ్చింది.

"మీకు జీతాలూ ఓవర్ టైములూ బాగుంటాయిలే. పైనేమైనా వస్తుందేవిటే" భోంచేస్తూ అడిగాడు శ్రీకాంత్.

"రాదు. రావాలని ఆశించడం లేదు."

"అయితే ఎప్పటికీ ఇలాగే వుండి పోతావా" అర్థోక్తితో అన్నాడు.

"కాంపిటీటివ్ ఎగ్జామ్స్ రాస్తున్నాను ఇదో మజిలీ మాత్రమే."

"ఎన్ని ఉద్యోగాలు చేసినా ఆడపిల్ల పెళ్లిలో తలొంచాల్సిందే. మొగుడికీ పిల్లలకీ సేవలు చేయాల్సిందే!" అంది రత్నం.

"త్వరగా నీ పెళ్లి చేసేస్తే బాధ్యత తీరుతుంది కదాని ఒకటే పోరుతోంది మీ వదిన." భార్యని వెనకేసుకొస్తూ అన్నాడు శ్రీకాంత్.

"వీలైన సంబంధం వుంటే చూడండి చేసేద్దాం. అదో ఇంటిదైతే నాకూ నిశ్చింతే కదా!"

రాజమ్మ మాటలకి రత్నం జవాబిచ్చింది: "పెద్ద కొడుకన్న అభిమానమూ గౌరవమూ మీకు లేకపోయినా చెల్లెలన్న అభిమానం ఆయనకుంది. ఆయన తన బాధ్యతని విస్మరించకుండా సుబ్బలక్ష్మికి ఇంచక్కని సంబంధం చూశారు."

వారొచ్చిన కారణం అర్థమై చిన్నగా నిట్టూర్చింది సుబ్బలక్ష్మి: "ఇప్పుడేగా ఉద్యోగంలో చేరిందీ? పెళ్లికప్పుడే తొందరేమొచ్చిందన్నయ్యా!"

"దానిమాటలకేంగాని ఏ ఊరి సంబంధంరా?" రాజమ్మ అడిగింది.

"తెలిసిన సంబంధంలే. మాపినమావగారబ్బాయి. కో ఆపరేటివ్ బ్యాంకులో సూపర్వైజరుగా ఈ ఊళ్ళోనే పని చేస్తున్నాడు. ఇద్దరికీ ఇక్కడే ఉద్యోగాలుకదా, ఈడూ జోడూ బాగుంటుంది కదాని సంబంధం కదిపాను. మనతో వియ్యమందటానికి వాళ్ళూ సుముఖంగా వున్నారు. చెల్లెల్ని చూసుకోడానికి రేప్పొద్దుటే వస్తానన్నారు."

"అలాగుట్రా! మరి ఇచ్చిపుచ్చుకోడాల గురించి..........మన తాహతుగురించి వివరంగా చెప్పేవా?"

"అన్నీ చెప్పేనమ్మా! కట్నం ఇవ్వడం మా అమ్మకి ఇష్టం లేదని కూడా చెప్పేను. అయినా ఆడపిల్లని ఒట్టి చేత్తో పంపే సాంప్రదాయం మా ఇంటా వంటా లేదు గనుక పల్లెలోని ఎకరం పై చిలుకు తోటని చెల్లెలికి రాసిచ్చేస్తామని చెప్పేను. మారుమాట్లాడకుండా అంగీకరించారు. ఖర్చుకో పదివేలైనా ఇవ్వకపోతే బావుండదు మరి. ఆపైన నీ ఇష్టం" అన్నాడు శ్రీకాంత్.

"తోట రాసివ్వొచ్చుగాని చరఖా కేంద్రం ఎలా ఇస్తాంరా? దాన్ని నాన్న జ్ఞాపకార్థం వుంచెయ్యాలనుకున్నాను. రిటైరయ్యాక నేను అక్కడికే వెళ్ళి వుండాలనుంది."

"మోజుపడి వచ్చేరని ఏవిటో అనుకుంటున్నట్టున్నారు. మనమిస్తానన్న కట్నం అసలు ఓ కట్నమే కాదు. రెండులక్షల దాకా ఇస్తామని బోల్డు సంబంధాలొస్తున్నాయి. ఏదో మీ అబ్బాయి అడిగారని మాట తియ్యలేక ఒప్పుకున్నారు." మొహం మాడ్చుకునంది రత్నం.

"నేనేం కాదూ కూడదూ అనటం లేదమ్మా! చరఖా కేంద్రమూ దాని చుట్టూ వున్న పది సెంట్లూ మినహాయించి రాసేద్దాం."

"మాటా తేడా రాకుండా ఇరవై వేలిస్తే సరిపోతుంది."

"సరే, వాళ్ళొచ్చేక మాట్లాడదాంలే."

నాలుగు రకాల స్వీట్లూ పండ్లూ తెప్పించింది .రాజమ్మ.

ఉదయం ఏడుగంటలకే పెళ్లివారొచ్చారు.

"తగుదునమ్మా అని వాళ్ళ ముందుకి రాకండి. అన్ని విషయాలూ మీ అబ్బాయి చూసుకుంటార్లెండి. విధవలు విధవల్లా మూలనపడుంటేనే మర్యాద." లోగొంతుకతో అంది రత్నం రాజమ్మకే విన్పించేలా.

కత్తితో గుండెల్లో కసిక్కున పొడిచినట్టు విలవిల్లాడింది.

ఆడదానికి ఆడదే శత్రువు!

ఎంత చిత్రం! ఎంత విషాదం!

కోడలి మాటలు పట్టించుకోకుండా హాల్లోకి వెళ్ళి నమస్కరించింది రాజమ్మ.

రత్నం ముఖం నల్లబడింది.

"రండమ్మా రండి! పంతుళ్ళు, మాకు దణ్ణాలు పెట్టకూడదు. కథలూ కవిత్వాలూ రాస్తారంట కదా? మీ గురించి మా అన్నయ్య చెబుతుంటాడు." పెళ్లికొడుకు తండ్రి అన్నాడు.

సుబ్బలక్ష్మిని నఖశిఖ పర్యంతం పరిశీలించారు. అటూ ఇటూ నడిపించారు. గొంతు విన్నారు. పెరట్లోకి తీసుకెళ్ళి కాళ్ళ మీదా చేతుల మీదా మచ్చలున్నాయేమోనని చూశారు.

సిగ్గుతో చితికిపోయిందామె. రోషంతో ఏదో అనబోయిందల్లా అన్నగారి మొఖంచూసి మౌనంగా భరించిందది. పెద్దలతో కబుర్లు చెబుతూన్నందున లోపలి తతంగం రాజమ్మ కంటబడలేదు.

"మీకింకో అబ్బాయి వున్నాడన్నారు, ఏం చేస్తున్నాడూ?" పెళ్లివారితో వచ్చినతను అడిగాడు.

"ఇంజనీరింగు చదువుతూ ఆత్మహత్య చేసుకున్నాడు."

శ్రీకాంత్ మాటలకి రాజమ్మ సుబ్బలక్ష్మి చివ్వున తలెత్తి చూశారు. తల తిప్పేసుకున్నాడతడు.

కన్నపేగు మెలితిప్పినట్టు విలవిల్లాడింది రాజమ్మ: "అహ. అంత పిరికివాడు కాదులెండి. ఎక్కడికో వెళ్ళిపోయాడు."

"పత్తాలేకుండా పోయినవాడు పోయినవాళ్ళతోనే జమ మరి!" అంది రత్నం.

"అమ్మాయి మాకు నచ్చింది. ఇచ్చి పుచ్చుకోటాల గురించి ఒక మాటనుకుంటే ముహూర్తాలు పెట్టుకోవచ్చు"

"అమ్మాయి అభిప్రాయం కూడా కనుక్కుని........" రాజమ్మ లేచి లోపలికెళ్తోంటే అప్రసన్నంగా చూశాడు శ్రీకాంత్.

"పిలిచి పిల్లనిస్తానంటే వెక్కెక్కి ఏడ్చేట్ట వెనకటికెవడో – అలాగుంది వరస. నిక్షేపంలాంటి సంబంధం వచ్చిందని ఎగిరి గంతెయ్యక ఇంకా మీన మేషాలు లెక్కపెట్టడం ఏవిటో!" అత్తగారికీ ఆడబడుచుకీ విన్పించేలా అంది రత్నం.

"పెళ్లికి అమ్మాయి అంగీకారం కూడా తీసుకోవాలి కదా రత్నం?"

"మమ్మల్నెవరూ ఇలా అడగలేదు మరి."

"అది వారి వారి సంస్కారాన్నిబట్టి వుంటుంది."

సుబ్బలక్ష్మిని వసారా వెనక్కి తీసుకెళ్ళింది రాజమ్మ.

"అబ్బాయిని చూశావుగా, నువ్వేమంటావు తల్లీ?" అనడిగింది.

"నీ ఇష్టం అమ్మా!"

"నీ ఇష్టం ముఖ్యం........"

"నీకెలా అన్పిస్తున్నారు?"

"కుర్రాడు బాగానే వున్నాడు. నెమ్మదస్తుడు. చొరవ తక్కువ. బుద్ధిమంతుల్లానే వున్నాడు."

"నాకూ అలాగే అన్పిస్తోంది. నేను ఉద్యోగం చెయ్యడం ఇష్టమే అయితే........"

"ఇష్టమేనా అని విడిగా అడగక్కర్లేదమ్మా! ఉద్యోగం చేస్తున్నావు గనుకే వెదుక్కుంటూ వచ్చారు. మాటల్లో అంతా కనిపెట్టాన్లే."

"సరే అయితే."

ముందరిగదిలో కొచ్చింది రాజమ్మ.

అంత ఉత్కంఠతో చూస్తున్నారు.

"మా అమ్మాయికి నచ్చింది. ఇక మిగతావాటిగురించి మా అబ్బాయి మాట్లాడాడు కదండీ!..........."

"ఏదో చెప్పేరు. అయిన పెద్దవారు మీరు చెప్పడం మర్యాద. అబ్బాయిని చూశారు. వారి పరువు ప్రతిష్ఠలేమిటో మీకు తెలుసు. బంగారంలాంటి ఉద్యోగం. వెనక కాస్తో కూస్తో పొలం పుట్రా వున్నాయి. ఇంకెలాటి బరువులూ బాధ్యతలూ లేవు. అంచేత ........" ఆగి అర్థోక్తితో చూశాడు పెద్దమనిషి.

"మనం అనుకున్నది చెప్పరా శ్రీకాంత్!"

తల్లివంక సాభిప్రాయంగా చూసి అన్నాడు: "ఎకరం కొబ్బరి తోటా ఇరవై వేలూ ఇస్తామండి"

"అబ్బే, బొత్తిగా అంత తక్కువా?" అని పెదవి విరిచారు.

కిందామీదా పడ్డారు.

కడకి తోటగాక ముప్పైవేలకి అంగీకరించారు.

ముహూర్తం పెట్టుకునెళ్ళిపోయారు.

"హమ్మయ్య. ఒక బరువు దిగిపోయింది" అన్నాడు శ్రీకాంత్ హేపీగా ఫీలవుతూ.

"మరీ పశువుల సంతలో బేరమాడినట్లు మాట్లాడతారేవిట్రా." అంది రాజమ్మ

"వీళ్ళింక నయమమ్మా! కొందరైతే కట్నం గురించి లాంఛనాల గురించి ఆడబడుచు కట్నం గురించి ఆఖరికి పెళ్లి భోజనంలో పెట్టాల్సిన స్వీటు గురించి కూడా షరతులు మాట్లాడేస్తున్నారు తెలుసా?"

"సుబ్బలక్ష్మి ఉద్యోగం చేస్తోంది గనుక ఈ మాత్రపు కట్నాని కొచ్చారుగాని లేకపోతే మనకి అందుతారేవిటి?" అంది రత్నం.

భోంచేసి వెళ్ళడానికునక్తులయ్యారు శ్రీకాంతూ రత్నమూ.

"కట్నానికి నన్ను కొంచెం సర్దుబాటు చెయ్యమంటే చేస్తాను మరి" అన్నాడు శ్రీకాంత్ తల్లితో.

"మీది పాపిష్టి సొమ్మామె. ఆవిడ ముట్టుకుంటారేవిటీ!" దీర్ఘం తీసింది కోడలు.

"నా తిప్పలేవో నేను పడతాన్లేరా. మీ రిద్దరూ పీటల మీద కూర్చుని కన్యాదానం చేస్తే అంతేచాలు"

"పెళ్ళికొస్తా మయితే" అనెళ్ళిపోయారు.

"చిన్నన్నయ్య నా పెళ్ళికి రాడా అమ్మా?" సుబ్బలక్ష్మి ఆర్తిగా అడిగింది.

"నీ పెళ్లని తెలిస్తే ఎక్కడున్నా పరుగెత్తు కొస్తాడమ్మా! కానెలా తెలుస్తుంది?"

"పేపర్లో ప్రకటన వేయిద్దాం."

ఆమె కళ్ళు మెరిశాయి.

ఇద్దరి ఫోటోలు వేసి ఫలానా రోజున పెళ్లంటూ అందరికీ ఆహ్వానం పలుకుతూ ప్రకటన వేయించింది.

గాంధీ తప్పకుండా వస్తాడన్న ఆశ!

వస్తే పోలీసులు బంధిస్తారేమోనన్న భయం!

ద్వైధీభావంతో ఆఖరిక్షణంవరకూ నలిగి పోతూనే వుంది.

సుబ్బలక్ష్మి పెళ్లి నిర్విఘ్నంగా జరిగిపోయింది.

గాంధీ జాడ మాత్రం తెలీలేదు!

## 37

దేశంలో అత్యయిక పరిస్థితి ప్రకటించి పదిరోజులయ్యింది.

ప్రజల కోసం ఎన్నెన్నో సాహసిక చర్యలు చేబట్టి ప్రజల అభిమానాన్ని చూరగొంది ఇందిరా గాంధీ. బంగ్లాదేశ్ ఆవిర్భావంలో అపర కాళిలా విజృంభించి విజయేందిరగా పేర్గాంచింది. అటువంటి ఇందిరాజీ ఎమర్జన్సీ ప్రకటించేసరికి రాజమ్మ నివ్వెరబోయింది.

స్వాతంత్ర్య సమరయోధులైన మోతీలాల్, జవహర్లాల్ వారసురాలు, ప్రజల ప్రాథమిక హక్కుల్ని కాలరాయటం, ప్రతిపక్షీయుల్ని జైళ్ళలో కుక్కటం చేయగలదని కలలోకూడా వూహించలేకపోయిందామె.

ఆమెని మరింత ఆశ్చర్యాంబుధిలో ముంచడానికా అన్నట్టు ఎప్పుడో ప్రచురించబడిన "స్వేచ్ఛ" పాటల పుస్తకాన్ని నిషేధించారు!

ఓ రోజున సాయుధులైన పోలీసు లొచ్చి "మిమ్మల్ని ప్రశ్నించాలి అంటూ పోలీస్ స్టేషన్‌కి తీసుకెళ్ళారు. గాంధీ గురించేమైనా తెలిసిందేమోనని ఆత్రంగా వెళ్ళింది రాజమ్మ.

"పాటలెందుకు రాస్తున్నారు? 'స్వేచ్ఛ' ఎవరు ప్రచురించారు? కొన్ని పత్రికల్లో వచ్చిన పాట లెందుకు రాశారు? మీకు తీవ్రవాదులెవర్తో సంబంధాలున్నాయి? వారి వివరాలూ వారి సంస్థల వివరాలేవిటి? ఎక్కడ దాక్కున్నారు?"

ప్రశ్నల వర్షం కురిపించారు.

తనకి స్థానిక మహిళా సంఘంతో తప్ప మరే సంస్థతోనూ సంబంధం లేదంది. అక్రమాలనీ అన్యాయాలనీ ఎదుర్కోకపోతే అవి పెచ్చుపెరిగి దేశం అల్లకల్లోల మయ్యే ప్రమాదముందని హెచ్చరిస్తూ రాశానంది. అంతే తప్ప తనకే ఉగ్రవాద సంస్థ ప్రోత్సాహమూ సహకారమూ లేదంది. తను యువతీ యువకుల్ని అజ్ఞాతంలోకి పంపే రిక్రూటింగ్ ఏజన్సీగా పనిచేయటం లేదనీ హింసమీద తనకి నమ్మకం లేదనీ చెప్పింది.

"మీ కళ్ళకి ఆరవ తరగతి పిల్లల్లా కన్పిస్తునామా మాకు పాఠాలు చెబుతున్నావ్?" అని నవ్వేరు.

నిజమే చెబుతున్నానని మొత్తుకుంది. మరింత బిగ్గరగా నవ్వేరు.

మెల్లగా హింసించడం మొదలెట్టారు. రూళ్ళ కర్రతో మోకాళ్ళమీద కొట్టారు. గోళ్ళల్లో సూదులు గుచ్చారు. తలని నీళ్ళలో ముంచారు. జుట్టులోకి కర్రడానిపి మెలిత్రిప్పారు.

రక్షక భటులెంత రాక్షసంగా ప్రవర్తించగలరో తెలిసొచ్చేలా చిత్రహింసలకి గురిచేశారు.

ఆమె పుట్టుపూర్వోత్తరాలు దగ్గర్నుంచంతా అడిగారు. గాంధీ నక్సలైట్‌గా మారాడని చెప్పేసరికి పెద్దపెట్టున హర్షధ్వానం చేశారు.

"ఇప్పుడు దార్లో కొచ్చావు. వాడెక్కడున్నాడు? దళ సభ్యులెక్కడు న్నారు?"

"నాకేం తెలీదు. వాడ్ని మళ్ళీ కళ్ళారా చూడలేదు."

ఆమె రోదన అరణ్య రోదనయ్యింది.

హింస డిగ్రీ పెంచారు. మాటిమాటికీ స్పృహకోల్పోతోంది తప్ప మరెలాటి సమాచారమూ బయటికి రాలేదు – విసిగి జైలుకి తరలించారు.

జైలు ప్రాంగణంలో అడుగు పెడుతోంటే రాజమ్మ శరీరం చిత్రంగా కంపించింది.

ఒకప్పుడు జైలుకెళ్ళడం ఎంతో గొప్పగా ఘనతగా భావించబడింది. ఒక ఉద్యమ కార్యకర్తలుగా ఒక ధ్యేయం కోసం ఒక లక్ష్యం కోసం

పాటుబడుతూ ఇక్కడి కొచ్చారు. తన తండ్రీ ఇక్కడి కొచ్చి వుంటారు. బహుశా ఈ ప్రదేశమంతా కూడా స్వాతంత్ర్య సమర యోధుల పాద స్పర్శతో పులకించి వుంటుంది!

ఇప్పుడిందులో దొంగల్నీ హంతకుల్నీ బంధిస్తున్నారు. స్వేచ్ఛ హరించడమే ఓ పెద్ద శిక్ష అంటోంది రాజ్యాంగమూ న్యాయస్థానమూ.

ఎమర్జన్సీ వల్ల దేశంలోని పౌరులందరి స్వేచ్ఛనీ ఒక్క కలంపోటుతో హరించి దేశాన్ని ఓ పెద్ద జైలుగా మార్చేశారు. అందుకు దేశంలోని అత్యున్నత నాయకులూ అధికారులూ మేధావులూ ఎవ్వరూ అడ్డు చెప్పలేదు. దాన్ని అవకాశవాదమనాలో మేధోవర్గపు దాస్యమనుకోవాలో మరి!

గాఢంగా నిట్టూర్చింది రాజమ్మ. పోలీసులు చిత్రంగా చూశారు.

ఒకప్పుడు జైలు ఎలా వుంటుందని తండ్రి నడిగింది. అప్పుడాయన చెప్పింది అర్థంకాలేదు. ఇప్పుడు ప్రత్యక్షంగా చూడటమే కాదు, అందులో వుండబోతోంది.

ఏ నేరానికి? తెలీదు! ఎన్నాళ్ళు? తెలీదు!

నాలుగు నెలలు గడిచాయి.

జైలులోని నేరస్తుల్తో రాజకీయ ఖైదీల్తో కలసి వుంటూ వారి వారి కథలూ గాథలూ తెలుసుకొంటోంది. జైలు గోడల బయటజరుగుతున్న దేమీ ఆమెకి తెలీదు. ఆమె గురించి బయటివారికీ తెలీదు.

ఆ ప్రపంచమే వేరు!

ఒక రోజునో పోలీసు ఉన్నతాధికారి వచ్చాడు. శిక్ష అనుభవిస్తున్నావారినీ మిగతావారినీ విడదీసి ప్రశ్నించారు. రాజకీయ కారణాలతో నిర్బంధించిన వారిలో కొందరిమీద వివిధ నేరాలు మోపుతూ చార్జిషీటు దాఖలు చేశారు. మిగతావారిమీద ఎలాంటి కేసులు మోపాలో అని తర్జన భర్జనలు పడ్డారు. కేసు మోపబడనివారిలో రాజమ్మా వుంది.

అప్పుడో యువ ఇన్స్పెక్టర్ దృష్టి రాజమ్మమీద పడింది.

కాస్సేపు సంశయించాక ఆమెని సమీపించి, "మీరు.........వియ్యన్నగారి అమ్మాయిగారు కదూ?" అనడిగాడు వుద్వేగంగా.

తలాడించింది, అతడెవరో గుర్తు తెచ్చుకోవడానికి ప్రయత్నిస్తూ.

"నేను మీ పాలేరు రావుడి మనవడ్నండి. భీముడి కొడుకుని. చిన్నప్పుడెప్పుడో చూశాను." సంబరంగా అన్నాడు.

"నిజవాఁ! నాకు చాలా సంతోషంగావుంది. పాలేరుగా కూలిచేసే హరిజన రావుడి మనవడు చదువుకుని ఒక వున్నత స్థాయి కొచ్చాడు. నాకు చాలా సంతోషంగా వుంది బాబూ! నీ పేరేంటి?"

"వియ్యన్న!"

ఆశ్చర్యచకితురాలయ్యిందామె.

అతడెళ్ళి ఉన్నతాధికారితో ఏదో మాట్లాడడు. బ్రతిమాలాడు. హామీ ఇచ్చాడు. మొత్తానికెలాగో విడుదల ఆదేశాలు పొందాడు.

"మిమ్మల్ని వదిలేస్తున్నాం. మీరిహ స్వేచ్ఛగా వెళ్ళిపోవచ్చు."

కన్నీటితో చేతులు జోడించింది రాజమ్మ.

☆ ☆ ☆

నాలుగు నెలల తర్వాత స్కూలు కెళ్ళిన రాజమ్మని చూసి అంతా నోళ్ళు వెళ్ళబెట్టేరు.

రూపురేఖలు మారిపోయి కళ్ళు లోపలికి పోయి ఒక్కసారే పదేళ్ళు పైబడ్డట్టుగా అయిపోయింది!

ఇన్నాళ్ళూ ఏమయ్యారంటూ సమీపించినవారు సంగతి తెలుసుకుని, సానుభూతి చూపడానిక్కూడా భయపడ్డారు. ఎమర్జన్సీ రోజులు గనుక ఏమంటే ఏం చుట్టుకుంటుందోనని దూరంగా జరిగిపోయారు.

మహిళా సంఘానికి చెందిన కొందరు మహిళలూ స్థానిక కళాకారులూ వచ్చి యోగక్షేమాలు విచారించి వెళ్ళారు.

ఎక్కడా ఏ ప్రతిపక్షనాయకుడ్నీ వదల్లేదనీ అందర్నీ జెళ్ళలో కుక్కారనీ ఎక్కడేం జరుగుతోందో తెలీనివిధంగా పత్రికా సెన్సారింగ్ అమలుజరుగుతోందనీ చెప్పేరు.

"బ్రిటీషువారి కాలంలోకూడా ఇలా జరగలేదు."అని అనుకోకుండా వుండలేక పోయిందామె.

శ్రీకాంత్ వచ్చాడు. "ఇదంతా నీ చిన్నకొడుకువల్ల వచ్చింది. అయిందేదో అయ్యిందిగాని ఇక పాటలూ గీటలూ సంఘాలూ కార్యక్రమాలూ అన్నీ కట్టిపెట్టేయ్. నువ్వేం దేశాన్ని ఉద్ధరించక్కర్లేదులే" అనేసి వెళ్ళిపోయాడు.

సుబ్బలక్ష్మి ఒక్కతీ వచ్చింది. తల్లిని కావలించుకుని బావురుమంది.

ముత్తం జరిగిందంతా చెప్పించుకుని "నిన్ను ఇన్ని బాధలు పెట్టినవాళ్ళు పురుగులు పడి ఛస్తారు" అని శపించింది.

"నీ కాపురం ఎలా వుందమ్మా! అల్లుడుగారు బాగా చూసుకుంటున్నారు కదా?"

"బాగానే చూసుకుంటున్నారమ్మా!........." అనింకేదో అనబోయి ఆగి పోయింది.

"నా దగ్గర సందేహిస్తావేమే!.........."

"పెట్టుపోతలు ఘనంగా పెట్టలేదని గునుస్తూ వుంటారు. నోరు తెరచి అడిగే ధైర్యం వుండదు. అన్నీ వూరికే వచ్చిపడాలి. ఇంట్లో ఖరీదైన వస్తువులుండాలి. అందరి ముందూ గొప్పగా వుండాలి అని ఆశిస్తూంటారు.........."

"అలాగా? ఏమైనా లోన్లు లభిస్తాయేమో కనుక్కుంటూ ఉండు.........."

"ఏమీ అవసరం లేదమ్మా! మన సంపాదనతో మనమే అన్నీ అమర్చుకుందాం. ఒకర్ని అర్థించడం దేబిరించడం యాచన లక్షణం అని బ్రెయిన్ వాష్ చేశాన్లే. ఇప్పుడు సణుగుడు తగ్గింది." నవ్వింది సుబ్బలక్ష్మి.

"నువ్వింకా నా కళ్ళకి చిన్నపిల్లలా కన్పిస్తున్నావుగాని బాగా ఎదిగిపోయావు తల్లీ!.........పై చదువుల సంగతేం జేశావు?"

"మీ అల్లుడికి కొంచెం ఇన్ఫీరియారిటీ కాంప్లెక్స్ వుంది. ఆయన్ని నేనెక్కడ దాటిపోతానో అని పరీక్షలకి వెళ్ళొద్దని అడ్డుపడ్డారు. నేను విననని చెప్పేశాను. నాకు సంసారమూ ముఖ్యమే కేరీరూ ముఖ్యమే అన్నాను."

కలవరపడింది రాజమ్మ: "తొందరపడి కాపురం కూల్చుకోకే......"

"అలాటి ముప్పేం రాదులే. నాకు పెద్ద ఉద్యోగం వస్తే సంపాదన పెరిగితే తమ హోదా పెరుగుతుందనీ బోల్డు ఆస్తులు సంపాదించుకోవచ్చనీ ఆశ కలిగిందిలే. ఇప్పుడు తనే ప్రోత్సహిస్తున్నారు. ఐ ఏ ఎస్‌కీ వాటికీ ప్రిపేరవుతున్నాను."

"చాలా సంతోషంగా వుందే. నీ మాటలు చిన్నన్నయ్య వింటే ఎంత పొంగిపోతాడో!"

"చిన్నన్నయ్యే నాకాదర్శమమ్మా! రోజూ ఎందరో పుడుతూంటారు. మరెందరో చనిపోతూంటారు. మనమూ వారిలో ఒక్కరై, అనామకుల్లా చరిత్రలో కలిసిపోకూడదనేవాడు అన్నయ్య. మనకి చేతనైనంతలో

పదిమందికి సాయపడమనీ, వందమంది మేలుకోరమనీ చెబుతూండే వాడు. ఆ స్థాయికి చేరుకోవాలని నా తపన, ఆరాటం."

ఆమె కళ్ళల్లో కన్నీటిపొర కదిలింది.

"మీరు నా బిడ్డలైనందుకు గర్వంతో పొంగిపోతున్నాను తల్లీ!" ఆనందబాష్పాలు రాలిపోతూంటే అంది రాజమ్మ.

## 38

చీకటి అధ్యాయానికి తెరపడింది.

ఎమర్జన్సీ కాలంలో జరిగిన దారుణ దురంతాలెన్నో వెలుగులో కొచ్చాయి. ఒక మహా నాయకురాలి అధికార వ్యామోహమూ ఆమె సుపుత్రుడి శల్యసారథమూ తేటతెల్లమైంది.

పంచకూళ్ళ కషాయంలాంటి "జనతా" అధికారంలో కొచ్చింది.

వైరుధ్యాలూ విభేదాలూ ఒక్కొక్కటిగా బయటపడుతున్నాయి.

సుందరంగారి ఆరోగ్యం బాగుండంలేదని తెలిసి చూడటానికి కెళ్ళింది రాజమ్మ.

"నియంతృత్వానికి వ్యతిరేకంగా ప్రజాస్వామ్యశక్తులు విజయం సాధించడం బాగానే వుంది. కాని అధికారం కోసం చేతులు కలిపిన వీళ్ళెక్కువ కాలం కలిసివుండలేరు. జనాన్ని దగాచెయ్యక మానరు" అన్నారాయన ఆవేదనగా.

"మీరేమీ అనుకోనంటే ఒక మాటడగనా?"

తలాడించారాయన.

"అలనాటి క్విట్ ఇండియా ఉద్యమాన్ని మన పార్టీ వ్యతిరేకించింది. అయినా చాలా మంది పాల్గొన్నారన్నది చారిత్రక సత్యం. ఇప్పుడీ ఎమర్జన్సీని కొందరు సమర్థించడం గొప్ప తప్పిదం కాదంటారా?"

"తప్పే. ఆ సంగతి అగ్రనాయకత్వం కూడా అంగీకరించింది. వేర్పాటు శక్తులని దెబ్బతీసి క్రమశిక్షణ గరపడానికి అనుశాసన పర్వం అవసరం అనుకున్నాం. ఇరవై సూత్రాల పథకం ఎంతో మేలు చేస్తుందని భావించాం. కొంత మంచి జరిగిందన్నది కాదన్లేని సత్యం. జనంలో క్రమశిక్షణ పెరిగింది. ఫైళ్ళు చక చకా తిరిగాయి. రైళ్ళు సక్రమంగా నడిచాయి. పనులు వేగంగా జరిగాయి. అవినీతి తగ్గింది. కాని, అధికార

కేంద్రీకరణ వలన అధికారాంధులవడం వలన ఊహాకందనన్ని ఘోరాలు జరిగాయి. ప్రభుత్వాన్ని విమర్శించిన ప్రతి ఒక్కర్నీ జైల్లో బంధించారు. దారుణమైన ప్రెస్ సెన్సార్ షిప్‌ని సాగించారు. బలవంతపు కుటుంబ నియంత్రణ ఆపరేషన్లూ మురికి వాడల నిర్మూలనాలూ ప్రాథమికహక్కుల్ని కాలరాయడాలూ – ఎన్నో ఎన్నో!"

"స్వాతంత్ర్యానంతరం పుట్టిన తరానికి స్వేచ్ఛ యొక్క విలువని పరోక్షంగా చాటి చెప్పడం ఎమర్జన్సీ వల్ల ఒనగూడిన ఒకమేలు అనుకుంటాను."

"అదీ పాయింటే. నియంతృత్వమంటే ఏమిటో, హక్కుల్ని కోల్పోయి బానిసలు కావడమంటే ఏమిటో, స్వేచ్ఛ లేకపోవడమంటే ఏమిటోనెత్తి మీద గట్టిగా కొట్టిమరీ చెప్పింది ఎమర్జన్సీ."

"తక్షణ కర్తవ్యం ఏమిటంటారు?"

"జనం మరింతగా సంఘటిత మవ్వాల్సివుంది. మరింత జాగరూకతతో వ్యవహరించాల్సివుంది. సామ్రాజ్యవాద శక్తులు బలపడకుండా చూడాలి. వేర్పాటు వాదాలూ ప్రాంతీయ వాదాలూ వేళ్ళూనకుండా చూడాలి. సోషలిస్టూలూ ప్రగతివాదులూ ఐక్యసంఘటనగా రూపొంది పోరాటం కొనసాగించాలి. ప్రజల్లో వచ్చిన చైతన్యాన్ని మరింత ముందుకి తీసుకుపోవాలి. సమసమాజలక్ష్యం వైపు శ్రామికరాజ్యస్థాపన వైపు నడిపించాలి."

"అది మనవల్ల సాధ్యపడుతుందంటారా?"

"ఎందుక్కాదు? చెల్లా చెదురుగా వున్న కార్మికుల్ని సంఘటిత పరచి సోషలిష్టు ప్రభుత్వాన్ని స్థాపించాడు లెనిన్. మందుభాయీలను కొదమసింహాలుగా మార్చి రైతురాజ్యం స్థాపించాడు మావో. మనదేశంలో ప్రాంతీయ వైరుధ్యాల దృష్ట్యా సంస్కృతుల భేదాల దృష్ట్యా అంతటా ఒకేరకపు చైతన్యం రాలేదు. అంతమాత్రాన కార్మిక కర్షకుల్లో, మహిళల్లో, బడుగువర్గాల్లో, విద్యార్థుల్లో వచ్చిన మార్పుల్నీ, వారు చేసిన చేస్తోన్న – పోరాటాల్నీ సాధిస్తోన్న విజయాల్నీ తక్కువ అంచనావేయొద్దు. ఇవాళ ప్రతి పరిశ్రమలోనూ ప్రతి రంగంలోనూ శ్రామికులంతా సంఘాలుగా ఏర్పడ్డారంటే ఎన్నెన్నో హక్కుల్నీ ప్రయోజనాల్నీ సౌకర్యాల్నీ చేజిక్కించు కున్నారంటే అదంతా కమ్యూనిస్టు పార్టీ గొప్పతనమే. ఇదెవరూ కాదనలేని నగ్నసత్యం! చారిత్రక విజయం!"

"పోలీసు హింస నన్ను పునరాలోచనలో పడేసింది. ప్రభుత్వ హింసనీ దౌర్జన్యాన్నీ అక్రమాలనీ ఎదుర్కోడానికి మా గాంధీ చేబట్టిన హింసామార్గమే సరైందేమోనన్న భావం నాలో సంఘర్షిస్తోంది. ఒక సమాజంలో ఒక దేశంలో మార్పు హఠాత్తుగా రాదు. అందుకెంతో కృషి కావాలి. పునాది వేయాలి. అంచెలంచెలుగా నిర్మాణం కొనసాగించాలి. ఎదురుదెబ్బల్ని తట్టుకుంటూ పునర్నిర్మించుకుంటూ పురోగమించాలనీ అప్పుడే లక్ష్యాన్ని సాధించగలమనీ అర్థమైంది. ఇక మీరు చెప్పిన బాటే నా బాట."

దృఢచిత్తంతో చెప్పింది రాజమ్మ.

మెచ్చుకోలుగా చూసి ఆశీర్వదించారు సుందరంగారు.

☆ ☆ ☆

తోడికోడలు దమయంతీ ఆమె భర్తా పిల్లలూ అంతా మూకుమ్మడిగా ఆత్మహత్య చేసుకున్నారని కబురొచ్చింది.

స్థాణువయ్యింది రాజమ్మ.

కన్నీళ్ళు చిప్పిల్లాయి. అణచుకుందామన్నా ఆగటం లేదు.

ఎలా వున్నది అలాగే బయల్దేరి వెళ్లి బస్సెక్కి కూర్చుంది.

కాపురానికెళ్ళిన తొలినాళ్ళు గుర్తొచ్చాయి.

పెద్ద తోడికోడలు సావిత్రి ఆదరణా దమయంతి మాటలూ వారి భర్తల వ్యవసాయప్పనులూ అన్నీ కళ్ళముందు కదిలాయి.

సావిత్రి భర్తా దమయంతి భర్తా పాలేర్లలా కష్టపడే వారు. తండ్రి బంగారు వర్ణపు చొక్కా జరీ పంచె ధరించి హుందాగా జమీందారులాగా వుంటే వీళ్ళు లుంగీలూ పంచెలూ కట్టుకుని ఖద్దరు బనీను ధరించి ఆరుగాలం కష్టపడేవారు. ఎప్పుడూ పొలమూ నీళ్ళూ పశువులూ అంటూ పాకులాడేవారు. వాళ్ళని చూసినప్పుడల్లా కష్టజీవులకి అర్థం వీళ్ళే సుమా అనుకునేది.

కాకుళస్వామి పోయాక ఉమ్మడి కుటుంబం ముక్క చెక్కలయ్యింది. ఎవరి రెక్కల్ని వాళ్ళు నమ్ముకుని కూలీలుగా కౌలురైతులుగా మారి పోయారు.

సావిత్రి భర్త మరణానంతరం వారి పిల్లలు పల్లె వదలి రాజమండ్రి వెళ్ళిపోయారు. చిన్న చిన్న వ్యాపారాలు ప్రారంభించి అంచెలంచెలుగా

ఎదిగారు. వారి కప్పాడు రెడిమేడ బట్టల దుకాణమూ - కట్ పీసెస్ సెంటరూ వున్నాయి.

దమయంతీ వాళ్ళూ పాలకొల్లు వెళ్ళిపోయారు. వాళ్ళ పని అంతంత మాత్రంగా వుందని విన్నది. ఇంతలోనే పరిస్థితి ఇంతగా విషమిస్తుందని ఊహించలేకపోయింది.

రాజమ్మ వెళ్ళేసరికి శవాలని ఆరుబయట నేలమీద వరుసగా పడుకోబెట్టి వుంచారు. పోలీసులొచ్చారు. బంధువులు వస్తున్నారు.

"ఎందుకిలాటి పనికి పూనుకున్నారు?" రాజమ్మ ప్రశ్నించింది.

"అప్పుల పాలయ్యారమ్మా! పాపం, క్షణంసేపు కాళీ వుండకుండా ఏదో పని చేసేవారు. అతగాడేమో కాయగూరలు పండించేవాడు. కొబ్బరి సొద వేసేవాడు. దమయంతేమో లేసు కుట్టేది. పిల్లలు కాయగూరల్ని పాలకొల్లు పట్టుకెళ్ళి అమ్మేవారు. ఇంతమంది ఇన్నిరకాలుగా కష్టపడ్డా డబ్బేమీ మిగిలేది కాదు. అప్పుచేసి కౌలు సొమ్ము ఇచ్చేవారు. కమీషన్ ఏజెంట్లు సరుకుని అయినకాడికి కొనేవారు. రక్తం తిప్పుకోడానికి వాళ్ళకి అమ్మక తప్పేది కాదు. ఈమధ్యన అప్పులోళ్ళ గోల ఎక్కువయ్యింది. అప్పులు తీరే మార్గం కన్పించక పురుగుమందు తాగి........"

నిర్ఘాంతబోయి నిస్త్రాణగా కూర్చుండిపోయింది రాజమ్మ.

పంటల్ని నాశనం చేసే విషకీటకాల్ని నిర్మూలించాల్సిన మందులు పంటల్ని పండించే రైతు తాగాల్సొచ్చింది.

ఎంత విషాదం!

మనదేశం పల్లెల్లోనే వుందన్నారు బాపూజీ. మనది వ్యవసాయిక దేశం అన్నారు. రైతు దేశానికి వెన్నెముక అన్నారు. కర్రు తిరిగి నంతకాలం కరువు వుండదన్నారు. లోకానికి అన్నం పెడుతున్న మహానుభావుడు రైతు అన్నారు.

అలాటి రైతు వెన్నెముకని విరిచేస్తున్నారు వడ్డీ వ్యాపారులు వారినోట్లో మన్ను కొడుతున్నాయి ప్రభుత్వ సిద్ధాంతాలు!

అమ్మబోతే అడవి కొనబోతే కొరవి అయిపోయింది రైతు పరిస్థితి.

పంటకి సరైన ధరలభించదు. పంట - రైతు చేతిలో వున్నంత కాలమూ ఉత్పత్తులకి ధర వుండదు. ఎగుమతి ఆర్డర్లుండవు. రైతు అమ్ముకున్నాక రైసుమిల్లర్ల గోడౌన్లకి చేరుకున్నాక ఒక్కసారే ధరలకి రెక్కలొస్తాయి. ఇతర రాష్ట్రాలకి ఎగుమతి చేసుకునే పర్మిట్లూ వస్తాయి.

అధిక ధర చెల్లించి వినియోగదారులు బియ్యం కొనుక్కోవలసిన స్థితి ఏర్పడుతుంది!

మరో పక్క రైతు కొనే ఎరువులూ పురుగుమందులూ అందుబాటులో వుండవు. మళ్ళీ వాటిల్లో ఎన్నో కల్తీలు. పెట్టుబడికి డబ్బు, బ్యాంకుల్నుంచి లభించదు. వడ్డీవ్యాపారుల పిడికిళ్ళలో చిక్కుకుని రైతు విలవిల్లాడాల్సిందే!

ఇదేమంటే, ఆహార పంటలు మాని వాణిజ్య పంటలు పండించుకో మంటారు. పొగాకు ప్రత్తి రొయ్యలు వగైరాల వైపు మళ్ళమంటారు. వాటికి మరింత అధిక పెట్టుబడి కావాలనీ పంట దెబ్బతింటే రైతు పరిస్థితి తల్లకిందులవుతుందని తెలిసీ తగిన ఏర్పాట్లు చెయ్యరు!

పెద్ద పెద్ద పరిశ్రమలకీ వ్యాపారులకీ ఎన్నో రాయితీలిచ్చి మరెన్నో సౌకర్యాలు కల్పించే ప్రభుత్వం రైతాంగాన్నీ వ్యవసాయాన్నీ పట్టించుకోదు! కనీసం నీటి పారుదలకీ విద్యుత్ సరఫరాకీ సరైన ఏర్పాట్లు కూడా చెయ్యదు!

ఈ పరిస్థితి మారాలంటే రైతులు మరింత సంఘటిత మవ్వాలి. పోరాడాలి. అందుకు పార్టీలన్నీ తోడ్పడితే ఎంత బావుణ్ణు!

"అయిదు వందల మంది రైతులని నా కివ్వండి, ఈ క్షణంలో దేవుణ్ణి సృష్టిస్తా" అన్నాడు టాల్‌స్టాయ్. అంతటి మహత్తర మూర్తులకి మంచి కాలం వచ్చేదెప్పుడు?

రాజమ్మ మనస్సు పరిపరివిధాల ఆక్రోశిస్తోంది!

## 39

**ఇం**టిముందు కారు ఆగింది.

ఎవరా అని తొంగిచూసింది రాజమ్మ.

హుందాగా రెట్టించిన ఆత్మవిశ్వాసంతో విజేతలా నడచివస్తోంది సుబ్బలక్ష్మి. ఆమె వెనుక అల్లుడు వస్తున్నాడు.

చేటంత మొహం చేసుకెళ్ళి ఆహ్వానించింది.

సుబ్బలక్ష్మి వంగి తల్లి పాదాలకి నమస్కరించింది.

"ఏమైనా విశేషమా తల్లీ?"

"విశేషమే. నువ్వనుకున్న విశేషం కాదు. నేను ఐ ఏ ఎస్ పాసయ్యానమ్మా!.........."

"ఏమిటి..........నిజంగానే?"

"నిజంగానే నిజం. ట్రెయినింగు పూర్తయ్యాక ఏదో రాష్ట్రంలో సబ్ కలెక్టరుగా వేస్తారు. ఆ తర్వాత జిల్లా కలెక్టర్నవుతాను." విజయానందంతో చెప్పింది.

"నా చిట్టితల్లి నా చేయి పట్టుకుని చిట్టి పొట్టి అడుగు లేసిన సుబ్బలక్ష్మి ఒక జిల్లాని పాలించే అధికారిణి అయ్యిందా? ఆనందంతో నా నోరు పెగల్టంలేదే!" కూతుర్ని కావలించుకుంది.

ఇద్దరి కళ్ళూ ఆనందబాష్పాలతో నిండిపోయాయి.

"ఎవరూ వూహించనంత ఎత్తుకి ఎదిగిపోయావు తల్లీ! మీ తాత బతికివుండివుంటే మనవరాలు కలెక్టరైనందుకెంత మురిసిపోయే వారో!"

"తాత సంగతి నాకు తెలీదు. కాని చిన్నన్నయ్యకి తెలిస్తే పరమానందంతో ఎన్ని చిందు లేసేవాడో. ఊరంతా మిఠాయిలూ పంచేవాడు."

"అవును. వాడంతటివాడే. ఎక్కడున్నాడో ఎలావున్నాడో బిడ్డ!"

"ఇంకా బతికే వున్నాడంటావా అమ్మా?"

చటుక్కున కూతురు నోరు మూసేసింది.

"వద్దు. అలా మాట్లాడొద్దు. వాడు బతికే వున్నాడే! పీడిత జనం కోసం అవిశ్రాంతిగా పోరాడుతూనే వున్నాడు. స్వసుఖం స్వార్థం రక్త బంధం అన్నీ కసాబిసా తొక్కేసి, నమ్మిన ఆశయానికి అంకితమైపోయాడే! వాడికి! మరణం లేదే! మరణం వాడి దరిదాపులక్కూడా రాలేదే! వాడు సజీవమూర్తిలా వున్నాడు. ఎక్కడో జనం జేజేలందుకుంటూనే వున్నాడు. కన్నపేగు విశ్వాసం అబద్ధం కాబోదు!"

తల్లి కళ్ళు తుడుస్తూ అంది: "అన్నయ్యబతికివుండాలన్నదే నా ఆకాంక్షను. కాని ప్రభుత్వం నక్సలిజాన్ని తీవ్రంగా అణచివేసింది. వారు కూడా చీలికలుగా పేలికలుగా చీలిపోయారు. చెదరిపోయారు."

"నా బిడ్డ నాకు చెప్పకుండా మృత్యుకౌగిల్లోకి సైతంవెళ్తాడనుకోను. ఒక్కసారి అమ్మా అని పిలవకుండా దూరమవుతాడంటే నమ్మను."

"మీ నమ్మకమే నిజమవ్వాలని మనస్ఫూర్తిగా కోరుకుంటున్నానత్తయ్యా" అల్లుడన్నాడు.

"నీ కడుపు చల్లగా ఎంత తీయని మాట చెప్పేవయ్యా! నా ఆయుష్షు కూడా పోసుకుని నూరేళ్ళు వర్ధిల్లు. కూర్చోబాబూ!........"

టీ ఇస్తూ అంది రాజమ్మ: "ప్రతి పురుషుడి విజయం వెనుకా స్త్రీ వుంటుందంటారు పెద్దలుప్రతి స్త్రీ విజయం వెనుకా పురుషుడి సహకారం వుండి వుంటుందంటాన్నేను. నీ తోడ్పాటు లేకపోతే అమ్మాయి కలెక్టరయ్యేది కాదు"

"అవునత్తయ్యా! పిల్లలు చదువు కాటంకమవుతారంటే పిల్లలు పుట్టకుండా జాగ్రత్త పడ్డాం. అర్ధరాత్రి వరకూ తను ప్రిపేరవుతోంటే ఎలాంటి ఇబ్బందీ కలక్కుండా చూశాను. టీ కాచిచ్చాను. వంటలో సాయపడ్డాను. నోట్సులుకూడా ప్రిపేరు చేసిపెట్టాను" అన్నాడతడు.

"అవునమ్మా! ఆయన బాగా హెల్ప్ చేశారు. ట్రెయినింగయ్యాక నన్నే స్టేట్‌లో పోస్టు చేస్తారోనని బెంగగా వుంది."

"అలాటి బెంగలేం పెట్టుకోకు. హేపీగా ట్రెయినింగు పూర్తి చేసుకునిరా. పోస్టింగొచ్చేక అప్పటి పరిస్థితిని సమీక్షించుకుని ఎలా బాగుంటుందంటే అలా చేద్దాం. వీలు కుదిర్తే ట్రాన్స్‌ఫర్ చేయించుకుంటాను. లేదా రిజైన్ చేసేస్తాను. ఏమంటా రత్తయ్యా."

"బంగారంలాంటి మాటన్నావయ్యా! నీ మాటలకి అప్పీలేం వుంటుంది చెప్పు?"

"నాకు పోస్టింగొచ్చేక నీ జాబ్‌కి రిజైన్ చేసి నా దగ్గరి కొచ్చేద్దువుగానమ్మా!" సుబ్బలక్ష్మి అంది.

"తప్పకుండా వస్తాను. నువ్వు చేసే మంచి పనులు రెండు కళ్ళతో చూట్టానికి నీ దగ్గరి కొచ్చి వుంటానుగా కానీ అందుకింకా టైముంది. రిటైరయ్యాక నీ దగ్గరకే వచ్చి వుంటానుకదా!"

"అసలే నీ ఆరోగ్యం అంతంత మాత్రంగా వుంది. మేమెలాగూ సెటిలయ్యాం. ఇంకేం బాధ్యతలున్నాయనీ ఉద్యోగం చేయడం?"

"గురుబ్రహ్మ అన్నారు. గురువు బాధ్యత చాలా గొప్పది. చాలా పెద్దది తల్లీ! వరి నాటామంటే అది ఒక ఏడాది ఆలోచన. చెట్లు నాటామంటే అది ఒక దశాబ్దపు ముందు చూపు. ఒక యువతరాన్ని తీర్చిదిద్దటమంటే ఒక బంగారు భవిష్యత్తుకు ప్రణాళిక. ఆ మహత్తర బాధ్యతని నన్ను నిర్వర్తించనీ తల్లీ!"

"నీ కడుపున పుట్టడం మేం చేసుకున్న జన్మ జన్మల అదృష్టం అమ్మా!"

"ఇప్పుడు నీ వల్ల నేను కలెక్టరుగారి అమ్మగార్ని అయ్యానే!" అంటూ గల గలా నవ్వేసింది రాజమ్మ.

శృతి కలిపారు సుబ్బలక్ష్మి ఆమె భర్తా.

☆ ☆ ☆

రాష్ట్రంలో ఓ కొత్త కెరటం ఉవ్వెత్తున లేచింది.

దాని పేరు తెలుగుదేశం. దాని కర్త ఎన్టీ ఆర్.

దశాబ్దాల కాంగ్రెస్ దుష్ట విధానాలానీ దివాళాకోరు పద్ధతుల్నీ తోలుబొమ్మలాటల్నీ పేరుకుపోయిన అవినీతినీ ఖండిస్తూ శంఖారావం పూరించాడు ఎన్టీ రామారావు.

ఒకరకమైన నిశ్శబ్దతలో నైరాశ్యంలో కూరుకుపోతున్న జనంలో చైతన్యం రగిలించాడు. ఆశాజ్యోతి చూపించాడు. ఎందరో విద్యావంతుల్నీ యువకుల్నీ ఆకర్షించాడు. కొత్త తరం కొత్త రక్తం రాజకీయాల్లోకి రావడానిక్కారకుడయ్యాడు.

"ఇన్నాళ్ళకి చారిస్మాగల ఒక నాయకుడు లభించాడు. అతడిలో అణగారిన వర్గాలకి కూడు గూడు ఇవ్వాలన్న ఆవేశం కన్పిస్తోంది. అతడు తప్పకుండా అన్నార్తులకి రెండు ముద్దలు పెడతాడన్న ఆశ కన్పిస్తోంది. మన లక్ష్యసాధనకి అతడు కొంతవరకూ ఉపయోగిస్తాడని విశ్వసిస్తున్నాం. అందుకే అతన్తో చేతులు కలుపుతున్నాం" అన్నారు సుందరంగారు.

రాజమ్మకి కూడా అతన్లో ఒక చైతన్యజ్యోతి ఆదర్శమూర్తి నవ్యస్ఫూర్తి కన్పించాయి. పేదసాదలకి రైతులకి కార్మికులకి విద్యార్థులకి ఉద్యోగులకి అందరికీ మేలు చేసే మంచి పరిపాలనని అందిస్తాడన్న నమ్మకం కలిగింది.

ఒకనాడు వియ్యన్నని ఉద్విగ్నుడ్ని చేసిన స్వేచ్ఛాస్ఫూర్తి వచ్చి ఆమెని చేరినట్టు ఊగిపోయింది. తను ప్రభుత్వ ఉద్యోగినన్న సంగతి మరచి పాటల కట్టింది. మాటల తూటాలు పేల్చింది. ఎందరెందర్నో కదిలించింది.

"నీకు మంచి పేరుంది. మహిళానాయకురాలు కవయిత్రి అన్న ఖ్యాతి వుంది. ఎలాగు ప్రచారం చేస్తున్నావు గనుక రాజకీయాల్లో కొచ్చెయ్యి. తెలుగుదేశంలో చేరి టిక్కెట్టు అడిగితే చాలు వెంటనే ఇచ్చేస్తారు" అన్నాడు లెనిన్‌బాబు వచ్చి.

"పదవులమీద నాకు ఆసక్తి లేదు."

"చేతిలో అధికారం వుంటేనే ఏమైనా చెయ్యగలం, సాయపడగలం, సాధించగలం. బంగారంలాంటి అవకాశం వదులుకోకు. మహిళలకి పెద్ద పీట వేస్తానంటున్నాడు ఎన్టీ ఆర్. చదువుకున్నదానివి గనుక నీకు మంత్రి పదవి ఇచ్చినా ఇవ్వొచ్చు. అసలు నాకే తెలుగుదేశంలోకి జంప్ చేద్దామా అన్పించింది. ఎలాగూ ఆ పార్టీతో పొత్తు కుదిరిందిగనుగ్గాని లేకపోతే ఎప్పుడో ఆ పని చేద్దును."

"నన్ను కార్యకర్తగానే వుండిపోనీ. ఓ సమిధగానే కాలిపోనియ్" అందామె.

"నీ ఖర్మ" అనేసి వెళ్ళిపోయాడు.

మొత్తానికేమైతేనేం, పార్టీ స్థాపించిన తొమ్మిది నెలల్లో అభేద్యం అనుకున్న కాంగ్రెస్ కంచు కోటని బద్దలు గొట్టి అనితర సాధ్యమైన విజయాన్ని చేబట్టింది తెలుగుదేశం. కాంగ్రెస్ పునాదులు కదిలి పోయాయి. వారి కోట బీటలు వారింది దిగ్గజాలు సైతం నేలకొరిగారు.

ఒక ప్రారంనం రాష్ట్రాన్ని చుట్టేసింది
ఒక కొత్త శకానికి ప్రారంభ గీతం పాడింది.

☆ ☆ ☆

గ్రామ మునసబు కరణాల వ్యవస్థని ప్రభుత్వం రద్దు చేసింది.

భూస్వాముల కొమ్ముకాస్తూ గ్రామాల్లో పెత్తందారీ రాజకీయాలు నడుపుతూ వచ్చిన ఒక వ్యవస్థని మట్టుబెట్టినందుకెంతో పొంగిపోయింది. రాజమ్మ.

"కాదనే వాడే కరణం" "మునసబు కుక్క చస్తే ఊరంతా వచ్చింది. మునసబు చస్తే ఒక్కరూ రాలేదు" "కరణంతో కంటు ఏటికి పోయినా తప్పదు" "కరణం సాధువు కాదు కాకి తెలుపూ కాదు" మొదలైన సామెతల్ని గుర్తు చేసుకుంది.

పల్లెల్లో వారు నడిపిన రాజకీయాల్నీ పెట్టిన తగదాల్నీ ఇచ్చిన తీర్పుల్నీ మింగిన సొమ్మునీ ముంచిన మందినీ నెమరువేసుకుంది.

"ఒక అవశిష్టం పీడ వదిలింది" అని సంతోషించింది.

"ఫరవాలేదు. పరిపాలన బాగానే వుంది. ప్రజల అవసరాలని బాగానే గుర్తించి ఒక్కొక్కటీ బాగానే తీరుస్తున్నాడు. అడుగులు బాగానే వేస్తున్నాడు" అని ఎన్టీఆర్ పాలన గురించి తృప్తిపడింది.

ఇంతలో కొన్ని ప్రాంతాల్లో దళితుల మీద అగ్రకులాల వారు జులుం సాగిస్తున్నారని వార్త లొచ్చాయి. "మా రాజ్యం వచ్చింది. నోర్మూసుకు పడుండి అంటూ ఒక కులస్తులు రెచ్చిపోతున్నట్టు తెలిసి నోరు నొక్కుకుంది!

పోలీస్ స్టేషన్లకి "రక్షకభట నిలయం" అని పేరు మారిస్తే చాలదు, వారిని అసలైన రక్షక భటులుగా మార్చాల్సిన అవశ్యకతని గుర్తు చేసే సంఘటన జరిగింది.

పట్టపగలు రైల్వేస్టేషన్లో రైలు దిగిందో యువతి.

పట్నం కొత్త. పల్లెనుంచి వస్తోంది. బంధువులింటికెళ్ళి వారి ఆసరాతో బతుకు తెరువు చూసుకోవాలన్న ఆశతో వచ్చింది.

స్టేషన్ బయటి కొచ్చింది. ఎటు వెళ్ళాలో తెలీలేదు.

చిరునామా రాసి వున్న కాగితాన్ని చూపించింది. ఏవో గుర్తులు చెప్పి వెళ్ళమన్నారు.

ఆమెనో నలుగురు యువకులు చూశారు. ఆమె మాటలు విన్నారు ఆమె పరువాలు చూసి లొట్టలేశారు. ఒకర్నొకరు చూసుకున్నారు. సై అనుకున్నారు.

వారి జీపు వెళ్ళి బిక్కు బిక్కుమంటూ నడుస్తోన్న ఆమె పక్కన ఆగింది.

ఆమెని గమ్యస్థానం చేర్చుతామని నమ్మించి జీపెక్కించకున్నారు. గెస్టుహౌస్‌కి తీసుకెళ్ళారు. ఆమెని దారుణంగా చెరచి, కుక్కలు చింపిన విస్తరిచేసి విసిరేసి వెళ్ళిపోయారు.

ఎవరో చూసి జాలిపడి ఆసుపత్రిలో చేర్చారు.

వార్త తెలిసి రెక్కలు కట్టుకువెళ్ళి వాలింది రాజమ్మ.

తన కూతురిమీదే అఘాయిత్యం జరిగినట్టు రగిలిపోయింది.

బాధితురాల్ని ఓదార్చి ధైర్యం చెప్పింది. మహిళల్ని పోగుజేసుకువెళ్ళి నిందితుల్ని అరెస్టు చెయ్యమని డిమాండ్ చేసింది.

పోలీసులు పట్టించుకోలేదు. నేరస్తులు నలుగురూ కలవారి బిడ్డలు. పలుకుబడిగలవారి పుత్రులు. అందుకనే కలగజేసుకోలేదు వాళ్ళు.

ఆడది అర్ధరాత్రి ఒంటరిగా నడవగలిగినప్పుడే దేశానికి నిజమైన స్వాతంత్ర్యం వచ్చినట్టన్న గాంధీజీ మాటల్ని జ్ఞప్తిచేసుకో. వీధి వీధినా సభ పెట్టి పిడికిళ్ళు బిగించి గర్జించింది.

మహిళా సంఘాలూ వివిధ పార్టీలవారూ కదిలివచ్చారు. పత్రికలు పోలీసుల్ని దుమ్మెత్తిపోశాయి.

జనం నిరసన పోలీసులకి వ్యతిరేకంగా మారేసరికి ఉన్నతాధికారులు దిగి వచ్చారు. దుండగుల్ని అరెస్టుచేశారు.

బాధితురాలికి న్యాయం చేకూర్చమని అర్థించగా బాలికల హాస్టల్లో ఆమెకి ఉద్యోగం ఇస్తూ కలెక్టరు ఉత్తర్వులిచ్చారు.

ఇంకెక్కడా ఇలాటి ఘటనలు జరక్కుండా చర్య తీసుకుంటామని మంత్రి హామీ నిచ్చారు. అప్పటిగ్గాని శాంతించలేదు రాజమ్మ.

## 40

సుబ్బలక్ష్మిని ఒరిస్సాలోని ఓ వెనుక బడిన జిల్లాలో సబ్ కలెక్టరుగా నియమించారు.

అది బాగా బ్యాక్‌వర్డ్ ఏరియా. గిరిజనులూ ఆదిమ వాసులూ ఎక్కువగా వుండే ప్రాంతం. అందుకే అక్కడి కెళ్ళడానికి ఎక్కువ మంది మక్కువ చూపరు. కొత్తగా ట్రెయినింగు పూర్తి చేసుకున్నవారినీ ఎలాంటి లాబీలూ లేనివారినీ వేస్తూంటారు.

ఒక మహిళని నియమించడం మాత్రం ఇదే ప్రథమం.

ఆ పోస్టింగ్ గురించి అంతా భయపెట్టారుగాని ఆమె బెదర్లేదు. అదో చక్కని అవకాశంగా భావిస్తానంది. తిన్నగా వెళ్ళి డ్యూటీలో చేరింది.

తన విధుల్ని తెలుసుకుంది. ఆ ప్రాంతాన్ని స్టడీ చేసింది. సమస్యల్ని అర్థం చేసుకుంది. వనరుల్నీ ప్రభుత్వ పథకాలనీ తెలుసుకుంది.

తనేం చేయాలో బోధపడింది. రంగంలోకి దిగిపోయిందామె.

తల్లినీ పెద్దన్ననీ రమ్మని ఫోన్‌మీద ఫోన్ చేసింది.

కడకి రాజమ్మ ఒక్కతీ వచ్చింది.

కూతురి అధికార వైభోగాన్ని చూసి పరమానంద పడింది రాజమ్మ.

ఉద్యోగంలో చేరిన ఆర్నెల్లలో తను చేసిన పనులన్నీ ప్రత్యక్షంగా చూపించింది సుబ్బలక్ష్మి.

గిరిజన ప్రాంతాలన్నీ తిరిగి చూసింది రాజమ్మ. భాష అర్థంగాక పోయినా సైగల్తో సంభాషించింది. స్వతంత్రం వచ్చి నాలుగు దశాబ్దాలు

వ్యూర్తయినా ఇంకా 'కాకులు దూరని కారడవులూ చీమలు దూరని చిట్టడవులూ' వున్నాయంటే నమ్మలేకపోయింది.

రవాణా సౌకర్యాలేకాదు, వైద్య విద్య వసతులేమీ లేవనీ ఎలాంటి అభివృద్ధికీ నోచుకోలేదనీ గ్రహించి తల్లడిల్లిపోయింది.

"ప్రజలింత అధ్వాన్న స్థితిలో వున్నారంటే ప్రభుత్వాలేం చేస్తున్నట్టు? అసలెందుకున్నట్టు?" అని ప్రశ్నించుకుంది.

వారి ఆరోగ్యం కోసం సంచార వైద్య బృందాలని నియమించింది సుబ్బలక్ష్మి. గిరిజన పాఠశాలని హాస్టల్తో సహా ఏర్పాటు చేసింది. అడవి దినుసుల్ని సంతకి తీసుకెళ్ళి అమ్ముకోడానికి ప్రత్యేకమయిన సౌకర్యం కల్పించింది. సమగ్ర గిరిజనాభివృద్ధికీ వారి జీవన వికాసానికీ గిరిజన కార్పొరేషన్ ఏర్పాటుకి కృషి చేస్తోంది. వారికి పక్కా ఇళ్ళు నిర్మించడానికీ రోడ్లు వేయించడానికీ పథకాలు సమర్పించింది.

అదంతా విని చూసి సంబరంతో పొంగిపోయింది రాజమ్మ ఆ గిరిజనులు సుబ్బలక్ష్మి మీద కురిపిస్తోన్న అభిమానమూ భక్తీ చూసి ఆమె కళ్ళు చెమ్మగిల్లాయి.

"పుత్రోత్సాహం అంటారు చూడు, అది కలుగుతోంది తల్లీ! ఒక పుత్రుడు పెడదారిపట్టి చరిత్రహీనుడయ్యాడు. మరొకడు చరిత్ర సృష్టిస్తానంటూ వెళ్ళి తిరిగిరాలేదు. పుత్రికవైనా కొడుకులకన్నా మిన్నగా ఎదిగి పదుగురి ప్రశంసలు పొందుతున్న నిన్ను చూస్తోంటే నా జన్మ ధన్యమైనట్టుగా అన్పిస్తోంది తల్లీ!" అంది ఆనందోద్వేగంతో వూగిపోతూ.

"ఇదంతా నీ శిక్షణా పెంపకమూనూ!"

"శ్రీకాంత్ని పెంచిందీ నేనే కదా!"

"పెద్దన్నయ్య గారబ్బాయి బుజ్జి ఏం చదువుతున్నాడమ్మా?"

"ఇంజినీరింగులో చేరాడు."

"లెనిన్ బాబాయి గారి పెద్దబ్బాయి విదేశాల్లో మెడిసిన్ చదివాడు కదా! ఏం చేస్తున్నాడు?"

"ఎక్కడో ఉద్యోగం చేస్తున్నాడమ్మా! కాని చిన్నవాడికి మాత్రం చదువబ్బలేదు. కాంట్రాక్టరుగా మారాడు. లెనిన్ బాబాయి వత్తాసుంది."

"ఆయన కమ్యూనిస్టైనా ఆయన పద్ధతంతా కాంగ్రెసు పద్ధతే'!' నవ్వింది.

"బాగా చెప్పేవు. శివయ్య అన్నపూర్ణలాంటి మహాత్ముల కడుపున

పుట్టిన కుక్కమూతి పిందేమోనని బాధ కలుగుతూంటుందొకోసారి. ఆ గొడవలకేంగాని మీ ఆయనేమంటున్నాడు?"

"ప్రస్తుతం లాంగ్ లీవు పెట్టి ఇక్కడికి కొచ్చేస్తానంటున్నారు. ఒకటి రెండేళ్ళలో నన్ను ఆంధ్రాకి మార్చొచ్చు. అప్పుడు ఉద్యోగం కొనసాగించడమో లేక ఏదైనా పరిశ్రమ స్థాపించడమో చేద్దామని వుంది."

"నీ గైడెన్సు వుంటే అతడెందులోనైనా రాణిస్తాడు."

"నా వీపు నువ్వూ నీ వీపు నేనూ గోక్కుందామా అమ్మా!" బిగ్గరగా నవ్వేస్తూ అంది సుబ్బలక్ష్మి.

తనూ నవ్వుతూ అంది: "నిన్నూ నీ డ్యూటీ చూశాక నాకోటి అర్థమయ్యింది తల్లీ. మన దేశమిలా వుండటానికి ముఖ్యకారణం నాయకులే అనుకుంటూ వచ్చానిన్నాళ్ళూ. కానది పాక్షిక సత్యమే అన్పిస్తోంది. చిత్తశుద్ధీ సేవాదీక్షాగల అధికారులుంటే చాలా చాలా చెయ్యగలరు. నాయకుల కుయుక్తుల్నీ అవినీతినీ స్కాముల్నీ కొంత వరకైనా అడ్డుకో గలరు. ఏ మంటావు సుబ్బలక్ష్మీ?"

"నువ్వన్నది నిజమేనమ్మా! అధికారులంతా తమ తమ అధికారాల్ని సవ్యంగా పూర్తిగా వినియోగిస్తే చాలు – సమాజ వ్యతిరేకశక్తుల ఆటలు కట్టడిపోతాయి. ప్రజలకి మరిన్ని మేళ్ళు జరుగుతాయి. దేశం మరింత అభివృద్ధి చెందుతుంది. కాని స్వార్థంతో స్వలాభాపేక్షతో అధికార కాంక్షతో ఐ య్యే ఎస్లూ, ఐ పీ ఎస్లూ రాజకీయ నాయకుల తాబేదార్లుగా మారిపోతున్నారు. ఐ ఏ ఎస్ అంటే అయామ్ సేఫ్ అనుకుంటూ ప్రవర్తిస్తున్నారు. బ్రిటిషు కాలంలో వ్యవహరించినంత స్వతంత్రంగా కూడా వ్యవహరించలేక నాయకుల చంచాలుగా మారిపోతున్నారు. ఎమర్జన్సీలో ఖాళీ అరెస్టు వారంట్ల మీద ఎందరో సంతకాలు పెట్టిచ్చారని విని బ్రాన్పడిపోయాననుకో!"

"నిజమా?"

"పచ్చి నిజం. నిజంగా ఉన్నతాధికారులు చిత్తశుద్ధితో వ్యవహరిస్తే ఈ నాయకులేమీ చెయ్యలేరు. శేషన్ – ఎన్నికల ఖర్చు తగ్గించి ప్రచారార్భాటాన్ని నిలిపివేయించి నాయకులని ఒక ఆట ఆడించలేదూ? అతడు తీసుకొచ్చిన ఎన్నికల సంస్కరణలన్నీ అదివరకు ఎలక్షన్ కమీషన్‌కున్న అధికారాల్లోవే ఇదివరకటివాళ్ళు పట్టించుకోలేదు. ఇతడు గట్టిగా అమలు చేశాడు. అంతే తేడా. అలాగే ఒక కిరణ్ బేడీ, ఒక ఖైర్నర్, ఒక వ్యాస్..........ఇలా ఎందరో మహానుభావులు!"

"వారి సంఖ్య పెరగాల్సివుంది. అధికారులూ ఉద్యోగులూ కూడా ప్రజలకి జవాబుదారీ కావాలి. అప్పుడే ప్రభుత్వ విధాన ఫలాలు ప్రజలకి చేరతాయి. ప్రజల సాధక బాధకాలు అర్థం చేసుకుని ప్రభుత్వం వ్యవహరించగలుగుతుంది. జనం కడగండ్లు తీర్చగలుతుంది."

"ప్రజలకీ ప్రభుత్వానికీ మధ్య మేధావులు వారధిగా స్వచ్ఛంద సేవకులుగా పనిచేయాల్సిన అవసరముందమ్మా! అప్పుడే లోటుపాట్లు సరిదిద్దుకుని సరైన మార్గాన ప్రయాణించ గలుగుతారు. దేశంలో చాలా ప్రతిపక్షాలు న్నాయిగాని వాటి దృష్టి ప్రజల మీదకన్నా సింహాసనం మీ దెక్కువగా వుంటోంది. ఒక జయప్రకాష్‌నారాయణ్, ఒక మేధో పాట్కర్, ఒక అన్నా హజారే, ఒక స్వామీ అగ్ని వేశ్ – దేశాని క్కావాలమ్మ"

కూతురి మాటలకి ఆలోచనలో పడింది రాజమ్మ.

ఆమె మెదడులో కొత్త ఆలోచనలు చిపుళ్ళు తొడగసాగాయి!

మరో పదిరోజులుండి, వెళ్తానని బయల్దేరింది రాజమ్మ.

"ఇంకొన్నాళ్ళుండమ్మా!" గోముగా అంది సుబ్బలక్ష్మి.

"నాకూ వుండాలనే వుంది తల్లీ! కాని గాంధీ ఏ వేళనైనా రావొచ్చేమోనని నా ఆశ. వాడొచ్చేప్పటికి నేనింట్లో లేకపోతే చాలా నిరాశపడతాడు బిడ్డ. ఎంతో ఆశతో అమ్మని వెదుక్కుంటూ వచ్చిన వాడ్నెలా బాధపెట్టను చెప్పు?"

"నీ ఇష్టం అమ్మా!"

☆ ☆ ☆

అర్థరాత్రి. రాజమ్మ గాఢనిద్రలో వుంది.

ఇంతలో ఆర్తనాదాలు విన్పించాయి. ఒక ఆడపడుచు ప్రాణభీతితో పెడుతున్న కేకలవి.

ఒక్క వుదుటున లేచింది. గబ గబా తలుపులు తీసుకుని బయట పడింది. ప్రక్కింటివారి కిచెన్లోంచి వస్తున్నాయి కేకలు. అటు చూసింది. పొగ లొస్తున్నాయి.

పరుగువెళ్ళి అరుస్తూ తలుపులు బాదింది.

ఇంటిహాళ్ళు కంగారుపడుతూ తలుపులు తెరిచారు.

వారిని తోసేసి లోపలికెళ్ళి వంటింటి తలుపు తెరచింది. దుప్పటి లాగి తీసుకెళ్ళి నిలువునా కాలిపోతున్న మనిషికి కప్పి పడేసి దొర్లించింది.

అయ్యో అయ్యో అంటూ వచ్చి మంటలార్పారు ఇంట్లోవాళ్ళు.

అప్పటికే మూడొంతులు కాలిపోయిందామె.

బాధతో కెవ్వుమని అరుస్తూ రాజమ్మవంక ప్రాణభీతితో చూస్తూ స్పృహ కోల్పోయిందా ఇంటికోడలు రుక్మిణి.

మరొక్క క్షణం ఆలస్యం చెయ్యకుండా ఆసుపత్రికి తీసుకెళ్ళారు.

ఇంటెన్సివ్ కేర్ యూనిట్లో వుంచి ట్రీట్ మెంట్ చేశారు డాక్టర్లు. అయినా ప్రయోజనం పెద్దగా కన్పించలేదు. పోలీసులూ మేజిస్ట్రేటూ వచ్చారు.

ఆవేశంతో వూగిపోయింది. రాజమ్మ.

కట్నం చాలలేదని భర్తా అత్తమామలూ రుక్మిణిని దెప్పి పొడుస్తూండేవారు. పుట్టింటినుంచి డబ్బూ దస్కం తెమ్మని పంపించేవారు. ఎంత తెచ్చినా దాహం తీరేది కాదు. టీవీయో ఫ్రిజ్జో మరోటో తెమ్మని హింసించేవారు..

రుక్మిణి గోలపెట్టేది. ఆమెతండ్రి చేతులు జోడించేవాడు.

అయినా అత్తవారికి కనికరం కలిగేదికాదు. అన్నం పెట్టకుండా రుక్మిణిని మాడ్చేవారు.

ఆమె బిడ్డనిమరో చోట దాచి ఏడ్పించేవారు.

వీలుచిక్కినప్పుడల్లా రుక్మిణి వచ్చి రాజమ్మకి తన గోడు చెప్పుకునేది. నలుగుర్నినీ పిలిచి నిలదీస్తానంటే అంగీకరించేది కాదు. కాపురం కూలిపోద్దని భయపడేది.

అయినా రాజమ్మ వూరుకోలేదు.

వారింటికెళ్ళి పరోక్షహెచ్చరికలు చేసింది. దాంతో ఆమె ఎదుట కోడలిమీద అంతులేని ఆప్యాయత కురిపించేవారు. కన్నబిడ్డలా చూసుకుంటున్నట్టు నటించేవారు.

నిజమే కాబోలనుకుంది రాజమ్మ. వారు మారివుంటారని భ్రమించింది.

కాని వాళ్ళు కప్పుకున్న మేకతోలుని తీసేసుకున్నారు. కోడల్ని చంపి, పెద్దకట్నంతో కొడుక్కి మరోపెళ్ళి చెయ్యడానికి సిద్ధపడ్డారు.

ఫలితంగా రుక్మిణి ప్రాణాపాయస్థితిలో అల్లల్లాడుతోంది!

రుక్మిణి దగ్గరికెళ్ళింది రాజమ్మ.

బేలగా చూసిందామె.

"నువ్వేం భయపడొద్దు నిజం చెప్పు. నిన్ను కాల్చి నీ పండంటి బతుకుని మాడ్చి మసి చేసిన దుర్మార్గుల్ని జైలుకి పంపిద్దాం. మళ్ళీ ఎవరూ ఇలాటి దుర్మార్గానికి పాల్పడకుండా బుద్ధి చెబుదాం" అందామె.

రుక్మిణి కళ్ళు అశ్రుపూరితాలయ్యాయి.

రాజమ్మని వెళ్ళమని చెప్పి రుక్మిణికి బిడ్డని చూపించిందామె అత్తగారు.

"నీ బిడ్డ సుఖంగా వుండాలంటే ప్రమాదవశాత్తూ చీర అంటుకుందని చెప్పు" అన్నాడామె భర్త లోగొంతుకతో.

ఏడ్వడానిక్కూడా శక్తి లేకపోయింది రుక్మిణికి.

అందర్నీ పంపి మేజిస్ట్రేటు వచ్చి ఆమె పక్కన కుర్చీలో కూర్చున్నారు.

"నిర్భయంగా నీ వాంగ్మూలం ఇవ్వు........"

కళ్ళు మూసుకుంది రుక్మిణి.

బిడ్డ రూపం కళ్ళముందు కదిలింది. తనెలాగూ బతకదు. ఇక వారికి శిక్షపడితేనేం పడకపోతేనేం? బిడ్డ క్షేమంగా వుంటే అంతే చాలు!

"పొరబాటున చీర అంటుకుంది......"

ఆ రాత్రే రుక్మిణి చనిపోయింది.

పోలీసులు కేసు మూసేశారు.

ఆవేదనతో రగిలిపోయింది రాజమ్మ.

"ఇలాటి దుర్మార్గులు చట్టం వేళ్ళ సందుల్లోంచి పోవచ్చు. కాని సమాజం చేతుల్లోంచి తప్పించుకోకూడదు. ఇలాటివారికి సాంఘిక బహిష్కరణ విధించాలి. వెలి వెయ్యాలి. మానసిక సంఘర్షణకి గురి చెయ్యాలి. నేరస్తుల్ని నేరస్తులుగా, గుండాల్ని గుండాలుగా చూడగల స్థాయి కెదగాలి. అప్పుడే ఇలాటి సంఘటనలు మళ్ళీ మళ్ళీ జరక్కుండా వుంటాయి" అంటూ ఎలుగెత్తి చాటింది.

కరపత్రాలని ప్రింటుచేయించి ఇంటింటికి తిరిగి మరీ పంచిపెట్టింది.

ఊళ్ళో తలెత్తుకోలేక పొరుగూరి కెళ్ళిపోయారు రుక్మిణి అత్తవారు!

## 41

"ఆంటీ, ఆంటీ!......." ఎదురింటి కుర్రాడు పిలుస్తూ ఇంట్లో కొచ్చాడు.

"ఎవరూ?" అంటూ లోపల్నుంచొచ్చింది రాజమ్మ.

"మీకు టీవీ లేదా?"
"అదిగో వుంది కదా?"
"మరి పెట్టలేదేం?"
"మంచి ప్రోగ్రాం వస్తోందా?"
"క్రికెట్ వరల్డ్ పోటీలు జరుగుతున్నాయి. మా టీవీ పోయింది. రిపెయిర్ చేయించడానికి డాడీ తీసుకెళ్ళారు" అంటూ చొరవగా టీవీ పెట్టేశాడు.
మరుక్షణం క్రికెట్లో లీనమైపోయాడు.
మరి కాస్సేపటికి "అన్నయ్యా!" అంటూ వచ్చాడు తమ్ముడు.
వాడి ఒంటిమీద మూడేళ్ళుండవు. లాగు తిరగేసి తొడుక్కున్నాడు. కాని చేతిలో వాడికన్నా పొడుగున్న క్రికెట్ బ్యాట్ వుంది. దాన్ని ఈడ్చుకుంటూ వచ్చాడు.
క్రికెట్ ఆట చూస్తూ కాళ్ళు దూరంగా పెట్టుకుని బాల్ని కొట్టడానికన్నట్టు బ్యాట్ని పట్టుకున్నాడు. ఆశ్చర్యపోయింది రాజమ్మ.
"బాగున్నారా పిన్నిగారూ?" అంటూ వచ్చి చతికిలబడింది ఆ పిల్ల గాళ్ళ అమ్మ. దృష్టి టీవీ మీద నిలిపి "మా టీవీ పాడయ్యింది" అంది.
"మీ పిల్లాడ్ని చూడండి. పిల్లలక్కూడా క్రికెట్ అంటే ఎంత పిచ్చో!" అంది రాజమ్మ.
"క్రికెట్ అంటే ఇష్టపడనివాళ్ళు భూప్రపంచంమీద వుండరు!"
"నేనున్నాను!"
తలతిప్పి వింతజంతువుని చూసినట్టు చూసింది.
"మీకు క్రికెట్ ఇష్టముండదా? అయితే చాలా మిస్సయిపోతున్నారు. క్రికెట్ చూస్తే ఏం మజా, ఎంత థ్రిల్లు!"
"అన్ని ఆటలానే ఇదికూడా ఒక ఆట, అంతే!"
పిచ్చిగా చూసిందామె.
"మీకు క్రికెట్ గురించి బొత్తిగా ఏమీ తెలీదనుకుంటాను."
"బాగా తెలుసు. తియ్యటి రంగు నీళ్ళమ్ముకునే కంపెనీలు తమ వ్యాపారాభివృద్ధి కోసం కోట్లు కుమ్మరించి ఆడిస్తున్న ఆట. ఈ పేరు మీద కొన్ని వేలమంది విలాసవంతంగా బతకడానికి సాయపడుతున్న ఆట. ఈ ఆటని టివీలో చూపిస్తూ వాణిజ్య ప్రకటనల ద్వారా కోట్ల రూపాయలు దండుకుంటున్నాయి టీవీ ఛానల్సు. ప్రపంచ వ్యాప్తంగా

కోట్లాదిమంది చూస్తూ ఎన్నో వేల కోట్ల పనిగంటల్ని 'వృధా చెస్తున్నారు. స్కూళ్ళలో ఆఫీసుల్లో అన్నిటా వీటి గురించే మాట్లాడుకుంటూ విలువైన సమయాన్ని వేస్టు చేస్తున్నారు. ఈ పిచ్చి పోవాలంటే క్రికెట్ని రేడియో ద్వారా టివి ద్వారా ప్రసారం చెయ్యడం నిలిపెయ్యాలి. కానా పని ఎవ్వరూ చెయ్యరు. కోట్లాదిరూపాయలు చేజారిపోతాయి మరి!"

వెర్రిగా చూసిందామె. ఈవిడకి నట్టు లూజా అన్నట్టుకూడా చూసింది.

"మీ కిష్టం లేదని అందర్నీ ఆడి పోసుకుంటారెందుకూ?" అంది వుండబట్టలేక.

"క్రికెట్ని ఒక క్రీడగా చూడమంటున్నాను. దీనిమీద చూపే శ్రద్ధని పిల్లలు ఇతర ఆటలు మీద చూపితే ఒలింపిక్స్లో ఏసియాడలో మనకెన్నో పతకా లొచ్చేవంటున్నాను."

"అద్సరేగాని నన్ను క్రికెట్ చూడనివ్వండి. అసలే యమ టెన్షన్గా వుంది. ఇప్పుడు ఓడిపోతే వరల్డ్ కప్ చేజారినట్టే!"

"చేజారితే ఏ మవుతుంది? జాతి భవిష్యత్తుకి ముప్పు వస్తుందా? మరీ ఇంత మాస్ హిస్టీరియాకి లోనవడం మంచిది కాదు. పెద్దవాళ్ళే మంచేవిటో చెడేవిటో, గ్రహించేలేకపోతే ఇక పిల్లలకేం అర్థమవుతుంది?......"

ఆవిడ రాజమ్మవంక నిరసనగా చూసింది.

"ఈవిడ శాడిస్టురా! ఇక్కడుంటే ఈవిడ శాపనార్థాలకి ఇండియా గెలవదుగాని పక్కింటి కెళ్దాం పదండి" అంటూ పిల్లల్ని తీసుకెళ్ళిపోయింది.

టీవీ పీక నొక్కేసింది రాజమ్మ.

చేతికర్రవూతంతో నడుచుకుంటూ వచ్చారు సుందరంగారు.

వయస్సు పైబడటంతో కోర్టుపనుల్ని కొడుక్కి అప్పగించేశారు. పార్టీపనులు కూడా తగ్గించుకున్నారు.

"మీరా? రండి రండి. కబురంపితే నేనే వచ్చేదాన్నిగా!"

"చూడాలన్పించింది. కాలు సాగినట్టూ వుంటుంది కదాని వచ్చాను. అలా వున్నావేమిటమ్మా"

"క్రికెట్ క్రేజ్ జాస్తి అయిపోయిందన్నానని ఎదురింటావిడ కోపించెళ్ళి పోయింది." మంచినీళ్ళ గ్లాసందిస్తూ అంది రాజమ్మ

"నిజమాడితే నిష్ఠురమన్నారందుకే. మన దేశంలో లక్షల మంది మత్స్యకారులున్నారు. అయినా ఈత పోటీల్లో మనకి బంగారుపతకాలు

రావు. విలువిద్యని అభ్యసించే అదివాసీలూ అనేకులున్నారు. అయినా విలువిద్య పోటీలో మనకి స్థానమే వుండదు. ప్రపంచ దేశాల మధ్య వివిధ క్రీడల్లో గర్వదాయకమైన స్థానాన్ని సంపాదించడానికి యువతరం కృషి చేయటల్లేదు. ప్రభుత్వం ప్రోత్సహించట్లేదు. క్రికెట్ క్రీడోన్మాదానికి లోనై నిర్వీరమైపోతోంది యువత!" విచారంగా అన్నారు.

"బాగా చెప్పేరు. మిగతా ఆటలన్నీ చిల్లర క్రీడలన్నట్టూ క్రికెట్టు మాత్రమే జాతికి ముక్తి ప్రదాయిని అన్నట్టు ప్రచారం జరుగుతోందంటే నమ్మండి."

"అంతేకాదమ్మా! స్టార్ టీ వీలూ విదేశీ ఛానల్సూ మన డ్రాయింగు రూముల్లోకి నడిచొచ్చేక పాశ్చాత్య విష సంస్కృతి మన యువత మెదళ్ళలోకి ప్రాకి! కలుషితం చేసి పారేస్తోందమ్మా! విదేశీ నాగరికతా వ్యామోహం సర్వత్రా చుట్టేస్తోంది. హింస అశ్లీలత నిండిన దృశ్యాలు పిల్లల మెదళ్ళలో విషం కక్కుతున్నాయి. విలాస జీవితం డాలర్ల మోజు విపరీతంగా పెరిగిపోతోంది. వెంటనే వీటిని అడ్డుకోక పోతే రేపటి తరం మన సంప్రదాయాన్నీ సంస్కృతినీ పూర్తిగా మర్చిపోయే ప్రమాదముంది. ప్రభుత్వం ఇప్పటికైనా కళ్ళుతెరిస్తే బావుణ్ణు! మన విద్యావిధానం మన పరిసరాలూ బతకడం నేర్పడం లేదు. చావడం చంపడం నేర్పుతున్నాయి!"

"ప్రభుత్వమే కాదు, అన్ని సాహిత్య సాంస్కృతిక సంస్థలూ మీడియా ఇందుకు పూనుకోవాలి. ప్రజల్ని ఎడ్యుకేట్ చెయ్యాలి!"

"యువత మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నాం. వారి భవితని తలచుకుంటే భయమేస్తోంది!"

రాజమ్మ మాట్లాడలేదు.

ఆమెకి గాంధీ గుర్తొచ్చాడు!

## 42

పెరటి తలుపు చప్పుడయ్యింది.

నిద్రలోంచి వులిక్కిపడి లేచి కూర్చుంది రాజమ్మ.

గాంధీయేమో అన్పించింది. అతడే అయితే ఎంత బాగుండున్నా అనుకుంది. ఏదో రోజున తప్పకుండా ఈ తల్లిని వెదుక్కుంటూ

వస్తాడన్న ఆశతోనే ఇన్నాళ్ళూ ఇన్నేళ్ళూ ఇల్లుకూడా మారకుండా వుంది. బదిలీ లొచ్చినా చుట్టుపక్కలే తిరిగేలా చేసుకుంది.

మళ్ళీ తలుపు తట్టారు ఒక్క వుదుటన వెళ్ళి తలుపు తీసింది.

గాంధీ లోపలి కొచ్చాడు!

ఆనందోద్వేగంతో నిలువునా కంపించింది. "బాబూ!" తల్లి ప్రేమనంతా ఆ రెండక్షరాల్లో నింపి ప్రేమగా ఆర్తిగా పిలిచింది.

"అమ్మా!" అతడి స్థితీ అలాగే వుంది. మళ్ళీ ఒకర్నొకరు కళ్ళారా చూసుకుంటామో లేదో అనుకున్నారు. చూసుకోలేమేమో అని భయపడ్డారు. అది సాధ్యమయ్యేసరికి తమ కళ్ళనికూడా నమ్మలేనంత ఆశ్చర్యాంబుధిలో మునిగిపోయారు కొన్నిక్షణాలపాటు.

ముందుగా తేరుకున్న రాజ్యమ్మ కొడుకు మొఖం ఒళ్ళూ నిమురుతూ అంది: "ఇలా అయిపోయావేమిరా? పీక్కుపోయిన మొహం పెరిగిన గెడ్డంతో. లోతుకు పోయిన కళ్ళూ – చిక్కి సగమయ్యేవురా బిడ్డా!......"

"నా సంగతి కేంగాని నువ్విలా ఒక్కసారే ముసిల్దానివై పోయావేమ్మా?"

"నా గొడవకేంగాని నువ్వెలా వున్నావ్, ఎక్కడున్నావ్? ఈ పొద్దు ఏమైనా తిన్నావా లేదా?"

"అమ్మ వుందికదాని ఆకల్తో వచ్చాను."

"నా బిడ్డే, నా తండ్రే. రా రా. కూర్చో." పీట వాల్చి గబ గబా అన్నంగిన్నె చూసింది. కొంచెమే వుంది పొద్దుటి అన్నం, నీరు కారి పోయింది. కళ్ళలోంచి నీళ్ళు కారిపోతోంటే "రెండు నిమిషాల్లో వండేస్తాన్రా బాబూ!" అంది.

"వద్దమ్మా. ఈ అన్నమే పెట్టు, చాలు. నీ చేతి అన్నం అమృతంతో సమానమమ్మా!"

"ఎంత ఆకలి మీదున్నావో బిడ్డా. పాపిష్టిదాన్ని, పట్టెడన్నమైనా వుంచలేకపోయాను!"

"ఇది చాలమ్మా!"

అదృష్టవశాత్తూ పాలు తోడుకున్నాయి. ఇంత పెరుగువేసి కలిపింది. ఆవకాయ బద్ద వేసి తనే స్వయంగా తినిపించింది. ఇద్దరి కళ్ళనుంచీ కన్నీళ్ళు ధారాపాతంగా కారుతూనే వున్నాయి!

"జీవితంలోనూ ఉద్యమంలోనూ పోరాటంలోనూ చాలా దూరం

నడిచి నడిచి అలసి పోయానమ్మా!" అన్నం తిన్నాక నేలమీద వెల్లికిలా పడుకుంటూ అన్నాడు.

"కటిక! నేలమీద పడుకుంటావేమిట్రా? "ఇది అడవి కాదు అమ్మ ఇల్లు" అంటూ అతడి తలని ఒళ్ళో పెట్టుకుంది.

"చెప్పరా నాన్నా, ఎలా వున్నావ్, ఏం కథా?"

"తుపాకి గొట్టంలోంచి అధికారం ప్రవహిస్తుందనుకున్నాను. కసిగా శత్రువు శిరస్సు నరకగలిగినవాడే హీరో అనుకున్నాను. నా దేశవిముక్తికి సాయుధ పోరాటమే శరణ్యం అనుకున్నాను. అడవుల్లో కెళ్ళాను. అక్కల్తో అన్నల్తో చేయి కలిపాను. మొదట్లో ఎన్నో మంచి పనులు చేశాం. గిరిజనుల్ని చైతన్య పరిచాం. వారి భూముల్ని విముక్తం చేశాం. వడ్డీ వ్యాపారుల్ని శిక్షించాం. భూస్వాముల్ని హతమార్చాం. బీడీ ఆకు కాంట్రాక్టర్లకి బుద్ధి చెప్పాం. ప్రజా కోర్టులు స్థాపించాం. కాని, ఆ తర్వాత ఉద్యమం మరో మలుపు తిరిగింది." ఆగాడతడు.

"ఏ ఉద్యమానికైనా మిట్టపల్లాలు తప్పవు."

"మాకు ఆయుధాలూ ఆహారం దుస్తులూ వాహనాలూ కావాల్సొచ్చాయి. అందుక్కావాల్సిన డబ్బు కోసం భూస్వాముల్నీ కాంట్రాక్టర్లనీ పీడించడం బెదిరించడం మొదలెట్టాం. వారితో ఒకరకమైన దోస్తీ చేస్తూ పోలీసుల్తో వర్గ శత్రువుల్తో తలపడ్డాం. పోలీసు చర్య అధికమైంది. వర్గశత్రువులందర్నీ చంపడమా కొందర్నే చంపడమా అన్న మీమాంస తలెత్తింది. ఏమైతేనేం ప్రజల్నుంచి దూరంగా అడవుల్లోకి పారిపోయి, వర్గాలుగా దళాలుగా ముక్క చెక్కలయ్యాం. ఒకటే ఆశయం ఒకటే మార్గం అని నమ్మినా ఆచరణలో ఒకటిగా వుండలేకపోయాం!" నిస్పృహగా అన్నాడు.

"హింస ఎప్పుడూ ప్రతిహింస కోరుతుంది. అందుకే హింసా మార్గం మంచిది కాదు."

"హింసగానీ అహింసగానీ ప్రజల్లోంచి రావాలి గాని ప్రజలపై రుద్దితే విఫలమై తీరుతుంది. మా విషయంలో అదే జరిగింది. అంతేకాదు, వ్యవస్థ కుల్లక్షణాలూ మాలో ప్రవేశించాయి. మాలో మేం శత్రువులుగా మారాం!"

"వద్దు నాన్నా ఆత్మహత్యా సదృశ్యమైన ఆ ఉద్యమంలోంచి జనజీవనస్రవంతిలోకి రారా! నీలాటి యువకులే ఈ దేశానికి దిక్సూచి

కావాలిరా! నలభైమంది యువకుల్నిస్తే ఈ దేశ స్వరూపాన్ని మార్చేస్తా నన్నాడ్రా వివేకానందుడు. యువతపైన ఆయనకున్న అపురూప నమ్మకం ఎలాటిదో చూడు. మీరే ఏమైనా చెయ్యగలర్రా! స్వార్థంతో కుళ్ళిన ఈ సమాజానికి మీరే కొత్త ఆయుష్షు పోయాల్రా! జనాన్ని చైతన్యుల్ని చెయ్యాలి. వారిలో మార్పు తీసుకురావాలి. గాంధీజీ కలలుగన్న రామరాజ్యం స్థాపించాలి!"

"నా దారి తప్పని తెలుసుకున్నామ్మా! నీకు మాట ఇచ్చిన ప్రకారం నేను వేసిన ప్రతి అడుగూ జనం కోసమే వేశాను తప్ప, నా స్వార్థానికి ఒక్క పైసాగాని ఒక్కతూటాగాని ఖర్చుచెయ్యలేదు. ఇతరుల్నీ చెయ్యనివ్వ నన్నాను. అందుకే మా వాళ్ళకి విరోధినయ్యాను. నీకంతా చెప్పి చెంప లేసుకోవాలనొచ్చానమ్మా!"

"మంచిపని చేశావురా. రేపే ప్రభుత్వానికి లొంగిపోదువు గాని! కొత్త బతుకు ప్రారంభిద్దువుగాని."

నవ్వేడు గాంధీ. "అది జరిగేపని కాదమ్మా! అన్నేళ్ళు ఉద్యమం నడిపినా గాంధీజీని చంపుదామని అనుకోలేదు బ్రిటీషువాళ్ళు. కానిప్పుడు ఎదురు తిరిగిన ప్రతీవాడ్నీ తమ ప్రయోజనాల కడ్డొచ్చిన ప్రతివారినీ హతమారుస్తారు. నా తలకి ప్రకటించిన లక్ష కోసమే కాదు, బూటకపు ఎన్‌కౌంటర్లో చంపి ప్రమోషన్ కొట్టెయ్యడానికైనా చంపేస్తారు. వాళ్ళు గాకపోతే మా దళం వాళ్ళాపని చేస్తారు. చావు మాత్రం ఖాయం."

"వద్దురా! అంత దారుణంగా మాట్లాడకు. భరించలేన్రా! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డు వేస్తాను. లొంగిపోరా! నా మాట వినరా నాన్నా!"

"నీకీ ప్రభుత్వం మీద ఇంకా నమ్మకం వుంటే అలాగే కానీయమ్మా"

"నా బాబే, నా తండ్రే!" ముద్దులు కురిపించింది.

మర్నాడు ప్లీడర్తో వెళ్ళి కోర్టులో లొంగిపోయాడు గాంధీ. పత్రికలవారు చుట్టుముట్టారు. ఫోటోలూ ఇంటర్వ్యూలూ అంటూ హడావిడి చేశారు.

అతడ్ని రిమాండ్‌కు పంపారు న్యాయమూర్తి.

ఆనందబాష్పాలు తుడుచుకుంటూ వీడ్కోలు చెప్పింది.

అదే కడపటి వీడ్కోలవుతుందని ఇద్దరూ అనుకోలేదు.

ఆ రాత్రి ఒక చోటునుంచి మరో చోటుకి తరలిస్తోంటే గాంధీ

తప్పించుకు పారిపోబోయాడనీ, అప్పుడు కాల్పులు జరపగా చనిపోయాడనీ పోలీసులు ప్రకటించారు!

కుప్పకూలిపోయింది రాజమ్మ.

కొడుకుని తీసుకెళ్ళి ఉరికొయ్యకి వేలాడదీసినట్టు విలవిల్లాడింది.

ఘొల్లు ఘొల్లున ఏడుస్తూ వెళ్ళింది.

రక్తసిక్తమైన అతడి బిగిసిన పిడికిళ్ళు మూగ సందేశాన్నిస్తోంటే వాటిని ముద్దాడి మూర్ఛబోయింది రాజమ్మ.

## 43

"నా బిడ్డని చంపిన హంతకులు చేతులకి సంకెళ్ళు వేయండి!" అని రాసివున్న ప్లేకార్డులు ధరించి కలెక్టరాఫీసు ముందు ఆమరణ నిరాహారదీక్షకి కూర్చుంది రాజమ్మ.

జనం గుమిగూడారు. పత్రికల వారొచ్చారు. టీవీ ఛానళ్ళవారు వచ్చారు.

ఏవిటేవిటన్నారు. ఫోటోలు తీశారు. ఇంటర్వ్యూలు చేశారు.

పోలీసుల అకృత్యం గురించి చెప్పింది. పోలీసుకస్టడీలో వుండగా అమానుషంగా చంపేరని ఆరోపించింది. సభ్యసమాజం సిగ్గుతో తలదించుకోవాలంది. విచారణ అనేది లేకుండా పోలీసులే శిక్ష విధించేట్లయితే ఇక న్యాయస్థానాలెందుకని ప్రశ్నించింది. గాంధీని చంపిన అపర గాడ్సేలకి బేడీలు వేసేదాకా నిద్రపోనంది. పౌరులకి రక్షణ కల్పించలేని ప్రభుత్వం రాజీనామా చెయ్యాలంది.

ఆమె ఒక సంచలనమయ్యింది.

జనంలో కదలిక వచ్చింది. మరీ ఇంత దారుణమా అన్నారు. రక్షించాల్సినవారే భక్షిస్తారా అని ప్రశ్నించారు పోలీసు జులుం నశించాలన్నారు.

వివిధ సంఘాలూ, ప్రతిపక్షాలూ రాశాయి.

పౌర హక్కుల్ని ప్రభుత్వం కాలరాస్తోందని మేధావులు విమర్శించారు.

మెల్లగా రాజమ్మ ఆందోళన ఉద్యమరూపం దాల్చసాగింది.

ఆ సంగతి ప్రభుత్వం గ్రహించింది.

వెంటనే జరిగిన ఘటనపై న్యాయవిచారణ కాదేశమిచ్చారు. ఆ

ఘటనకి బాధ్యులని ఆరోపణలకి గురైన పోలీసు అధికారుల్ని సస్పెండ్ చేశారు. దీక్షని విరమించమని సాక్షాత్తు ముఖ్యమంత్రి విజ్ఞప్తి చేశారు.

ఒక వృద్ధురాలు సాధించిన విజయానికి విస్మితమయ్యింది రాష్ట్రం యావత్తూ.

ఆమె దీక్షకీ పోరాట పటిమకీ అభినందనలు కురిపించారంతా.

రాజమ్మ కూడా రాటుదేలింది.

గాంధీ చంపబడ్డాడని తెలిసి సర్వం కోల్పోయినట్టు బోరు బోరుమని విలపించిన మాట యదార్థమే కాని తర్వాత నిజాన్ని గ్రహించింది. జరిగిన దారుణాన్ని ఆకళింపు చేసుకుంది. తనని తాను నిగ్రహించుకుంది. ధైర్యం చెప్పుకుంది.

అన్యాయానికి వ్యతిరేకంగా పిడికిలి బిగించాలనుకుంది.

గాంధీలాగా మరెవ్వరూ బలవ్వకూడదనుకుంది. ఆ అమానుషకాండ గురించి దేశ జనానికి ఎలుగెత్తి చెప్పాలనుకుంది. మీరంతా అప్రమత్తంగా వుండకపోతే మీ హక్కులూ ప్రాణాలూ ఆఖరికి మీ స్వేచ్ఛ కూడా హరిస్తారని చాటిచెప్పాలని కంకణం కట్టుకుంది.

అందుకు ఒంటరిపోరు సాగించాల్సొచ్చినా వెనుదిరగరాదనుకుంది. వయస్సు సహకరించకపోయినా లెక్కచేయకూడదనుకుంది.

ఊరూరా తిరిగింది, వాడవాడనా ప్రచారం చేసింది.

అనూహ్యంగా నలుదిక్కుల్నుండీ సపోర్టు లభించింది. ఆమె ధ్యేయం నెరవేరింది.

ఈ విజయంతో సంతృప్తిపడదలచలేదామె.

ఎక్కడ అన్యాయం జరిగినా ఎక్కడ అకృత్యం జరిగినా ఎక్కడ అమానుషత్వం పడగ విప్పినా అక్కడ ప్రత్యక్షమవ్వాలనుకుంది. న్యాయం పక్షాన నిలిచి పోరాడాలనుకుంది. శేషజీవితాన్ని జనాన్ని చైతన్యం చేయడానికి తద్వారా దేశ పరిపుష్టికీ సమగ్రతకీ తన వంతు బాధ్యతగా నిర్వర్తించాలని నిశ్చయించుకుంది.

అలా నిర్ణయించుకుందో లేదో వెయ్యి ఏనుగుల బలం వచ్చినట్టుగా అనుభూతి చెందింది.

జనం గుండెయ్యి కొట్టుకోవడంలో ఎంత శక్తి ఎంత బలం ఎంత ధైర్యం ఎంత తృప్తి వున్నాయో తెలిసొచ్చింది.

శ్రీకాంత్ వారించినా లెక్కచెయ్యకుండా ఉద్యోగానికి రాజీనామా ఇచ్చేసింది.

పత్రికలవారూ టీవీలవారూ చుట్టుముట్టారు.

"మీ తదుపరి కార్యక్రమం ఏమి"టని ప్రశ్నించారు.

"ఇక ఉద్యమాల బాట నాది. ఉద్యమాలే నా ఊపిరి. బిగించిన పిడికిలి నా చిహ్నం!"

"అంటే ఏవిటి మీ ప్రణాళిక?"

"స్వేచ్ఛ! సంపూర్ణ స్వేచ్ఛ! బానిస బంధనాల నుంచి సంప్రదాయాల సంకెళ్ళ నుంచి వివక్షపిడికిళ్ళ నుంచి స్వేచ్ఛ! అమానుషత్వం నుంచి అన్యాయాలనుంచి అవినీతినుంచి స్వేచ్ఛ! దేశీయ కుట్రలనుంచి విదేశీ హస్తాలనుంచి అంతర్జాతీయ ఆంక్షల నుంచి స్వేచ్ఛ! మతం నుంచి మత్తు నుంచి మద శక్తుల నుంచి స్వేచ్ఛ! స్వాముల పాలన నుంచి గుండాల నాయకత్వంనుంచి స్వేచ్ఛ! అందుకోసం అహరహం శ్రమిస్తాను. అనుక్షణం తపిస్తాను. జనంలో చైతన్యం రగిలిస్తాను. ఆ మహాయజ్ఞంలో సమిధనై రాలిపోతాను!"

"ఇప్పుడు స్వేఛ్ఛా స్వాతంత్ర్యాలు లేవంటారా?" "సాంఘిక ఆర్థిక స్వాతంత్ర్యాలు లేకుండా కేవలం రాజకీయ స్వాతంత్ర్యం మాత్రమే వుంది. అది కొద్దిమంది అనేకమందిని దోచుకుతినే స్వాతంత్ర్యంగానే మిగిలిపోతోంది."

"మీ స్వేచ్ఛాస్వప్నం ఫలిస్తుందంటారా?"

"ఫలించాలని నా ఆశ, ఆరాటం, తపన, పోరాటం. ఎప్పుడు ఫలిస్తుందన్నది కాలమివ్వాల్సిన తీర్పు."

"మీ వెనుక సంస్థల్లేవు. శక్తుల్లేవు. పార్టీల్లేవు. మీరెంతవరకూ కొనసాగించగలరు?"

"వెయ్యి మైళ్ళ ప్రయాణమైనా మొదలయ్యేది మొదటి అడుగుతోనే. ఇది ప్రారంభం మాత్రమే. దీన్ని నా దేశపు యువత కొనసాగించి తీరుతుంది. విజేతయై నా దేశాన్ని ప్రపంచపటంమీద జ్వాజ్వల్యమానంగా ప్రకాశింపజేస్తుంది."

తిన్నగా పల్లెకి వెళ్ళింది రాజమ్మ. గ్రామ ప్రజలు హార్దిక స్వాగతం పలికారు. తోటలోని చరఖా కేంద్రపు తలుపులు తెరచింది.

బాపూజీ ఫోటో, తండ్రి ఫోటో, భగవద్గీత, రాట్నాలు తనకోసం నిరీక్షిస్తున్నట్టుగా అన్పించింది.

అంతా నడుం బిగించారు. కొద్దిసేపటికి ఆ ప్రాంతం, ఆ కుటీరం పరిశుభ్రతతో కళ కళలాడాయి.

రాట్నం ముందు కూర్చుని తిప్పింది. కిర్రు కిర్రు మంది. నూనె పోసింది. మెత్తగా తిరిగింది.

రాట్నం స్వయంకృషికి నిదర్శనం!

దూబగుంటలో రోశమ్మ సారావ్యతిరేకోద్యమానికి శంఖారావం చేసింది.

ఆ పిలుపు నందుకుని కొంగు బిగించింది రాజమ్మ.

ఊరూరా వాడవాడలా తిరిగింది. మహిళల్ని జాగృతం చేసింది. సారా మానమంటూ పాటలు కట్టింది.

సారా అనర్థాన్ని తెలియజెబుతూ ఉపన్యాసాలిచ్చింది.

రాష్ట్రం నలు మూలల్లోనూ స్త్రీలు ఆది శక్తులై కదిలారు. ధర్నాలు చేశారు. పికెటింగులు జరిపారు. సారా కాంట్రాక్టర్ల దౌర్జన్యాలని ఎదుర్కొన్నారు. పోలీసుల వత్తాసు లేకపోయినా ధైర్యంగా ఎదురొడ్డి నిలిచారు.

స్వాతంత్ర్య పోరాటం తర్వాత జనాన్ని ముఖ్యంగా మహిళల్ని కదిలించి కదన రంగానికి నడిపించిన ఉద్యమంగా అది చరిత్ర కెక్కింది.

మహిళల డిమాండ్‌ని కాదంటే మట్టిగొట్టుకు పోతామని గ్రహించి సానుకూలంగా స్పందించారు ఎన్టీఆర్. అధికారంలోకొచ్చిన అరగంటలో సారాని నిషేధిస్తానని ప్రకటించారు.

ప్రజలాయనకి తిరిగి పట్టం కట్టారు.

ప్రతిజ్ఞనుసారం పదవీస్వీకారం చేసినవెంటనే సారాని నిషేధిస్తూ ఉత్తర్వులు జారీ చేసారాయన.

"ఇది మహిళల విజయం!" అంది రాజమ్మ ఆనందబాష్పాలు రాలుస్తూ.

☆ ☆ ☆

స్టార్ ఛానళ్ళ విదేశవిషసంస్కృతిని వ్యతిరేకిస్తూ –

పుట్టబోయేది ఆడపిల్లని స్కానింగ్‌లో తెలుసుకుని భ్రూణహత్యలకి తలపడుతున్నందుకు –

దళితులపై అత్యాచారాలను నిరసిస్తూ –

మేధావులు విదేశాలకి వలసపోతున్నందుకు –

కన్యాత్వపరీక్షలు నిర్వహించినందుకు –

మతకలహాల దారుణ మారణకాండకు వ్యతిరేకంగానూ –

ప్రభుత్వరంగ సంస్థల ప్రైవేటీకరణకి నిరసనగా –

నాయకుల అవినీతిపనులూ స్కాంలూ దుయ్యబడుతూ –

లాకప్‌డెత్‌లకీ పోలీస్‌ఎన్‌కౌంటర్లకీ వ్యతిరేకంగా –

ఎన్నో ఉద్యమాలు నడిపింది రాజమ్మ. ప్రతి సమస్యకీ ప్రతిస్పందించి రంగంలోకి దూకింది. ప్రతి అక్రమానికీ జవాబు చెప్పించింది. దేశానికీ జనానికీ వ్యతిరేకమైన ప్రతి చర్యనీ ఎండగట్టింది.

వృద్ధాప్యం పైబడి కృంగదీస్తోన్నా ఆమెలో ఉత్సాహం చల్లారలేదు. ఆమె ఆరాటం తగ్గలేదు. ఆమె తపన ఆగలేదు.

ఆమె ఒక చైతన్యమూర్తి! చైతన్యస్ఫూర్తి!

## 44

చరఖా కేంద్రంలో నూలుపడుకుతోంది రాజమ్మ.

ఉద్యమాల పోరుబాట పట్టినప్పట్నుంచీ ఆమె ఖద్దరు దుస్తులే ధరిస్తోంది. శాకాహారమే తింటోంది. ఆశ్రమాని కొచ్చిన యువతీయువకులకి దేశపరిస్థితులు వివరిస్తోంది. పిల్లలకి భారత మాత ముద్దు బిడ్డల కథలు చెప్పి ఉత్తేజపరుస్తోంది.

ఒకప్పుడు ఉత్సాహంగా పని చేసిన మహిళా సంఘం యువజన సంఘం చీలిపోయాయి. స్తబ్ధిమయ్యాయి. అత్యధికులు తెలుగు దేశం వైపు ఆకర్షింపబడటం ముఖ్యకారణం.

రాజమ్మ వచ్చేక మళ్ళీ ఒక్కొక్కరూ రాసాగారు. ఆమెతో గొంతు కలపాలని మహిళలూ యువకులూ కూడా ముందుకొస్తున్నారు. చిన్నారి బాల బాలికలకీ విద్యార్థులకీ ఆమె ఓ పేదరాశి పెద్దమ్మ అయ్యింది.

"భారత దేశమంటే ఏమిటో స్వామీ చిన్మయానంద వివరించారు. భ అనగా కాంతి. రతి అనగా మునిగి వుండు. భారతి అనగా వెలుగులో కాంతిలో జ్యోతిలో తన్మయుడై వుండుట. భారతీయులనగా అంధకారాన్ని అజ్ఞానాన్ని విడిచిపెట్టి కాంతిని వెలుగును జ్ఞానాన్ని స్వీకరించేవారని అర్థం. అట్టి మనుషులుకల దేశం భారత దేశం" అంది రాజమ్మ.

"భలే భలే" చప్పట్లు కొట్టారు పిల్లలు.

లెనిన్‌బాబు తన అనుచరగణంతో వచ్చి ఆమెకి జైజైలు చెప్పేడు.

"నీలో ఇంత అగ్నికణం రగుల్తోందనుకోలేదు. ఇలాటి ఉద్యమాలకి పెద్ద ప్లాట్‌ఫాం కావాలి. ఐక్య సంఘటనలూ రూపొందాలి. ఆ బాధ్యత నేను స్వీకరిస్తాను!"

అతడి వంక చిత్రంగా చూసిందామె. అతడు అక్రమసంపాదనకి పాల్పడ్డాడని కమ్యూనిష్టుపార్టీనుంచి బహిష్కరించారు. అతడి చిన్న కొడుకు ఇప్పుడు ప్రముఖ కాంట్రాక్టరు!

"ఈ ఉద్యమం నాది కాదు, ప్రజలదే. అంతా చైతన్యవంతులై ముందుకి రావాలనీ ఉద్యమాన్ని మున్ముందుకి తీసుకుపోవాలనీ నా అకాంక్ష. అందుకు నా అనుమతి అవసరం లేదు. చిత్తశుద్ధీ నిస్వార్థతా వుంటే చాలు. కానొక్క సంగతి. ఇందులో నాయకులుండరు. నిధులుండవు. ఆపైన నీ ఇష్టం."

తిట్టుకుంటూ వెళ్ళిపోయాడతడు.

మరో పార్టీ నాయకుడొచ్చాడు. అతడు మాజీ మంత్రి. ప్రస్తుతం పార్లమెంటు సీటుకి పోటీ పడుతున్నాడు. ప్రత్యర్థి సినీ నటుడు. అతడి గ్లామర్ ముందు వెల వెలబోతున్నందున ఆమె సాయం అర్థించాడు.

"మీరు నా తరఫున ప్రచారం చేస్తే మీరు చెప్పిన అనాథ సంస్థలకి భరీ విరాళాలిస్తాను" అన్నాడు.

"రాజకీయాల్లో కొచ్చేక నువ్వు సంపాదించిందంతా నీ నియోజక వర్గంలోని పేదలకి పంచగలవా?"

"అలా పంచిస్తే అడుక్కు తినాలి. అయినా సంపాదించుకోడా నికీ ఆస్తులు కాపాడుకోడానికీ కాకపోతే రాజకీయాలు ప్రజా సేవ చేయడానికేమిటి?" అంటూ చిర్రు బుర్రులాడుతూ వెళ్ళిపోయాడు.

శ్రీకాంత్ భార్యా బిడ్డల్తో వచ్చాడు. బుజ్జిని చూసి "అప్పుడే ఎంతయ్యావురా." అని మురిసిపోయింది రాజమ్మ.

"అమెరికాలో ఉద్యోగం వచ్చింది. రేపే ప్రయాణం. నీ ఆశీర్వాదం కోసం వచ్చాడు" అన్నాడు శ్రీకాంత్.

ఆమె కళ్ళల్లో తడిపొర కదిలింది.

"ఒకప్పుడు భారతీయులంటే గర్వం, గౌరవం, ఇవాళ ప్రవాస భారతీయులంటే గౌరవం రాజమర్యాదలు!"

"అంతేమరి. ఇక్కడేముందని అసలు? స్కాములూ స్వాహాలూ లీకేజీలూ లంచగొండితనమూ అలసత్వమూనూ! కష్టపడినా సుఖపడలేని

దిక్కుమాలిన దేశం! అసలీ దేశం నాకేమిచ్చింది?" వుక్రోషంగా అన్నాడు బుజ్జి.

"నువ్వింతటివాడివి కావడానిక్కారణమైన ఈ దేశాని కేమిచ్చావో ఆ ఋణం ఏమాత్రం తీర్చుకున్నావో చెప్పరా! ఈ వ్యవస్థలో లోపాలున్నాయి. కాదన్ను. దాని ప్రక్షాళనానికి పూనుకోవాలిగాని దేశాన్ని నిందిస్తూ వదిలిపోతే ఎలా? డాలర్లకోసం పరుగుపెడితే ఎలా?"

"పెట్టక, ఇక్కడుండి మట్టి పిసుక్కోమంటావా? ఐ హేట్ దిస్ కంట్రీ!"

"బుజ్జీ!" అరిచిందామె. అంతా అదిరిపడి చూశారు. తనని తాను అదుపుచేసుకోలేక వణకుతూ అంది: "ఇంకో సారామాట అన్నావంటే వూరుకోను. ఈ గడ్డ నీకు జన్మనిచ్చిన తల్లిరా! పెంచి పెద్ద చేసి విద్యాబుద్ధలూ నేర్పిందిరా! నీ ఉనికికి చదువుకి ఈ దేశం ఎంతో ఖర్చు పెట్టిందిరా! ఇవాళ రెక్కలొచ్చాయని తల్లిలాంటి దేశాన్ని అసహ్యించుకుంటావా? సిగ్గులేదూ? నీ మేధని కొన్ని డాలర్లకి మరో దేశానికి అమ్ముకుంటున్నందుకు నువ్వు సిగ్గుతో తలవంచుకోవాలిరా! పదివేల మిలియన్ల డాలర్లకన్నా పిడికెడు మాతృదేశపు మన్ను గొప్పదిరా!"

"విదేశాల్లో ఉద్యోగం రావడం చాలా గొప్ప. మీకు తెలుసా?" కోడలు అడిగింది రోషంగా.

"తెలుసుకుంటున్నానమ్మా! మన దేశపు మేధావుల్ని శ్రామికుల్ని చౌకగా కొనుక్కుంటున్న విదేశీ సంస్థల గురించి తెలుసుకుంటున్నానమ్మా. మరో దేశపు ప్రజలకి వూడిగం చెయ్యడానికి వలస పోతున్న ఈ పక్షుల గురించీ తెలుసుకుంటున్నానమ్మా!

"ఒకప్పుడు సంకెళ్ళు వేసి బానిసలుగా తీసుకుపోయేవారు అమెరికన్లు. ఇవాళ డాలర్లు చూపేసరికి మీరంతట మీరే బానిస సంకెళ్ళు తగిలించుకుని వలసపోతున్నారు ఎంత చిత్రం!" ఎంత దారుణం!

"ఒరే అబ్బాయ్! అక్కడ వేల డాలర్లు సంపాదించొచ్చు. కాని అక్కడి వారికన్నా తక్కువే ఇస్తారు. అక్కడివారు చెయ్యడాని కిష్టపడనివే చేయిస్తారు. అంతేకాదురా ఇక్కడ రొమ్ము విరిచి తలెగరేసి స్వేచ్ఛగా బతికే స్వేచ్ఛ వుందే – అది నీ కక్కడ మచ్చుకి కూడా దొరకదురా! రెండో తరగతి పౌరుడిలా బిక్కు బిక్కుమంటూ బతకాలి. తెల్ల తోలుకి సలాం కొడుతూ వారికి ఆగ్రహం కలక్కుండా భయపడుతూ బతకాలి.

ఆ బానిస బతుక్కావాలో స్వేచ్ఛావాయువులు గుండెల్నిండా పీల్చుకోగల ఈ దేశం కావాలో తేల్చుకోరా!"

"నీ కెప్పుడూ మే మంటే అసూయే" అంటూ వెళ్ళిపోయారంతా.

☆ ☆ ☆

లెనిన్‌బాబు పెద్ద కొడుకు అరుణ్ వచ్చాడు.

అతడ్ని గుర్తించలేకపోయింది రాజమ్మ.

తనే స్వపరిచయం చేసుకున్నాడు.

"విదేశాలో డాక్టరీ చదివేవు కదూ, ఇప్పుడెక్కడ చేస్తున్నావురా?" ఆప్యాయంగా అడిగింది.

"రెండు మూడు ప్రైవేటు హాస్పిటల్స్‌లో చేశాను. ఇప్పటికి వనరులన్నీ సమకూరడంతో స్వంతంగా నర్సింగ్ హోం ప్రారంభిస్తున్నాను. నీ చేతుల మీదుగా అది ప్రారంభించాలని నా కోరిక పెద్దమ్మా!"

ఆపేక్షగా చూస్తూ నవ్వింది.

"ఇంకా పెద్దవాళ్ళు చాలామంది వున్నారు కదుట్రా?"

"నీ కంటే పెద్దమనస్సున్న వాళ్ళెవరూ లేరు. నీలాంటి నిస్వార్థపు మనిషీ లేరు!"

"పొగడ్తలు బాగా నేర్చుకున్నావు మీ నాన్నే మంటున్నాడు?"

"నేనిలా ప్రజా వైద్యశాల స్థాపించి పేదసాదలకి అతి తక్కువ ఫీజుకి వైద్యం చెయ్యబోవటం ఆయన కిష్టంలేదు. సిటీలో కార్పొరేట్ హాస్పిటల్ కడితే బోల్డు సంపాదించొచ్చు కదా అన్నారు. నా కది ఇష్టంలేదు. నా సేవలు నా ప్రాంతపు పేదసాదలకి దక్కాలని నా ఆకాంక్ష!"

ఆప్యాయంగా అతడి భుజం తట్టింది.

"నీలాంటి వాళ్ళే దేశానిక్కావాలిరా! నీలాటివారివల్లనే దేశం మహోన్నత స్థాయికి చేరుకుంటుందిరా!........"

"మరి ప్రారంభోత్సవానికి........."

"తప్పకుండా వస్తాన్రా! ఇంతటి మంచి కార్యంలో పాలు పంచుకో గల్గటం నా అదృష్టంరా! మీ నానమ్మా తాతయ్యల వారసత్వం నువ్వు స్వీకరిస్తున్నందుకు చాలా ఆనందంగా వుందిరా!"

రాజమ్మ వెళ్ళి ప్రజావైద్యశాలకి ప్రారంభోత్సవం చేసింది.

ఎందరో పెద్దలూ ప్రముఖులూ వచ్చి డాక్టర్ అరుణ్‌ని ఆశీర్వదించారు.

రాజమ్మ అభినందిస్తూ ప్రసంగించింది:

"ఎప్పుడో స్వరాజ్యం రాకముందు డాక్టర్ అరుణ్ నానమ్మ అన్నపూర్ణ మహిళల్ని సంఘటితపరుస్తూ వూరూరా తిరిగింది. మహిళల ఆరోగ్యం గురించీ శిశుపోషణం గురించీ ఎన్నో విషయాలు చెప్పి జాగృతం చేసింది. మాతా శిశువుల ఆరోగ్యం కోసం నిజంగా ఆవిడ ఎంతగానో తపించేదని చెప్పాలి. ఇప్పుడామె వారసత్వాన్ని ఆమె మనుమడు కొనసాగించబోవటం చాలా ఆనందకర పరిణామం. నిరుపేదలకి ఉచితంగానూ మిగతా వారికి అతి తక్కువ ఫీజుతోనూ వైద్యం చేస్తానంటోన్న చిరంజీవి అరుణ్‌కి అభినందనలు తెలియజేస్తున్నాను. వైద్యం ఖరీదైన వ్యాపారం అయిన ఈ రోజుల్లో ఇతడు ప్రజావైద్యశాలని స్థాపించడం నిజంగా అపూర్వం. ఈ అవకాశాన్ని ఉపయోగించుకుని మీ మీ ఆరోగ్యాలని పెంపొందించు కోవాల్సిందిగా విజ్ఞప్తి చేస్తున్నాను........"

రాజమ్మ పల్లెకి తిరిగివచ్చేసరికి సుబ్బలక్ష్మి వచ్చింది.

ఆమె ఇప్పుడు రాష్ట్రంలోనే ఓ జిల్లా కలెక్టరుగా పనిచేస్తోంది.

"నువ్వటు వెళ్ళగానే వచ్చాను. ప్రారంభోత్సవ కార్యక్రమం బాగా జరిగిందా?"

"చాలా బాగా జరిగిందమ్మా! మొత్తానికి అన్నపూర్ణ మనవడన్పిం చాడు."

"లెనిన్ బాబాయి ఏమంటున్నాడు?"

"పార్టీ నుంచి బహిష్కరించారు కదా! ఏదైనా వేదిక దొరక్కపోతుందా అని వెదుకుతున్నాడు. వివిధ కుల సంఘ నాయకుల్తో కలిసి ఒక ఫ్రంట్‌గా ఏర్పడాలని ప్రయత్నిస్తున్నాడు."

"ఆకాశంబుననుండి శంభుని శిరస్సు, అందుండి........అన్నట్టు ఆఖరికి కుళ్ళు రాజకీయాల్లోకి దిగజారిపోయాడన్నమాట!"

"నిబద్ధత తాదాత్మ్యత లేకపోతే అంతేనమ్మా! నీ విషయాలు చెప్పు. చంద్రబాబు కొంతవరకూ ఫరవాలేదు కదూ! మీ అందర్నీ సరిగ్గా నిద్ర పోనివ్వకుండా పరిగెత్తిస్తున్నాడు కదూ! రోడ్లు వేయిస్తున్నాడు. కాలవలు తవ్విస్తున్నాడు రైతుబజార్లు పెట్టాడు. హైటెక్కు సిటీలంటున్నాడు. టెలికాన్ఫరెన్సులు నిర్వహిస్తున్నాడు. కాదంటే అప్పుల్తోనే రాష్ట్రాన్ని అభివృద్ధి చెయ్యగలననే భ్రమలో వున్నట్టున్నాడు."

"ఆచరణ తక్కువ, ఆర్భాటం ఎక్కువ. రోజుకో విధానం పూటకో పిలుపు అన్నట్టుగా వుంది. ఎందులోనూ చిత్తశుద్ధి కన్పించదు. ఆఖరికి రాష్ట్రం ఏమవుతుందోనని భయమేస్తోందమ్మా!"

"అదేవిటే, దేశం గర్వించదగ్గ ముఖ్యమంత్రి అంటున్నారు!"

"ఆ ప్రచారం చేస్తున్నదెరో తెలుసా? ప్రపంచ బ్యాంకు, మల్టీ నేషనల్ సంస్థలూనూ! ఇలాటివారివల్లే వారికి లాభం వుంది మరి!"

"కొంచెం అర్థమయ్యేట్లు వివరించవే, నీకు పుణ్యం వుంటుందిగానీ."

"సరైన ఆదాయమూ సరిపడా ఆస్తులూ లేని వాళ్ళు అప్పులు చేస్తే ఏమవుతుంది చెప్పు?"

"దివాలా తీస్తారు! మా మావగారు చేసిందదే. నిన్నగాక మొన్న దమయంతీ వాళ్ళూ అప్పు తీర్చలేకే కదా ఆత్మహత్య చేసుకున్నదీ!"

"అదే పరిస్థితి రేపు రాష్ట్రానికీ దాపురించబోతోంది!"

"సుబ్బలక్ష్మీ!"

"అవునమ్మా! ఇది పచ్చినిజం. జనమూ మేధావులూ సంఘాలూ పార్టీలూ అన్నీ అంతా కళ్ళు తెరచి విదేశీ రాహువుని అడ్డగించకపోతే రాష్ట్రాన్నీ దేశాన్నీ మింగెయ్యడం ఖాయం!"

"ఏవిటే, ఇంత దారుణంగా వుందా పరిస్థితి? ప్రతిపక్షాలూ పత్రికలూ గగ్గోలుపెట్టడంలేదేం?"

"వాళ్ళవీ ఇవే విధానాలు గనుక. అసలు విదేశీపెట్టుబళ్ళకీ ప్రపంచ బ్యాంకు అప్పులకీ తలుపులు బార్లా తెరచింది కాంగ్రెస్సే గనుక!"

"అయితే వాళ్ళు అప్పులిచ్చి మనల్ని అదుపు చెయ్యాలని అదుపులో వుంచుకోవాలని పన్నాగాలు పన్నుతున్నారన్నమాట"

"అవునమ్మా! అప్పులనే రంగుదారాల ఉచ్చుల్లో మన దేశాన్ని ఇరికించాలని చూస్తున్నారు. ఒక దేశం ఇంకో దేశాన్ని బానిసగా ఎందుకు చేసుకుంటుందో తెలుసుకదా? ఆ దేశంలోని సంపదనీ వనరుల్నీ కొల్లకొట్టడానికి, లేబర్ని చీప్‌గా కొనుక్కోడానికి, తమ సరుకుల్ని తెచ్చి అధికలాభాలు గడించడానికి. ఇప్పుడదే జరగబోతోంది!"

"అంటే, అప్పు లిచ్చిన ఆర్థిక సంస్థల చేతుల్లో మనం బానిసలవుతామన్నమాట!"

"అక్షరాలా అంతే. ఇప్పటికే మన రాష్ట్రానికి ప్రపంచబ్యాంకూ ఐ ఎమ్ ఎఫ్ కలిసి ఇరవై ఐదు వేల కోట్ల రూపాయలు రుణాలుగా

ఇచ్చాయి. వడ్డీకిందే ఏడాదికి ఇరవై ఐదువందల కోట్ల రూపాయలు చెల్లించాల్సి వుంటుంది. పోనీ, ఆ సొమ్మును సద్వినియోగం చేస్తున్నారా అంటే అదీ లేదు. చాలా వరకూ నాయకుల కాంట్రాక్టర్ల జేబుల్లోకి పోతోంది. మిగతాదైనా హైటెక్ ప్రాజెక్టులకీ ఫ్లై ఓవర్ బ్రిడ్జీలకీ బహుళ జాతి సంస్థలకోసం వనరులు కల్పించడానికీ ఉపయోగిస్తున్నారు. అంతే తప్ప నీటి పారుదల ప్రాజెక్టులకీ అధిక భూమి వినియోగానికీ అక్షరాస్యత తొలగించడానికీ అధికోత్పత్తికీ ఉపాధి కల్పనకీ ఉపయోగించట్లేదు నినాదాలు తప్ప!"

"అలాగా! ఇంత ముందుచూపు లేకుండా ఎందుకు చేస్తున్నట్టు?"

"వాళ్ళిచ్చే ఋణం దేనికి ఎలా ఉపయోగించాలో వాళ్ళే చెబుతారు. షరతులు విధిస్తారు. అలా చేస్తేనే వారింత ఋణం ఇస్తారు. వాళ్ళెలా చెబితే అలా చేస్తోంది ప్రభుత్వం. సంక్షేమ పథకాలు తగ్గించమంది. తగ్గించారు. సబ్సిడీలు తగ్గించమన్నారు. తగ్గిస్తున్నాను పన్నులు పెంచమన్నారు పెంచుతున్నారు విద్యుత్ శాఖని విడగొట్టమన్నారు. విడగొట్టారు. ప్రభుత్వరంగ సంస్థల్ని ప్రయివేటుపరం చెయ్యడమో మూసెయ్యడమో చెయ్యమన్నారు. అల్విన్ మూసేశారు. ఐ డి పి ఎల్ ని మూసేస్తారు. మిగతా సంస్థల్నీ బ్యాంకుల్నీ ఇన్స్యూరెన్సు కంపెనీలనీన్నీ ప్రయివేటు పరం చేస్తారు. ఉద్యోగులెక్కువగా వున్నారని చెప్పి మీ ఆర్ యస్ ఉద్యోగుల్ని తొలగిస్తారు. ఇలాటివే ఎన్నో చెయ్యబోతున్నారు. కడకేమవు తుందో తెలుసా?"

ఏమవుతుందన్నట్టు భయం భయంగా చూసింది రాజమ్మ.

"పోలీసు వ్యవస్థ తప్ప మిగతా ప్రభుత్వ కార్యకలాపాలన్నీ ప్రయివేటుపరం అయిపోతాయి. అప్‌వాస్‌లాటి విదేశీ సంస్థలు ఆ పనుల్ని నిర్వహిస్తాయి. ఉద్యోగాలు కాంట్రాక్టు ఉద్యోగాలుగా మారిపోతాయి. ప్రతీ ఉద్యోగీ ఉద్యోగం ఊడుతుందేమోనన్న భయంతో బానిసలా పడుండాలి. విద్య వైద్యం రవాణా సమస్తమూ ఖరీదైపోతాయి. అదే మన ముఖ్యమంత్రి గారి విజన్ 2020. ఇది రంగుల కలకాదు. అప్పుల వల. ఎంచేతంటే, దాని కోసం ముప్పై లక్షల కోట్లు అప్పుల ద్వారా విదేశీ పెట్టుబడులద్వారా సేకరిస్తారట. అంటే 2020 నాటికి రాష్ట్ర నికర ఆదాయంలో సగం చట్టబద్ధంగా విదేశాలకి తరలించుకుపోతారన్నమాట. మన సిరి సంపదలు దోచుకెళ్ళిపోతున్నారని బ్రిటిష్ సామ్రాజ్యవాదుల్ని వెళ్ళ

గొట్టిన దేశం మన సంపదని బంగారు పళ్లెంలో పెట్టి విదేశీ సంస్థల కప్పగించబోతోందన్నమాట!"

"చూస్తోంటే చంద్రబాబు సాధించేది స్వర్ణాంధ్ర ప్రదేశ్ కాదు ఋణాంధ్రప్రదేశ్ అన్పిస్తోంది!"

"అక్షరాలా అంతే. మన రాష్ట్రమే కాదు, మిగతా రాష్ట్రాలూ కేంద్రమూ కూడా ప్రపంచ ఆర్థిక సంస్థల గుప్పిట్లోకెళ్ళి దేశాన్ని వారికి తాకట్టు పెట్టడానికి సిద్ధపడుతున్నాయి."

"ఇన్నాళ్ళూ ఏమిటో అనుకున్నాను. ఇక ఉపేక్షించను. జనానికి ప్రపంచ ఆర్థిక సంస్థలతో కలిసి మన నాయకులు ఆడుతోన్న నాటకాన్ని బట్టబయలు చేస్తాను. మళ్ళీ నా దేశం బానిసత్వంలోకి వెళ్ళకుండా అడ్డుకుంటాను. నా కంఠంలో ప్రాణం వున్నంతవరకూ అడ్డుకుంటూనే వుంటాను!"

"అంతేకాదమ్మా! ప్రపంచ బ్యాంకు నిధులు తెచ్చుకుని అన్ని విధాలా మోసపోయి భ్రష్టు పట్టిపోతున్న బ్రెజిల్ మెక్సికోలని చూసైనా బుద్ధి తెచ్చుకోమని మన నేతలకి బుద్ధి చెప్పాలి."

"చెబుదామమ్మా! నువ్వూ నేనూ మేధావులూ అంతా కలిసి చెబుదాం. చెవులు మెలేసిమరీ చెబుదాం. ఇకనుంచి 'ప్రపంచ ఆర్థిక సంస్థల్లారా, క్విట్ ఇండియా' అన్నదే నా నినాదం!"

ఉద్వేగంతో వూగిపోతోంది రాజమ్మ.

ఆమె మోములో ప్రతిఫలిస్తోన్న దీక్ష, పట్టుదలని చూసి ఉప్పొంగి పోయింది సుబ్బలక్ష్మి.

## 45

ఒక ప్రయివేట్ టీవీ ఛానెల్ వారు రాజమ్మని ఇంటర్వ్యూ చేయడాని కొచ్చారు.

ఆమె వ్యక్తిగత వివరాలడిగేక, "మీది వ్యక్తిగత ఉద్యమం అంటున్నారు. తాటాకు మంటల్లా త్వరగ చప్పబడి పోతుందంటున్నారు. మీరేమంటారు?" అని ప్రశ్నించారు.

"జయప్రకాష్‌నారాయణ్, మదర్ థెరిస్సా, శేషన్, కిరణ్ బేడి, ఖైర్నర్, మేదాపాట్కర్, స్వామి అగ్నివేశ్, అన్నా హజారే – వీళ్ళంతా

ఒక్కరే. కాని ఒక్కొక్కరూ ఒక శక్తిగా ఎదిగారు. వారి స్ఫూర్తితో అన్నిచోట్లా అందరూ ప్రజలకోసం ముందుకి రావాలి. పిడికిళ్ళు బిగించాలి. అప్పుడేమైనా సాధ్యమని నా నమ్మకం."

"సమస్యలొచ్చినప్పుడు స్పందిస్తున్నారుతప్ప ఒక నిర్మాణాత్మక పథకాన్ని రూపుదిద్దటంలో మీరు విఫలమయ్యారంటున్నారు. మీ సమాధానం?"

"సమస్యనాధారంగా జనంలో చైతన్యం రగిలించాన్నది నా తపన. ఆ సమస్య పూర్వాపరాలు వివరించి ఎడ్యుకేట్ చెయ్యడం ముఖ్యం. దేశం ఎటు పోతోందో, ప్రతివారూ అందినంత దోచుకొంటోంటే కడకి దేశం ఏమవుతుందో, వివరించడం ముఖ్యం. ఆలోచించేంత చైతన్యం కల్గిస్తే చాలు. ఆ తర్వాత ఏం చెయ్యాలో ఎలా చెయ్యాలో ప్రజలే నిర్ణయించుకుంటారు."

"మీ అమ్మాయి జిల్లా కలెక్టరు గనుక మీడియా మీ కెంతో విలు విచ్చిందనీ తద్వారా మీకు మీ కార్యకలాపాలకీ ఎక్కువ పేరొచ్చిందనీ అంటున్నారు. మీ కామెంట్?"

"కలెక్టర్ తల్లిగాకన్నా స్వాతంత్ర్య సమరయోధుడు వియ్యన్న గారి కూతురిగా ఎక్కువ గర్విస్తాను. వియ్యన్నగారి గురించి గోదావరి ప్రాంతీయులెవర్ని అడిగినా కథలు కథలుగా చెబుతారు. ఇక మీడియా గురించంటారా? వారు నాకుగాదు నేను లేవనెత్తిన సమస్యలకే విలువివ్వక తప్పనిసరై ఇస్తున్నా రనుకుంటున్నాను. ఎంచేతంటే, అవి జనం సమస్యలు, దేశసమస్యలు."

"ప్రపంచబ్యాంకు తదితరులకి వ్యతిరేకంగా పోరాడమని పిలుపు ఇచ్చారు కదా, అది సరైన నిర్ణయమే నంటారా?"

"ముమ్మాటికీనూ. బ్రెజిల్ మెక్సికో దేశాల్లా మన దేశమూ మోసపోకూడదని నా తాపత్రయం. నా దేశ స్వేచ్ఛ నెవరూ హరించ కూడదని నా తాపత్రయం. స్వేచ్ఛే నా స్వప్నం, నా ఊపిరి, నా సర్వస్వమూ. నిన్నటిది రాజకీయ స్వేచ్ఛా స్వప్నం, నేటిది సాంఘిక స్వేచ్ఛా స్వప్నం, రేపటిది ఆర్థిక స్వేచ్ఛా స్వప్నం!"

"మీ రెవర్తో ఢీకొంటున్నారో తెలుసా?"

"విశ్వాసం వుంటే కొండనైనా కదిలించగలమని నా నమ్మకం. చీకటిని నా చేతుల్తో పగులకొట్టి వెలుగుకి రోడ్డు వేయగలనని నా విశ్వాసం. ఇది అహంభావం కాదు, ఆత్మవిశ్వాసం. నేను కణ కణమండే అగ్ని

శిఖను. కాలరాయాలని చూస్తే కాల్చివేస్తాను. నేను ఒంటరిని కాదు. సమూహశక్తిని."

"హైటెక్ వల్ల ప్రయోజనం శూన్యమని మీ అభిప్రాయమా?"

"హైటెక్ జీవన వేగాన్ని పెంచి సమాచారాన్ని మిల్లి సెకన్లలో అందిస్తుంది తప్పితే పంటలు పండించదు. వర్షాలు కురిపించదు. ఇళ్ళు కట్టించదు. రోటీ కపడా ఔర్ మకాన్‌లది పాత కథే పునరావృత్తమవుతుంది!"

"చంద్రబాబు స్వర్ణాంధ్ర ప్రదేశ్ మీకక్కర్లేదంటారు?"

"స్వర్ణాంధ్రలో స్వర్ణం వద్దు. పాడి పంటలు అన్నపూర్ణ కావాలి. ప్రజల ఆకలి తీర్చే రోజు రావాలి. ఉపాధి సంక్షేమం అందించే ప్రభుత్వం కావాలి. చంద్రబాబుని ఏసిరూములో బిల్‌గేట్స్‌ని ఇంటర్నెట్‌లో పలకరిస్తూ, అమెరికన్ పిజ్జాతింటూ, జాక్సన్ సంగీతం వింటూ, కోకో కోలా తాగమనండిగాని, దేశాన్ని అప్పులు ఊబిలోకి ఈడ్చొద్దని నా విజ్ఞప్తిగా చెప్పండి. నా దేశం భగవద్గీత అనికూడా చెప్పండి."

"అరవై ఏళ్ళు పైబడ్డా మీరింకా ఎంతగానో తపిస్తూ శారీరక మానసిక శ్రమలకి లోనవుతూన్నా రెందుకు? హాయిగా విశ్రాంతి తీసుకుంటూ శేష జీవితాన్ని సుఖంగా గడిపేయొచ్చుకదా?"

"నా దేశం సుభిక్షంగా వుండాలి. నా ప్రజలు పచ్చగా వుండాలి. నా దేశపు జెండా వినువీధుల్లో రెప రెపలాడుత్తుండాలి. అందుకోసం ఆఖరి క్షణం వరకూ తపిస్తూనే వుంటాను. ఆఖరి రక్తపు బొట్టు వరకూ ధార బోయడానికి వెనుకాడను................"

☆ ☆ ☆

రాష్ట్రమంతా సుడిగాలి పర్యటన జరుపుతోంది రాజమ్మ.

ఆమెకి అండగా ఎందరో విద్యార్థులూ యువకులూ వివిధ సంఘాల వారూ మేధావులూ వామపక్షాలూ నిలిచాయి.

"విదేశీ దోపిడీ నిరోధించండి. ప్రపంచ ఆర్థిక సంస్థల్ని వెళ్ళగొట్టండి. దేశాన్ని అప్పుల ఊబిలోకి నెట్టనివ్వకండి" అని ప్రతిచోటా నినదిస్తోంది.

సామ్రాజ్యవాద దేశాల ప్రయోజనార్థం పనిచేసే ప్రపంచ ఆర్థిక సంస్థల పనితీరుని ఎండగడుతోంది. వారి లీలల్ని వివరిస్తోంది. రాబోయే విషమ పరిణామాల్ని వివరిస్తోంది.

జనం మద్దత్తు కోరుతోంది.

కొన్నిచోట్ల నిరసనలు ఎదురయ్యాయి. మరికొన్నిచోట్ల అల్లర్లు సృష్టించాలని ప్రయత్నించారు.

అయినా లెక్క చెయ్యకుండా అప్రతిహతంగా ముందుకి దూసుకెళ్తోంది రాజమ్మ.

ఇంతలో ప్రపంచబ్యాంక్ బృందం భాగ్యనగరానికి రాబోతోందని తెలిసింది.

రాష్ట్ర ప్రభుత్వం చేబట్టిన పనుల్నీ పాలనా సంస్కరణల్నీ సమీక్షించి మరింత ఋణం ఇచ్చేందుకు అవకాశాల్ని పరిశీలించేందుకూ వస్తున్నారని వార్తలొచ్చాయి.

ప్రభుత్వం వారికి రెడ్ కార్పెట్ పరచి అట్టహాసంగా స్వాగత సత్కారాలివ్వడానికి ప్రయత్నాలు అరంభించింది. విదేశీ వ్యాపార సంస్థలకి అన్ని వసతులూ కల్పిస్తామనీ రాష్ట్రంలో పరిశ్రమలూ వ్యాపార సముదాయలూ స్థాపించమనీ ప్రభుత్వం విజ్ఞప్తి చేసింది.

బహుళ జాతి సంస్థలకి దేశ ప్రయోజనాలని తాకట్టు పెట్టడానికి నిస్సిగ్గుగా సిద్ధపడింది! రూపాయిచేత డాలర్‌కి వూడిగం చేయించడానికి దిగజారిపోయింది!

ఆ వార్తలు వింటూనే ఆగ్రహోదగ్రురాలయ్యింది రాజమ్మ.

విదేశీ బృందానికి నిరసనని తెలియజేయమని పిలుపు నిచ్చింది.

ఎందరో యువకులూ విద్యార్థులూ సంస్థలూ సంఘాలూ పార్టీలూ ముందుకొచ్చాయి. ప్రభుత్వరంగ సంస్థల కార్మికులూ ఉద్యోగులూ వేలాదిగా కదలి వచ్చారు. దిక్కులు పిక్కటిల్లేలా నినదిస్తూ గొప్ప ఊరేగింపుగా విమానాశ్రయాని కెళ్ళారు.

జనాన్నుద్దేశించి ఆవేశంతో వూగిపోతూ ప్రసంగించింది రాజమ్మ.

నిలబడే శక్తి లేక పోయినా ఏదో తెలీని వుద్రేకంతో కంపిస్తూ పాలకుల గుండెల్లో ప్రకంపనాలు పుట్టేలా ఉపన్యసించింది:

"నా దేశపు ప్రియతమ బిడ్డలారా! ఇవాళ మన దేశాన్ని పరిపాలిస్తున్నది ప్రధాన మంత్రికాదు, ముఖ్యమంత్రులూ కాదు మరెవరూ? ప్రపంచ బ్యాంకు వారి తొత్తులూ తాబేదార్లూనూ. వాళ్ళేం చేయమంటే అది చేస్తున్నాం. ఆఖరికి సబ్సిడీ తగ్గించమన్నారు. తగ్గించాం. అన్ని రకాల సబ్సిడీల్లో కోత పెట్టమన్నారు. పెట్టేశాం. ప్రభుత్వరంగ పరిశ్రమల్ని

ప్రైవేటు పరం చెయ్యమన్నారు. అందుకూ సిద్ధమైపోయాం. టెక్నాలజీ పెంచి కార్మికులకి గోల్డెన్ షేక్‌హేండ్ ఇమ్మన్నారు. అదీ ఇస్తున్నాం. విద్యుచ్ఛక్తి బోర్డుని ముక్కలు చేసి ప్రైవేటు పరం చెయ్యమన్నారు. అప్పుడే అందుకు పధకాలు తయారు చేసేస్తున్నాం. ఇళ్ళు కూల్చి అయినా సరే రోడ్లు వెడల్పు చెయ్యమన్నారు అదీ చేస్తున్నాం. ఇదీ నేటి మన దుస్థితి! ఇక మన స్వేచ్ఛకీ స్వాతంత్ర్యానికీ అర్థం ఏమిటి?"

జనంలో కలకలం లేచింది. "నిజం నిజం" అని అరిచారు కొందరు. షేమ్ షేమ్ అని అరిచారు కొందరు.

"అమెరికా మాజీ ప్రెసిడెంట్ కెన్నడీ ఒకసారే మన్నాడో ఈ సందర్భంగా గుర్తు తెచ్చుకుందాం. ఒక దేశాన్ని జయించాలంటే రెండే మార్గాలున్నాయిట. ఒకటి – ఆయుధ బలం ద్వారా ఆ దేశ ప్రజలపై పెత్తనం సాధించటం. రెండు – ద్రవ్యసహాయం ద్వారా ఆ దేశపు ఆర్థిక వ్యవస్థపై పెత్తనం పొందటం. ఇప్పుడు మన దేశంలో జరుగుతోంది ఆ రెండోదే-సోదరులారా! ప్రపంచం ఆర్థిక సంస్థలు చెప్పినట్టు తు.చ. తప్పకుండా నడుచుకుంటున్నాం. వారిచ్చే కోట్ల రూపాయల ఋణాల కోసం మన దేశాన్నీ ప్రజాప్రయోజనాల్నీ తాకట్టు పెట్టేస్తున్నారు మన నాయకులు. ఎంతటి విషాదమో ఆలోచించండి.........."

ఆయాసం రాగా ఆమె ఆగింది. అంతా నిశ్శబ్దమై ఆమె వంక ఆశగా ఆర్తిగా చూస్తున్నారు.

"ప్రతిగ్రామం స్వయంపోషకం కావాలన్నారు బాపూజీ. నేడు దేశం కూడా స్వయం పోషకం కాలేకపోయింది. విదేశీ సంస్థలు ఋణం ఇస్తే తప్ప ఇక్కడి ప్రజలకి బియ్యం కూడా సరఫరా చెయ్యలేని దౌర్భాగ్య స్థితిలో వున్నాం. మన దేశపు విదేశీ ఋణం ఎంతో తెలుసా? నాలుగు లక్షలకోట్లు పైమాట. సాలుసరి వడ్డీయే నాలుగువేల కోట్లు. అంటే తొంభై కోట్ల దేశ ప్రజల ఒక్కొక్కరి తలపై అయిదు వేల రూపాయల అప్పు వుందన్నమాట!"

"సిగ్గు సిగ్గు" అంటూ కొందరు రెచ్చిపోగా, మరి కొందరు సర్ది చెప్పి కూర్చోబెట్టారు.

"యాభై మూడేళ్ళ క్రితం విదేశీయుల్ని తరిమేసి విదేశీ పాలన నుంచి దేశాన్ని విముక్తం చేశాం. స్వాతంత్ర్యం సాధించి సంబరాలు చేసుకున్నాం. కాని ఇవాళ విదేశీయుల్నీ విదేశీ సంస్థల్నీ 'మా దేశం రండి,' దోచుకోండి

అంటూ మేళ తాళాలతో మంగళ వాయిద్యాలతో ఆహ్వానిస్తున్నాం. మన దేశాన్ని మనమే తాకట్టు పెట్టడానికి సిద్ధపడుతున్నాం. ఎంత సిగ్గుచేటుపనో ఆలోచించండి. విదేశీ సంస్థల ఉక్కు పిడికిళ్ళ నుంచి దేశాన్ని కాపాడటానికి పిడికిళ్లు బిగించండి. ఒక్క గొంతై గర్జించండి. విమానంలో రాబోతున్న బృందం అదే విమానంలో తిరిగి వెళ్ళేలా విరుచుకు పడండి........"

జనం ఆగ్రహోదగ్రులయ్యారు. "గోబాక్ గోబాక్" అని నినదించారు. పోలీసువలయాన్ని చీల్చుకుని విమానాశ్రయంలోకి చొరబడ్డారు. సరిగ్గా అప్పుడో పక్కన బాంబు పేలింది!

పోలీసులు విరుచుకుపడ్డారు. లాఠీచార్జీ చేశారు. బాష్పవాయువు ప్రయోగించారు. కాల్పులూ జరిపారు!

దేశాన్ని విచ్ఛిన్నం చేసేందుకు, చట్టబద్ధ ప్రభుత్వాన్ని కూలదోసేందుకు కుట్ర పన్నిందని రాజమ్మమీద అభియోగం మోపిఅరెస్టు చేశారు.

ఆమె కుట్రదారు అని నిరూపించే సాక్ష్యాధారాలు చూపెట్టలేక పోయారు. అందువల్ల విదేశీ బృందానికి వ్యతిరేకంగా జనాన్ని రెచ్చగొట్టి గందరగోళ స్థితికీ, ఆస్తి నష్టం, ప్రాణనష్టాలకీ కారణమైందన్న ఆరోపణకిగానూ ఏడాది జైలుశిక్ష విధించింది న్యాయస్థానం!

## 46

గతం వర్తమానంలోకొచ్చి ఆగింది.

ఆలోచనామాలిక వదిలి రాజమ్మ నిట్టూరుస్తూ లేచి కూర్చుంది.

జైలు గదిలోని చీకట్లు మెల్లగా విచ్చుకుంటున్నాయి.

సూర్యోదయమవుతోంది. రంగు రంగుల వెలుగు కిరణాల నీడలు గోడమీద కదుల్తున్నాయి.

వాటివంక ఆనందంగా చూసింది.

భారతమాత స్వర్ణభారతి ఐ మూడేళ్ళైది. స్వాతంత్ర్యం సాధించిన ఈ శతాబ్దంలో అఖరి పండుగ చేసుకొంటోంది. ఎంత గొప్ప సంగతి! అనేకమంది దేశభక్తుల నిర్విరామ పోరాటఫలితంగా వారి త్యాగాలకి ప్రతిగా స్వాతంత్ర్యం వచ్చి యాభై మూడేళ్ళయ్యింది.

ఈ స్వాతంత్ర్య సంరంభాల మధ్య గత యాభై మూడేళ్ళుగా ఏం సాధించామని ఒక్కసారి సింహావలోకనం చేసుకుంటే.........

ఎన్నో ప్రణాళికలేశాం. ప్రాజెక్టులు కట్టాం. విద్యా వైద్య సౌకర్యాలూ రవాణా మార్గాలు పెంచాం. ఉద్యోగావకాశాలు కల్పించాం. చిన్న పెద్ద పరిశ్రమల్ని స్థాపించాం. వాణిజ్యాన్ని అభివృద్ధి చేశాం. జీవన ప్రమాణాల్ని పెంచాం. ప్రజల ఆర్థిక స్థితిని మెరుగుపరిచాం. దేశసంపదనీ దాంతో బాటు జనాభానీ పెంచాం!

అదే సమయంలో ఋణభారాన్ని ఇబ్బడిముబ్బడిగా పెంచాం.

అంతేనా? కాదు.

ఇవాళ దేశంలో 291 మిలియన్ ప్రయోజనులు నిరక్షరాస్యులుగా వున్నారు. 45 మిలియన్ బాల బాలికలు ప్రాథమిక విద్యకి దూరంగా వున్నారు. 135 మిలియన్ ప్రజలకు ప్రాథమిక ఆరోగ్య భాగ్యం లభించడం లేదు. 276 మిలియన్ ప్రజలకు శుభ్రమైన త్రాగునీరు లభించడం లేదు. 57 శాతం ప్రజలు మురికివాడల్లో నివసిస్తున్నారు. 52 శాతం జనం దారిద్ర్యరేఖకి దిగువ జీవిస్తున్నారు. ఇక అడుగడుగునా అవినీతీ గుండాయిజమూ రాజ్యమేలుతున్నాయి!

డొనేషన్ కట్టందే యల్కేజీలో కూడా సీటు దొరకదు. లంచం ఇవ్వనిదే రేషన్ కార్డు లభించదు. ఎవరి ఓటు వారే వెయ్యగలస్థితిలేదు. నూరు మూల గ్రామాలకి సరైన రోడ్లు కూడా లేవు. ఎన్నికల్లో పోటీ చేసే వారికి ఎలాటి అర్హతలూ వుండాల్సిన పని లేదు. నాయకుడ్ని వెనక్కి రప్పించే హక్కు లేదు. దయతో మెలగటం పోలీసులకి తెలీదు. న్యాయస్థానాల్లో కేసులు ఏళ్ళతరబడి మగ్గుతుంటాయి ప్రభుత్వోద్యోగులు సేవాభావంతో పని చెయ్యరు. పత్రికల్లో స్కాముల హత్యల ఎన్ కౌంటర్ల వార్తలే వస్తాయి. కుల సంఘాల్లూ కుల సభలూ కోటా సీట్లూ సర్వసాధారణం మరణశిక్ష పడ్డ ఖైదీల్లా చుట్టూ రక్షక భటులు లేనిదే రాజకీయనాయకులు జనంలోకిసైతం రారు!

ఇదా మన ప్రగతి?

ఇదేనా స్వాతంత్ర్య సమర యోధులు కలలుగన్న రామరాజ్యం?

దేశాభివృద్ధిని కొల్లగొట్టి జేబులు నింపుకున్న దెవరు? దేశ సంపదన విదేశీ బ్యాంకుల్లో దాస్తున్న ద్రోహులెవరు? దేశాన్ని విదేశాలకి తాకట్టు పెట్టి ఆస్తుల్ని పెంచుకోవాలని చూస్తున్న దెవరు?

దాచేసిన సత్యాలనన్ని కావాలిప్పుడు!

మరుగున పడిన నిజాలన్నీ వెలికి తీయాలిప్పుడు!

ప్రతి భారతీయుడూ ఈ నాటి స్థితికి కారణా లేమిటో తెలుసుకోవాలిప్పుడు!

అప్పుడే స్వతంత్ర భారతి సాక్షిగా సరైన మార్గాన పయనించగలరు. లక్ష్య సాధనకై ఉద్యమించగలరు. నా దేశం నా ప్రజలు అంటూ సగర్వంగా త్రివర్ణ పతాకం చేబూని ఎలుగెత్తి వందేమాతరం పలకగలరు!

తలుపు చప్పుడుకి ఆమె భావవాహిని చెదరిపోయింది.

"ఏయ్ ముసిలీ! అదృష్టవంతురాలివే. స్వాతంత్ర్యోత్సవ సందర్భంగా! నీ శిక్ష తగ్గించారు. నిన్ను ఇవాళే విడుదల చేస్తున్నాం లే లే........"

సూర్యుడు మెల్ల మెల్లగా పెకైగబాకు తూండగా రాజమ్మ జైలు నుంచి బయటికొచ్చింది. స్వేచ్ఛా వాయువు ఆమెని చుట్టుముట్టింది. గుండెల్నిండా ఊపిరి పీల్చుకుని వదిలింది.

ఎటు చూసినా జాతీయ పతాకాలు! జనాన్ని కర్తవ్యోన్ముఖుల్ని చేసే దేశభక్తి గీతాలు!

"బోలో భారత్ మాతాకీ జై........" నినాదాలు చేస్తూ ఎందరో బాల బాలికలూ, యువతీ యువకులూ బిల బిలమంటూ వచ్చి ఆమెని చుట్టేశారు.

సుబ్బలక్ష్మి కూడా వచ్చింది.

"నువ్వు ఇక్కడికి........"

"ఆత్మవంచన చేసుకోలేకుండా వున్నాను. అందుకే రాజీనామా చేసేశాను. ఇకనుంచి నీ ఉద్యమంలో నీకు తోడుగా వుంటానమ్మా!"

పరమానందపడుతూ ఆలింగనం చేసుకుంది.

జే జేలు కొట్టారు పిల్లలు

వాళ్ళంతా ముందుకొచ్చి రాజమ్మకి పూలదండలు వేశారు.

పూలగుచ్ఛాలు అందించారు.

"నా కెందుకర్రా, ఇవన్నీ అమ్మ భరతమాతకి వెయ్యండ్రా!" అంది.

"మీరు మాకు అమ్మతో సమానమే." అన్నారు ముక్తకంఠంతో

ఆమెని నడిపించడానికి సాయం రాబోయారు. వద్దని వారించి అతి కష్టంమీద కాలు ఈడుస్తూనే అడుగులు వేసింది.

ఆ దగ్గర్లోని నాలుగు రోడ్ల కూడలి దగ్గరికి తీసుకెళ్ళారు.

ఎత్తయిన జెండాకర్రకి మువ్వన్నెల జెండా కట్టివుంది.

జెండా ఎగురవేయమంటూ తాడు అందిచ్చారు.

తాడు లాగింది. భారతీయ జెండా రెక్కలు విప్పుకుంది.

పూలవాన కురిసిందామెమీద.

రెప రెపలాడుతూ సగర్వంగా ఎగురుతోంది జెండా. మూడు రంగుల ముచ్చటైన పతాకాన్ని, సహనానికీ స్నేహానికీ, సమైక్యతకీ చిహ్నమైన జెండాని తృప్తిగా చూసి వందనం చేసింది.

"ఝుండా ఊంఛా రహే హమారా.........."

"వందేమాతరం.........."

"జన గణమన అధినాయక జయహే.........."

ఎన్నో పాటలు పాడారు. మిఠాయిలు పంచారు. టపాసులు పేల్చారు. ఆనందంతో ఒకకొకరు అభినందనలు తెలుపుకొన్నారు.

రాజమ్మని సందేశం ఇమ్మని కోరారు.

"ఒకప్పుడు రాజకీయ స్వేచ్ఛకోసం పోరాడాం. ఇప్పుడు స్త్రీస్వేచ్ఛకోసం, దళితస్వేచ్ఛ కోసం పోరాడుతున్నాం. ఇక ఆర్థికస్వేచ్ఛ కోసం పోరాడాలి. అప్పుడే మన దేశపు జెండా వినువీధుల్లో ఉత్సాహంగా ఉద్రూతలూగుతూ ఎగురగలదు. ఎట్టి పరిస్థితుల్లోనూ మన స్వాతంత్ర్యాన్ని హరించనీయమని అమ్మ భారతి సాక్షిగా ప్రతిజ్ఞ చెయ్యండి. జైహింద్!........."

"స్వాతంత్ర్యం మా జన్మహక్కు! దాని కోసం ప్రాణాలైనా ఇస్తాం!!" ముక్తకంఠంతో ప్రతిజ్ఞ చేశారంతా.

వారివంక ఆనందంగా ఆప్యాయంగా అపురూపంగా చూస్తూ మెల్లగా జెండా స్తంభపు మొదలుదగ్గర కూలిపోయింది రాజమ్మ.

జెండా ఒక్కసారి ఒక్కక్షణం ఆమెకి నివాళు లర్పించడానికా అన్నట్టు స్తంభించి తిరిగి స్వేచ్ఛగా ఎగురసాగింది.

మేరా భారత్ మహాన్!

- సమాప్తం -